# రెండవ భాగం

# 1

# ఫిల్కా

ఆగస్టునెల వచ్చింది. ఆపిల్ పండ్లు పండేకాలం అది. సాయంకాలాలు ప్రశాంతంగా ఉండే రోజులవి. కాలనీవాసులంతా పాతగదులు వదలిపెట్టి కొత్త గదుల్లోకి వచ్చారు. కొత్తగదులు పెద్దవి. విశాలంగా ఉన్నాయి, వాన్యా గది ప్రక్కనే ఫిల్కా-పేరీ ఆనే కుర్రవాడుంటున్నాడు. వారిరువురూ స్నేహితులయ్యారు. వ్యక్తిత్వాలలో ఇరువురికీ పోలికలేదు. అయినా ఇద్దరూ ఫౌండ్రీ లోనే పని చేస్తున్నారు. అక్కడే వారికి స్నేహం కుదిరింది.

ఫిల్కాకు ఆత్మవిశ్వాసం ఎక్కువ. పట్టుదలతో పనిచేస్తాడు. తాను ఎప్పుడో ఒకప్పుడు సినిమా నటుణ్ణి అయిపోతానని కలలు కంటున్నాడు. మనిషి మాత్రం ఆకతాయి. ఏపనైనా అతి సాహసంతో చేయడానికి పూనుకుంటాడు. అతను కాలనీలో చేరి అయిదేండ్లయింది ఇప్పుడతని వయస్సు పదమూడేండ్లు. కాలనీలో ఉన్న ఈ అయిదేండ్లలోనూ అతను ఎంతో హుషారుగా ఉంటూ వచ్చాడు. తానూ ఒక ప్రసిద్ధుడుగా పేరుపొందాడు. అంచాత అతనికి నిండు సంతృప్తి, అతిశయం కలిగాయి. అయినప్పటికీ అతని అకతాయి తనం మాత్రం పోలేదు. అప్పుడప్పుడు దురుసు పనులు చేస్తూనేఉన్నాడు. అతనికి జకరోవ్ అంటేభయం లేదు. జకరోవ్‌తో మాట్లాడమంటే అతనికి సరదా. జంకూ గొంకూ లేకుండా వాదిస్తుంటాడు. తన వాదన సమర్థించు కుంటాడు. జకరోవ్

2

"సరే అయితే నావాదన సాధారణ సమావేశం ముందు చర్చకు పడతాను" అనగానే ఫిల్కా వెనక్కు జంకుతాడు. అప్పటికి కాని జకరోవ్ కు లొంగడు.

ఫిల్కా ఆకతాయి కుర్రాడైన అతని చిలిపిచేష్టలు హద్దులు దాటిపోవు.

"బావుంది. ఏ విషయమైనా మీరు సాధారణ సమావేశం లోనే నిర్ణయించాలంటారు. అంతవరకూ ఎందుకు వెళ్ళడం? నన్ను శిక్షించడానికి మీరు చాలు. మీకా అధికారం ఉంది" అంటాడు ఫిల్కా.

"నిన్ను నేనెలా శిక్షిస్తాను? నీవు కాలనీలో చాలాకాలం నుంచీ సభ్యుడివి. నీవు చెబుతున్నది నిజంకావచ్చు. నిజమవునో కాదో నిర్ణయించవలసింది సాధారణ సమావేశం, నేనుకాదు" అంటాడు జకరోవ్.

ఈ మాటతో ఫిల్కా పూర్తిగా దిగివస్తాడు:

"నేను చేసింది మంచిపని కాకపోవచ్చు" అంటాడు.

"ఎందుకుకాదూ? నీవు మంచిపనే చేశావనుకుంటున్నాను"

"కాదు. నేను తప్పు చేశాను."

"తప్పుచేసినా అరగంటసేపు వాదించావు కదూ?"

"అరగంటసేపు వాదించానా! లేదు. అయిదు నిముషాలే."

"అయితే సరే. దారిలో నీళ్ళు చిమ్మినందుకూ, నాతో అరగంట అనవసరంగా వాదించినందుకూ నీవొక గంటసేపు నిర్బంధంలో ఉండాలి." అంటూ జకరోవ్ నవ్వాడు: "సరే ఇహ నీవు వెళ్ళవచ్చు" అన్నాడు.

ఒకనాటి సాయంకాలం ఫిల్కా, జకరోవ్ టేబిల్ ముందుకు వచ్చి నిలుచున్నాడు.

"కామ్రేడ్ జకరోవ్! మీరు విధించిన శిక్ష అనుభవించ డానికి వచ్చాను." అన్నాడు.

అది విని జకరోవ్ నవ్వాడు. ఫిల్కా బల్లమీద కూచుని పత్రిక చదవడం మొదలుపెట్టాడు.

నిర్బంధమంటే అలాగే అతని కెదురుగా ఒక గంటసేపు కూచోవడమని అర్థం. తాను అలా కూచున్నప్పుడు ఫొటో గ్రాఫరు వచ్చి ఫొటోతీస్తే బావుండునని అనుకున్నాడు ఫిల్కా.

ఆ గంటసేపు గడిచిన తరువాత ఇరువురూ మాట్లాడు కున్నారు. నాటకసమాజాన్ని గురించి, నటులను గురించి, ఆనాటి నాటక ప్రదర్శనాన్ని గురించి ఎన్నెన్నో కబుర్లాడుకున్నారు.

ఆనాటి ప్రదర్శనాన్ని ఫిల్కా జ్ఞప్తికి తెచ్చుకోసాగాడు. జోరిన్, ఇగోర్‌లు దేశభక్తుల వేషాలువేసి అందర్నీ చక్కగా మెప్పించారు. తనకు ప్రదర్శనాలలో యువచోదకుని వేషం మాత్రమే లభిస్తోంది. అంతకు మించి మంచివేషం వేయడానికి తనకు అవకాశం చిక్కడంలేదు. తనింకా సాధన చేయాలంటు న్నారు. దర్శకుడు చెప్పిన ఆమాట వాస్తవమే. తనకింకా సాధన కావాలి.

ఫిల్కాకూ వాన్యాకూ స్నేహం కుదిరి చాలా కాలమైంది. వాన్యాకు అతను లోహాల పోతపని నేర్పాడు. అంతేకాదు. వాన్యా కొత్తగా కాలనీకి వచ్చాడు. చాలాకాలంనుంచీ ఉంటున్న ఫిల్కా అంటే అతనికి గౌరవం. ఫిల్కా మాటమీద పూర్తి విశ్వాసంకూడా.

ఫౌండ్రీలో పొగబాధ ఎప్పటిలాగే ఉంది. సభ్యుల్లో గందర గోళం బయలుదేరింది. బ్లమ్ ఎవరిమాటా లక్ష్యపెట్టడం లేదు. అందుకని కమాండర్ల కౌన్సిలు సమావేశం ఏర్పాటు చేశారు. సమావేశంలో జిరియాన్‌స్కీ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు:

"తీర్మానం: గాలీ వెలుతురూ, పరిశుభ్రమైన వాతావరణం ఫౌండ్రీలో సక్రమపద్ధతిలో లేకపోతే 'పనిచేస్తున్న యువకులకు ఆరోగ్యం చెడుతుంది. ఆ పద్ధతి అమలుజరగని పక్షంలో వాళ్ళ

చేత పని చేయించడం మంచిదికాదు. అంచాత వాళ్లను వది లెయ్యాలి."

ఈ తీర్మానం వినగానే బ్లుమ్ భగ్గున మండిపడ్డాడు:

"ఏమిటి నీ ఉద్దేశం? పిల్లలచేత పని చేయించకుండా వదిలి పెట్టడమా? ఏమిటయ్యా నీవుమాట్లాడుతున్నది? తెలిసే మాట్లాడు తున్నావా? పిల్లలను వదిలేస్తే లోహపుపాత్రలు తయారు చేసే దెవరు?"

కొంతసేపు తర్జనభర్జనలు సాగాయి. బ్లుమ్ అనేక వాగ్దా నాలు చేశాడు. ఫాండ్రీ బాగుచేయిస్తానని సభ్యులను అనునయింప చూచాడు. కాని తుదకు జిరియాన్‌స్కీ పెట్టిన తీర్మానం నెగ్గింది. బ్లుమ్ గాభరాపడి జకరోవ్ ఆఫీసుకు పరుగెత్తాడు హడావుడిగా అతన్ని ఇలా అడిగాడు:

"అంతా కలిసి సమావేశంలో తీర్మానం ఆమోదించారు. పిల్లలు అంత ఆకతాయి తనంగా ప్రవర్తిస్తుంటే నీకు చీమకుట్టి నట్టయినాలేదు. ఇక్కడ ఆఫీసులో ముక్కుమూసుకుని కూచున్నా వయ్యా ?"

ఇంతలో టార్‌స్కీ అక్కడికి వచ్చాడు. అతని చేతిలో ఒక కాగితం ఉంది.

"అదిగో ఆర్డరు. ఫౌండ్రీలో లోహపు పనిచేసే పిల్లకాయ లను వదిలిపెట్టమని ఇందులో ఉత్తర్వు చేశారు." అన్నాడు.

జకరోవ్ ఉత్తర్వుమీద సంతకం చేశాడు. టార్‌స్కీ దాన్ని తీసుకుని బ్లుమ్‌వంక వెక్కిరిస్తున్నట్టు చూచి వెళ్ళిపోయాడు బ్లుమ్ నిలువునా నీరైపోయాడు.

"అయితే ఆర్డరుమీద సంతకం చేశావన్నమాట ?" అని అడిగాడు బ్లుమ్.

"ఆ, చేశాను." అన్నాడు జకరోవ్.

"అయితే వాళ్ళిహ పనిలోకి రారన్నమాటేగా ?"

ఇలా అడిగి జకరోవ్ సమాధానం చెప్పేలోపుగానే బ్లమ్ చరచరా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. కాపలాసైనికుణ్ణి దాటేసి, పూలమొక్కల మధ్యనుంచి స్టేడియం చెంతకు వెళ్ళాడు. అత్రుతగా ఒలెన్‌చెక్ కార్యాలయంలోకి అడుగు పెట్టాడు.

"కామ్రేడ్ ఒలెన్‌చెక్ ! ఇప్పుడేమిటయ్యా గత్యంతరం ?" అని అడిగాడు "ఇంతకూ నీకొచ్చిన ఆపదేమిటి ?" "ఇది ఆపద కాదూ ? ఫౌండ్రీలో పని మూలపడుతుంది ! పొగ పోయేమార్గం చూడాలి. లేకపోతే తట్టుకోలేం. నీ దగ్గర ఇనపదూలాలు ఏమాత్రం ఉన్నాయి?"

"ఒక్కటికూడా లేదు." అని చెప్పాడు ఒలెన్‌చెక్.

"ఒక్కటీలేదూ ?నాతోరా,ఎక్కడున్నాయో చూపిస్తాను అంటూ బ్లమ్ అతన్ని తన వెంట తీసుకెళ్ళాడు.

ఇరువురూ యంత్రశాలలోకి వెళ్ళారు. అక్కడ ఒకమూల ఇనపదూలం, పొగగొట్టం పడిఉన్నాయి.

"అవిగో, అక్కడున్నాయికదూ?" అన్నాడు బ్లమ్.

ఒలెన్‌చెక్ అటు చూచాడు. అభ్యంతరం చెప్పలేదు. అతనేమీ మాట్లాడకపోవడం చూచి బ్లమ్ ఇలా అన్నాడు:

"అది ఇనుము కాదంటావా ఏమిటి?"

ఈ ప్రశ్నకుకూడా ఒలెక్‌చెక్ సమాధానం చెప్పలేదు. బ్లమ్ కోపంగా స్టేడియమ్ వైపు వెళ్ళిపోయాడు. టూర్‌స్కీ ఏదో పనిమీద అటువెడుతూ ఒలెక్‌చెక్‌ను చూచాడు. ఇలా ప్రశ్నించాడు:

"ఇక్కడ ఏంచేస్తున్నావు కామ్రేడ్?"

ఒలెక్‌చెక్ విచారంగా నవ్వాడు. "ఈ ఇనుముతో నాకు అవసరమున్నది. కాని దీన్ని బ్లమ్ పట్టుకపోతానంటున్నాడు" అన్నాడు.

అదివిని టూర్‌స్కీ ఒక చిరునవ్వు విసిరి, తనదారిన తాను పోయాడు.

బ్లమ్ అత్యంతగా అటూఇటూ తిరుగుతూ, షాపులు తనిఖీ చేస్తూ సంతోషంగా ఉన్నాడు. కుర్రవాళ్ళకు ఉత్తర్వులిచ్చాడు. తరువాత తిన్నగా కమాండర్ల కౌన్సిలుగదికి వెళ్ళాడు. అక్కడ టూర్‌స్కీ కూచునిఉన్నాడు. బల్లముందు కూచుని బ్లమ్ నిట్టూర్చాడు.

"నీ ఉత్తర్వులిక రద్దుచేసుకోవచ్చును. అక్కడ అంతా మనవాళ్ళే దొరికారు ? కావలసినంత ఇనుము ఉన్నది. ఉండికూడా లేదంటూరేం ?" అని అడిగాడు.

అదివిని టూర్‌స్కీ కనుబొమ లెగరేశాడు. తరువాత బ్లమ్ అక్కడనుంచి చరచరా అవతలికి వెళ్ళిపోయాడు.

ఆవేళ సాయంకాలం బ్లమ్ ఎన్నడూ లేనంత ఉత్సాహంగా ఉన్నాడు. తన విధులను తను చక్కగానిర్వర్తించాడు. కొందరికి ఆదేశాలిచ్చాడు. సలహాలు చెప్పాడు. సూచనలు చేశాడు. లెక్కలువేసి చూపించాడు. ఫౌండ్రీ ఫోర్‌మన్ బంకోవిస్కీ—తన గదిలోనికి రాగానే బ్లమ్ అతన్ని ఇలా అడిగాడు.

"ఇవాళ నూనె పాత్రలు ఎన్ని తయారైనాయి ?"

"నాలుగొందలు." అని చెప్పాడు బంకోవిస్కీ.

"అంతేనా ? ఇంకా ఎక్కువ తయారు కాలేదూ ?"

"సరే, బాగానే ఉంది. రేపటినుంచి ఇవికూడా ఉండవు!"

"అంటే ఏమిటి నీఉద్దేశ్యం ?"

"ఏముందీ ! పనిచేసేవాళ్ళు రేపటి నుంచీ రారట ! ఏవో ఉత్తర్వులొచ్చాయట."

"పని చేసేవాళ్ళంటే ఆకుర్రాళ్ళే కదూ ? గళ్చెంకో,

మళ్ళెంకోలు - వాళ్ళు పూర్తిగా పసివాళ్ళు, వాళ్ళతో మాటాడి చూడు——"

"నేనెందుకూ, మీరే మాట్లాడి చూడండి రేపటి నుంచీ ఒక్క నూనెపాత్రకూడా తయారుకాదు."

"ఎందుకని ?- నీవు తయారుచేయలేవా ఏం ?"

"చాలాబావుంది! ఇంకేం చెయ్యాలి నేను?- ఇంకానయం ఇవాళ పాత్రలు తయారు చేయమంటారు, రేపు మట్టిపిడతలు కూడా చేయమంటారు! నేను ఫాండ్రీలో ఫోర్మన్ను. నేనుచేయవలసిన పనులేమిటో నాకు తెలుసును."

"సరే- రేపు ఫాండ్రీ తెరువు. పనివాళ్ళు వస్తారు"

ఇలాఅని బ్లమ్ గబగబా ఫిల్కా దగ్గరికి వెళ్లాడు: "ఇప్పుడు నీకర్థమైందా ఫిల్కా? ఈ ఫ్యాక్టరీ నీది- ఈ డబ్బు నీది- ఈ ఆదాయం నీది- అంతా నీదే, నాదికాదు సుమా! పనివాళ్ళంటే ఏమనుకున్నావు మరి? మీరు తక్కువవాళ్లు కాదు. రేపు మీరు పనిమానేస్తారు. ఎల్లుండి మరొకరు అలాగేచేస్తారు. చివరకు పని బంద్ అయిపోతుంది. రోజుకు ఒకవెయ్యి పాత్రలు మనం తయారు చేస్తున్నాం. అయిదొందల రూబుళ్ళు లాభంవస్తున్నది. ఇదంతా పోగొట్టుకుంటామా?"

"పోగొట్టుకో."

"నీవు బుద్ధిమంతుడివి. నీసంగతి నాకు తెలుసు. క్రావ్చెక్, నోవాక్, సెమియోన్, మొదలైనవాళ్ళతో కూడా కలిసి మాట్లాడు. అందరూ ఫాండ్రీకి వెళ్ళండి.

"అయితే ఆ ఉత్తర్వు ఏమవుతుందంటావు?"

"దాంతో నీకెందుకులే పొయ్యి ఉంటేకదా పొగవచ్చేది! అది లేకుండానే ఫాండ్రీలో మిగతాపని చేసుకోవచ్చుకదూ."

"అయినాసరే- ఉత్తర్వు ఉత్తర్వే."

"ఏమిటేమిటీ !..."

ఇలా వారిరువురికీ కొంతసేపు చర్చ జరిగింది. చివరకు ఫిల్కా, బ్లమ్‌సూచనను అంగీకరించాడు. ఫా్ౕరడీతలుపు తెరిచాడు. వాన్యా గల్చెంకో, క్రాల్‌బెల్, కిర్యూషానోవాక్, బ్లమ్ వీరంతా లోనికి వెళ్ళారు. లోనికి వెళ్ళాక బ్లమ్ మెల్లగా ఫిల్కాను ఇలా అడిగాడు.

"మనం లోపలికి రావడం ఎవరైనా చూచారా?"

"ఎవరూ చూడలేదు." అన్నాడు ఫిల్కా."

పనివాళ్ళు పనులు ప్రారంభించారు. అంతా మౌనంగా పనులు చేసుకుంటున్నారు. ఇలా ఒకగంట గడిచింది, బిగోనక్ తలుపు తెరుచుకుని లోనికి వచ్చాడు:

"కామ్రేడ్స్! కాలనీ డైరెక్టర్ ఉత్తర్వును వ్యతిరేకించ కండి- ప్రమాదం!..." అన్నాడు.

బ్లమ్ అతనివంక తీక్షణంగా చూచాడు. ముఖం ఎరు పెక్కింది. కళ్ళు జ్యోతుల్లా అయినాయి.

"ఆ ఉత్తర్వు మాటకేం?- దాని విషయం తరువాత మాట్లాడుకుందాం. ఇక్కడ మనుష్యులు పనిలో ఉన్నారని నీకు తెలీదూ?- అలా అరుస్తా వెందుకు?"

బిగోనక్ తల పంకించాడు: ఇది చాలా తీవ్రమైన విషయం. కామ్రేడ్స్! మీరంతా ఇప్పుడు అరెస్టులో ఉన్నారని తెలుసు కోండి?" అన్నాడు. "ఎంతకాలం?" అంటూ ఫిల్కా, వెర్రి మొగం వేశాడు.

"సాధారణ సభ్యులు సమావేశమయ్యే వరకూ." అని బిగోనక్.

ఫిల్కా, బిత్తరపోయి బ్లమ్‌వంక చూచాడు.

"నేను ముందే చెప్పలేదూ- ఇలాంటి ప్రమాదంవస్తుం దని-" అన్నాడు.

బిగోనక్ గంభీరంగా నిలుచుని అందర్నీ తనవెంట రమ్మ న్నట్టుగా ఒక చూపు విసిరాడు:

"కామ్రేడ్స్! ఇహరండి" అన్నాడు.

నలుగురూ మౌనంగా అతనివెంట నడిచారు. ఫిల్కా వెడుతూ వెడుతూ బ్లమ్‌వంక కొరకొర చూచాడు. బ్లమ్ దీర్ఘంగా నిశ్వసించి "ఈ కుర్రాడెంత భయంకరంగా ఉన్నాడు!" అనుకు న్నాడు.

# 2

# కాలనీ ఉత్తర్వు

కాలనీ డైరెక్టర్ ఉత్తర్వుకు భిన్నంగా ఫౌండ్రీ తెరిచి పని చేయడం సాధారణమైన విషయం కాదు. నిందితులు నలుగురూ బెల్టులు లేకుండా నిలుచున్నారు. బెల్టులు లేకపోతే అరెస్టులో ఉన్నట్టు అర్థం.

ఇంతకుపూర్వం జకరోవ్ ఆఫీసులో ఆ నలుగురూ రెండు గంటలసేపు కూర్చున్నారు. అప్పుడప్పుడు నెస్ట్రాంకోలోనికి వస్తూ ఉండేవాడు; జకరోవ్ చెవిలో రహస్యంగా ఏదేనో చెపుతూ ఉండేవాడు. వెడుతున్నప్పుడు వాళ్ళవంక కన్నెత్తి అయినా చూచేవాడుకాదు. న్యాయంగా ఈ వేళప్పుడు జకరోవ్ ఆఫీసు సందడిగా ఉంటుంది. కాని ఇప్పుడు అంతా నిశ్శబ్దంగా, ఒక నిర్ణీత పద్ధతిలో కొనసాగుతూ ఉంది. ఆఫీసుపని ఉంటేతప్ప ఎవరూ లోనికి రావడం లేదు. జకరోవ్ కూడా ఆవేళ ఎప్పుడూ లేనంత మౌనంగా ఉన్నాడు. ఆఫీసు కాగితాలు చూస్తున్నాడు. ఏవేవో రాస్తున్నాడు. లెక్కలు వేస్తున్నాడు. ఎవరైనా పనిమీద వచ్చి నప్పుడు మాత్రం తలఎత్తి చూస్తున్నాడు.

"బావుంది. ఆ, సరే......ఇహ మీరు వెళ్ళవచ్చు." అంటున్నాడు వచ్చిన వాళ్ళతో.

తనముందు కూచున్న కుర్ర వాళ్ళతో మాత్రం ఏమీ మాట్లాడడంలేదు. ఇలా కొంతసేపు జరిగింది. తరువాత బ్లమ్‌ను పిలుచుకరమ్మని బిగోసక్‌ను పంపించాడు. బిగోసక్ వెళ్ళి బ్లమ్‌ను పిలుచుకొచ్చాడు. బ్లమ్ ముఖం ఎర్రబారి ఉంది. ఆ కుర్రవాళ్ళ వంక చూడకుండానే బల్లమీద కూచుని, జేబురుమాలు బయటకి తీశాడు. ముఖం తుడుచుకున్నాడు. కాని చెమటలు పోస్తూనే ఉన్నాయి.

బ్లమ్ రాగానే జకరోవ్ కటువుగా ఇలా అన్నాడు:

"కామ్రేడ్ బ్లమ్! ఫౌండ్రీ ఒక వారంరోజులపాటు మూసి వెయ్యమని ఉత్తర్వు చేస్తున్నాను. పదివేల నూనె పాత్రలు కావాలని పైకి ఆర్డరు పంపించాను. చేతి పరిశ్రమల సహకార సంఘం వారు వాటిని త్వరలోనే పంపిస్తారు."

"అయ్యో భగవంతుడా! పదివేలా! వాటికి మీరు ఎంత ఇస్తున్నారు?" అని అడిగాడు బ్లమ్.

"ఖర్చులతో కలుపుకుని రెండురూబుళ్ళ-చొప్పునఇస్తున్నాం"

"అయ్యో భగవంతుడా!" అంటూ బ్లమ్ లేచినిలుచున్నాడు. జకరోవ్ కుర్చీ చెంతకు వెళ్ళి "ఎంత నష్టం, ఎంత నష్టం! రెండు రూబుళ్ళే! మనం అగవై కోపెక్కులకు తయారు చేయవచ్చు" అన్నారు.

మనం సామానుకూడా పంపిస్తున్నాం."

"సామాను పంపిస్తేమాత్రం – ఒక్కొక్కటి రెండు రూబుళ్ళే!"

"సామాను వెంటనే వాళ్ళకు అందచేయమని ఆర్డరుకూడా ఇచ్చాను."

"ఎందుకూ? రెండురోజుల్లో ఫౌండ్రీ బాగుచేయిస్తాంగా. ఈసారి గాలీ వెలుతురూ శుభ్రంగా వస్తుంది; ఈపాటిదానికి మీరు వారంరోజులు ఫౌండ్రీ మూసేస్తామంటున్నారు"

నీకు మూడు రోజులు వ్యవధి ఇస్తున్నాను. ఈ మూడు రోజుల్లో ఫౌండ్రీలో హంగంతా ఏర్పాటు చెయ్యి. నాలుగోనాడు బస్తీనుంచి ఇంజనీరు వస్తాడు. వచ్చి ఏంకావాలో అంతా చేసి పోతాడు.''

''అలా అయితే నే నిప్పుడే వెళ్ళిపోతున్నాను.''

''ఎక్కడికి?'' అని అడిగాడు జకరోవ్.

''ఎక్కడికా? ఏట్లోకి - ఇహ కాలనీలో మాత్రం ఒక క్షణం ఉండను.''

''ఆపని నీ వెప్పుడో చేస్తావని నాకు తెలుసు - కాని ఇప్పుడు నీవు వెళ్ళిపోతావని నాకేం భయంలేదు.''

బ్లమ్ చేరుమాలు జేబులో కుక్కుకున్నాడు. జకరోవ్ మాటలకు అతను మరీ రెచ్చిపోయాడు: ''అదా సంగతి! ఓహో! ఇక్కడునుంచి ఈబ్లమ్‌కాస్తా వెళ్ళిపోతే అంతా బాగుపడుతుందనా నీఉద్దేశం - ఫౌండ్రీ ఖాతాలో మూడులక్షల రూబుల్లు బ్లమ్ సంపాయించిపెట్టాడు! బస్తీనుంచి ఎవడో ఇంజనీర్ని పిలిచి బాగు చేస్తామనే పేరుతో ఆ సొమ్మంతా ఖర్చుపెడదామనా నీఉద్దేశం? ఫౌండ్రీలో గాలీ వెలుతురూ బాగా ఉండాలనేమాట నేను కాద నను. కాని ఒక్కవిషయం జ్ఞాపకం పెట్టుకో. ఇదివరకు ఆఫౌండ్రీలో అనేకమంది కుర్రాళ్లు పనిచేశారు. ఇప్పుడెవడో ఒక డాక్టరువచ్చి గాలీ వెలుతురూ లేకపోతే ఫౌండ్రీ జ్వరం వస్తుందని చెప్పడం; ఆమాట పట్టుకుని మీరంతా గ్రేళ్లాడడం - బాగుంది వరస. ఇంతకూ ఆజ్వరం ఎవడికొచ్చింది? ఒక్కడిపేరు చెప్పండి - ఆమాటకొస్తే ఆమాట చెప్పినడాక్టర్‌కే రాలేదు.'' అంటూ బ్లమ్ దూకుడుగా ఆఫీసులోనుంచి బయటకొచ్చాడు.

అతని వాలకమంతా చూచాడు జకరోవ్: ''ఫౌండ్రీ అంటే నీకెంత ఆసక్తో నాకు తెలుసు. నీవు మంచివాడివే - సందేహంలేదు. కాని నా సూచనలు వెంటనే అమలుజరుపు, అంతే'' అన్నాడు.

"ఇంతేనా ?" అంటూ బ్లమ్ చేతులూపాడు: "అవును, అంతే. కాని ఒకవిషయం - నేను మాత్రం ఇలాంటివి సహించ లేను."

"సహించాలి, తప్పదు."

బల్లమీద కూచునిఉన్న కుర్రాళ్ళు నలుగురూ జకరోవ్ వంక చూస్తున్నారు. ఇహముందు ఏం జరుగుతుందో అని విచారంగా కనిపెట్టుకొని ఉన్నారు.

బ్లమ్ అక్కడనుంచి వెళ్ళిపోయాడు. పోతూ పోతూ ఇలా అన్నాడు: "ఇవాల్టినుంచీ సాధారణ సమావేశానికి నేను హాజరు కాను. అందుకు మీరు అనుమతిస్తారనుకుంటాను."

"అలాగే." అన్నాడు జకరోవ్.

నెస్టెరింకో లోపలికివచ్చాడు. "రిపోర్టు తీసుకునేందుకు సిద్ధంగా ఉన్నారా జకరోవ్?" అని అడిగాడు.

ఒకక్షణం గడిచింది. అవతల బిగిల్ వినిపించింది. ఒక నిముషంలో ఆరోగ్యశాఖకు చెందిన ఉద్యోగి, పదకొండుమంది కమాండర్లు లోపలికి వచ్చి జకరోవ్ బల్లముందు వరుసగా నిలుచున్నారు. వాళ్లు రాగానే కుర్రవాళ్లు నలుగురూ లేచి నిలుచున్నారు. కమాండర్లు ఒక్కొక్కరే జకరోవ్ చెంతకు వెళ్ళి ఇలా రిపోర్టు అందచేసారు:

"మొదటిదళంలో అంతా సవ్యంగా ఉంది."

"రెండవదళంలో అంతా సక్రమంగా ఉంది."

కమాండర్ జిరియాన్‌స్కీ అందరిలాగా రిపోర్టు ఇవ్వలేక పోయాడు. అతనిముఖం జేవురించింది:

"నాలుగోదళంలో క్రమశిక్షణకు భంగం కలిగింది. క్రావ్ చెక్, ఫిల్కా, నోవాక్, వాన్యాలు కాలనీ ఉత్తర్వులను ఉల్లంఘించి ఈ సాయంకాలం ఫౌండ్రీలో పనిచేశారు. మీ ఆదేశాను

సారం వాళ్ళను సాధారణ సమావేశం ముందు సంజాయిషీ అడగ వలసి ఉంటుంది.''

జకరోవ్ ఈ రిపోర్టును తక్కిన అందరి రిపోర్టుల్లాగానే ప్రశాంతంగా విన్నాడు: ''మంచిది'' అన్నాడు.

ఆవేళ డ్యూటీలో ఉన్న కమాండరు నెస్ట్రెంకో. అతను ఇలా ప్రశ్నించాడు: ''ఆ కుర్రవాళ్లను సాధారణ సమావేశం ముందు హాజరు పెట్టమంటారా?''

''ఆ, సమావేశం జరపండి.'' అన్నాడు జకరోవ్,

బిగోనక్ బిగిల్ ఊదడానికి బయటికి వెళ్లాడు. సమావేశం జరిగేముందు మూడుసార్లు బిగిల్ ఊదుతారు. ఒకసారి భవనం మధ్యలోను, రెండవసారి ఫ్యాక్టరీ ఆవరణలోను, మూడవసారి పార్కులోను బిగిల్ ఊదడం మామూలు. బిగోనక్ బిగిల్ ఊదే సరికి కమాండర్ల గదిలో కూచున్న కుర్రవాళ్ళు హడలెత్తి పోయారు. జకరోవ్ సమావేశానికి బయలుదేరాడు. పిల్లలందరూ విశ్రాంతి మందిరం నుంచి నడవసాగారు. ఇప్పుడు పూర్వం లాగా నిందితునకు విశ్రాంతి మందిరానికి వెళ్లే అవకాశంలేదు. డ్యూటీలో ఉన్న కమాండర్ వచ్చి వాళ్ళను సమావేశానికి తీసుకెళ్ళాలి. అయిదు నిమిషాలు గడిచిన తరువాత నెస్ట్రెంకో గదిలోనికి వచ్చి వాళ్ళను తనవెంట రమ్మని పిలిచాడు. ఫిల్కా, నెస్ట్రెంకో వంక చూచాడు. నెస్ట్రెంకో ముఖంలో స్నేహభావం కనిపించడంలేదు. అధికారదర్పం ద్యోతకమవుతూ ఉంది.

నెస్ట్రెంకో వాళ్ళను విశ్రాంతి మందిరంలోకి తీసుకెళ్ళాడు. మందిరంలో సమావేశం మొదలైంది. టార్స్కీ ఇలా అన్నాడు.

''అబ్బాయిలూ! కాలనీ ఉత్తర్వులను ధిక్కరించి ఎందుకు మీరు పనిచేశారో సంజాయిషీ చెప్పుకోవలసి ఉంటుంది. బ్లమ్ ఏవేవో చెప్పాడని, అతనిమాటలు విని ఆ పని మేంచేశామని మీరు చెప్పి ప్రయోజనంలేదు. ఆ విషయం మాకు తెలుసును. ముఖ్యమైన అంశం చెప్పండి. కాలనీ ఉత్తర్వులను ధిక్కరించడానికి

మీకు ధైర్యం ఎలావచ్చింది? ఇక్కడ ఉత్తర్వులను అందరూ మన్నిస్తారు. ఫిల్కా! ముందు నీవు సంజాయిషీ చెప్పు. నీవు చాలా కాలం నుంచి కాలనీలో ఉన్నావు. నీ కన్నీ తెలుసును."

ఫిల్కా సమాధానం చెప్పేలోగా వ్లాడిమిర్ కోలోస్ జోక్యం కలిగించుకున్నాడు: "అబ్బాయిలూ! నేనొక విషయం చెప్పదలుచుకున్నాను; ఉత్తర్వు ఇచ్చిన ఒక గంటలో ఒకడూ కాదు, ఇద్దరూ కాదు - నలుగురు దాన్ని ఉల్లంఘించటం; అహా మాషీ వ్యవహారం కాదు. వీళ్ళ కాలనీ సభ్యత్వం రద్దుచేసి, వీళ్ళను తర్ఫీదులో పెడదాం. కొంతకాలానికి సభ్యత్వం ఇస్తే, ఇద్దాం. ఇలా ఇదివరకు అనేకమంది ఉత్తర్వులు ధిక్కరించారు. వాళ్ళకు ఇలాంటి శిక్షే విధించాం."

"అవునవును." అన్నారు సభ్యులు.

"అసలు ప్రశ్న అది కాదు - దీని కెవరు బాధ్యులు?" అని అడిగాడు కోలోస్:

"ఏమప్రోయ్! ఈ మాట మనం మరిచిపోకూడదు. వాన్యా కొత్త కుర్రాడు. అతను వచ్చి రెండు నెలలే అయింది. అంచాత ఇందుకతను బాధ్యుడు కాదు. అతను నిర్దోషి. కనుక అతనికి శిక్ష విధించకూడదు. తక్కిన ముగ్గురిలోనూ ఫిల్కా చాలా కాలంనుంచీ కాలనీలో ఉంటున్న కుర్రాడు. తెలిసిందికదూ? ఇంతకూ ముందు అలెగ్జీ జిరియాన్స్కీ ఏం చెపుతాడో విందాం," అంటూ కోలోస్ కూచున్నాడు. అతని ప్రసంగం అందరిలోనూ సంచలనం కలిగించింది. మందిరంలో అంతా నిశ్శబ్దం అలుముకున్నది. జిరియాన్స్కీ వేదికముందు మెట్లపైన కూచున్నాడు. అధ్యక్షునికి ఏంచేయాలో తోచలేదు. కోలోస్ ప్రతిపాదన క్లిష్టపరిస్థితిని తెచ్చిపెట్టింది. జకరోవ్ వంక తిరిగి అధ్యక్షుడిలా అన్నాడు:

"వాన్యా గల్చెంకో విషయంలో సందేహం లేదు. నిస్సందేహంగా అతను నిర్దోషి. తక్షణమే అతన్ని విడిచిపెట్టవచ్చును. దీని కెవరైనా అభ్యంతరం చెపుతారా?"

ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. వాన్యా విషయం అక్క-డెవరికీ పట్టనేలేదు. అతను మొన్న మొన్ననే కాలనీకివచ్చాడు.

"కామ్రేడ్ నెస్ట్రెంకో! వాన్యాను వదిలిపెట్టండి-వాన్యా! ఇహ నీవు వెళ్ళవయ్యా" అన్నాడు సభాధ్యక్షుడు.

తన్ను విడిచిపెట్టారని వాన్యా సంతోషించలేదు. అతను వెళ్ళిపోతూ తన స్నేహితులు ముగ్గురివంక చూచాడు. లిడాటాలికోవా అతని చెయ్యి పట్టుకుంది:

"రా, రా వాన్యా! ఎలాగైతేనేం తప్పించుకు బయట పడ్డావులే!" అన్నది. అతన్ని పిలిచి తన సరసన కూచోబెట్టుకున్నది. కాలనీలోకి వచ్చిననాడే వాన్యా ఆ పిల్లను చూచాడు. ఇద్దరికీ పరిచయం ఏర్పడింది. వాన్యా కృతజ్ఞతతో ఆమెవంక చూచి నవ్వాడు.

ఫిల్కా సమావేశంలో గట్టిగా ఉపన్యసిస్తున్నాడు:

"క్లోలోస్ పతిపాదనలు కేవలం అబద్ధాలు. నేను సంజాయిషీ చెపుతాను. నేనేకాదు, తక్కిన ఇద్దరు కుర్రాళ్ళుకూడా చెప్పుకుంటారు. నిజమే- మేంపొరపాటు చేశాం. కాని ఆ పొరపాటు ఎలాంటిదని ప్రశ్న? మా స్వలాభంకోసం మేమాపని చేస్తే అప్పుడు ఈ సమస్యను ఇంకొకలా విచారించాలి. కాని మా స్వలాభంకోరి మేమాపని చేయలేదు. కాలనీ శ్రేయస్సుకోసమే అలాచేశాం. మేం ఎందుకు చేశామో మీకు తెలుసునా? రేపు పని చేసేటందుకు అక్కడ ఏమీలేదు. మేంవెళ్ళి పనిచేస్తే సరిపోతుందనుకున్నాం. ఉత్తర్వు మాకు సరిగ్గా బోధపడలేదు. ఫ్యాక్టరీలో కొలిమి ఉన్నప్పుడే, పొగ వస్తున్నప్పుడే ఆ ఉత్తర్వు వర్తిస్తుందనుకున్నాం. ఫౌండ్రీలో సాయంకాలం కొలిమిఉండదు. కనుక పని చేయవచ్చు ననుకున్నాం."

సభ్యులందరూ ఫిల్కా ప్రసంగాన్ని శ్రద్ధగావిన్నారు. కాని అది ఎవరికీ నచ్చలేదు. ఉపన్యాసం ముగించి ఫిల్కా నగరుస్తూ కూచుండిపోయాడు. అతను చెప్పింది కేవలం తర్కం తప్ప సత్యం

కాదు. అది సభ్యులను మోసపుచ్చలేక పోయింది. సమావేశంలో కమాండర్లు, సభ్యులు, అందరూ ప్రసగించారు. గుసగుసలు విని పించ సాగాయి:

"అతనలా మాట్లాడడంలో ఆశ్చర్యం లేదు."

"అవునవును. మనందరి ఎదుటా ఎంత ధైర్యంగా అబద్ధా లాడుతున్నాడో చూడండి!"

"వాడికి ఉత్తర్వు అర్థమే కాలేదంటున్నాడు! అయిదేండ్లు కాలనీలో ఉన్నవాడికి ఎందుకర్థం కాదు?"

"ఈ కాలనీలో పిల్లలెప్పుడైనా సాయంకాలం పనిచేసి ఎరుగుదురా?"

"ఫిల్కాకు పొగరెక్కువ. ఎవరితోనూ కలియడు. అసలు, మనిషి అహంకారి."

"ఇంతకూ తప్పంతా జిరియాన్స్కీది."

"అవును, ఫిల్కాను అని ఏం ప్రయోజనం?"

"జిరియాన్స్కీకి అతనంటే అభిమానం. ఇప్పుడేకాదు. మొదటినుంచీ ఫిల్కా అంతే. వాడెన్నితప్పులు చేసినా సమావేశం ముందు పెట్టక క్షమించి ఊరుకున్నాడు."

"చూడు, చూడు! ఫిల్కాకేసి చూడు! సినిమాయాక్టర్‌లా ఎలా ముఖంపెట్టాడో! మొన్న వేసిన నాటకంలో బోల్షివిక్ వేషం వేస్తానన్నాడు. బోల్షివిక్ అంటే ఇదేనా మరి? వాడికి ఉత్తర్వు అర్థం కాలేదుట!"

సభాధ్యక్షుడు తరువాత జీన్‌గ్రిఫీని మాట్లాడమని కోరాడు. వాయిద్యదళంలో ఫిల్కా ఎలా ప్రవర్తిస్తున్నదీ చెప్పమన్నాడు. గ్రిఫీ ఫ్రెంచివాడిలా ఉంటాడు. సన్నటి మనిషి చురుకైనవాడు. అతను మాట్లాడడం మొదలు పెట్టాడు:

"ఫిల్కా వాయిద్యదళంలో నియమాలను సాధారణంగా ఉల్లంఘించడం లేదు. అప్పుడప్పుడు మాత్రం తను ఊదేసన్నాయి ఊదకుండా క్రిందపెడుతుంటాడు. అతనికి అసంతృప్తిఉన్నది.

ఫోమిన్ వాయించే వాయిద్యం తను వాయించాలంటాడు.. సన్నాయి తన కక్కర్లేదుట. ఒక్కొక్కప్పుడు మరొక తమాషా చేస్తుంటాడు. నోటిదగ్గర సన్నాయి పెట్టుకుని ఊదకుండానే ఊదుతున్నట్టు నటిస్తుంటాడు! ఒకసారి ఏం జరిగిం దనుకున్నారూ? మేమంతా మా వాయిద్యాలు వినిపించడానికి వైద్యసంస్థకు వెళ్ళాం. కచేరీ సాగుతున్నది. మధ్యలో ఫిల్కా సన్నాయి క్రింద పారేశాడు. పారేసి 'అమ్మో, గుండె నొప్పి, గుండెనొప్పి!' అంటూ నాటకమాడాడు. డాక్టర్‌ను పిలవమ న్నాడు. నానా గడబిడచేశాడు. కాని నేను అసలుసంగతి ఇట్టే కనిపెట్టాను. అతని సన్నాయి ఫోమిన్‌కు ఇచ్చి, ఫోమిన్ వాయి ద్యం ఫిల్కాను వాయించమన్నాను. తరువాత గుండెనొప్పి ఎలా ఉందని అడిగాను. అప్పుడతను 'ఫరవాలేదు, ఏదో ఒకలా వాయిస్తాను' అన్నాడు. ఇదీ అతనితంతు."

ఫిల్కా ఇదంతా విన్నాడు. గ్రిషీ తననుగురించి అలా చెప్తాడని అతను అనుకోలేదు.

సమావేశంలో కొమ్సొమోల్ కార్యదర్శి మార్క్ గ్రిన్ హోస్ ఉపన్యసించసాగాడు: "ఇందుకు మనం జిరియాన్‌స్కీని తప్పు పట్టక్కర్లేదు. అతను మంచి కమాండరు. అతనిదోషం ఏదైనా ఉంటే అది కమాండర్ల కౌన్సిలు విచారించాలి. ఆ విషయం సాధారణ సమావేశంలో తీసుక రానక్కర్లేదు."

అందుమీదట టూర్‌స్కీ ఇలా అన్నాడు: "దీనికి ఎవరైనా అభ్యంతరం చెపుతారా?"

ఇరువురు సభ్యులు మాత్రమే అభ్యంతరం ఉన్నదని చేతు లెత్తారు. ఓటింగులో జిరియాన్‌స్కీ బాధ్యుడు కాదనే తీర్మానం నెగ్గింది. తరువాత జిరియాన్‌స్కీ లేచి నిలుచున్నాడు:

"ఇక్కడ ఈ కాలనీ స్థాపించి ఏడేండ్లయింది. మీ అందరి లాగే నేనూ ఈ కాలనీఅంటే గర్వపడతాను. మన సమిష్టి శక్తి గొప్పది. మనభవిష్యత్తు ఉజ్వలమైనది. ఇప్పటికి కాలనీ నాయకత్వంలో

మూడులక్షల రూబుళ్ళు నిల్వఉన్నాయి. ఆ ధనమంతా మన కృషిఫలితమే. ప్రభుత్వం మనకు సహాయంచేస్తుంది- సహాయం పొందడానికి మనం అర్హులం. ప్రభుత్వాన్ని మనం ప్రేమిస్తున్నాం. మన శాయశక్తులా దేశక్షేమం కోసం, జాతి పురోభివృద్ధికోసం పాటుపడుతున్నాం. నిజమైన సోవియట్ ప్రజలవలె జీవించడానికి ప్రయత్నిస్తున్నాం. అనతికాలంలోనే మనం ఒక నూతన కర్మాగారాన్నినిర్మించనున్నాం... ఇదివరకు సుఖంగా జీవించడమెలాగో మనకు తెలీదు. ఎన్నో ఆటంకాలు అధిగమించాం. ఇప్పుడు మన జీవితం నిత్యనూతనం. కారణం మరేమీకాదు. మన బాధ్యతలు మనకు తెలుసును. మనం సమిష్టిగా జీవించడం నేర్చుకున్నాం. కొందరు క్రమశిక్షణ అంటే అపార్థం చేసుకుంటున్నారు. తమకు అది ఎంతవరకు బాగుంటుందో అంతవరకే దాన్ని పాటిస్తున్నారు. బాగుండనిది మాత్రం ఉల్లంఘిస్తున్నారు. బాగోగులు వ్యక్తి ఇష్టాయిష్టాలమీద ఆధారపడి ఉండవు. క్రమశిక్షణకు సమిష్టి శ్రేయస్సే మూలం. తద్భిన్నంగా ఎవరూ ప్రవర్తించకూడదు. ఈ నలుగురు కుర్రాళ్ళు కొంచెం వేళాకోళానికి క్రమశిక్షణను ఉల్లంఘించారు."

జిరియాన్స్కీ ఇలా ఉపన్యసించేసరికి సభలో హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

తరువాత జకరోవ్ ఇలా ప్రసంగించాడు: "మన క్రిమశిక్షణ ఉక్కువంటిది—మనకు స్టాలిన్ నేర్పిన క్రమశిక్షణ అది. అది మనదేశానికి అవసరం. మనం ఎన్నో అద్భుతమైన వీరోచిత కార్యాలను నిర్వర్తిస్తున్నాం. మనచుట్టూ శత్రువులు పొంచి ఉన్నారు. మనం ఏమరుపాటున ఉండకూడదు. వాళ్లు ఎప్పుడైనా మనమీద పడవచ్చు. మనం శత్రువులను ఎదుర్కొని పోరాడవలసి ఉంటుంది. మనం ఈ కాలనీవదిలి, ఇక్కడ మనం అలవర్చుకున్న క్రమశిక్షణాశక్తిని ప్రదర్శించుకోవలసి ఉంటుంది. ఫిల్కా క్రమశిక్షణకు భిన్నంగా ప్రవర్తించాడు. సందేహంలేదు."

సమావేశంలో టార్‌స్కీ ఈక్రింది తీర్మానాన్ని ఓటింగుకు పెట్టాడు: "సభ్యులారా మీముందొక తీర్మానముంది. ఈ నింది తుల కాలనీ సభ్యత్వాన్ని రద్దు చేయవలసినదిగా ఈ తీర్మానం ఆదేశిస్తున్నది. అయితే అది ఎంతకాలమని ప్రశ్న? మూడు మాసాలు చాలునని నా సూచన... కామ్రేడ్ ఫిల్కా! నీవు చెప్ప దలుచుకున్న దేమైనా ఉంటే చెప్పవచ్చును."

ఫిల్కా ఇలా అన్నాడు: "క్రమశిక్షణను అతిక్రమించడం తప్పే. జకరోవ్‌తో నేనుపూర్తిగా ఏకీభవిస్తున్నాను. కాని మరె న్నడూ ఇలాంటి తప్పు చెయ్యను. మీరు నన్ను శిక్షించినా శిక్షించకపోయినా ఒకటే – ఏమంటే ఇహముందు నేనెలాగైనా క్రమశిక్షణను తప్పక పాటిస్తాను. నేను కొత్తవాణ్ణి కాదు. కాలనీ సభ్యత్వం కొన్నిమాసాల పాటు రద్దు చేయవచ్చును. సభ్యత్వం రద్దుఅయిన పిదప అది ఎన్ని నెలలయితే ఏం? ఇంతకూ నేను అయి దేండ్లనుంచీ కాలనీలో సభ్యుణ్ణి."

టార్‌స్కీ, నోవాక్ వంక చూచాడు: "నీవేమంటావు నోవాక్?" అని అడిగాడు.

అందుకు నోవాక్ "నేనూ అంతేనంటాను" అని సమా ధానం చెప్పాడు.

క్రావ్‌చెక్ కూడా సమావేశం చేసిన నిర్ణయాలకు తాను బద్ధుడనై ఉంటానన్నాడు. ఇంతలో సమావేశంలో ఒక గొంతుక వినిపించింది:

"నేనొక తీర్మానాన్ని ప్రతిపాదించ దలుచుకున్నాను." అంటూ పదవ దళాధిపతి ఇల్యారొడినోవ్ లేచి నిలుచున్నాడు. కమాండర్లందరిలోకీ అతను చిన్నవాడు.

"అదేమిటో చెప్పు" అన్నాడు టార్‌స్కీ. రొడినోవ్ ఇలా చెప్పసాగాడు:

"కాలనీ సభ్యత్వం రద్దుచేయడమంటే ఎవరికైనా కష్టంగా ఉంటుంది. అంటే బాడ్జి లేకుండా కాలనీలో ఉండడమన్నమాట.

ఫిల్కా చాలా కాలంనుంచి కాలనీలో వుంటున్నాడు. అతనుచేసింది నేరమే. కాని అందువల్ల నష్టమేమీ జరగలేదు. ఎవరి గౌరవానికీ భంగం రాలేదు. అతని సభ్యత్వం రద్దు చేయకూడదు. ఇదివరకు ఇలాంటి సంఘటన కాలనీలో జరగలేదు. ఫిల్కా, వెర్యూషా, పెట్యాలూ చాలా చిన్న కుర్రాళ్ళు. పదమూడేండ్ల పిల్లలు. అం చాత వాళ్ళ నొకసారి అందరి ఎదుటా హెచ్చరించి వదిలిపెడితే చాలు. ఇంతే నా ప్రతిపాదన."

ఆ పిల్లలను శిక్షించాలో మానాలో నిర్ణయించవలసిందిగా టార్స్కీ, తీర్మానాన్ని ఓటుకు పెట్టాడు.

వాళ్ళను శిక్షించాల్సిందేనని అందరూ ఆమోదించారు. ఈ శిక్ష ఎవరెవరికి ఏవిధంగా ఉండాలనే ప్రశ్న చర్చకు వచ్చింది. శిక్ష అందరికీ ఒకేవిధంగా ఉండాలని అంతా ఆమోదించారు. తరువాతవాళ్ళకు కాలనీ బాడ్జీలు ఇవ్వాలా అక్కర్లేదా అన్న విష యం ఓటుకు పెట్టారు. ఇవ్వక్కర్లేదని అరవై మంది ఓటు చేశారు. ఇవ్వాల్సిందేనని జకరోవ్‌తో సహా నూటఇరవై ఇద్దరు చేతు లెత్తారు. సమావేశం అదొకవిధమైన సంచలనంతో ముగిసింది.

విడిదికి వెళ్ళుతున్నప్పుడు తోోవలో క్రావ్‌చెక్‌ను వాన్యా పలకరించాడు. క్రావ్‌చెక్ కోపగించుకున్నాడు.

నాలుగో దళంలో సభ్యులందరూ జిరియాన్‌స్కీ కోసం నిరీక్షిస్తున్నారు. అందరి ముఖాలలోనూ గాంభీర్యం అగుపిస్తోంది. ఎవరూ మాట్లాడడంలేదు. అంతా నిశ్శబ్దంగా, నిశ్చలంగా ఉంది. దళాలన్నీ ఇలాగేఉన్నాయి. కాని కొంతసేపటికి, ఒకగంటపోయిన తరువాత ఈ గాంభీర్యం చెదిరిపోయింది. అందరికీ ఉల్లాసం కలిగించే ఒక వార్త వినవచ్చింది. ఆ మర్నాడు 'ఆసియాలో తుపాను' అనే చలనచిత్రాన్ని కాలనీలో ప్రదర్శిస్తున్నారని తెలియగానే పిల్లలంతా సంబరపడ్డారు. ఈచలనచిత్రాన్ని చూడాలని ఎన్నాళ్ళబట్టో పిల్లలు కుతూహల పడుతున్నారు. ఆ చిత్రం అత్యద్భుతంగా ఉందని పత్రి

కలు వ్రాశాయి. జనం చెప్పుకుంటున్నారు. దాంతో పిల్లల ఉబ్బ లాటం మరీ హెచ్చింది.

మరుసటిరోజు బస్తీనుంచి పెట్రోవ్ ఆ ఫిలింను తీసుకొచ్చాడు.

ప్రదర్శనం ఇంకా చాలాసేపటికి ప్రారంభమవుతుందనగానే నాలుగోదళంలోని సభ్యులు ప్రదర్శనశాలకు వెళ్ళారు. అంతా ఒక వరుసలో కూచున్నారు. చిత్రంలో కథానాయకుడు జంఘిజ్ ఖాన్‌ను గురించి జిరియాన్‌స్కీ ఆ పిల్లలకు చెప్పాడు. తరువాత కాలనీ సభ్యులంతా అక్కడికి చేరారు. డ్యూటీలో ఉన్న కమాండర్‌తో జకరోవ్ ఇలా అన్నాడు:

"ఇహ నీవు ఆట ప్రారంభించవచ్చు. నేను ఆఫీసుకు వెళ్ళిపోతున్నాను."

తరువాత లైట్లు ఆరిపోయాయి. ఆట మొదలైంది. నాలుగోదళంలోని సభ్యులు తమకు క్రిందటిరోజు జరిగిన దుస్సంఘటనను మర్చిపోసాగారు. విరామసమయం తరువాత కథలో రెండవభాగం ప్రారంభమయింది. పిమ్మట మూడోది. అది అన్నిటికన్నా మరీ బాగుంది. చివరభాగం జరుగుతున్నప్పుడు మధ్యలో డ్యూటీలో ఉన్న కమాండర్ పొకొజై గొంతుక వినిపించింది:

"నాలుగోదళ సభ్యులంతా వెంటనే ఆఫీసుకు వెళ్ళాలి."

"ఏమిటి విశేషం!" అని అడిగారు కొందరు.

"ఏమీలేదు - మీరు సినిమా చూడండి." అన్నాడు పొకొజై.

నాలుగోదళానికి చెందిన సభ్యులు ఆఫీసుకు వెళ్ళారు. వాళ్ళు రాగానే జకరోవ్ ఇలా ప్రశ్నించాడు:

"అంతా వచ్చారా?"

"ఆ, అంతావచ్చాం."

"షాపులో సామాన్లకు నిప్పంటుకున్నది. అగ్నిమాపక దళంతో అవసరం లేకుండానే మీరే వెళ్ళి ఆర్పండి. వంటగదిలో

బాల్చీలున్నాయి. గడబిడలేకుండా పని కానివ్వండి. నేనూ వస్తు న్నాను."

జిరియాన్‌స్కీ ఇలా అన్నాడు: "క్రావ్‌చెక్! నీవీ నలుగు రినీకూడా తీసుకెళ్లు. బాల్చీలు పట్టా. తక్కినవాళ్ళు నాతోరండి."

అంతా ఎవరిపనిమీద వారు పరుగెత్తారు. సాపుదగ్గరికివెళ్ళి మంటలార్పారు. మంటలారిపోయాక జకరోవ్ వాళ్ళను అభినం దించాడు.

అంతా సంతోషంలో మళ్ళీ సినిమాలోకి వెళ్ళి కూచు న్నారు. సినిమాలో చివరభాగం చూపుతున్నారు. తాము మంటలు ఎంత నేర్పుగా అర్పిందీ నాలుగోదళ సభ్యులు తమలో తాము మెల్లగా చెప్పుకుంటూ సినిమా చూడసాగారు.

## 3

# ఎవరితోనూ కలవని వాండా

ఫౌండ్రీ మూడురోజుల పాటు మూతపడేసరికి బ్లమ్ నీరస పడిపోయాడు. దిగులువల్ల మనిషి చిక్కిపోయాడు. అతనికి జబ్బుగా ఉన్నదని కాలనీలో పుకారు పుట్టింది. కాని దీనికి కారణం లేక పోలేదు. ఒకనాడు బ్లమ్ ఫౌండ్రీ చుట్టూ తిరిగి అక్కడనుంచి తిన్నగా డాక్టర్ దగ్గరికెళ్ళాడు. అది కొందరు చూచారు. దాంతో అతనికి వంట్లో బాగాలేదని పుకారు పుట్టింది. ఆ డాక్టరంటే బ్లమ్‌కు వళ్లుమంట. అతనే ఈ అల్లరికి కారణమని బ్లమ్ ఊహ. ఫౌండ్రీలో గాలీ వెలుతురూ లేకపోతే జ్వరం వస్తుందని లేనిపోని హడావుడి చేశాడు. డాక్టర్ దగ్గరునుంచి తిరిగొస్తున్నప్పుడు కొంత ఉల్లాసంగా కనుపించాడు కాని, తరువాత అదంతాపోయి మనిషి

క్రుంగిపోవడం మొదలుపెట్టాడు. కమాండర్ల కౌన్సిలు గదిలో అతనికి జోరిన్ కనుపించాడు.

"డాక్టర్ దగ్గరికి వెళ్ళాను జోరిన్! 'జబ్బేమీ లేదు. అనవసరంగా దిగులు పెట్టుకోకు' అన్నాడు డాక్టర్" అని బ్లమ్ అతనితో చెప్పుకున్నాడు.

మూడు రోజులు గడిచిపోయాయి. ఫౌండ్రీకి కొత్త పొగగొట్టం అమర్చారు. అది చూచి జోరిన్ ఇలా అన్నాడు:

"అది ఎప్పుడో ఒకప్పుడు విరిగి ఊరుకుంటుంది. అట్టే బలంగా లేదు. మొదటి తుపాను కేసరి."

ఇది వినగానే బ్లమ్‌కు కోపం వచ్చింది.

"ఏమిటీ నీవన్నది? విరిగిఊరుకుంటుందా? మనం అంత అసమర్థులం అనుకున్నావా ఏం?" అన్నాడు బ్లమ్.

అదే రోజున పొగగొట్టానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేశారు. తీగెలు చుట్టారు. ఇప్పుడు పొగగొట్టం బలంగా ఉన్నది.

ఆ పొగగొట్టం చూచినప్పుడు వాండా స్ట్రాడ్నిడాస్కయా పొంగిపోయింది. ఇన్నాళ్ళూ అయిదో దళం సభ్యులు బ్లమ్‌ను ఎగతాళిచేస్తూ వచ్చారు. ఆ దళంలోనే వాండా పని చేస్తున్నది. వచ్చిన కొత్తలోనే పనంతా నేర్చుకున్నది. ఆమె నేర్పుచూచి కమాండర్ అభినందించాడు. ఆమెకు కొత్త బాధ్యత ఒకటి అప్పగించాడు. కుర్చీలను చక్కగా మెరుగుపెట్టి తయారుచేయడం వాండా పని. కాలనీ సభ్యులందరితో వాండా ఎంతో కలుపుగోలుతనంగా ఉంటుంది. ఎవరితోనూ దెబ్బలాడదు. ఎవరినీ పల్లెత్తుమాట అనదు. కాని ఆ కాలనీకి ఇంకా ఆవిడ అలవాటు పడలేదు. అది తన జీవితంలో ఒకభాగమని భావించడంలేదు. కాలనీ జీవితం ఆమెకు కొత్తగా కనుపిస్తున్నది. పూర్వపు జీవితానికీ దీనికీ పోలికేలేదు. ఆ జీవితం పదేపదే ఆమెకు జ్ఞప్తికి వస్తున్నది. దాని ఛాయలింకా ఆమె హృదయంలో

ముద్ర వేసుకునే ఉన్నాయి. రాత్రిళ్ళు ఏవేవో కలలుకంటున్నది. ఆ కలల్లో కరిగిపోతూనే నిద్ర లేస్తున్నది. కాలనీలో చక్కని ఉదయాన్ని చూస్తూ పొంగిపోతున్నది. కాలనీ వాతావరణమంతా ఆవిడకు ప్రశాంతతను చేకూరుస్తున్నది.

కాలనీలో ఉదయంపూట ఆ పిల్లకెంతో హాయిగా ఉండేది. అంతా సందడి, చెవులు గింగిర్లెత్తేటట్టు బిగిల్ కూతలు, పిల్లకాయలు అటూ ఇటూ తీసే పరుగులు, ఎక్కడ చూచినా అంతా హడా వుడితో కన్నుల పండుగ్గా ఉండేది. అన్ని వైపులనుంచీ కుర్రాళ్ళ నవ్వులు, పరాచికాలు వినిపించేవి. కాలమంతా ఇట్టే గడిచి పోయేది. ఆవిడకూడా ఎంతో కుతూహలంతో ఈ పనిపాటల్లో పాల్గొనేది. కాలనీ పిల్లలతోపాటు తనుకూడా తన విధులు నిర్వ ర్తించేది. దళం మానీటర్ కు సహాయం చేస్తూనో, కమాండర్ కు ఏవైనా కబుర్లు అందచేయడంలోనో నిమగ్నురాలయ్యేది. డ్యూటిలో ఉన్న కమాండర్లు హఠాత్తుగా - ఏ క్షణంలోనో ప్రత్యక్షమయ్యేవాళ్లు. వెంటనే ఎక్కడి కుర్రాళ్ళు అక్కడ నిలబడి పోయి నిశ్శబ్దం వహించేవాళ్లు. కాలనీ అంతటా నిశ్శబ్దం అలుము కునేది. కమాండర్లు పిల్లకాయలను చూచి "శుభోదయం కామ్రేడ్స్!" అంటూ ఆహ్వానించేవాళ్ళు. ఇదంతా ఆ పిల్లకెంతో ఉత్సుకతను రేకెత్తించేది.

పరిశుభ్రంగా, మంచుమడిలా తళతళ మెరిసిపోతున్న భోజనశాల చూచేసరికి ఆవిడకళ్ళు జిగేల్ మనేవి. బల్లలమీద కుండీలలో అమర్చిన పూగుత్తులు, అవతల పచ్చని, వెచ్చని సూర్యకాంతిలో మిలమిల లాడుతూ వరుసలొరుసలుగా బారులు తీరిఉన్న పూలమొక్కలు ఆవిడ కెంతో ముచ్చట కలిగించేవి. ఇహ పోతే సాయంకాలాలు కూడా ఆవిడకెంతో హాయిగా గడిచి పోయేవి. నిశ్శబ్దంగా ఉన్న విశ్రాంతి మందిరంలోను, ప్రశాంతంగా ఉన్న పార్కులోను గడిపేది. ఎంతో ఉద్వేగాన్ని, ఉత్సుకతను కలిగించే చిన్నచిన్న సాయంకాలపు సమావేశాల్లో పాల్గొనేదికూడా.

కాని ఇన్ని ఉన్నప్పటికీ కూడా ఇంకా వాండాకు మనుష్యులపట్ల ఇష్టంగా ఉండడం అలవడలేదు. నిజానికి కుర్రవాళ్ళంతా ఆవిడ యెడల ఎంతో మర్యాదగా ప్రవర్తించేవాళ్లు. శ్రద్ధ, ఆసక్తి చూపుతూ ప్రేమతో ఉండేవాళ్లు. కాని ఆవిడ వాళ్లను అనుమానించేది. వాళ్ళదంతా ఒక నటనఅని, వాళ్ల అసలు స్వరూపం ఏనాటికో ఒకనాడు బట్టబయలవుతుందని అనుకునేది. తను 'స్వేచ్ఛా జీవితం' గడిపిన రోజుల్లో అనేకమంది పోకిరీకుర్రాళ్లు తనను వెంటాడి వేధించినట్టే వీళ్ళుకూడా వ్యవహరిస్తారని భావించుకునేది. పైగా ఆ అమ్మాయి అంతమంది కుర్రవాళ్ళలోనూ రైజికోవ్‌ను ముఖ్యంగా గమనిస్తూ ఉండేది. అంతమందిలోనూ అతనిముఖం ఆవిడకు కొట్టొచ్చినట్టు అగుపించేది. మొదట మొదట గోంటార్ అనేకుర్రాణ్ణి చూచి ఆపిల్ల భయ విచలితురాలవుతూ వచ్చింది. అతని దొంగచూపులు, చప్పరిస్తున్న పెదవులు ఆవిడకు అనుమానం కలిగిస్తూ వచ్చాయి. కాని ఆ తరువాత తరువాత అతను ఒకర్నెనాను ప్రేమిస్తున్నాడని తెలుసుకున్నది. అప్పటినుంచీ అతను మంచికుర్రవాడేనని అనుకోసాగింది.

కాలనీలో ఆడపిల్లలంటే కూడా ఆవిడకు సదభిప్రాయంలేదు. ఆడపిల్లలు కంటపడినప్పుడు కూడా అనుమానంగా చూచేది. వాళ్లు మామూలు పిల్లల్లాగా అగుపించేవాళ్ళు కాదు ఆమెకు. వాళ్ల రూపురేఖలు, వాళ్ళచూపులు, చర్యలు; ఒకొక్కరు ఒకొక్క తరహాగా ఉండేవాళ్లు. ఈ ఆడపిల్లలంతా పొగరుపోతు పిల్లలనీ, స్వార్థపరులనీ వాండా అనుకునేది. వగలమారివాళ్ళనీ వీళ్ల మనస్సుల్లో పుట్టెడు బుద్ధులున్నాయనీ తలపోసేది. ఇలా ఒకొక్క పిల్లను ఒకొక్క తరహాగా అంచనావేసి; మొత్తంమీద అందరినీ అనుమానిస్తూ వచ్చింది. ఈ ఆడపిల్లల్లో ప్రతి ఒక్కరికీ చక్కని దుస్తులున్నాయి. రకరకాల దుస్తులు, లంగాలు, కుట్టుదారాలు, రిబ్బన్లు, అందమైన జోళ్ళు; ఇవన్నీ ఈపిల్లలు తమతమ అల్మారాల్లో అమర్చుకున్నారు. కాని వాండాకు అలాంటి వస్తువులేమీ లేవు. తక్కిన పిల్లలందరికీ పరుపులమీద రెండు మూడు తలగడ

లున్నాయి. వాండాకు మాత్రం పక్కమీద ఒక్కటే దిండు ఇవన్నీ వాండాకు అసూయ పుట్టించాయి. అనుమానాన్ని రేకెత్తించాయి. కాని ఆవిడ స్వతహాగా తగువులమారి పిల్ల కాదు అంచాత లోపల అసూయ ఉన్నప్పటికీ పైకి ఎవరితోనూ తగువులు పెట్టుకోలేదు. ఉన్నదంతా కడుపులోనే దిగమ్రింగుతూ మౌనంగా ఉండేది. అయినప్పటికీ ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒకరూపంలో ఆవిడ మనోభావాలు వ్యక్తమవుతూనే ఉండేవి. ఇలా ఉండగా ఒకనాడు జకరోవ్ క్లావాను పిలిచి వాండా పరిస్థితి ఏమిటనీ, కాల నీలో ఆవిడ ఎలా ఉంటున్నదనీ అడిగాడు.

అందుకు క్లావా "తనవిషయమేమో తనేమో తప్ప వాండా మరేమీ పట్టించుకోవడం లేదు...ఆవిడ విధేయతగా ఉంటున్నది. కాని మనస్సులో ఏవేవో పెట్టుకుని ఒంటిగా గడుపుతున్నది" అని సమాధానం చెప్పింది.

"ఎవరితోనైనా స్నేహం చేస్తున్నదా?" అని అడిగాడు మళ్ళీ జకరోవ్.

"లేదు. ఇంతవరకూ ఆపిల్లకు స్నేహితులన్నవారు ఒక్కరు కూడా లేరు. చాలా నింపాదిగా ఉంటున్నది. విషయాలు అర్థం చేసుకునేందుకు ఆవిడకెంతో కాలం పట్టేటట్టున్నది." అని చెప్పింది క్లావా.

"ఒకవిధంగా అదే మంచిది. తొందరేమీ లేదు. ఆవిడను ఒంటిగానే ఉండనివ్వండి. ఏ విషయంలోనూ బలవంతం చేయ వద్దు. అలాగే విశ్రాంతి తీసుకోనివ్వండి ఆమెను." అన్నాడు జకరోవ్.

"అవును, నాకు తెలుసు. అలాగనే నేనూ ఊరుకున్నాను."

"ఆ అమ్మాయి చాలా మంచిది."

నిజానికి వాండా విశ్రాంతి తీసుకుంటున్నది. షాపులో మాత్రం పనిచేస్తున్నది. ఆ పనిపాటల్లోనూ, సమావేశాల్లో పాల్గొ నడంలోనూ, తుపానులా అల్లకల్లోలం చేసిన ఆపిల్ల వెనకటి జీవితం

క్రమక్రమంగా స్మృతి పథంనుంచి తొలగి పోసాగింది. కాని ఇంతలో ఆవిడకు ఒక్సానా ఒకతె తటస్థమైంది. ఇప్పుడామెకు కలలో ఇలలో కూడా ఒక్సానాయే కనుపిస్తున్నది.

పార్కులోనో, సినిమా హాలులోనో ఆవిడకు ఒక్సానా తటస్థపడుతున్నది. కాని ఆ పిల్లతో స్నేహం చేయడానికి బిడియ పడేది. ఒక్సానా కూడా ఆమెను దూరంగానే ఉంచేది. ఒక్సానా రైతులపిల్లని ఆమెకు తెలుసును. గోంటార్ ఆపిల్లను ప్రేమించాడు. ఇగోర్ పార్కులో ఆపిల్లను ముద్దుపెట్టుకుని తరువాత క్షమాపణ కోరుకున్నాడు. ఈ ఉదంతం కూడా వాండాకు తెలీకపోదు.

ఒక్సానా కనుపించేసరికి వాండా ఆ పిల్లవంక తదేకంగా చూస్తుంది. ఒక్సానా కనులలో ఏదో దైన్యం ఉట్టుపడుతున్నట్టు ఆమెకు అనిపించేది. అవును. ఆపిల్ల మోములో ఎంతో దైన్యం గోచరిస్తోంది. పాపం. ఆపిల్ల జీవితంలో ఎన్నో కష్టాలుపడి ఉంటుంది.

# 4

# కాలనీలో కొత్తపిల్ల

రోజులు గడుస్తున్నాయి. రోజులు గడుస్తున్న కొలదీ ఇగోర్‌లో యౌవనం ఇనుమడిస్తున్నది. ఇప్పుడతను మాటిమాటికీ అద్దంలో ముఖం చూచుకుంటున్నాడు. అతనికి బాడ్జీ లేకుండా ఒక పెరేడ్ యూనిఫారం ఇచ్చారు. ఆ దుస్తుల్లో అతను ఎంతో చక్కగా, బలంగా ఉన్నట్టు అగుపించేవాడు. దుస్తులు వేసుకుని అద్దం ముందు నిలుచునేవాడు. ముస్తాబు చూచుకొని మురిసిపోయే వాడు. తనలో తాను నవ్వుకునేవాడు. కాలనీలో తను చక్కగానే ప్రవర్తిస్తున్నాడు. తనకు ఒప్పగించిన పని సక్రమంగా నెరవేరుస్తు న్నాడు. ఆవేళ ఒక్సానాను పార్కులో తను ముద్దుపెట్టుకోవడం

తప్పే. కాని అందుకు వెంటనే క్షమాపణ చెప్పుకున్నాడు. వచ్చే వారం పరీక్షలు. ఇట్టే తను ఎనిమిదవఫారం ప్యాసైపోతాడు. ప్యాసైన నెలరోజుల్లో తనకు 'కాలనీ సభ్యత్వం' లభిస్తుంది. బుద్ధిగా ప్రవర్తిస్తూ ఉంటే అన్నీ సాధ్యమే.

రోజురోజుకూ ఇగోర్‌లో ఎక్కడలేని ఉత్సాహం పొంగి వస్తోంది. ఇప్పుడతను ఎవరితోనూ దెబ్బలాడడం లేదు. అందరితోనూ కలిసి మెలిసి ఉంటున్నాడు. పరాచకా లాడుతున్నాడు. అతన్ని చూడగానే అందరూ నవ్వుతూ పలకరిస్తున్నారు. రాను రాను అతనికి పుస్తకాలు చదవడం బాగా అలవాటయింది. విపరీతంగా పుస్తకాలు చదవడం ప్రారంభించాడు. గ్రంథాలయంలో అడుగుపెట్టగానే అతన్ని, షురామిట్యానికోవా చిరునవ్వుతో పలకరిస్తుంది.

"ఏం పుస్తకాలు కావాలి? షేక్‌స్పియర్ నాటకాలా?" అని అడుగుతుంది.

ఇలా అడుగుతూనే మెల్లెక్కుతూ బీరువా తలుపుతీస్తుంది. షేక్‌స్పియర్ నాటకాలను ఇంకా ఎక్కువమంది చదవాలని ఆమె ఉద్దేశం. ఇగోర్ షేక్‌స్పియర్ వంటి కవుల రచనలంటే చాలా ఇష్టపడతాడని ఆమె నమ్మకం. ఆమె ఇలా అడుగుతూ ఇగోర్ వంక చూచేసరికి అతను లోలోపల ఆనందిస్తుంటాడు. ఇలాంటి చెల్లెలు తనకు ఉన్నట్టయితే ఎంత బావుంటుందని అనుకునేవాడు. ఆమె అతనికి షేక్‌స్పియర్ పుస్తకాలు ఇస్తుంది. అతను అవి తీసుకుని వెడుతోంటే త్రోవలో పిల్లలు ఎదురు పడతారు. అతన్ని గౌరవంగా చూస్తారు.

"లైబ్రరీలో ఏం పుస్తకాలు తెచ్చుకున్నావు? ఓహో! షేక్‌స్పియర్ గ్రంథాలా? బాగుంది. అప్పుడే అవి చదువుతున్నావే!"

వ్లాడిమిర్ కొలోస్ ఇలా అడిగేసరికి ఇగోర్ "అవును. అర్థం చేసుకోవద్దూ. అందుకు ప్రయత్నిస్తున్నాను." అని సమాధానం చెప్పేవాడు.

వ్లాడిమిర్ కొలోస్ కాలనీలో ప్రసిద్ధుడు. ఇంకా కొద్ది కాలంలో చదువుకునేందుకు మాస్కో వెడతాడు. అతని పొగడ్త సాధారణమైన విషయం కాదు.

ఇగోర్ తిన్నగా పడకగదిలోకి వెళ్ళాడు. కుర్చీలో కూచుని పుస్తకం తెరిచాడు. అది ఒథెల్లో నాటకం. నాటకం చదువు తోంటే అతనికి నవ్వొచ్చింది. ఒథెల్లో ఒక చిత్రమైనవ్యక్తి. కాల నీలో ఉండే గోంటార్ కూడా సరిగ్గా అలాంటివాడే.

ఇలా ఇగోర్ అనుకుంటూ ఉండగా ఇంతలో గోంటార్ అక్కడికి వచ్చాడు. అతనికేసి చూచి ఇగోర్ ఇలా అన్నాడు:

"ఈ నాటకమంతా నిన్ను గురించే వ్రాశాడు !"

"నాగురించా ?"

"అవును. నాటకంలో ఒకవ్యక్తి ఉన్నాడు. అతనూనీలాగే ఈర్ష్యాళువు.

"ఆ పుస్తకంలో నాలాంటి వ్యక్తే ఉన్నాడా?"

"అవును. అచ్చం నీలాంటివాడే !"

"కాని నాకు ఈర్ష్య లేదు. ఉందనుకుంటే అది నీతప్పు. ఇంతకూ నీకేమర్థమవుతుంది కనుక? ముద్దాడడం మాత్రమే నీకు తెలుసును." అన్నాడు గోంటార్.

మిషాగోంటార్ మొగమాటస్థుడు. ఇగోర్ కేమీ తెలీదనీ, ముద్దులు పెట్టుకోవడమే అతని పననీ గోంటార్ నమ్మకం. గోంటార్ ఇతర్లజోలికి పోడు. ఈ విషయం ఎనిమిదవ దళంలో అందరికీ తెలుసును. వచ్చే శీతాకాలంలో అతను కారు నడపడం నేర్చుకుంటాడు. నేర్చుకున్న తరువాత లారీలమీద పనిచేస్తాడు. జకరోవ్ అతనికొక విషయంలో మాటకూడా ఇచ్చాడు. అతను ఉండడానికై జాగా చూచిపెడతానన్నాడు. అప్పుడతను ఒక్సా నాను పెళ్ళాడవచ్చును. ఈ పన్నాగడ అంతా కాలనీలో అందరికీ తెలియక పోలేదు. ముఖ్యంగా నాలుగోదళంలో వాళ్ళందరికీ తెలు

సును. కాని మిషాగోంటార్ మాత్రం ఈరహస్యం ఎవరికీ తెలియ కూడదన్నట్టు అతిగోప్యంగా ఉంచేవాడు. ఎవరైనా ఈవిషయాన్ని గురించి అడిగితే ఒక విషపునవ్వు నవ్వి ఊరుకునేవాడు. పిల్లలంతా తలకొక విధంగా వదరుతూ ఉంటే, వాళ్ళ ఇష్టంవచ్చినట్టు వాగ నివ్వమని ఊరుకునేవాడు. తను ఇంతకంటె కూడా భవిష్యత్తును గురించి, ఇంకా పెద్దపెద్ద ఆలోచనలు చేస్తున్నట్టు అగుపించేవాడు. పిల్లకాయలు అతనితో వాదన పెట్టుకునేవాళ్లు కాదు. ఏమైనా గోంటార్ భలేకుర్రాడని ఊరుకునేవాళ్ళు.

గోంటార్ ఊహలు, పన్నాగాలు కాలనీలో అందరికీ తెలుసును... కాని ఒక్సానా ఆలోచనలేమిటో ఒక్కరికీ తెలీదు. నిజానికి ఆ పిల్ల కడుపులో ఏమున్నదో గోంటార్‌కు కూడా తెలీదు. అయితే కాలనీ కుర్రవాళ్లు తక్కువవాళ్లా? వాళ్ళ కళ్ళు సామాన్యమైనవికావు—గోంటార్‌కన్నా ఒక ఆకు ఎక్కువ చదివినవాళ్ళే వాళ్లు; ఆవులిస్తే పేగులు లెక్కపెట్టే రకం.

ఒక్సానా సినిమా చూడ్డానికి వచ్చింది. చెత్త ఎత్తిపోసే బుట్టకూడా వెంట తెచ్చుకున్నది.సాయంకాలం,ఆడవాళ్ళ 'విశ్రాంతి' సమయంలో ఈత కొట్టడానికై కోనేటికి వెళ్ళింది. కాలనీలో వాళ్ళు ఆ పిల్లను వెయ్యికళ్ళతో కనిపెడుతున్నారు. లారీడ్రైవరు గోంటార్‌కు ఆవిడ భార్య కావాలని అనుకుంటున్నదని చెప్పడానికి వాళ్ళకీ నిదర్శనం చాలదూ మరి!

ఒక్సానా రైతులపిల్ల. ఆమె ఒకలాయరు ఇంట్లో పనిచేస్తున్నది. కాలనీ వాసులెవరూ ఆ లాయర్ను ఎరగరు. ఒక్సానాను చూచి కాలనీవాసులు జాలిపడుతూ ఉంటారు. కాని ఆవిడలో ఉన్న కొన్ని సద్గుణాలనుచూచి ఆనందిస్తూ ఉంటారు. ఒక్సానా ఎప్పుడూ నవ్వుతూఉంటుంది. మనిషి తొట్రుపడదు. గంభీరంగా కనుపిస్తుంది. ఆ పిల్ల కళ్ళు ఆలోచనాపూర్వకంగా ఉంటాయి. ఆమెనుగురించి ఇంతకాలం బట్టీ కాలనీ వాసులెవరూ చాడీలు చెప్పి ఎరగరు. అలాంటి అవసరం ఎవరికీ రాలేదు. మిషా గోంటా

ర్‌తో కలిసి ఆవిడ షికార్లు చేస్తుండగా ఎవరూ కళ్ళారా చూడ లేదు. కాలనీవాసులకు ఇది మరీ ఆశ్చర్యంగా ఉంది.

ఆగస్టు నెల వచ్చింది. సెలవులిచ్చారు. ఒకనాడు అనుకో కుండా ఇగోర్, మిషా గోంటార్లు విశ్రాంతి మందిరంలో కలుసు కున్నారు. గోంటార్ తల దువ్వుకుంటున్నాడు. ఇగోర్ తనబూట్లు పాలిష్ చేసుకుంటున్నాడు. అతనివంక గోంటార్ చూచీచూడ నట్టు చూచాడు. అతను తొడుక్కున్న పంట్లాం కొత్తది. గోంటార్ చూపుల్లో అనుమానం వ్యక్తమైంది. కాని ఏమీ మాట్లాడలేదు. ఇగోర్ మంచిమాటకారి. గోంటార్‌ను చూచి ఇలా అడిగాడు:

"నీవు ఎక్కడికి వెడుతున్నావో చెపుతావా?"

"చెప్పడమెందుకూ? నాతోవస్తే రా."

"అయితేసరే. వస్తాను."

తరువాత ఇద్దరూ మౌనం వహించారు. కొంతసేపు పోయాక ఇగోర్ మళ్ళీ ఇలా అన్నాడు:

"పెరేడ్ దుస్తులు వేసుకునేందుకు నీకు హక్కులేదు."

"ఏం? వీటితో పట్నానికి వెడితే ఏం? ఫ్యాక్టరీలోఉన్న కమాండరుతో చెప్పివెడతాను." అన్నాడు గోంటార్.

"ఓహో! నీవు బస్తీకి వెడుతున్నావా! బాగుంది!"

"వెళ్ళాలనే అనుకుంటున్నాను. ఈ దుస్తులు ఎలా ఉన్నాయో చూస్తాను."

ఇద్దరూ మౌనంగా నిలుచున్నారు. ఇగోర్ జేబురుమాలు మడత పెట్టుకుంటున్నాడు. గోంటార్ ఇలా అడిగాడు:

"మరి నీవు ఎక్కడికీ ప్రయాణం?"

"నేనా? ప్రత్యేకంగా ఒకచోటికని ఏమీలేదు. ఎక్కడ చల్లగా గాలివేస్తే అక్కడికి—"

"ఇక్కడికన్నా హాయిగా గాలివచ్చేచోటు మరేదీలేదు."

"అలాగా! ఫౌండ్రీలో పొగ విషయం మరిచిపోయావన్న మాట!" అంటూ ఇగోర్, చేరుమాలు ముక్కుదగ్గర పెట్టుకున్నాడు.

"ఎందుకా లేనిపోని నటన. ఇవాళ ఫౌండ్రీకి సెలవు. మరెందుకా ముక్కులు మూసుకోవడం?"

"ఇవాళ పొగలేకపోతే సరా! నిన్నటిపొగకే ఇంకా నాకు ఊపిరి తిరగడంలేదు!"

ఇగోర్ ఫౌండ్రీ సరిహద్దులు దాటి ఎక్కడికో వెడుతున్నాడని గోంటార్ గమనించాడు.

"అనవసరంగా తిరగకు. అంతే నాసలహా". అన్నాడు గోంటార్.

"గాభరా పడకయ్యా మిషా."

ఇరువురూ విశ్రాంతిమందిరం దాటారు. పార్కుదగ్గరికి వెళ్ళారు. ఆనకట్ట చేరుకున్నారు.

"ఇంతకూ ఎక్కడికి వెడుతున్నావో చెప్పవూ?" అని అడిగాడు గోంటార్.

"ఉట్టినే—కాలనీ అంతా ఒకమాటు పచారు చేయాలనుకున్నాను. అందుకు నాకు హక్కు లేదంటావా?"

"ఎందుకు లేదూ, ఉన్నది."

ఇరువురూ ఆనకట్టదాటి వెళ్ళారు.

"ఇహనీవు అట్టే దూరం రావడంలేదూకదూ?" అన్నాడు గోంటార్.

"ఎందుకు రాకూడదూ?" అని ఎదురుప్రశ్న వేశాడు ఇగోర్.

"కాలనీలో పచారు చేస్తానన్నావుకదూ, అందుకని అంటు న్నాను."

"కాలనీలో పచారుచెయ్యను- కాలనీచుట్టూ పచారు చేస్తాను. ఏం? నాకాహక్కు లేదా?"

"ఉన్నదయ్యా ఉన్నది——కాని——..."

"కాని——ఏమిటి?"

"నాదగ్గర తమాషాలు చెయ్యకు ఇగోర్——దౌడపండ్లు రాలగొడతాను; ఏమనుకున్నావో" అన్నాడు గోంటార్.

"పండ్లు రాలగొడతావా? ఈ చక్కని 'మే' నెలలో—— ఇంత చల్లని సాయంకాలం హాయిగాఉండక ఆమాట అనడానికి నీకు నోరెలా వచ్చిందోయ్?" అన్నాడు ఇగోర్.

"ఇది 'మే' నెలా? నీవు ఆడుతున్న నాటకం నాకు తెలీ దనుకున్నావా? నీవు ఎందుకోసం వచ్చావో నాకు తెలుసును."

జపాన్‌వాళ్ల ముష్టియుద్ధం ఎలాఉంటుందో నీకు తెలీదు కాబోలు- ముఖంమీద ఒక్కగుద్దు గుద్దానంటే——గుద్దుకు ఫయి సలా అవుతావు..." అన్నాడు ఇగోర్.

"నీకు రష్యన్‌ల తడాఖా తెలీదుకామోసు——మెడమీద. ఒక చరుపుచరిస్తే, భళ్ళున రక్తం కక్కుతావు..." అన్నాడు గోంటార్.

దారికడ్డంగా నిలుచున్నాడు గోంటార్. పిడికిలి బిగించాడు

"ఇంతహఠాత్తుగా దెబ్బలాడుకోవడం బాగుండదు మిషా." అన్నాడు ఇగోర్.

"అయితే వెనక్కుమళ్ళు——"

"నీవు నిజంగా ఒథెల్లోలాంటి వాడివి!...ఏమైనాసరే నేను వెనక్కుమళ్లను. కాని దెబ్బలాటవస్తే కొట్టేమొనగాడివి నీవొక్కడి వేనా? నీవనుకుంటున్నచోటికి నేనేంరానులే. నీలాంటి ఒథెల్లోతో నాకేంపని?"

ఈమాటలు విని గోంటార్ తల్లక్రిందులై పోయాడు. తాను ఎక్కడికో వెళ్ళాలని అనుకుంటున్నాట్ట! ఆ విషయం అతనికి తెలుసునట!

గోంటార్ ఒకప్రక్కకుతిరిగి చూచాడు. కొంచెందూరంలో ఒక్సానా కనుపించింది. వయస్సుమనిషి ఒకతనుకూడా ఆమె వెంట ఉన్నాడు. అతనికి తలమీద టోపీలేదు. మనిషి కులాసాగా కనుపిస్తున్నాడు. ఇగోర్, గోంటార్లు ఇరువురూ అతనివంక చూచారు. అతనే ఒక్సానా యజమాని అని పోల్చుకున్నారు. ఒక్సానా నాలుగడుగులు వేసింది. కాళ్ళకు తెల్లటి జోళ్ళున్నాయి. తలకు తెల్లటిరిబ్బన్ చుట్టుకుంది. రోజుటికంటె ఇవాళ మరీ అందంగా అగుపిస్తోంది. ఆ యజమాని, ఒక్సానాలిద్దరూ ఆనకట్టవైపు నడిచి వస్తున్నారు. ఇగోర్ గోంటార్లు ప్రక్కకుతప్పుకుని వాళ్ళకు త్రోవ ఇచ్చారు. గోంటార్ చెయ్యెత్తి నమస్కరించాడు. ఇగోర్ కూడా అలాగేచేశాడు. ఒక్సానా తల ప్రక్కకు తిప్పుకుంది వాళ్ళిద్దర్నీ చూచి ఆ యజమాని తనుకూడా నమస్కరించి ఇలా అడిగాడు:

“జకరోవ్ కాలనీలో ఉన్నాడయ్యా?—ఆయనతో ఇప్పుడు మాట్లాడడానికి వీలుంటుందా?”

“ఎప్పుడూ మాట్లాడడానికి వీలుంటుంది” అన్నాడు గోంటార్. అతిశయంగా,

ఒక్సానా ముందు వంతెనమీద అడుగుపెట్టింది. తక్కిన వాళ్ళంతా ఆమె వెనకాలే నడిచారు. నడుస్తూ యజమాని ఇలా అన్నాడు:

“మీరు కాలనీలో ఎంతహాయిగా గడుపుతున్నారు! నేను కూడా మీలాగే పదిహేనేండ్ల కుర్రాణ్ని అయితే ఎంత బాగుండును!”

అతనిమాటల మీద గోంటార్ కు నమ్మకంలేదు. అతను ఎలాగైనా యజమాని ఇతర్న ప్రశ్నను దోచుకతినేవాడు.

మాట్లాడుకుంటూ ప్రధానభవనం చెంతకు వచ్చారు. గోంటార్ మాట్లాడు తున్నంతసేపూ మహాజాగ్రత్తగా మాట్లాడాడు. ఒక్కమాటకూడా పొల్లు పోనీయలేదు. అనవసరమైన వివరాలు అతనితో చెప్పలేదు.

"రోజూ కాలనీలో ఎన్ని నూనెపాత్రలు తయారవుతాయి?" అని అడిగాడు ఆ యజమాని.

"ఆ వివరాలు గుమాస్తాలకు తెలుస్తాయి, మాకు తెలీవు." అంటూ గోంటార్, ఇగోర్ వంక గడుసుతనంగా చూచాడు.

అంతా కాలనీలోకి వచ్చారు. డైరెక్టర్ కోసం ఎవరో కొత్తవాళ్ళు వచ్చారు." అన్నాడు డ్యూటీలో ఉన్న కమాండర్.

అరగంట గడిచింది. ఇగోర్ గోంటార్లు అక్కడే అటూ ఇటూ తిరుగుతున్నారు.

"వాళ్ళెందుకొచ్చారంటావ్?" అని అడిగాడు గోంటార్.

బిగోనక్ తుర్రున ఎక్కడికో పరుగెత్తుక వెళ్ళాడు. కొద్దిసేపయిన తరువాత క్లావా కషిరినాను వెంటబెట్టుకుని వచ్చాడు. ఆ యజమాని గోంటార్ ఇగోర్లకు నమస్కరించి అక్కడనుంచి కదిలాడు. ఇగోర్ గోంటార్లు ఒకరివంక ఒకరు చూచుకున్నారు.

కొంతసేపు గడిచింది. ఆ కార్యాలయంలో నుంచి క్లావా, ఒక్సానాలు ఇవతలికొచ్చారు. కార్యాలయంముందు ఇగోర్ గోంటార్లు నిలుచునిఉన్నారు. వాళ్ళవంక ఒక్సానా బెదురుచూపులతో చూచింది. క్లావాముఖంలో ఆనందం తొణికిసలాడింది. నవ్వుతూ తలవొంచి నమస్కరించింది. మధురస్వరంతో ఇలా అన్నది:

"కొత్త సభ్యురాలు ఒక్సానా విటోవ్ చెంకోను మీకు పరిచయం చేస్తున్నాను."

యువకులిరువురూ అలాచూస్తూ నిలుచుండిపోయారు. తరువాత క్లావా, ఒక్సానాలు వెళ్ళిపోయారు. యువకులు ఒకరినొకరు చూచుకున్నారు. ఇగోర్ ఇలా అన్నాడు:

"ఇప్పుడైనా కాస్త మంచిగాలి పీల్చుకునేందుకు అలా వెళ్ళిరానా?"

"ఓరి భడవా! కాలనీలో అంతా మంచిగాలే! ఆ-అందు కోసం నీవు మరెక్కడికీ వెళ్ళక్కర్లేదు." అన్నాడు గోంటార్.

ఇరువురూ నవ్వుకున్నారు.

కాపలావాడు వాళ్ళ నవ్వులు విని ఉలిక్కిపడ్డాడు. అలా వారిరువురూ నవ్వుకుంటూ విశ్రాంతి మందిరంవైపు వెళ్ళడం చూశాడు.

గోంటార్ మళ్ళీ ఇగోర్‌తో ఇలా అన్నాడు:

"ఇగోర్! ఇహ ఇంతటితో మన ప్రేమ కలాపాలు ముగి శాయనుకుంటాను!"

"నామటుకు నాకంతే—కాని మరి నీకో?" అన్నాడు ఇగోర్.

గోంటార్ చురచుర చూశాడు:

"నేనూ కాలనీ సభ్యుణ్ణే. జాబితాలో నేను నాలుగోవాణ్ణి. ఆమాట మరిచిపోకు."

# 5

# అత్యద్భుతం!

విశ్రాంతి మందిరంలో మెడవరకూ దుప్పటి కప్పుకుని ఒకాసానా ఒక కుర్చీలో కూర్చుని ఉంది. ఆమె జుట్టు ఎంతో అందంగా, నున్నగా ఉంది. ఆమెచెంతనే నిలుచుని వాండా చక్కగా ఆమెజుట్టు కత్తిరిస్తోంది.

"నేను నీకు రెండు అల్లికచుట్టలిస్తాను. అవి తలకు ఎంతో ముచ్చటగా ఉంటాయి." అంటూ వాండా చుట్టూ ఉన్న పిల్లల

వంక చూచింది : "చూడండి ఒక్సానా జుట్టు ఎంతబావుందో! ఆట్టే కత్తిరించాల్సిన పనిలేదు. వంకులొంకులుగా ఉండేటట్టు చేయ వచ్చును. అప్పుడు మరీ అందంగా ఉంటుంది." అన్నది.

వాండా క్రిందపెదవి కొరుక్కుంటూ ఒక్సానా జుట్టుకొస లను వంకులొంకులుగా సరిచేయసాగింది. ఒక్సానా కదలకుండా కూచున్నది. ఆపిల్ల చెక్కిళ్ళు ఎరుపెక్కాయి.

పని అయిపోయిన తరువాత ఒక్సానా వాండావంక చూచింది. తను కప్పుకున్న దుప్పటి తీసి అవతల పెట్టింది.

"అభివందనాలు!" అంటూ కుర్చీలోనుంచి లేచింది.

వాండా ఆవిడను కౌగలించుకున్నది: "ఇప్పుడెంత బాగు న్నావు!" అన్నది.

గదిలో ఉన్న ఆడపిల్లలంతా కిలకిల నవ్వారు. ఒక్సానా ముఖంలో సిగ్గుతెర వచ్చి కమ్మింది.

"ఇహ చాల్లేండి నవ్వులు. త్వరగా జకరోవ్ దగ్గరికి వెళ్ళాలి" అన్నది క్లావా.

"ఎందుకూ?" అని అడిగింది వాండా.

"అతనికి నునతో మాట్లాడే పని ఉందట."

"అవుతే నేనూ వస్తాను; పదండి."

"త్వరగా రా మరి"

ఆవేళప్పుడు జకరోవ్ ఆఫీసు నిండుగా ఉంటుంది. అనేక మంది ఏదో పనిమీద వచ్చి అతన్ని ఉక్కిరిబిక్కిరీ చేస్తుంటారు. టార్‌స్కీ ఆఫీసులో తొడతొక్కిడిగా ఉన్నా ఇబ్బందిలేదు. అక్కడ ఎంతసేపయినా కూచోవచ్చు, మాట్లాడుకోవచ్చు, నవ్వుకోవచ్చు. కాని జకరోవ్ ఆఫీసులో అలాకాదు. అక్కడంతా నిశ్శబ్దం. ఎవరు వెళ్ళినా అక్కడ గడబిడ చేయకూడదు. మెల్లగా మాట్లాడుకోవాలి. లేకపోతే అతని పని పాడవుతుంది. అయితే ఎప్పుడూ అతని ఆఫీసు ఇలాగే ఉంటుందనికాదు. అప్పుడప్పుడు

జకరోవ్ అక్కడికి వచ్చినవారితో కబుర్లు చెబుతుంటాడు, చలోక్తు లాడుతుంటాడు.

ఆడపిల్లలు కమాండర్ల కౌన్సిలుగదిలోనికి వెళ్ళారు. ఒక్సానా కాలనీదుస్తులు వేసుకున్నది. ఎంత మంచివార్త! బిగోనక్ వాళ్ళురాగానే తనమామూలు ధోరణిలో తలుపు తెరిచి "ఇదేదారి–" అంటూ చూపించాడు.

వాళ్ళు లోనికివెళ్ళగానే గదిలోని వారంతా ఆశ్చర్య పోయారు. జకరోవ్ ఒక్సానానుచూచి ఇలా ప్రశ్నించాడు:

"ఎలాగైతేనేం కాలనీలో చేరావన్నమాట? నీవేమైనా చదువుకున్నావా? ఎన్నాళ్లు బళ్లోకివెళ్ళావు?"

"ఏడేండ్లు" అనిచెప్పింది ఒక్సానా.

"మార్కులు బాగా వచ్చేవా?"

"ఆ, బాగానే వచ్చేవి."

సంభాషణ ఇలా సాగుతుండగా ఇగోర్ తాను జోక్యం కలిగించుకున్నాడు.

"ఒక్సానా! నీతోవచ్చిన చిక్కల్లా ఒక్కటే" నన్నాడు.

అతనిలా అంటోంటే వాండాకు అదోలా అనిపించింది: "చూడండి, అతనిమాటలు——బస్తీ అలవాట్లుపోయాయి. కావు–" అన్నది.

జకరోవ్ మళ్ళీ తనధోరణిలో పడ్డాడు:

"అయితే నీకుబాగా మార్కులొచ్చావన్నమాట?" అని అడిగిన తరువాత,తమాషాకు ఇగోర్‌ను ఇలా ప్రశ్నించాడు: "పన్నెండు పన్నెండ్లు ఎంతో చెప్పగలవా ఇగోర్?"

"ఏమిటేమిటీ! పన్నెండు పన్నెండ్లా?

"అవును."

ఇగోర్ ఇంటినాసాలు లెక్కపెట్టసాగాడు: "నూటనాలుగు" అని సమాధానం చెప్పాడు.

"ఇదేనా నీలెక్క? ఏ పద్ధతిన హెచ్చువేశావు?" అని అడిగాడు మళ్ళీ జకరోవ్.

ఇగోర్ ఉడికిపోయాడు. అంతా అతనికేసి చూచారు. అతను మళ్లీ దీర్ఘంగా ఆలోచించి "నూటనాలుగు" అని తిరిగి అదే సమాధానం చెప్పాడు.

జకరోవ్ నిశ్వసించాడు :

"చూచావా ఒక్సానా! పన్నెండు పన్నెండ్లు నూట నాలుగట! బస్తీనుంచి వచ్చిన ఈ పెద్దమనిషి మనకు చెబుతున్నాడు! ఈ మధ్యనే అమెరికాలో ఒక శాస్త్రజ్ఞుడు పన్నెండు పన్నెండ్లు నూటనాలుగు కాదని పరిశోధించి చెప్పాట్ట!" అన్నాడు.

ఆడపిల్లలు నవ్వుతూ ఇగోర్ వంక చూచారు. ఇగోర్ మళ్ళీ మనసులో లెక్కలు గుణించుకున్నాడు. కాని అతనికి పన్నెండు పన్నెండ్లు ఎంతో తోచలేదు. జకరోవ్ తనతో పరాచకాలాడుతున్నాడనుకున్నాడు. ఒక్సానా సమక్షంలో తనలా ఓడిపోవడం అతనికి అవమానంగా ఉంది. ఎలాగైనా తనమాట నెగ్గించుకోవాలనుకున్నాడు. అతను చెప్పిన సమాధానం తప్పని పక్కనే కూచున్న వాన్యా అతన్నిగిల్లాడు. కాని ఇగోర్ అది పట్టించుకోలేదు.

"అమెరికా వాళ్లు ఒక్కోసారి తప్పుచేస్తుంటారు జకరోవ్." అన్నాడు ఇగోర్.

ఒక్సానా నవ్వు ఆపుకోలేక పోయింది. ఇప్పుడా పిల్ల నవ్వులో సిగ్గు కనిపించటం లేదు. తనొక కొత్తమనిషిలాగా భావించడంలేదు. నవ్వుతూ ఇగోర్‌ను ఇలా అడిగింది:

"అయితే మీరాలెక్క ఎలా చేస్తారు?"

ఈమాటతో ఇగోర్‌కు తలమీద పిడుగు పడ్డట్టనిపించింది. తన ఓటమిని తాను అంగీకరించలేక పోయాడు:

"దీంట్లో ఏముందీ? పదిపదులు నూరు. రెండు రెండ్లు నాలుగు. మొత్తం నూటనాలుగు. సరిపోలా?" అన్నాడు.

ఒక్సానా నివ్వెరపోతూ అతనివంక చూచింది. జకరోవ్ బుజాలు కుంచించుకున్నాడు :

"నివ్వెర పోతావెందుకు ఒక్సానా ? అతనిలెక్క సరిగ్గానే ఉంది. నూటికి నాలుగు కలిపితే నూటనాలుగు అవదూ మరి !" అన్నాడు.

అందరూ పగలబడి నవ్వారు. చప్పట్లు కొట్టారు.

"లెక్క తప్పుచెప్పాడు. కావాలంటే చూడండి జకరోవ్ - అదేం హెచ్చవేత - పన్నెండు పన్నెండ్లు నూట నాలుగా !" అన్నారు ఎవరో.

సంభాషణ మరో విషయంమీదికి మళ్ళింది. జకరోవ్ క్లావాను ఇలా అడిగాడు :

"ఒక్సానా ఎవరి అజమాయిషీలో ఉంటుంది క్లావా ?"

"మరుష్యా ఆ బాధ్యత తీసుకుంటే బాగుంటుందను కుంటు న్నాను. కాని వాండా తానే ఆబాధ్యత తీసుకుంటా నంటున్నది. కాని ఆమెకు కాలనీ సభ్యత్వం ఇంకా లభించలేదు." అన్నది క్లావా.

వాండా లేచి నిలుచున్నది. రెండడుగులు నడిచి ఒక్సానా పక్కన చతికిలబడింది:

"అవును. నేనింకా కాలనీ సభ్యురాలను కాను. కాని కామ్రేడ్ జకరోవ్ ..."

జకరోవ్ ఆమె కళ్ళల్లోకి చూచాడు. అంతా నిశ్శబ్దంగా వింటున్నారు.

"సరే - ఇది చాలా ముఖ్యమైన విషయం. ఆమె బాధ్యత నీవు తీసుకోవాలను కుంటున్నావు. అంతేకదూ ?" అని అడిగాడు.

"అవును, అంతే" అన్నది వాండా.

మళ్ళీ గదంతా నిశ్శబ్దం అలుముకున్నది. వాండా అందరి వంకా తేరిపార చూచింది. తల పంకిస్తూ ఇలా అన్నది:

"అవును. ఒక్సానా బాధ్యతను నేను పూర్తిగా తీసు కుంటానని మీ అందరికీ వాగ్దానం చేస్తున్నాను."

జకరోవ్ లేచి ఆపిల్లతో కరస్పర్శ కావించాడు:

"అందుకు అభివందనాలు వాండా! నీవు చాలా మంచి అమ్మాయివి." అన్నాడు.

"ఆ బాధ్యత నాకు ఒప్పగించినందుకు మీకు నా ధన్యవాదాలు." అన్నది వాండా.

సంతోషంగా ఎవరి పనిమీద వారు వెళ్ళిపోయారు.

రాత్రి పిల్లలంతా గదులలో పడుకున్న తరువాత జకరోవ్ టార్‌స్కీ దగ్గరికి వెళ్ళాడు. టార్‌స్కీ అతనివంక ప్రశ్నార్థకంగా చూచాడు. జకరోవ్ అతన్నిలా ప్రశ్నించాడు:

"టార్‌స్కీ! ఒకమాట అడుగుతాను చెప్పు?"

"అడగండి." అన్నాడు టార్‌స్కీ.

ఒక్సానా పొలంలో పనిచేసే పిల్లని కాలనీ పిల్లలకు ఎలా తెలిసింది?"

"ఏమోమరి - కాలనీలో అంతా అదేమాట చెప్పుకుంటు న్నారు."

"అది సరేలే - ఎలా తెలిసిందని అడుగుతున్నా."

"ఆపిల్ల ఒక లాయరు ఇంట్లో పనిచేస్తున్నది. అతని దొడ్లో చెట్ల పాదులకు ఒక్సానా నీళ్ళుపోసేది. ఏం, కాదంటావా?"

"ఆమె పూర్తిపేరు ఒక్సానా విటోవ్ చెంకో. ఆపిల్లతండ్రి ఒక కమ్యూనిస్టు. గత శీతాకాలంలో అతను స్వర్గస్థుడైనాడు. అంతకుముందే వాళ్ళమ్మ చచ్చిపోయింది. దాంతో ఈపిల్ల దిక్కు లేని పక్షి అయింది. ఆలాయరు నిజానికి లాయరు కాదు - అతనొక ప్రొఫెసరు. న్యాయశాస్త్రం బోధిస్తాడు. అతను ఒక్సానాను పెంచు తున్నాడు. అతనూ, ఆపిల్ల తండ్రీ స్నేహితులు. ఇద్దరూ యుద్ధంలో కలిసి పనిచేశారు."

"అయితే ఆపిల్ల అతని ఇంట్లో చెట్లపాదులకు నీళ్ళెందుకు పోయడం?"

"అందులో వింత ఏమున్నది? ఆతోట తానే వేసింది. కూర మొక్కలు పెంచడం ఆపిల్లకు సరదా."

టూర్‌స్కీకి ఇదంతా గాబరాగా ఉంది: "వింతగా ఉన్నదే మీరు చెప్పేది - ఆ లాయరును మేము ఒక పీడకుడని భావించామే !" అన్నాడు.

"లేనిపోని ఊహాలు పెట్టుకోకండి. అలాభావించడం తప్పు."

"అయితే ఈ విషయం వచ్చే సమావేశంలో అందరికీ చెప్పాలి."

"అలా చెప్పక్కర్లేదు. అందరికీదానంతట అదే తెలుస్తుంది" అంటూ జకరోవ్ అక్కడనుంచి బయలుదేరాడు.

వసారాలో దీపం వెలుగుతోంది. జకరోవ్‌ను చూచి కాపలావాడు కుర్చీలోనుంచి లేచి నిలుచున్నాడు.

"గుడ్‌నైట్-" అన్నాడు జకరోవ్.

"గుడ్‌నైట్ కామ్రేడ్ జకరోవ్." అన్నాడు కాపలా మనిషి.

జకరోవ్ 'బి'.- అనే భవనాల దగ్గరికి వెడుతున్నాడు. అక్కడ పడకగదుల్లో అంతా నిశ్శబ్దంగా ఉన్నది. ఎక్కడా దీపాలు లేవు. ఒకగదిలో మాత్రం కిటికీలోనుంచి వెలుగు కనిపిస్తోంది. జకరోవ్ అటువైపుకు నడిచాడు.

"గుడ్‌నైట్ జకరోవ్." అన్నది ఒక గొంతుక.

జకరోవ్ అటుచూచి "నీవింకా మేలుకునే ఉన్నావా వాండా ?" అన్నాడు.

"అవునండీ. నిద్ర రావడంలేదు. ఏం చేయమంటారు ?" అన్నది వాండా.

"నీవేం చేస్తున్నావక్కడ ?"

"ఏం చేయడంలేదు - ఊరికె మబ్బులవంక చూస్తూ కూచున్నాను." అన్నది వాండా.

బాగుంది నీవాలకం - ఇహ నిద్రపో."
"నిద్రరాందే ఏంపోనూ?"
"అదేవస్తుంది - పోయి పడుకో." అన్నాడు జకరోవ్.
వాండా నవ్వుతూ ఇలా అన్నది: "అలాగే కామ్రేడ్ - పోయి పడుకుంటాను.

ఈమాట క్లావా, గదిలోకి వచ్చింది. వాండా బుజాలమీద తల ఆనించి అవతలికి చూచింది:

"ఎవరితో నీవు మాట్లాడేది వాండా?" అని అడిగింది.
అప్పుడు అవతలనుంచి జకరోవ్ ఇలా అన్నాడు:
"రాత్రిళ్లు ఆపిల్ల అలా ఎందుకూ మేలుకొని ఉండడం క్లావా? ఊరిక కిటికీలో కూచుని పగటికలలు కంటున్నది పాపం."
"నేనేం కలలు కనడంలేదు - ఊరికే అటుచూస్తూ కూచున్నాను అంతే-" అన్నది వాండా.
"చప్పున ఆపిల్లను తీసుకెళ్ళి పడుకోబెట్టు క్లావా!" అన్నాడు అవతల్నుంచి జకరోవ్.
కిటికీ మూతపడింది. దీపం ఆరిపోయింది. అంతా నిశ్శబ్దం, చీకటి ఆవరించింది.

# 6

# చక్కని ఆగస్టు నెల

ఉండి ఉండి హఠాత్తుగా కాలనీలో ఒక సంఘటన జరిగింది. ముందు చెప్పకుండానే జిరియాన్‌స్కీ నాలుగోదళాన్ని సమావేశపరిచాడు. అలా ఎందుకు సమావేశపరిచాడో ఎవరికీ తెలీదు. ఎవరూ కారణం అడగలేదు. పిల్లలు వాళ్ళల్లోవాళ్లు గుసగుసలాడుకున్నారు. ఫిల్కా-షేరీ చెవిలో రహస్యంగా వాన్యా

ఇలా అన్నాడు: "ఏమిటి జరుగుతుందంటావ్? ఎందుకు సమావేశ పరుస్తున్నట్టు? నీకు తెలిస్తే నాకుచెపుదూ."

"ఏదో అద్భుతం జరుగుతుంది—తొందరెందుకు, కాసే పట్లో చూస్తాంగా!" అన్నాడు ఫిల్కా షేరీ.

బిగిల్‌కూత వినిపించింది. నాలుగోదళం కుర్రాళ్ళందరినీ వరుసగా నిలుచోబెట్టి జిరియాన్‌స్కీ ముందు, హాలువైపు నడిచాడు. బిగోనక్ బిగిల్‌పట్టుకుని దళసభ్యులను కలుసుకున్నాడు. ఒకరినొకరు చూచుకుంటూ నవ్వుకున్నారు. అందరూ విశ్రాంతి మందిరంలోకి వెళ్లాడు. అక్కడ కాలనీసభ్యులు కూచునిఉన్నారు. నాలుగోదళపు సభ్యులు వాళ్ళదగ్గరకాకుండా స్టాలిన్‌విగ్రహం చుట్టూ ఎదురుగా కూచున్నారు. తరువాత జకరోవ్, టార్‌స్కీలు మాట్లాడుకుంటూ లోనికివచ్చారు. టార్‌స్కీ సమావేశాన్ని ప్రారంభించాడు.

"నాలుగోదళం కమాండర్ జిరియాన్‌స్కీ ఇప్పుడు మీ ఎదుట మాట్లాడతాడు" అన్నాడు.

వెంటనే జిరియాన్‌స్కీ లేచి నిలుచున్నాడు. అతనితో పాటు అతని దళసభ్యులుకూడా లేచి నిలుచున్నారు. జిరియాన్‌స్కీ ఇలా ప్రసంగించాడు:

"కామ్రేడ్! ఇంతకుముునుపు మానాలుగోదళం సమావేశమైంది. ఆ సమావేశంలో మేము పద్నాలుగుమందిమీ ఒక నిర్ణయానికి వచ్చాము. ఇంతవరకూ సభ్యత్వంలేకుండా దళంలో పని చేస్తున్న వాన్యా గల్చెంకోకు కాలనీసభ్యత్వం ఇవ్వాలని నేను ప్రతిపాదిస్తున్నాను. మా దళం కోరికను కాలనీసభ్యుల సాధారణ సమావేశం మన్నిస్తుందని నేను భావిస్తున్నాను. వాన్యా చాలా మంచి కామ్రేడ్. పనిలో ఎప్పుడూ ముందడుగే. అతన్నిగురించి నేను ఇట్టేచెప్పను. బిగోనక్ అతని బాధ్యత వహించాడు. కనుక అతనేవచ్చి చెపుతాడు. వాన్యా! అయిదడుగులు ముందుకు మార్చి చెయ్యి."

వాన్యా ఆశ్చర్యపోయాడు. కమాండర్ పక్కనే నిల్చుండిపోయాడు. బిగోనక్ ముందుకువచ్చి వాన్యాను గురించి నాలుగు మాటలు చెప్పాడు: అతనెప్పుడూ ఎవరితోనూ దెబ్బలాడడు. చెప్పిన పనులన్నీ నేర్పుగా చేసుకపోతాడు. వేళ తప్పడు. ఎల్లప్పుడూ ఉల్లాసంగా ఉంటాడు. అతన్ని అందరూ మెచ్చుకుంటారు, రోజూ 'ప్రవదా' పత్రిక చదువుతాడు. అక్టోబరు విప్లవాన్ని గురించి అధ్యయనం చేశాడు. లెనిన్, స్టాలిన్‌లు సాధించిన విజయాలను క్షుణ్ణంగా అవగతం చేసుకున్నాడు. నీపర్ నది ఆనకట్టను గురించిన వివరాలు తెలుసుకున్నాడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల స్థాపన, అవి స్థాపింపబడుతున్నప్పుడు ధనికవర్గం చేసిన విద్రోహాలు; అర్థం చేసుకున్నాడు. కాలనీ వదిలిపెట్టిన తరువాత అతను ఎర్ర వైమానిక దళంలో చేరాలనుకుంటున్నాడు, కాని 'బాంబర్' నడపడంలో సొగసులేదు. యుద్ధవిమానం నడపడంలోనే గొప్పతనం ఉంది.

ఇలా అని వాన్యా అందరితోనూ చెబుతుంటాడు.

కాలనీ అంటే అతని కెంతో ప్రీతి. కాలనీ నియమాలు, సూత్రాలు చక్కగా అర్థం చేసుకున్నాడు. వాటిని తూ, చా. తప్పకుండా పాటిస్తాడు. ఇప్పుడతను సంగీతం అభ్యసిస్తున్నాడు. కొంతకాలం పోయాక వాయిద్య దళంలో సభ్యుడుగా చేరతాడు. అతని గుణవిశేషాలు బిగోనక్ సభ్యులకు విపులంగా చెప్పాడు.

మార్క్ గ్రీన్‌హాస్ సమావేశంలో లేచి నిలుచున్నాడు. నాలుగోదళం ప్రతిపాదించిన తీర్మానాన్ని 'కొమోసల్' తప్పక ఆమోదిస్తున్నదని చెప్పాడు. గత మూడు మాసాలనుంచీ వాన్యా మరింత చురుగ్గా ఉంటున్నాడనీ, కనుక అతనికి 'ఫస్టు ఆఫ్ మే కాలనీ' పతకాన్ని ఇవ్వవలసిందనీ కోరాడు. తక్కిన కాలనీ సభ్యులందరూ అందుకు తమ ఆమోదాన్ని ఎరుకపరచారు. క్లావా కషిరినాకూడా, వాన్యా చాలా మంచివాడనీ, మర్యాద తెలిసిన కుర్రవాడనీ చెప్పింది. తరువాత జకరోవ్ ఇలా ఉపన్యసించాడు:

"కామ్రేడ్స్! ఒక్క విషయం చెప్పదలుచుకున్నాను. ఎక్కడ తప్పుడున్నా దాన్ని కనిపెట్టడం నా వంతు. కాని వెయ్యి కళ్ళతో వెతికినా వాన్యాలో ఎక్కడా తప్పు కనిపించదు. మీ నాలుగోదళ సభ్యులందరూ జాగ్రత్తగా ఉండాలి. ఇహ ముందు కూడా వాన్యా ఇలాగే ప్రవర్తించేటట్టు చూడవలసిన బాధ్యత మీ అందరిపైనా ఉన్నది. వాన్యా, నీ కొకమాట—నిన్ను ఎవరు పొగిడినా పొంగిపోకు. పొంగుబాటు ఎప్పటికీ అనర్థదాయకం. ఒకమంచి చేశానుకదా అని సంతృప్తిపడి ఊరుకోకు. అంతకంటె మంచిపని మరొకటి చెయ్యి, తెలిసిందికదూ?"

వాన్యా తల ఊపాడు.

వ్లాడిమర్ కొలోస్ అనే కుర్రవాడు ఒక ముఖమల్ బాడ్జీని తీసుకొచ్చాడు. దానిమీద బంగారపు అక్షరాలు తళతళ మెరుస్తున్నాయి.

"వాన్యాగల్చెంకో! గదిలో నీబాడ్జీ. ఇవాల్టినుంచీ నీవు కాలనీ సభ్యుడవు. కాలనీ క్షేమంకోసం సోవియట్ ప్రభుత్వ శ్రేయస్సుకోసం నీశక్తినంతా ధారపోయాలి. నీ క్షేమంకంటె ప్రజాక్షేమమే ఎక్కువని భావించాలి. దేశరక్షణకోసం శత్రువులను ఏక్షణంలోనైనా పారద్రోలడానికి నీవు సంసిద్ధుడవై ఉండాలి. యుద్ధరంగంలో ఎప్పుడూ ముందుకే సాగిపోవాలి. ధైర్యసాహసాలను ప్రదర్శించాలి. అభివందనాలు!" అంటూ కొలోస్, వాన్యాకు పతకం అందించాడు. అందించి అతనితో కరస్పర్శ కావించాడు. సభ్యులందరూ మిన్నుముట్ట కరతాళధ్వనులు చేశారు. వాన్యా బుజాలమీద జిరియాన్స్కీ చేతులు వేశాడు.

సమావేశం ముగిసింది. వాన్యా చుట్టూ పిల్లలు మూగారు. ఒక్కొక్కరు అతనితో కరస్పర్శ కావించి తమ అభివందనాలు తెలిపారు. వారిలో జకరోవ్ కూడా ఉన్నాడు.

"ఏదీ నీ పతకం చూపించు." అన్నాడొక కుర్రవాడు.

"ఓహో, అద్భుతంగా ఉంది."

లిడాటాలిగోవ్నా తల వాల్చుకుని వాన్యావంక క్రీగంట చూచింది :

"రా, ఒక్కమాటు మాగదికి రా." అన్నది.

వాన్యా పదకొండవ దళానికి చెందిన విశ్రాంతిమందిరం లోకి వెళ్ళడం ఇదే మొదటిసారి. అక్కడికిపోగానే ఆడపిల్లలంతా అతనిచుట్టూ మూగారు. అతనికి చాక్‌లెట్లు, బిస్కత్తులు, పెట్టారు. ఎన్నెన్నో అడిగారు. ముసిముసినవ్వులు నవ్వుకున్నారు.

లిడా, వాన్యాకిచ్చిన కాలనీ పతకాన్ని అతని ఎడమబుజానికి అలంకరించింది. అతను అద్దంముందు నిలుచుని దాన్ని చూచుకోసాగాడు. షూరామిట్నికోవా వెనుకనుంచి అతని బుజాలమీదికి వాలింది. పకపకనవ్వింది. అద్దంలో ముత్యాలవంటి ఆ పిల్ల పలువరుస కనుపించింది.

అద్దంముందు నిలుచున్న ఆ ఇరువురినీ చూచి

"ఓహో! ఎంత ముచ్చటగా ఉన్నారీజంట!" అన్నారు, ఎవరో. "వెళ్ళొస్తాను." అంటూ వాన్యా అక్కడనుంచి బయలుదేరాడు. కాని రెండడుగులు అవతలికి వేసేసరికి ఆడపిల్లలు మళ్ళీ అతన్ని లోపలికి పిలిచారు:

"రావయ్యా వాన్యా, రా, అప్పుడే వెళ్ళి ఏంచేస్తావు."

ఆడపిల్లలను తోసుకుంటూ షూరా మిట్నికోవా ముందుకు ముందుకు వచ్చింది.

"ఒక్కమాట వాన్యా, నిన్ను మాలో కలుపుకుంటాం. నీపేరు గ్రంథాలయసేవకుల జాబితాలో వేస్తాను. నీవు చాలా చురుకైన కుర్రాడివి. నీవు ఉండకపోతే ఎలాగ? ఏమంటావు?" అన్నది.

వాన్యా కళ్లు అప్పగించి చూడసాగాడు. అతనికంతా అయోమయంగా ఉంది. సాయంకాలం జరిగిన సంఘటనలు ఇంకా అతనికి జరుగుతున్నట్టే ఉన్నాయి. తన జీవితంలో అలాంటి మధుర సన్నివేశాలు తటస్థిస్తాయని అతను కలలోకూడా అనుకోలేదు.

అనుకోకుండానే మహాద్భుతాలు జరుగుతున్నాయి. చూడచక్కని చిన్నారి బాలికలు కిలకిలనవ్వుతూ, పలకరిస్తూ, చక్కలిగింతలు పెట్టే వాలు చూపులతో తనను ఆహ్వానించారు. పరిమళాలు వెద జల్లే పడకగదిలో నిలువుటద్దం ముందు ఆడపిల్లలు నిలుచున్నారు. తనకు తీయని చాక్లెట్లు, బిస్కట్లు ఇచ్చారు. ఇది మనకు జీవితంలో మరపుకురాని మధురానుభూతి. ఏదో ఒక ఆవేశం, ఆనందాతిశయం అతని హృదయాన్ని అలుముకున్నది. అప్రయత్నంగా ఇలా అన్నాడు:

"మీరు చెప్పినట్టే చేస్తాను. గ్రంథాలయంలో పనిచేయడం నాకిష్టమే."

అతని జీవితంలో ఇలాంటి మధుర దినాలు, సాయంకాలాలు, మాసాలు, కనురెప్ప పాటులో గడిచిపోయాయి.

ఫ్యాక్టరీ వాతావరణం ఇప్పుడు కొంచెం బాగుపడింది. పూర్వంలాగా పొగ, అది రాకుండా ఏర్పాట్లుచేసినా, ఆ ఏర్పాట్లు కాలనీ డాక్టరుకు నచ్చలేదు. అంచాత కార్ఖానాలో పని చేస్తున్న మరీ చిన్నకుర్రవాళ్ళను మరోచోటికి మార్చమని డాక్టరు మరింత పట్టుబడుతున్నాడు. ఈ విషయమే జకరోవ్ కార్యాలయంలో తీవ్రంగా చర్చించుకుంటున్నారు. బ్లమ్ క్రోధావేశుడై ఉపన్యసించ సాగాడు:

"నీవు డాక్టరువు. అంతమాత్రంచేత నాకేమీ తెలీదని అనుకోకు. ఆ పొగగొట్టానికేమీ? నిక్షేపంలాఉంది. నీవు చేస్తున్నంత గడబిడ ఆపొగగొట్టం చేయడంలేదు! మరీ చిన్నపిల్లలను మరోచోటికి మార్చాలా? వాళ్ళనే ఎందుకూ? అందరినీ మార్చమను. నీవు చెప్పేదంతా సిద్ధాంతంగా ఉంది. అదే నిజమవుతే నాలాంటి ఉక్కుమనిషికూడా అక్కడి పని చేయలేడు. నాఊపిరితిత్తులకు ఈపాటికి చిల్లులుపడి ఉండును!"

"స్పేఱపిరి తిత్తులకూ ఆ ఫ్యాక్టరీకి సంబంధంలేదు—అసంద ర్భంగా మాట్లాడకు." అన్నాడు డాక్టరు.

కమాండర్ల కౌన్సిలు ఈ విషయాన్ని గురించి తీవ్రంగా చర్చించింది. బాగా చెయ్యితిరిగిన కుర్రవాళ్ళను, దృఢకాయులను ఆ ప్యాక్టరీలోనే పని చెయ్యమన్నారు. మిగతావాళ్ళను ఇంకొక చోటికి మార్చమన్నారు. అలా ప్యాక్టరీలో ఉండిపోయినవాళ్ళల్లో రైజికోవ్ ఒకడు.

దీంతో హఠాత్తుగా కొందరు కుర్రవాళ్ళు 'టర్నర్లు'గా పని చేయవలసి వచ్చింది. అందులో ఫిల్కా-షేరీ, కిర్యూషానోవ్క్, పెట్కా క్రావ్‌చెక్, వాన్యాగల్చెంకో మొదలైన కుర్రవాళ్లంతా ఉన్నారు. వాన్యా జీవితంలో, ఇది మరీ అద్భుతమైన మార్పు ఈ 'టర్నర్లు' అనే మాటలు వాళ్ళకొక దివ్యమంత్రాల్లా వినిపిస్తు న్నాయి. తమ నూతనజీవితాన్ని గురించి వాళ్ళు ఆనందంతో మాటిమాటికీ ముచ్చటించుకుంటున్నారు. ఇప్పుడు వాళ్లు తమజీవి తాన్ని నూతన పద్ధతిలో చూడసాగారు. ఆలోచనలలో కొత్త దనం వెల్లివిరిసింది. దుస్తుల షాపు, యంత్రభాగాలు అమర్చే షాపు ఇప్పుడు వాళ్ళకళ్లకు ఎంతో చులకనగా కనుపించసాగాయి. అక్కడ పనిచేస్తున్న వాళ్ళు ఒక పనివాళ్ళేకాదన్న అభిప్రాయం ఏర్పడింది. నిజంగా అదొకపనా!

నాలుగోదళంలో కుర్రవాళ్ళు టర్నర్లుగా పనిచేస్తున్నారు. మొదట బ్లమ్ వాళ్ళను కసురుకున్నాడు. కాని తరువాత తరువాత వాళ్ళు పనికి అలవాటుపడ్డారు. వాన్యా అందరిలోకీ మంచి పనివా డనిపించుకుంటున్నాడు.

ఈ ఆగస్టు నెలలోనే మరొక ముఖ్యమైన సంఘటన జరిగింది. వాన్యా గల్చెంకో అయిదవఫారంలో చేరాడు. అతనేకాదు, నాలుగోదళ సభ్యులంతా అదే ఫారం చదువుతున్నారు. వాన్యా మొదటి బెంచీలో కూర్చుంటున్నాడు. మిషాగోంటార్ మాత్రం ఆఖరుబెంచీలో కూచుంటున్నాడు. స్కూలంటే అతనికి తగని అసహ్యం.

"నేను ఇహ కొద్దికాలంలో లారీ డ్రైవర్ను కాబోతు న్నాను. అలాంటప్పుడు ఈ చదువెందుకు?—దండుగ!" అంటూ వచ్చాడతను.

పెట్రోవ్ కూడా గోంటార్ ప్రక్కనే కూచుంటున్నాడు. అతనిదీ గోంటార్ పద్ధతే:

"అయిదోఫారంలో చేరినందున ఏమిటిలాభం? ఫిలిం నడ పడం ఇక్కడ నేర్పనే నేర్పరు. నేర్పందానికి మనకెందుకీ గోల!" అంటున్నాడు పెట్రోవ్.

కాని ఇదేవిషయం మీద సాధారణసభ్యుల సమావేశంలో జకరోవ్ కుర్రవాళ్లందర్నీ ఇలా హెచ్చరించాడు:

"అబ్బాయిలూ! ఇలాంటి వెర్రిమొర్రిమాటలు నాదగ్గర చెప్పకండి. నేర్చుకున్నదంతా ఇదివరకే నేర్చుకున్నాం. కొత్తగా ఇంకేం నేర్చుకుంటాం?' అని భావించకండి. బుద్ధిపూర్వకంగా పాఠశాలకు హాజరు కాకపోయారా, మీవిషయం సమావేశం ముందు చర్చకువస్తుంది. మీలో కొంతమందికి లారీ డ్రైవర్లు అయిపోవాలనీ, మరికొందరికి సినిమా ఆపరేటర్లు కావాలనీ కోరిక లుండవచ్చును. మీరు కలలుకనడం మంచిదే. కాని మీకలలు ఎప్పుడు నిజమవుతాయో కొంచెం గ్రహించుకోండి. మార్కులు తక్కువొస్తే ఏమీలాభం లేదు. అంచాత బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోండి. అప్పుడు మీ కోరికలు ఫలిస్తాయి. ఎవరైతే ఒకవిషయం నేర్చుకునేందుకు విముఖులో వాళ్లు సోవి యట్ పౌరులని అనిపించుకోరు. వాళ్ళకు మనమధ్య స్థానంలేదు."

ఈ మాటలు విని గోంటార్ ముఖం చిట్లించుకున్నాడు. జకరోవ్ అంత నిష్కర్షగా మాట్లాడడం అతనికి నచ్చలేదు.

అయిదవఫారం విద్యార్థులు అతన్ని మానేటర్ గా ఎన్ను కున్నారు. ఎన్నుకోవడంతోటే అతనూ తనకొక బాధ్యతఉందని అనుకోసాగాడు. ఒకనాడు విద్యార్థులను జకరోవ్ హెచ్చరించి నట్లే అతనూ ఇలా హెచ్చరించాడు:

"అబ్బాయిలూ! మీరు నన్ను పెద్దగా ఎన్నుకున్నారు. నాకొక బాధ్యత అప్పగించారు. క్లాసులో ఎవరూ అల్లరిచేయకూడదు. అల్లరిచేశారా సమావేశం ముందు నిలుచోబెడతాను. కనుక శ్రద్ధగా చదువుకోండి. చదువుకోకపోతే నేనే మీచేత చదివించవలసి వస్తుంది. చదువంటే మజాఖా!"

గోంటార్ సంగతి పిల్లకాయలందరికీ తెలుసును. ఇదివరకు అతనేతరగతీ తిన్నగా ప్యాసుకాలేదు. కాని ఇప్పుడు అతను వాళ్ళకు 'మానేటర్' అయినాడు. అతనిఅదుపాజ్ఞలలో వాళ్ళంతా ఉండకతప్పదు. కాని గోంటార్ తన హద్దులుమీరి ప్రవర్తించడం లేదు. త్రికరణశుద్ధిగా తనవిధులు తాను నిర్వర్తిస్తున్నాడు.

ఇగోర్ చెర్నియావిన్ ఎనిమిదవఫారంలో చేరాడు. చదువుకోవాలో లేక సరదాగా తిరగాలో అతనికింకా నిర్ధారణకాలేదు. కాని అతనిముందు బెంచీలో వాండా, ఒక్సానాలు కూచుంటున్నారు. అది అతనికి ఎంతోహాయి గొలుపుతున్నది.

# 7

# దీక్ష

ఆగస్టు వెళ్ళింది, సెప్టెంబరు వచ్చింది. వస్తూనే యువజనోత్సవాన్ని వెంట తీసుకొచ్చింది. కాలనీ అంతా కన్నుల పండువుగా ఉంది. పిల్లలందరిలోనూ ఆనందం వెల్లివెరిసింది. తళతళ మెరిసే పతాకాలు ధరించారు. పెరేడ్ దుస్తులు వేసుకున్నారు. అంతా బారులు తీరినిలుచున్నారు. వాన్యాగల్చెంకో ఆరవ వరుసలో నిలుచున్నాడు. ఆ వరుస పిల్లల్లో అతను మూడవవాడు. ఎదురుగా బ్యాండ్ వాయిద్యగాళ్ళు వాయిద్యాలు పట్టుకుని సిద్ధంగా ఉన్నారు. జకరోవ్ కూడా విన్యాసపు దుస్తులను ధరించి అక్కడికి వచ్చాడు. అతను ఒక్కొక్క వరుసనే పరిశీలించాడు. కుర్రావాళ్ళు

చాలా శ్రద్ధాసక్తులతో తమతమ స్థానాల్లో నిలుచున్నారు. జకరోవ్ అదోకతరహా గొంతుకతో, సాధికారంగా ఒకహెచ్చరిక చేశాడు. రెండుచేతులూ పైకెత్తాడు. బారులుతీరి ఉన్న కుర్రవాళ్ళుకూడా అలాగే చేతులెత్తారు. వెంటనే వాయిద్యాలు మ్రోగాయి. విన్యాసం మొదలైంది. వాన్యా తలఎత్తి ముందుకు ఆతృతగా చూచాడు. కాలనీ సింహద్వారంలో నుంచి మరొక దళం కదం తొక్కుతూ రావడం కనుపించింది. ఆ దళాన్ని విడా టాలికోవా ముందుండి నడుపుతున్నది. ఆ పిల్ల వెనకాల వ్లాడిమిర్ కొలోస్ నడుస్తున్నాడు. అతని చేతిలో రైఫిల్ ఉంది. ఇలాంటి విన్యాసాన్ని వాన్యా చూడడం ఇదే మొదటిసారి. కొలోస్ దగ్గిరికి వస్తున్నకొద్దీ వాన్యాకు మరీ వాత కలిగింది. కొలోస్ చేతిలో ఒక అరుణపతాకం రెపరెప లాడుతున్నది. అదే 'ఫస్ట్ ఆఫ్ మే కాలనీ' పతాకం. ఆ పతాకం చూడముచ్చట గొలుపుతున్నది. ముఖమల్ గుడ్డ రంగురంగుల కాంతులతో శోభిల్లుతున్నది. పతాకంఅంచులు బంగారు రంగుతో తళతళ మెరుస్తున్నవి. ఆ పతాకం పట్టుకొని కొలోస్ బారులమధ్యకు వచ్చాడు. ఒక్కొక్క వరుసదాటి వెళ్ళసాగాడు. దళసభ్యులు గంభీరంగా నిలుచున్నారు. అంతా నిశ్శబ్దంగా ఉంది. జకరోవ్ ఇలా ఆజ్ఞాపించాడు:

"షెరీ, క్రామ్‌చెల్, నోవాక్! మీరు ముగ్గురూ ముందుకు మూడడుగులు వెయ్యండి."

మళ్ళీ బ్యాండ్ వాయిద్యాలు వినిపించాయి. దళాలు ముందుకు కదం తొక్కుతూ పోసాగాయి. ఎనిమిదినుంది చొప్పున ఒక్కొక్క బారే విడిపోయింది. బార్లు రోడ్డుమీద నడవసాగాయి వాన్యా ఇప్పుడు తన వరుసలో మొదట ఉన్నాడు. అతనిముందు కసాట్కిన్ వెడుతున్నాడు. వాన్యా చుట్టూ కలయ చూచాడు. పిల్లల టోపీలు ధగధగ మెరుస్తూ కనుపిస్తున్నాయి. వెనకాల పిల్లలు చీమలబారుల్లా వస్తున్నారు. కసాట్కిన్ వెనక్కు తిరిగి చూచి ఇలా అరిచాడు :

"ఏయ్, వాన్యా! అడుగు సరిగ్గా వెయ్యి, వరుసతప్పకు."

అందరూ కొరోషిలోవ్కా దాటారు. వాన్యా జాగ్రత్తగా కదం తొక్కుతూ నడుస్తున్నాడు. దళాలు కదిలి మహాసముద్రంలా పొంగివస్తుంటే, బాటలమీద మనుష్యులు బారులుతీరి వింతగా చూడసాగారు. నగరంలో పెద్దబజారుకు వచ్చాయి దళాలు: అక్కడ బ్యాండ్ వాయిద్యాలు మరీపెద్దగా, మధురంగా వినిపించాయి. నగరవాసులంతా కాలనీ పిల్లలకు స్వాగతం ఇస్తున్నట్టు కనిపించారు. వాన్యా ఆనందంతో పొంగిపోయాడు. దళాలు మరికొంతదూరం సాగిపోయాయి. అక్కడ ఎర్ర సైని కులు బారులు తీరి దళాల రాకకోసం ఎదురు చూస్తున్నారు. దళాలు అక్కడికి చేరగానే ఒకరికొకరు అభినందనాలు చేసుకు న్నారు. నగరంలో పెద్దలు, పిన్నలు, స్త్రీలు, పురుషులు అంతా ఈ ఉత్సవాన్ని తిలకించి ఆనంద పరవశులయ్యారు. కాలనీ సభ్యులు, ఎర్రసైనికులు ఒకరికొకరు అభివాదాలు కావించుకుంటూ పలకరించుకుంటూ ఉంటే అదిచూచిన పౌరుల ఆనందానికి మేరలేకపోయింది. అన్ని దళాల్లోనూ ముఖ్యంగా ఆరవదళం పౌరుల దృష్టిని ఆకర్షించింది. వాళ్లు మరీ చిన్నపిల్లలు, అయినా ఎంతో ముద్దుగా, క్రమశిక్షణతో, విన్యాసాలు చేశారు.

ఆ సాయంకాలం సాధారణ సభ్యుల సమావేశం జరిగింది. సమావేశానికి క్రుట్జర్ హాజరయ్యాడు. అతను కాలనీకి సాధార ణంగా రాడు. అతనంటే కాలనీవాసుల కెంతో సరదా. క్రుడర్ పొడుగ్గా ఉంటాడు. ముఖం వెడల్పుగా ఉంటుంది. నవ్వుతున్న కళ్ళు, నుదుటిమీద పడుతున్న జుట్టు. మనిషి బాగానే ఉంటాడు. కొన్నాళ్ళు అతను ప్రాదేశిక కార్యనిర్వాహక సంఘానికి అధ్యక్షు డుగా పనిచేశాడు. కాలనీ సభ్యులకు అతనిపై గౌరవమున్నది. కాని అందుకు అతను అధ్యక్షుడుగా పని చేయడమనిమాత్రం చెప్పలేం. క్రుట్జర్ అందరితోనూ కలుపుగోలుతనంగా ఉంటాడు. దాపరికం లేకుండా మాట్లాడతాడు. పరాచకాలాడడమంటే అతని కెంతో ఇష్టం. ఎవరైనా పరాచకాలాడితే పకపక నవ్వుతాడు.

ఇవాళ సాయంకాలం అతను సమావేశానికి వస్తాడని కాలనీవాసు లెవరూ అనుకోలేదు. అతను రాగానే అంతా లేచి నిలుచుని అభి వందనాలు చేశారు. ఒక్కక్షణంలో వాతావరణమంతా ఇట్టే మారిపోయింది. అంతా ఒకరితో ఒకరు పరిహాసాలాడుకోవడం మొదలుపెట్టారు. హాలంతా నవ్వులతో నిండిపోయింది

"ఇవాళ మీరంతా కులాసాగా ఉన్నట్టున్నారే కామ్రేడ్స్!" అన్నాడు క్రుట్జర్.

"మీరంటారేమిటి?—మనం"అని అనక అన్నారు ఎవరో.

"నేనీ సాయంకాలం ఎందుకొచ్చానో తెలుసా? మిమ్మల్ని అభినందించడానికి వచ్చాను. మీరు చక్కగా విన్యాసాలు చేశా రని వాళ్ళు మెచ్చుకున్నారు."

"సరే, బాగానేచేశాం. దానికేంలెండి. ఆమాట అందరూ అన్నారు. ఇంకా విశేషాలు ఏమన్నా ఉంటే చెప్పండి."

"అవి చెప్పడానికే వచ్చాను. మీరు అదృష్టవంతులు. మీ ఖర్చువెచ్చాలను ఇహ ప్రభుత్వమే భరిస్తుంది. ఇదివరకటి లాగా ప్రత్యేకనిధులమీద కాలం గడపవలసిన పనిలేదు. ఇది మీకు శుభవార్త కదూ?"

కాలనీవాసులు ఆనందంతో కరతాళధ్వనులు కావించారు.

"అభివందనాలు కామ్రేడ్ క్రుట్జర్! ఈవార్త తెచ్చి నందుకు మీకు మరీ మరీ అభివందనాలు."

"ఇంతటితో చాలదు."

"చాలదూ?" అన్నాడు క్రుట్జర్.

"చాలదు,"

"అవును. మీరింకా పురోగమించాలి. మీకింకా అనేక సదుపాయాలు కలిగించాలి. మీ ఫ్యాక్టరీ బాగాలేదు."

"ఫ్యాక్టరీ ఒక్కటేకాదు. మాకొక మంచి స్టేడియమ్‌కూడా కావాలి."

" అవునవును." అంటూ బ్లమ్, పెద్దగా అరిచాడు. అతని ముఖం ఎర్రబారింది.

క్రుట్జర్ వేదికపైన కూచున్నాడు. "సరే. మనం ఇక్కడ ఒక చక్కని ఫ్యాక్టరీ నిర్మించాలి. అందుకు మీరేమంటారు?"

"అనేదేముంది— నిర్మించాలి. కాని దాన్ని మనం ఎలా నిర్మించడం?" అని అడిగాడు టార్‌స్కీ.

"ఎలా నిర్మించాలో మీరంతా కలిసి ఆలోచించండి. ఫ్యాక్టరీ ఎలా కడతారో మీకు తెలీదా? అవసరమైన సామాన్లు కొందాం, కట్టుకుందాం." అన్నాడు క్రుట్జర్.

"మరి డబ్బుమాట?"

"డబ్బెందుకు లేదూ? మీఖాతాలో మూడులక్షలున్నాయి!"

"అది సరిపోతుందా?"

"సరిపోదనుకోండి—ఇంకా ఎక్కువే కావాలి."

"మరి ఆ మిగతా డబ్బుమాట?"

"అప్పు తీసుకుందాం." అని అరిచాడు షేరీ.

"అప్పు పుచ్చుకోవడమా! అది మంచిపని కాదు. ఎంచేత నంటారా? మీదగ్గరున్నది మూడులక్షలు. ఇంకా కావలసింది ఏడు లక్షలు. తాహతుకు మించి— అంతఅప్పు చెయ్యకూడదు" అన్నాడు క్రుట్జర్.

"అయితే మరెలాకడతాం ఫ్యాక్టరీ?" అని అడిగాడు వాన్యా.

"నేనొక ఉపాయం చెబుతాను. జాగర్తగా వినండి. మీకు ఇప్పుడు ఏడులక్షలు కావాలి. నేను నాలుగులక్షలిస్తాను. తక్కిన మూడు లక్షలూ మీరెన్నాళ్లల్లో సంపాదించగలరు?"

బ్లమ్ ముందుకు వంగాడు. ఒకక్షణం ఆలోచించాడు :

"ఆ మూడులక్షలూ ఒక్క ఏడాదిలో సంపాదిస్తాం."

"ఏడాదిలో సంపాయిస్తారా !"

"అవును—ఏడాది కూడా అక్కర్లేదేమో." అన్నాడు మళ్ళీ బ్లమ్.

అతని సమాధానం విని జకరోవ్ సంతోషంతో నవ్వు కున్నాడు.

"నీవేమంటావయ్యా కామ్రేడ్ జకరోవ్?" అని అడిగాడు క్రుట్జర్.

జకరోవ్ జవాబు చెప్పడానికి కొంచెం తడబడ్డాడు :

"ఈవిషయం మేం చాలా కాలంనుంచీ ఆలోచిస్తున్నాం. అతను చెప్పినట్లు డబ్బు గడించటం అంత తేలికైన పనికాదు. ఒక ఏడాదిలో మూడు లక్షలు గడించవచ్చు నంటున్నాడు బ్లమ్. కాని అంతకంటె ఎక్కువ కాలం పట్టవచ్చు. ఇప్పుడు మా ఫ్యాక్టరీలో యంత్రాలు అన్నీ పాతపడిపోయినాయి. ఉత్పత్తి కొంచెం తగ్గింది." అన్నాడు.

ఇలా సంభాషణ కొనసాగుతుంటే శాంకోజారిన్ తాను మాట్లాడతానని చెయ్యెత్తి సూచించాడు.

"యంత్రాలు కొంచెం మందగొడిగా పనిచేస్తున్న మాట నిజమే. కాని ఒక్క ఏడాదిలో మూడు లక్షలు చులాగ్గా సంపాదించవచ్చు. నాతో సభ్యులంతా ఏకీభవిస్తారనుకుంటున్నాను." అన్నాడు.

"అవునవును" అని అరిచారు సభ్యులు.

దీంతో జోరిన్‌కు మరీ హుషారు వచ్చింది:

"సభ్యులంతా అవునంటున్నారు. అలాంటప్పుడు వెనకంజ వేయకూడదు. మీరు సహాయంచేస్తే మేం ఇట్టే కొత్త ఫ్యాక్టరీ నిర్మిస్తాం. అయితే ఆ ఫ్యాక్టరీ ఎలా ఉండాలన్నది ప్రశ్న. ఆ విషయం తరువాత చర్చించుకోవచ్చు. ఇప్పుడు నేను చెప్పొచ్చే దేమంటే ఆ ఫ్యాక్టరీ కట్టడానికి మీ ప్రతిపాదన ప్రకారం రెండేండ్లు

పడుతుంది. ముందుమీరు సొమ్మివ్వాలి. ఆ సొమ్ముతో మేం పని చేసి ఏడాదిలో మరో మూడులక్షలు గడించాలి. అప్పుడు ఫ్యాక్టరీ నిర్మాణానికి పూనుకోవాలి. నిర్మాణం పూర్తయ్యేసరికి మరోఏడాది పడుతుంది. అంటే మొత్తం రెండేండ్లన్నమాట. ఇది వృథా కాల యాపన. మనదేశంలో పంచవర్ష ప్రణాళిక, అనుకున్న వ్యవధి కంటే ముందుగానే పూర్తవుతున్నది. మనంకూడా అలాగే మన నిర్మాణం ముందుగా పూర్తిచెయ్యాలి.

అంచాత మీరు డబ్బిచ్చిన వెంటనే ఫ్యాక్టరీ నిర్మాణానికి పూనుకుంటాం. ఒకవైపు పని సాగుతూ ఉంటుంది. మరోవైపు మేం పనిచేసి మూడులక్షలు గడిస్తాం. ఏడాదిలో ఫ్యాక్టరీ పూర్తవు తుంది. కనుక దీనికి రెండేండ్లక్కర్లేదు." అని చెప్పాడు జోరిన్.

"అవునవును." అన్నారు సభ్యులు.

జకరోవ్ సంశయంతో చూడసాగాడు. సభ్యులు నవ్వారు. డబ్బు వెంటనే ఇవ్వమన్నట్టుగా క్రుట్జర్ వంక చూడసాగాడు. క్రుట్జర్, సభ్యులను జకరోవ్‌కు చూపిస్తూ ఇలా అన్నాడు :

"అటు ఒకమాటుచూడు, వాళ్ళెంత పట్టుదలగా ఉన్నారో వాళ్ళ దీక్షను నేనెలా భంగపరచగలను... సరే అబ్బాయిలూ ! సరే – నాలుగులక్షలూ మీకు వెంటనే ఇస్తాను. ఇవాళే ఇస్తాను."

జకరోవ్‌కు ఇప్పుడు అనుమానం మటుమాయమైంది. సంతో షంతో క్రుట్జర్‌ను కౌగలించుకున్నాడు. సభ్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

"ఆగండోయ్ ఆగండి !" అన్నాడు టార్‌స్కీ.

క్రుట్జర్ చేతులూపుతూ టార్‌స్కీతో ఇలా అన్నాడు:

"వాళ్ళను ఆగమంటావేమయ్యా నీవు? – వాళ్ళకు ఆనందం పొంగి వస్తుంటేను – ఒక్క ఏడాదిలో కొత్త ఫ్యాక్టరీ కట్ట బోతు న్నారు. చూచావా వాళ్ళ దీక్ష !"

# 8

# యంత్రశాల

కొత్త ఫ్యాక్టరీని గురించి కాలనీలో అందరూ కలలు కంటు న్నారు. క్రుట్జర్ ప్రతిపాదన ఆమోదించడంతో సభ్యులందరిలోనూ ఆనందోత్సవాలు అలుముకున్నవి. ఇలా కొన్నిరోజులు గడిచాయి.

ఒకనాడు చాలా హడావుడిగా టార్‌స్కీ భోజనశాలలోకి వచ్చాడు. అతను 'కొమోసమోల్‌బ్యూరో' సభ్యుడు. కమాండర్ల కౌన్సిలుకు కార్యదర్శి. అతను ఎప్పుడూ గంభీరంగానే ఉంటాడు. కాని ఈవేళ పట్టరాని ఆనందంలో తన్నుతాను మరిచిపోయాడు. జుట్టు రేగి ఉన్నది. చేతులూపుకుంటూ భోజనశాలలోకి పరుగెత్తు కుని వచ్చాడు :

"చక్కని వార్త — శుభవార్త! అది వర్ణించి చెప్పలేను." అన్నాడు బిగ్గరగా. అతనేం చెబుతాడోనని సభ్యులంతా ఆతృ తలో "అదేమిటి చెప్పు, అదేమిటి చెప్పవూ?" అని ప్రశ్నించారు.

"క్రుట్జర్ మనకొక లారీ ఇచ్చాడు!" అన్నాడు టార్‌స్కీ.

"అబద్ధం."

"కాదు, నిజం. అదిగో! అటుచూడండి! ఆరుబయట లారీ కనుపించడంలేదూ? డ్రైవర్ కూడా అక్కడే ఉన్నాడు."

ఇలా చెప్పి టార్‌స్కీ అక్కడనుంచి దూసుకునిపోయాడు.

భోజనాలు చేస్తున్న సభ్యులల్లా, లేచి వాకిట్లోకి వచ్చి నిలు చున్నారు. దూరానఉన్న లారీ వారి కంటపడింది. కొందరు కాలనీ కుర్రాళ్ళు లారీచుట్టూ మూగారు. నాలుగోదళం కుర్రాళ్ళు

లారీలో కూచున్నారు కూడా. మిషాగోంటార్ హోరస్ బాయ్ బాయ్ మని మోగించాడు. లారీలో ముందు ఒక సన్నపాటి మనిషి కూచున్నాడు.

"నీవు మెకానిక్ వా?" అని అతన్ని అడిగాడు జిరియాన్ స్కీ.

"కాదు, డ్రైవర్ ను." అన్నాడా సన్నమనిషి.

"నీ పేరేమిటి?"

"ఒరోబ్యోవ్."

"మీ ఇంటిపేరు?"

"పైటర్."

"బాగుంది, బాగుంది."

"లారీ ఎక్కండర్రా, లారీ ఎక్కండర్రా కుర్రాళ్లూ!" అన్నాడు జిరియాన్ స్కీ.

వెంటనే పిల్లలు నాలుగు వైపులనుంచీ లారీలో జొరబడ్డారు. చప్పట్లు చరిచారు. కేకలు పెట్టారు. ఈలలువేశారు, గోలలు చేశారు. ఒరోబ్యోవ్ అప్పుడే లారీ బయలుదేర తీయడానికి సిద్ధపడ్డాడు.

"ఏమిటాగోల? మరీ కొంటెపిల్లలయి నారే!" అన్నాడు.

"మేం కొంటెవాళ్ళం కాం. నిజమైన రష్యాబిడ్డలం—నీ లారీని మేమేం పాడుచెయ్యంలేవయ్యా!" అన్నాడు గోంటార్.

పిల్లలు లారీ అంతా పరిశీలించారు. ఇంజనుదగ్గరికి వెళ్ళి చూచారు. వారిలో వారు ఏవేవో తర్జన భర్జనలు చేసుకున్నారు. లారీ కొత్తదే లెమ్మని సంతసించారు. బ్లమ్ పాండ్రీలో దీనితో సరితూగగల వస్తువేదీ లేదని అనుకున్నారు. అంతటితో ఆ సన్ని వేశం ముగిసింది.

యంత్రశాలలో పనిచేస్తున్న పిల్లల మనస్తత్వాలు క్రమేపీ మారిపోసాగాయి. నిత్యం కొత్తకొత్త భావాలు వారిలో పెల్లుబుకుతున్నాయి. పనిలో ఏమాత్రం పొరపాటు జరిగినా వాళ్ళు

సహించడం లేదు. యంత్రశాలలో వస్తువులు సరిగ్గా ఉండకపోతే వాళ్ళకు చిరాకు వస్తున్నది. ఎప్పుడూ మామూలుగా ఉండే వాన్యా గల్చెంకో సయితం ఉద్రేకపడుతున్నాడు.

ఒకనాడు వాన్యా గబగబా జకరోవ్ కార్యాలయానికి వెళ్ళాడు. తానొక గొప్ప వ్యవహర్తలాగా ఇలా అన్నాడు: "అలెక్జీ స్టెపానొవిచ్! నామాట కాస్త వినిపించుకోండి. వ్యవహారాలు ఇంకా ఇలా సాగడానికి వీలులేదు. కప్పీలు చెడిపోయాయి. అవి బాగుచేయించమని 'అతని'తో ఇప్పటికి వందసార్లు చెప్పాం. కాని అతను పట్టించుకోలేదు" ఇలా అంటుంటే అతని కళ్ళవెంట గ్రుదున నీళ్ళు తిరిగాయి.

"ఈపాటివానికి ఎందుకింత గడబిడ? వాటిని బాగుచేస్తే అంతా సరిపోతుంది." అన్నాడు జకరోవ్.

"వాళ్లు బాగుచెయ్యరు— ఎందుకు బాగుచేస్తారూ. ఏమైనా అంటే 'ముందు నీపని నీవుకానీ' అంటున్నాడతను. కాని కప్పీలు సరిగ్గా లేకపోతే నేనేం పనిచెయ్యను?"

"అయితే నాతోరా." అంటూ జకరోవ్ అతన్ని తనవెంట తీసుకెళ్ళాడు.

వాన్యా సంతోషించాడు. ఇరువురూ యంత్రశాలకు వెళ్ళారు. వాన్యా, జకరోవ్‌కు చెడిపోయిన కప్పీలు చూపించాడు. జకరోవ్ అవన్నీ పరిశీలించాడు. ఇంతలో బ్లమ్ అక్కడికివచ్చాడు. జకరోవ్ అతన్ని ఇలా అడిగాడు:

"సాలొమన్ డవిడొవిచ్! ఇలాగయితే ఎలాగయ్యా? పనులెలా తెములుతాయి?"

"తాత్కాలికంగా పని గడవడానికి నీకు ఒక తీగెచుట్ట అవీ ఇచ్చానుకదా?" అన్నాడు బ్లమ్ వాన్యాతో.

ఇదివిని అక్కడేఉన్న పొర్షినేవ్ జోక్యం కలిగించుకున్నాడు:

"ఆఁ. ఇలాఅయితే బాగానే అవుతాయి పనులు! సాంకేత విద్యలో మీరిచ్చిన తీగెచుట్ట ఒకగొప్ప అభ్యున్నతిని సాధించిందని అనుకుంటున్నారు కాబోలు పాపం!"

బ్లమ్‌కు కోపం వచ్చింది. చిందులు తొక్కాడు, పోర్షి నేవ్ ముసిముసి నవ్వులు నవ్వుతూ వాలుచూపులతో అతనివంక చూచాడు:

"అలా చిందులు తొక్కుతావేమయ్యా బ్లమ్?" అన్నాడు.

"నేనిచ్చిన తీగెచుట్ట అద్భుతమైందని నేనన్నానా ఏమిటి? సాంకేతిక నిపుణత్వంలో ఎలాగా ముందడుగు వేస్తాం. ఈలోగా మీపని మీరు కానివ్వండి." అన్నాడు బ్లమ్.

"మీరిచ్చిన వస్తువులతోటే నా ముందడుగు వేసేది! ఎంత బాగా చెప్పావయ్యా బ్లమ్!" అన్నాడు మళ్ళీ పోర్షి నేవ్ ఎద్దేవగా.

జకరోవ్ యంత్రశాలంతా పరిశీలించి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. బ్లమ్, వాన్యావంక కోపంగా చూచాడు:

"ఫిర్యాదులు చెయ్యడమేనా నీపని? ఈపాటిదానికి అక్కడిదాకా పరుగెత్తికెళ్ళి ఆయనతో చెప్పావా? ఒవెన్‌చెక్ బాగు చేయలేడనుకున్నావా వాన్యా?" అన్నాడు బ్లమ్.

అంతలో ఫిల్కా-మేరీ అక్కడికి వచ్చాడు.

"యంత్రశాల ఎప్పుడు బాగుచేస్తారు?" అని బ్లమ్‌ను అడిగాడు.

"తలుచుకున్నప్పుడే తాతకు పెళ్ళంటే ఎలాగా! కొంచెం ఓపిక పట్టవయ్యా ఫిల్కా. అందాకా ఒవెన్‌చెక్ చిన్నచిన్న మరమ్మత్తులు చేసిపెడుతుంటాడు మీకు" అన్నాడు బ్లమ్.

ఒవెన్‌చెక్‌కూడా అక్కడికి వచ్చాడు. అతని చేతిలో ఒక పెట్టె ఉన్నది. ఫిల్కా అతన్ని చూచి నిశ్వసించాడు. బ్లమ్ పిల్ల వాళ్ళమీద విరుచుకపడ్డాడు:

"ఏయ్, బోరిన్ ఎనోవిస్కీ! ఎందుకక్కడ నిలుచున్నావ్? పనిలేదా ఏమిటి? వెళ్ళి నీపని నీవు చేసుకో." అన్నాడు.

బోరిన్ భయవిచలితుడై అక్కడనుంచి వెళ్ళిపోయాడు. బ్లమ్ కోపం అంతటితో ఆగిపోలేదు. ఒవెన్‌చెక్ చూచి మళ్ళీ మండిపడ్డాడు:

"ఎందుకయ్యా అలా గుడ్లుమిటకరిస్తూ నిలబడ్డావు? బోరిన్ పనిచేస్తున్నచోట కప్పీ చెడిపోయిందటగా. వెళ్ళి బాగుచెయ్యి. ఊరికచేస్తున్నావేమిటి పని! భలేవాళ్ళయ్యా మీరు!" అని కేక వేశాడు బ్లమ్.

ఒవెన్‌చెక్ తనపెట్లో సామాన్లు సర్దుకుంటూ ఇలాఅన్నాడు: "ఆ కప్పీ ఎందుకూ పనికిరాదు. దాన్ని ఊడపీకి కొత్తది వెయ్యాలి."

"ఏమిటీ! ఊడపీకాల్నా? డబ్బు తేరగా ఉందనుకున్నావటయ్యా? ఆ కప్పీ ఇంకా పదేండ్లు పనిచేస్తుంది. ఎదురుచెప్పక వెంటనే వెళ్ళు. వెళ్ళి ఆ కప్పీ బాగుచెయ్యి" అన్నాడు బ్లమ్.

"ఏమీ లాభంలేదు. అది బాగుపడదు." అన్నాడు మళ్ళీ ఒవెన్‌చెక్.

"బాగుపడదూ? ముందు నేను చెప్పినట్టు చెయ్యవయ్యా."

ఒవెన్‌చెక్ ఇహ మారుమాటాడకుండా నిచ్చెన తెచ్చుకున్నాడు. నిచ్చెన స్తంభానికి ఆనించుకుని పైకెక్కుతూ ఇలా అన్నాడు:

"ఈ కప్పీ నిన్ననే ఇక్కడ అమర్చాం."

"అది నిన్నటిమాట. ఇవాళెందుకూ చెప్పడం? నిన్న పని చేసినందుకు నీజీతం నీకు ముట్టింది. ఇవాళ పనిచేస్తే ఇవాళా ముటుతుంది." అన్నాడు బ్లమ్.

యంత్రశాలలో మరో మూలనుంచి సెడోవ్‌నిక్ గొంతుక వినిపించింది:

"ఏవయ్యోయ్ బ్లమ్! బెల్టు మళ్ళీ తెగిపోయింది! ఇదేమిటయ్యా! మాటిమాటికీ తెగిపోతుంటే ఎలా పనిచెయ్యడం?"

బ్లమ్ గబగబా అక్కడికి వెళ్లాడు. "మొన్ననే మనిషిని పంపించాను. అత నిక్కడ బెల్టులన్నీ బాగుచేసి పోయాడు. అత నొచ్చినప్పుడు నీవేలోకంలో ఉన్నావయ్యా స్వామీ ?" అని అడిగాడు బ్లమ్.

"ఈ లోకంలోనే ఉన్నాను. ఆ బాగుచేసేవాడు ఆరెన్నెల్ల కొకమాటు ఇలావచ్చి అలా వెడితే లాభంలేదండీ బ్లమ్. అతను హామేషా ఇక్కడే ఉండాలి." అని చెప్పాడు సెడోవ్‌నిచ్.

"సరి సరి బాగుంది. వాడేకాదు, ఇంజనీర్లనుకూడా ఇక్కడే నీకోసం కనిపెట్టుక ఉండమంటావు ! భలే పనివాడివి బయలు దేరావయ్యా !"

దాంతో సెడోవ్‌నిచ్‌కి చుర్రుమన్నది. చేతిలో రెంచీ విసిరి అవతల పారేశాడు. చరచరా అవతలికి నడిచాడు.

"ఎక్కడికయ్యా వెడుతున్నావ్ ?" అని అడిగాడు బ్లమ్.

"ఇక్కడుండి మాత్రం నేను చేసేదేమిటి ? ఆ బెల్టు బాగు చేశాకనే వస్తాను."

"అది బాగుచేయడానికి ఎవడో, ఎక్కడనుంచో రావాలా నీవు బాగుచేసుకో లేవూ ?

ఈ మాటవిని యంత్రశాలలో కుర్రాళ్లంతా పకపకనవ్వారు. సెడోవ్‌నిచ్‌కి కూడా నవ్వు ఆగలేదు.

"అది నేను బాగుచేయడానికి బూటు కాదయ్యా బ్లమ్, బెల్టు ! తెలిసింది కదూ ?" అని అరిచాడు సెడోవ్‌నిచ్.

సెడోవ్‌నిచ్ ఇంతకుముందు బూట్లు బాగుచేసేవాడు. అందుకని అలా అన్నాడు.

# 9

# వాగ్దానం

కొత్త ఫ్యాక్టరీ స్వరూపం ఎలా ఉంటుందో జకరోవ్‌కు సహితం అనూహ్యంగా ఉంది. కాని ఒక ఏడాదిలో మూడులక్షల రూబుళ్లు ఆర్జించాలని కాలనీ వాసులందరికీ తెలుసును. మూడు లక్షలు సంపాదించడమంటే మాటలతో పనికాదు. కాలనీఖర్చంతా బ్లమ్‌ఫ్యాక్టరీ ఆదాయంమీదనే గడిచిపోతున్నది. తనవల్లనే కాలనీ నడుస్తున్నదని బ్లమ్‌కు అతిశయం లేకపోలేదు. ఇహ ఇప్పుడు ఒక్కొ-క్కరే నెమ్మది నెమ్మదిగా ఖర్చులు తగ్గించుకోవడం మొదలుపెట్టారు అయిదు, పదకొండుదళాల ఆడపిల్లలు ఇహముందుతమకుఉన్నిబట్టలు కావాలని అడగడానికి వీలుండదు. కుట్టుమిషన్ల పని కుంటుపడింది. బైండింగు చేయించడానికి సిద్ధంగా ఉన్న కొన్నివందల లైబ్రరీ పుస్తకాలను, అలాగే అట్టిపెట్టి ఉంచారు. తన చిన్నకారుకు వంద రూబుళ్లు కావాలని ఇదివరకు మలెంకీ జకరోవ్ నడిగాడు. అలాగే నన్నాడు అప్పుడు జకరోవ్. కాని అప్పుడు కొంతకాలం ఆగమంటున్నాడు. ఇలా కాలనీలో అంతా పొదుపు చేయసాగారు.

సాధారణ సమావేశంలో పొదుపు ఉద్యమం యొక్క-ఆవశ్యకతను గురించి జకరోవ్ బోధించాడు:

"మీరు క్లుప్తంగా జీవితం గడుపుకోవడం నేర్చుకోవాలి."

అందరూ అందుకు అంగీకరించారు. అందరిదృష్టి యంత్రశాలపైకి మళ్ళింది. అందులో ఉన్న యంత్రాలు నాసిరకపువి. వాటితో పనిచేసి ఏడాదిలో మూడు లక్షల రూబుళ్ళు సంపాదించడమంటే అది అయ్యేపనికాదు. ఆ విషయమే నాలుగోదళం

సభ్యులు పదే పదే చర్చించుకుంటున్నారు. తక్కిన దళాలసభ్యులు కూడా అదే యావలో ఉన్నారు. అయినా వాళ్ళకు పరిష్కార మార్గం కనుపించడంలేదు.

క్రుట్జర్ వచ్చిన మర్నాటి నుంచీ నూనె పాత్రల ఉత్పత్తి సగానికిసగం పెరిగింది. ఇంత అభివృద్ధి పిల్లలు ఎలా సాధించారో బ్లమ్ కే ఆశ్చర్యంగా ఉంది: ఆశ్చర్యంతోను, అనుమానంతోను పదే పదే లెక్కలు తనిఖీ చేసుకుంటున్నాడు. కాని సగానికి సగం ఉత్పత్తి పెరిగినమాట వాస్తవం. ఈ విషయాన్ని జకరోవ్ చెప్ప కుండా రెండు మూడు రోజులు ఊరుకున్నాడు. రోజులు గడుస్తున్న కొలదీ ఉత్పత్తి పెరుగుతున్నది. కాని దానితోపాటు పిల్లల శ్రద్ధ కూడా ఎక్కువైంది. యంత్రశాలలో అనేక లోపాలున్నాయనీ, తగినన్ని మూసలు లేవనీ పిల్లలు గొడవచెయ్యడం ప్రారంభించారు. ప్రతి సమావేశంలోనూ ప్రధానంగా ఇదే విషయం చర్చకు వస్తు న్నది. ఒకనాటి సమావేశంలో జిరియాన్స్కీ మెల్లగా తన ఉప న్యాసం ఇలా ప్రారంభించాడు:

"మన యంత్రశాలలో మూసలయితే ఉన్నాయి. కాని అవి చాలవు. ఉన్న మూసలుసహితం మన తాత ముత్తాతల నాటివి. చిల్లులేని మూస చూద్దామన్నా కనుపించదు. ఈవిషయం ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, వందసార్లు చెప్పాను నేను. ఇదిగోవస్తాయి, అదిగో వస్తాయి అని వేండ్లూ పూండ్లూ గడుపుతున్నాడు బ్లమ్. ఇదేమాత్రం బాగాలేదు."

దీనిపైన శాంకోజోరిన్ అందుకుని ఇలా చెప్పసాగాడు:

"బ్లమ్ వట్టి పిసినిగొట్టు, ఒక్క వెయ్యి రూబుళ్ళు పెట్టుబడి పెడితే అన్నివస్తాయి. కాని అందుకతనికి చేతులురావు. అందువల్ల అనుకున్న ప్రణాళిక తల్లక్రిందు లవుతోంది."

ఇదివిని బ్లమ్ కు కోపం వచ్చింది. "దీనికెందుకింత గడబిడ? మూసలు అవుసరమో కాదో నాకు తెలీదనుకుంటున్నారా? కొంచెం ఓపిక పట్టండి – నాలుగైదు రోజుల్లో కావల్సినన్ని మూసలు తెప్పిస్తాను." అన్నాడు బ్లమ్.

"నాలుగైదు .రోజులుంటేకాదు — సరిగా ఎన్నిరోజులకు తెప్పిస్తావో ఖచ్చితంగా చెప్పితీరాలి. ఈసారి మాట తప్పడానికి వీలులేదు." అని అనేకమంది పిల్లలు కేకలువేశారు.

"పదిహేను రోజుల్లో వస్తాయి." అన్నాడు బ్లమ్.

"మీ లెక్కలో నాలుగైదు రోజులంటే పదిహేను రోజులన్నమాట !" అన్నాడు జిరియాన్‌స్కీ.

"అక్టోబరు 15 వ తారీకు నాటికి వస్తాయన్నమాట !" అన్నాడు జోరిన్.

"కాదయ్యా కాదు. పదిహేను రోజులన్నాను. అంటే అక్టోబరు ఒకటో తేదీకే నన్నమాట." అనిచెప్పాడు బ్లమ్.

"అక్టోబరు ఒకటికి కాదు - పదిహేనో తేదీ నాటికివస్తే పదివేలు !"

"అదేమిటదీ ! మొదటి తారీకుకే వస్తాయని నేచెబుతూ ఉంటే మీరంతా వేళాకోళం చేస్తారేమయ్యా !" అన్నాడు బ్లమ్.

అదివిని పిల్లలంతా పకపక నవ్వారు. చేతులు ముందుకు చాపి ఒక విచిత్రమైన భంగిమ పెట్టాడు బ్లమ్. ఆ భంగిమతోనే అభినయిస్తూ "అక్టోబరు ఒకటి, అక్టోబరు ఒకటయ్యా ! నామాట నమ్మండి !" అని అరిచాడు.

నలుమూలలనుంచీ నవ్వులు వినిపించాయి. జకరోవ్‌కుకూడా నవ్వు ఆగింది కాదు. బ్లమ్‌కు చెక్కిళ్ళు ఎరుపెక్కాయి. ముఖం కందింది. తొట్రుపాటుతో గది మధ్యకువచ్చి నిలుచున్నాడు :

"నన్ను మీరు అవమానిస్తున్నారు. నన్నవమానించడానికి మీకెవరు హక్కు ఇచ్చారు ?" అన్నాడు.

అంతా నిశ్శబ్దమయింది. తరువాత ఏం జరుగుతుందో ఎవరికీ అర్థంకాలేదు. జిరియాన్‌స్కీ లేచి నిలుచున్నాడు, గది మధ్యకు వెళ్ళాడు. బ్లమ్‌వంక తీక్షణంగా చూచాడు:

"సాలొమన్ డవిడొవిచ్! నిన్ను అవమానించేందుకు ఇక్కడికెవరూ రాలేదు. అక్టోబరు ఒకటో తేదీనాటికి మూస

లొస్తాయని నీవన్నావు. అక్టోబరు 15 వ తేదీకి కూడా అవిరావని నేనన్నాను—అంతే.'' అన్నాడు.

జిరియాన్‌స్కీ, బ్లమ్‌వంక చూస్తూ అలాగే నిలుచుండి పోయాడు. బ్లమ్ కళ్ళు జ్యోతుల్లా అయినాయి. గిరుక్కున వెనక్కు తిరిగి చరచర అవతలికి వెళ్ళిపోయాడు. సభలో కలకలం బయలు దేరింది. మార్క్ గ్రీన్‌హాస్ కోపంతో ఇలా అరిచాడు.

"అలా నీవు బ్లమ్‌ను రెచ్చకొట్టి, తీరా అతను వెళ్ళి పోతుంటే చూస్తూ ఊరుకున్నావు అలెక్జీ. ఇది మేం సహించం. ఇది మర్యాదకాదు. బ్లమ్ వాగ్దానం చేశాడుకదా! ఇంకా ఎందుకూ సాగదీయడం?''

ఈ మాటకు ఇప్పుడు జిరియాన్‌స్కీకి కోపం వచ్చింది: "నేనూ మీకు మాట ఇస్తున్నాను. మూసలు అక్టోబరు పదిహే నవ తారీకులోపల రావు. నామాట అబద్ధమైతే అప్పుడు నన్నడ గండి. నన్ను కాలనీలోనుంచి బయటికి గెంటండి! సరేనా?'' అన్నాడు జిరియాన్‌స్కీ.

"నీమాట శుద్ధ అబద్ధం!'' అన్నాడు ఒలెంకో.

"అబద్ధమో నిజమో చూద్దాంగా.'' అన్నాడు మళ్ళీ జిరి యాన్‌స్కీ.

ఇలా వారిరువురి మధ్య మళ్ళీ అవును, కాదు అని కొంత సేపు చర్చ జరిగింది.

"ఏమైనాసరే నీవు బ్లమ్‌ను అవమానించడం బాగాలేదు'' అన్నాడు ఒలెంకో.

"నే నతన్ని అవమానించలేదు. అతనితో వాదించాను. అంతే,'' అన్నాడు జిరియాన్‌స్కీ.

"వాదించడం వేరు, అవమానించడం వేరు. నీవు అవమా నించావు.''

"ఇహ ఈ వాదన కట్టిపెడదాం. మనం ఇక్కడ ఎందుకు సమావేశం అయ్యామో అది మరిచిపోకండి, నీ అభి[illegible]

రం ప్రతివాడూ మంచివాడే. ఎవర్ని ఏమాట అన్నా తప్పే, అవమానమే కాని కామ్రేడ్! నీ దృష్టి వేరు, నా దృష్టి వేరు. మనకు కావలసింది మూసలు. మూసలు ఇచ్చి తరువాత వ్యవహారం మాట్లాడాలి. అవి ఎప్పుడొస్తాయో స్పష్టంగా చెప్పాలి. మాటి మాటికీ, ఊరించడం, అన్నమాట తప్పడం ఇదేం ఆట అనుకున్నారా?" అని అడిగారు జిరియాన్‌స్కీ.

చర్చ తీవ్రంగా కొనసాగుతున్నది. సభ్యులందరూ ఆసక్తితో వింటున్నారు. కాని ఎవరు ఎవరిపక్షంమాట్లాడుతున్నారో అర్థం కాకుండా ఉంది. జిరియాన్‌స్కీ వాదన సబబుగానే ఉన్నదనీ, కాని అతను బ్లమ్‌ను మాత్రం అవమానించకూడదనీ కొందరు భావించసాగారు. ఇగోర్ చెర్నియావిన్ ఒక బెంచీమీద కూచున్నాడు. నెస్ట్రింకో, జోరెన్‌లు అతని కిరువైపులా కూచున్నారు. ఇగోర్ అభిప్రాయం ఏమిటో మనం నిశ్చయంగా చెప్పలేం. అతనికి పదిమందిలో మాట్లాడడం కొత్త. కాని బ్లమ్‌మీద అతనికి సానుభూతి ఉన్నది. ప్రొద్దున లేచింది మొదలు రాత్రి పడుకునేంత వరకూ బ్లమ్‌ను ఎవరో ఒకరు దుయ్యబడుతూనే ఉంటారు. అయితే ఫ్యాక్టరీ విషయంలో కాలనీవాసుల పట్టుదల సబబుగానే ఉంది. వాళ్ళంటున్నట్టు యంత్రశాల నానా కంగాడీగా ఉంది. అక్కడే లారీలు, అక్కడే సామాన్లు, అంతా అక్కడే. ఈ లోపాలన్నీ సరిదిద్దుకోవాలి.

ఎప్పుడూ మాట్లాడి ఎరుగని ఇగోర్‌కు కూడా ఇప్పుడు సమావేశంలో మాట్లాడాలని ఉత్సాహం పుట్టుకొచ్చింది. హాఠాత్తుగా చెయ్యెత్తాడు. అలాగే మాట్లాడమని టార్‌స్కీ అతన్ని చేరువకు పిలిచాడు. సమావేశంలో అందరూ ఇగోర్ వంక ఆశ్చర్యంగా చూడసాగారు.

"అబ్బో! ఇగోర్ కూడా మాట్లాడాలని లేచాడే!"

ఇగోర్ ఏమాత్రం తొణక్కుండా మాట్లాడడానికి పెదవులు కదిపాడు. పెదవులు వణకసాగాయి. పదిమంది ఎదుట మాట్లాడ

డమంటే కష్టమే అనుకున్నాడు. చివరకెలాగైతేనేం తన్ను తాను నిభాయించుకుని, ధైర్యంగా మాట్లాడడం మొదలుపెట్టాడు:

"కామ్రేడ్స్! ఇప్పుడు జరుగుతున్న పనంతా అసందర్భంగా ఉంది. మాట వరుసకు ఇక్కడ తయారయ్యే కుర్చీల విషయమే తీసుకుందాం..."

ఇలా ఇగోర్ చెప్పబోతోంటే టార్‌స్కీ అడ్డుతగిలాడు :

"జపం విడిచి లొట్టల్లో పడకు ! అసలు మనం చర్చిస్తున్న విషయమేమిటి, నీవు మాట్లాడుతున్న దేమిటి ?" అన్నాడు.

"ఏమిటీ నీవనేది టార్‌స్కీ?" అని అడిగాడు ఇగోర్.

"నీవు మాట్లాడుతున్న దేమిటి ? కుర్చీలసంగతీ బెంచీల సంగతీ ఇప్పుడెందుకయ్యా ? మనం మాట్లాడుతున్నది జిరియాన్‌స్కీ అన్న మాటలను గురించి." అన్నాడు టార్‌స్కీ.

"అయితే మటుకేం ? ఒక విషయం మాట్లాడుతుంటే అనేక విషయాలొస్తాయి – తీగె కదిలిస్తే డొంకంతా కదులుతుంది. ఉన్న స్థితిగతులను గురించి మనం పూర్తిగా చర్చించుకోవాలి."

"స్థితిగతులేమిటి ?" అని అడిగాడు జోరిన్.

ఇగోర్ అతనివంక చూచాడు. జోరిన్ తన కొంటెచూపులు పక్కకు తిప్పుకుని ఒక విషపునవ్వు నవ్వాడు. ఇగోర్ ధైర్యంగా ముందుకు చేతులుచాపి ఒక భంగిమ పెట్టాడు. ఆ భంగిమ బఫూన్ లాగా ఉంది. అదిచూచి ఆడపిల్లలంతా పగలబడ్డారు.

ఇగోర్‌కు ముచ్చెమటలు పోశాయి. చేరుమాలుతో తుడుచుకున్నాడు. దీర్ఘంగా నిట్టూర్చాడు. మళ్ళీనవ్వులు – ఇగోర్ కళ్ళు పైకెత్తాడు. మళ్ళీ దీర్ఘంగా విశ్వసించి క్రింద చతికిలపడ్డాడు.

ఇప్పుడు నవ్వులు మిన్నుముట్టాయి. చతికిలపడ్డ ఇగోర్ తాచుబాములా కస్సుమని లేచాడు :

"ఎందు కానవ్వులు, విరగబాట్లు ? ఏం చిత్రముందని ! మూసలు, మూసలు! మూసలు తెమ్మనడమే మీపని. బ్రహ్మమాట ఇచ్చినా మీరు వినిపించుకోరేం ? అతని సహాయం లేందే మూడు

లక్షలు రూబుళ్లూ మీఅంతట మీరే గడిద్దామనా ? మీకంటె అతనికి పనిమీద శ్రద్ధఎక్కువ. మీరు ప్రొద్దున్నే లేచి టీలు సేవించేసరికే అతను..."

"మేమేకాదు— ప్రొద్దున్నే నీవు తాగుతావు టీ." అన్నారెవరో.

"ఆ, తాగుతాను—తాగితే ఏం? మనం ప్రొద్దున్నే టీ తాగేవేళకే బ్లిన్ లేచి తన పనిమీద నగరానికి వెడతాడు. అతను తిరిగొచ్చేసరికి మనమంతా అతన్ని దుయ్యపడుతున్నాం. ఇది న్యాయమేనంటారా? నాకుమాత్రం సాలొమన్ డవిడొవిచ్ అంటే గౌరవమున్నది— మరి మీమాటేమో?" అన్నాడు మళ్లీ ఇగోర్.

ఇంతలో ఒక గమ్మత్తు జరిగింది. అకస్మాత్తుగా సభ్యులలో నుంచి కరతాళధ్వనులు వినిపించాయి. ఇగోర్ తన చెవులను తానే నమ్మలేకపోయాడు. చుట్టూ కలయచూచాడు. సభికుల ముఖాల్లో ఆనందం కనుపించింది. తన ఉపన్యాసం వాళ్లను ఆకర్షించిందని గ్రహించుకున్నాడు. అతని చెక్కిళ్ళు ఎరుపెక్కాయి. నెస్ట్రెంకో అతని బుజం తట్టి ఇలా అన్నాడు:

"బావుంది, నీ ఉపన్యాసం చాలా బావుంది!"

తరువాత జకరోవ్ ఇలా ప్రసంగించాడు:

"ఇవాళ ఇగోర్ చెర్నియావిన్ చక్కగా ప్రసంగించాడు. మనందరిలో ఉన్నభావాలే అతను ఎంతో బాగుగా వ్యక్తం చేశాడు. జిరియ్యాన్స్కీ చెప్పినట్టు మాసలు ముఖ్యమైనవే. కాని అంతకంటే ముఖ్యమయ్యా మనిషి. సాలొమన్ డవిడొవిచ్ని గురించి మనం జాగ్రత్తగా మాట్లాడవలసి ఉంటుంది. అతను ఆకతాయికాదు, పెద్దమనిషి. కాని నేచెప్పే విషయాన్ని మీమనస్సుల్లోనే అట్టిపెట్టుకోండి. నేను ఏం చెప్పదలుచుకున్నానో మీరు ఊహించండి చూద్దాం!"

జకరోవ్ ఒకక్షణం ఆగి సభికులవంక తదేకంగా చూచాడు. అందరి ముఖాల్లోనూ ఒకేఒక భావం ద్యోతకమైంది. ఏ రహస్యం చెప్పినా బయటికి పొక్కనీయం—అనే దృఢనిశ్చయం వాళ్ళ చూపుల్లో వ్యక్తమైంది. అయితే ఆడపిల్లల విషయం చెప్పలేమన్నట్టు ఒక కుర్రాడు ఆడపిల్లలవంక చూచాడు. ఒక ఆడపిల్ల "ఏం! మాకేసి ఎందుకంత అనుమానంగా చూస్తున్నావు? మీ మగవాళ్ళే బయటికి చెపుతారని మా కనుమానం." అన్నది, ముఖాన కొట్టినట్టు.

"ఓహో, అలాగా! చూద్దాంలే!" అన్నాడా కుర్రాడు.

తను చెప్పనున్న రహస్యం సభ్యులు జాగ్రత్తగా దాచుతారనే నమ్మకం జకరోవ్‌కు ఉన్నది, ఇలా చెప్పసాగాడు:

"అయితే సరే. నే చెప్పేవిషయం సాలొమన్ డవిడొవిచ్‌కి తెలీనీయకండి—జాగర్తగా వినండి. యంత్రశాల సక్రమంగా ఉండాలనీ, ఉత్పత్తి పెరగాలని మన ఆశయాలు. అందుకు కొత్త మూసలు కావాలి. బ్లుమ్ మన అదుపాజ్ఞలలో ఉండవలసినవాడే. సందేహం లేదు. కాని ఇవన్నీ కూడా మనం సౌమ్యంగా సర్దుకపోవాలి. మర్యాదగా ప్రవర్తించాలి. కొందరు మర్యాద తప్పి ప్రవర్తిస్తారు. మంచి అలవాట్లు అలవర్చుకోవాలి. ఒకడు మర్యాదగా ప్రవర్తిస్తున్నాడంటే అది వాడి బలహీనత అని మాత్రం మనం అనుకోకూడదు. మాట వరుసకు ఒక వ్యక్తిని ఇక్కడనుంచి మనం బయటికి పంపించాలని అనుకుంటాం. అప్పుడు ఆ వ్యక్తిని మనం 'పో, ఇక్కడనుంచి పో! నీవు భ్రష్టుడివి!' అని దురుసుగా ప్రవర్తించకూడదు. ఆ భావాన్నే మనం మృదువుగా సౌమ్యంగా చెప్పవచ్చును."

"అయితే అది మనమిత్రుల పట్లనే వర్తిస్తుంది." అన్నారు ఎవరో.

"అవునవును. నిజమే. అలాగని పైవాళ్ళపట్ల మనం దూరంగా ప్రవర్తించక్కర్లేదు. కాని శత్రువులయెడల మాత్రం

నిర్దాక్షిణ్యమే. వాళ్ళపట్ల మనం ఎంత కరుకుతనంగా ఉంటే అంత మంచిది. అది శౌర్యానికి నిదర్శనం! అయితే సాలొమన్ డవిడొవిచ్ మన కామ్రేడ్. ఇగోర్ చెప్పినమాట అక్షరాల నిజం. మన ఫ్యాక్టరీ స్థితి అధ్వాన్నంగా ఉన్నది. అందులో పనిచెయ్యడం మనకెంత కష్టంగా ఉన్నదో, దాన్ని నిర్వహించడం బ్లమ్‌కు అంత కష్టంగా ఉన్నది. అవునంటారా కాదంటారా కామ్రేడ్స్?" అన్నాడు జకరోవ్.

అందరూ అవునన్నట్టు తలలూపారు. కాని జిరియాన్‌స్కీ మాత్రం అసంతృప్తితో సభలోనించి లేచి బయటకి వెళ్ళిపోయాడు. వెళ్ళేవాడు వెళ్ళక ఇలా అని మరీ వెళ్ళాడు:

"చూద్దాంగా! అక్టోబరు ఒకటో తారీక్కు ఏం ఒరగ పెడతాడో బ్లమ్‌కి తెలుస్తుందిగా!"

ఇగోర్ సంతోషానికి మేరలేదు. అతని ఉపన్యాసాన్ని జకరోవ్, ప్రశంసించాడు.

సమావేశం ముగిసింది. ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయారు.

# 9
# ఏదీ అసాధ్యంకాదు

క్రుట్జర్ ఈసారి కాలనీకివస్తూ తనవెంట ఒక లావుపాటి వ్యక్తిని తీసుకొచ్చాడు. క్రుట్జర్ అతనికి అన్నీ చూపించాడు. కాలనీ కుర్రవాళ్ళను అతనికి పరిచయం చేశాడు:

"అదిగో, అటుచూడండి! ఆ కుర్రవాడు ఎంత హుషారుగా ఉన్నాడో... ఏవయొవ్యాయ్, కిర్యూషా! రా, ఇలారా! ఇక్కడ నీకు ఎలాఉంది? బాగుంటున్నదా?"

కిర్యూషా నోవాక్ ఏదో చెప్పుదామనుకున్నాడు. కాని ఆ లావుపాటి మనిషిని చూచేసరికి అతనికి నోరాడిందికాదు. ఆకొత్త వ్యక్తి ముఖంలో ఒకానొక నిస్పృహ దాగిఉంది.

క్రుట్జర్ ఆ కొత్తవ్యక్తి వంక తిరిగి ఇలా అన్నాడు:

"ఇక్కడి విషయాలింకా మీకర్థం కానట్టుంది. అంతేనా? అంతా మీకు విచిత్రంగా ఉందికదూ?

కొత్తమనిషి బొంగురు గొంతుకతో "నేను ఇంజనీరును. ఇక్కడి విచిత్రాలతోను, తమాషాలతోను నాకేంపని? అవి నాకెలా అర్థమవుతాయి?"

"ఇతనంటున్నమాటలు వింటున్నావా కిర్యూషా ?" అని నవ్వుతూ అడిగాడు క్రుట్జర్.

నోవాక్ తల ఊపుతూ తన త్రోవనతాను వెళ్ళిపోయాడు.

బిగోనక్ బిగిల్ ఊదాడు. మరొక క్షణంసేపట్లో కమాండర్ల కౌన్సిలు సమావేశం జరుగనున్నది. కొత్తఫ్యాక్టరీ మంచి చెడ్డలను గురించి చెప్పడంకోసం ఇంజనీరు వచ్చాడనీ, అందుకు సమావేశం జరుగుతున్నదనీ కాలనీ సభ్యులందరికీ తెలిసిపోయింది. సభ్యులంతా ఒక్కొక్కరే సమావేశానికి రాసాగారు. సభాస్థలానికి మొదట వాన్యాగల్చెంకో చేసుకున్నాడు. పెద్దలు పిన్నలు, ఉపాధ్యాయులు, ఫోర్మన్లు, అంతా అక్కడికి వస్తున్నారు. ఒలెన్ చెక్ ఒకమూల అనుమానంతో చూస్తూ కూచున్నాడు.

సమావేశం ఇహ మొదలవుతుందనగా క్రుట్జర్, జకరోవ్తో ఇలా అన్నాడు:

"అబ్బాయీ! పరిస్థితులు చక్కబడ్డాయి. ఇహ పని ప్రారంభించడమే తరవాయి. ఇప్పుడు మీకొక వ్యక్తిని పరిచయం చేస్తున్నాను. ఈయన గొప్ప యింజనీరు. పేరు ప్యెటర్ పెట్రోవిచ్ వొర్గునోవ్. కొత్త ఫ్యాక్టరీకి ప్లాను తయారు చేశాం. చాలా అద్భుతంగా ఉంది. నగరవాసులంతా కూడా మెచ్చుకున్నారు. ఈ

ఫ్యాక్టరీలో విద్యుత్ పరికరాలు తయారుచేయాలని "మాఆశయం ...కానీయండి ప్రైట్ పెట్రోవిచ్! ఇహ మీరు మాట్లాడండి."

ఇంజనీరు వొర్గునోవ్ కూచోవడానికి బల్ల బల్లంతా సరి పోయింది. పాపం, పీపాలాగా ఉన్నాడాయన. అతను క్రుట్జర్ వంక కన్నెత్తి అయినా చూడలేదు. కాలనీ సభ్యులనుకూడా అంతే. అతని తలకూడా చాలా పెద్దదే. అక్కడక్కడ వెంట్రుకలు నెరి శాయి. అతను తన జుట్టును మాటిమాటికీ సవరించుకుంటున్నాడు. తనవెంట తెచ్చుకున్న పెట్టెను తెరిచాడు. అందులోనుంచి, ఒక రివాల్వరు ఆకారంలో ఉన్న చిన్న యంత్రాన్ని బయటికి తీశాడు. దాన్ని రెండు చేతులతో పట్టుకుని బొంగురు గొంతుకతో ఇలా అన్నాడు:

"ఇది ఒక అద్భుతమైన యంత్రం. దీన్ని నావికా నిర్మాణంలోను, వైమానిక యంత్రశాలల్లోను ఉపయోగిస్తున్నారు. ఇదిగో చూడండి! బటన్ నొక్కుతున్నాడు. వెంటనే గిరిగిర తిరగడం ప్రారంభించి పనిచేస్తుంది. ఇది చేత్తో ఉపయోగించవచ్చు, లేదా ఒక స్టాండ్‌కు బిగించుకోవచ్చు. ఇలాంటివే ఆధునిక విద్యుత్పరికరాలు అనేకం ఉన్నాయి. కట్టబోయే మీ ఫ్యాక్టరీలో ఇలాంటి పరికరాలే తయారుచేయవలసి ఉంటుంది. రంపాలు, పిండిమరలు, మొదలైనవి విద్యుచ్ఛక్తి తయారు చేసుకోవాలి. ఇలాంటివి ఇంత వరకూ మన సోవియట్ యూనియన్‌లో ఉత్పత్తి చేయలేదు. ఆస్ట్రియా, అమెరికా దేశాలనుంచి వీటిని మనం దిగుమతి చేసుకుంటున్నాం. ఇప్పుడు మీకు చూపించిన ఈయంత్రం ఆస్ట్రియాలో తయారైంది." ఇలా అని అతను దాని బటన్‌నొక్కి చూపించాడు. వెంటనే అది ఊహించనంత వేగంగా గిరగిర తిరగసాగింది. అతను మళ్ళీ ఇలా చెప్పసాగాడు:

"ఈ ఫ్యాక్టరీకి అనుబంధంగా ఒక ఫౌండ్రీ, ఒక యంత్రశాల, యంత్ర పరికరాలు అమర్చేషాపు, పరికరాలషాపు; ఈ నాలుగూ ఉంటాయి. మీకు ఏదైనా అర్థం కానప్పుడు, పని కష్టంగా తోచినప్పుడు నాదగ్గరికి రండి, చెప్తాను."

ఇలా చెప్పి ఒర్గనోవ్ తిరుగుతున్న మిషన్‌ను టక్కున ఆపే శాడు. "మీకేమైనా సందేహాలుంటే అడగండి చెబుతాను అబ్బాయిలూ." అన్నాడు.

అప్పుడు ఒలెంకో లేచి ఇలా ప్రశ్నించాడు: "ఇప్పుడున్న మా ఫౌండ్రీ బాగుపడుతుందంటారా? అది ముందుముందు పనికొస్తుందంటారా?"

"ఆ కొత్త ఫ్యాక్టరీకి ఇది అనువుగా ఉండదు." అన్నాడు ఒర్గనోవ్.

జిరియాన్‌స్కీ ఇలా అన్నాడు:

"ఇప్పుడు మీ చేతిలో ఉన్న మిషన్‌లాంటివి మేం కూడా తయారు చేయగలమంటారా?"

"ఆ విషయం నేనెలా చెపుతాను నాయనా!" అన్నాడు ఒర్గనోవ్.

అందరూ పగలబడి నవ్వారు. ఒర్గనోవ్ మళ్లీ ఇలా అన్నాడు:

"మీరు చెయగలరో చెయ్యలేరో నాకే కాదు, క్రామేడ్ ట్రక్టర్‌కు కూడా తెలీదు. కాని ఇలాంటి యంత్రాలు మన దేశాని కెంతో అవసరం. మన సైనికదళాలు, వైమానికదళాలు ఇలాంటి యంత్రాలను ఉపయోగించవలసి ఉంటుంది."

తరువాత జకరోవ్ లేచి ఒర్గనోవ్‌ను ఇలా ప్రశ్నించాడు:

"ఇలాంటివి రోజుకెన్ని తయారు చేయాలంటారు?"

"మీరు యాభయి చొప్పున తయారుచేస్తే చాలు!"

"యాభయి ఏమిటి కర్మ, వంద చేస్తాం! అస్ట్రియా మిషన్ల కంటె మనవే అద్భుతంగా ఉంటాయి."

జకరోవ్ ఇలా అని సవాలు చేస్తున్నట్టు ఒర్గనోవ్ వంక చూచాడు. కాని అతనేమీ చలించక తనమిషన్ మళ్ళీ పెట్టెలో పెట్టుకున్నాడు.

సభ్యులలోనుంచి ఒకరు ఇలా అన్నారు: "ఆ, అద్భుతంగా చేస్తాం! కావలిసినన్ని మిషన్లు!"

మిషాగోంటార్ కళ్ళల్లో పెద్దవాళ్ళ అనుభవం కనిపిస్తున్నది. అతనిలా అన్నాడు:

"మొన్న నేనొక పుస్తకం చదివాను. టెలిగ్రాఫ్ ద్వారా బొమ్మలు ఒక చోటినుంచి మరొకచోటికి పంపవచ్చునని ఆ పుస్తకంలో రాసిఉంది. అలా మనవాళ్ళు తయారుచేయడం రోస్టోవ్ నగరంలో నేను కళ్ళారా చూచాను. త్రికరణశుద్ధిగా మనంకూడా కృషిచేస్తే అలా తయారు చేయవచ్చును. సందేహం లేదు. అయితే ఒకటి - మనకు మాత్రం మంచి ఫౌండ్రీ ఉండాలి."

కొంతసేపు చర్చలు జరిగిన తరువాత సమావేశం ముగిసింది.

జకరోవ్ కార్యాలయంలో ఒర్డునోవ్ ప్రభృతులు కూచుని ఉన్నారు. జకరోవ్, ఒర్డునోవ్‌లు ముచ్చటించుకుంటున్నారు.

"కామ్రేడ్ జకరోవ్! నన్ను మీరు ప్రత్యేకంగా అభినందించవలసిన పనిలేదు. మీరు పొగడ్తలకు మురిసి పోయేందుకు నేనేమీ ఆడపిల్లనుకాదు! మీరు చెయ్యవలసిందల్లా ఒక్కటే — చెబుతాను వినండి. ముందు ఒకటోరకం ఫ్యాక్టరీ కట్టండి. కాని పనివాళ్ళను మాత్రం ఒకకంట కనిపెడుతుండండి!" అన్నాడు ఒర్డునోవ్.

ఇది విని క్రుట్జర్ అతనివంక నివ్వెరపోయి చూచాడు:

"ఇహ ఊరుకోండి ఒర్డునోవ్! మీమాటమీరు! కాలనీ కుర్రవాళ్ళంటే ఏమనుకున్నారు? మీ దృష్టిలో..."

"ఓ, నాకు తెలుసయ్యా, ఇక్కడ చాలామంది దొంగలున్నారు!" అన్నాడు ఒర్డునోవ్.

బ్లమ్ కోపావేశుడై చిందులు తొక్కాడు:

"మీకు తెలీదు - కాలనీ కుర్రాళ్లు ఎంతగొప్పగా పని చేస్తారో మీరెరుగరు." అన్నాడు.

ఒర్లనోవ్ టోపీపెట్టుకుని, పెట్టెసర్దుకున్నాడు: "వెళ్లొస్తాను" అనిచెప్పి వెళ్ళిపోయాడు.

అందరూ అతనివంక చూచారు. తరువాత క్రుట్జర్ ఇలా అన్నాడు :

"చాలా చిత్రమైన మనిషిలే అతను !"

బ్లుమ్ ఇంకా కోపంగానే ఉన్నాడు : "అతననేదేమిటి ? కాలనీ కుర్రాళ్ళ సంగతి అతనికేం తెలుసునని ?" అన్నాడు.

జకరోవ్ అమాయకంగా నవ్వాడు.

నాలుగోదళం కుర్రాళ్లు తమతమ గదుల్లో నిద్దర్లు పోతు న్నారు. జిరియాన్‌స్కీ, పుస్తకం చదువుకుంటూ పడుకున్నాడు. అతని కిరువైపులా మంచాలమీద వాన్యా, బిగోనక్‌లు పడుకుని ఉన్నారు. హఠాత్తుగా వాన్యా లేచి కూచున్నాడు.

"రోజుకువంద! అబ్బా! మనం చెయ్యగలమా?" అన్నాడు.

"ఎందుకు చేయలేం. మానవులకు అసాధ్యమైంది ఏదీలేదు" అన్నాడు బిగోనక్.

జిరియాన్‌స్కీ చదవడం ఆపి వారివంక చూచాడు :

"ఇహ పడుకోండోయ్ అబ్బాయిలూ !" అన్నాడు.

# 10

# చెంపపెట్టు

ఒర్లనోవ్ మిషన్ అయితే తనవెంట తీసుకెళ్ళాడు. కాని అది మాత్రం కాలనీవాసుల కళ్ళల్లో ఇంకా మెదులుతూనేఉంది.

కాలనీసభ్యులలో ఒకవిధమైన అసందిగ్ధత ఏర్పడింది. కొత్త ఫ్యాక్టరీ స్వరూపం ఎలా ఉంటుందో పలురకాలుగా ఊహించ సాగారు. ఇప్పుడున్న దుస్తులషాపు ఉంచాలో తీసెయ్యాలో తెలీ కుండా ఉన్నది. స్టేడియమ్ సంగతికూడా అంతే. ఆడపిల్లలు చాలా

మంది ఒక నిర్ణయానికొచ్చారు. తమను యంత్రశాలకు బదిలీ చెయ్యమని కమాండర్ల కౌన్సిలును అభ్యర్థించారు. వాళ్ళచొరవను చూచి కౌన్సిలువారు అభినందించారు, హర్షించారు. కాని నాలుగోదళ సభ్యులు కొంచెం అనుమానపడ్డారు:

"ఈ ఆడపిల్లలు చాలా గడుసువాళ్ళే! యంత్రశాలకు బదిలీ చేయించుకోవాలని చూస్తున్నారు. మెల్లమెల్లగా వాళ్ళు మంచిమంచి పరికరాలను సంపాదించుకుంటారు. మనం మాత్రం ఈ మూసలతోనే ఉండిపోతాం" అన్నాడు పెట్కా క్రావ్‌చెక్. తక్కిన సభ్యులంతా అతనిమాట అవునన్నారు.

ఆ మరునాడే వాండా, ఒక్సానాలు యంత్రశాలకు బదిలీ చేయబడ్డారు: వాండా ఇంతకాలం యంత్రాలు అమర్చే షాపులో పని చేస్తున్నది. ఆ పిల్ల అక్కడే పని చెయ్యడం అవసరమని బ్లమ్ నొక్కి చెప్పాడు. కాని వాండా అందుకు అంగీకరించలేదు. ఒక్సానా ఎక్కడ పనిచేస్తే తానూ అక్కడే చేస్తానని పట్టుపట్టింది.

ఒక్సానా వాండాలు ప్రాణస్నేహితుల్లా మెలగుతున్నారని కాలనీవాసులంతా గ్రహించారు. వాళ్ళెందుకింత అన్యోన్యంగా ఉన్నారో ఎవరికీ బోధపడలేదు. ఆ ఇరువురు అమ్మాయిలూ ఎప్పుడు చూచినా ఒకేచోట కనుపిస్తారు. ఎక్కడికి వెళ్ళినా కలిసి వెడతారు. కవలపిల్లల్లా కాలనీ అంతా తిరుగుతారు. భోజనశాలలో, పాఠశాలలో, ఫ్యాక్టరీలో, పార్కులో, ప్రదర్శనశాలలో, క్రీడా స్థలంలో; ఎక్కడ చూచినా ఇద్దరూ జంట. ఒక్సానా, వాండాలు ఒక తల్లి కడుపున పుట్టిన బిడ్డల్లా, అంత అన్యోన్యంగా ఉంటారు. వాళ్ళ స్నేహాన్ని చూచి గోంటార్, ఇగోర్లు కళ్ళలో నిప్పులు పోసుకుంటున్నారు. కాని తమ అసూయను ఒకరితో ఒకరు చెప్పు కోడంలేదు. ఒక్సానా వాండాల ప్రవృత్తి ఆ కుర్రాళ్ళకు చిత్రంగా తోచింది. ఎవరైనా ఉన్నప్పుడు ఆ ఇరువురు ఆడపిల్లలూ ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. నోరు మెదపకుండా ఎవరిపని వారు చేసుక పోతారు. అయితే వీళ్ళు ఎప్పుడు, ఎక్కడ, ఎలా మాట్లాడు కుంటారా అన్నది ఈ కుర్రవాళ్ళకు ఒక చిత్రమైన ప్రశ్నగా పరిణ

మించింది. బహుశా ఒంటరిగా పడకటింట్లోనో, పార్కులోనో ముచ్చట్లాడుకుంటారు కాబోలు! అందుకే వాళ్ళు పరులముందు మౌనంగా ఉంటారు.

ఆపిల్ల లిద్దరిలోకీ ఒక్కాసనా కొంచెం అందంగా ఉంటుంది. ఆమె అంతగా ఎవరితోనూ మాట్లాడదు. స్నేహితులపట్ల విధేయతగా మాత్రం ఉంటూ తనపనితాను చేసుకపోతుంది. కాని వాండా తరహా వేరు. ఆ పిల్లకు తనచుట్టూ ఉన్న వాతావరణంపై ఆసక్తి. అన్నీ తెలుసుకోవాలని ఆకాంక్ష. తన మనస్సులో ఒక భావనా జగత్తును సృష్టించుకుని అందులో తన్మయం చెందుతూ ఉంటుంది.

రాను రాను వాండాకు కాలనీమీద ప్రీతి అధికం కాజొచ్చింది. అక్కడుండే పిల్లల మనోభావాలను అర్థంచేసుకుని ప్రవర్తించ సాగింది. అయితే ఆమె వాళ్ళతో సన్నిహితంగా మాత్రం ఉండలేక పోతున్నది. రానురాను కాలనీ రహస్యాలు ఆపిల్లకు అవగతమవుతూ వచ్చాయి. ఆడపిల్లలకు మగపిల్లలకంటె ఎక్కువ తలగడలు కాలనీవారు సరఫరా చేశారు. అలా ఎందుకు చేశారో ఆవిడ కర్థంకాలేదు. ఆవిడకే కాదు. మగపిల్లలకు కూడా ఇంకొక సమస్యగా పరిణమించింది. కాలనీ అధికారులు ఆడపిల్లలపట్ల పక్షపాతం చూపుతున్నారని వాళ్ళు అనుకోసాగారు. కాని వాళ్ళు అనుకున్నట్లు ఒకరికి ఒకలాగా, ఇంకొకరికి ఇంకొకలాగా కాలనీ అధికారాలు తలగడలు ఇవ్వడంలేదు. ఇవ్వడమైతే అందరికీ సమానంగానే ఇస్తున్నారు. అయితే ఒక గమ్మత్తు జరుగుతోంది. ప్రతి ఉదయాన్నే పరుపులకు దిండ్లకు గలీబులు మారుస్తారు. ఇలా మారుస్తున్నప్పుడు, దిండ్లలో ఉన్నదూది తడవకు కాస్త ఊడి ఇవతలి కొస్తుంటుంది. అది మగపిల్లలు గమనించరు. ఆడపిల్లలు మాత్రం ఆదూదిని రోజూ పోగుచేసి దాంతో మళ్ళీ దిండ్లు తయారుచేసుకుంటున్నారు. వాండా తలక్రింద పెట్టుకునే దిండ్లు మరీ ఎత్తుగా ఉన్నాయి. ఆ పిల్ల అందరిలాగే ఫ్యాక్టరీలో పని చేస్తూ రోజూ జీతం పుచ్చుకుంటున్నది. అక్టోబరు నెలాఖరకు నూటఇరవై రూబుళ్ళు సంపాదించింది. ఇందులో చాలామటుకు

భోజన వసతి సౌకర్యాలకు కేటాయించారు కాలనీవారు. నూటికి పదివంతులు కమాండర్ల కౌన్సిలువారు తీసుకుంటారు. ఈ డబ్బుకు మరికొంత కలిపి, సభ్యులు కాలనీ విడిచి వెళ్ళిపోతున్న ప్పుడు వాళ్ళకిస్తారు. అప్పుడప్పుడు ఈనిధిలోనుంచి ప్రత్యేక అవస రాలకుగాను సభ్యులకు ఇస్తుంటారుకూడా. వాండా ఈ విధంగా సుమారు ఇరవై, ఇరవైఐదు రూబుళ్ళు సంపాదించింది. చేతిలో పడిన సొమ్ము ఎలా ఖర్చుపెట్టాలో వాండాకు తెలీలేదు. ఆమెకు ఆట్టే వేటిమీదా ఆపేక్షలేదు. కాని ఒక్సానా ఆడబ్బు ఎలా వినియోగించాలో ఆమెకు చెప్పింది. ఇహనేం? వాండా కొన్ని చాక్‌లెట్లు, సిల్కు మేజోళ్ళు కొనుక్కున్నది. తరువాత ఏవైనా వస్తువులుకొని ఒక్సానాకు బహుమతిగా ఇవ్వాలని అనుకున్నది.

ఇప్పుడామె పెట్టెనిండా రకరకాల వస్తువులున్నాయి. ఇలా క్రమేణా ఆవిడలో అనేక కోరికలు కలుగసాగాయి. క్లావా కషి రినా వలె తానూ చేతిగడియారం పెట్టుకోవాలని ముచ్చటపడ సాగింది. కాని ఈ కోరిక నెరవేరలేదు. ఈ డబ్బుతో కొనవలసిన వస్తువులు ఇంకా చాలా ఉన్నాయి. ఇంతకూ తనకు చేతిగడి యారంతో అంత అవసరంలేదు. టైం చూచుకునేందుకు గోడ గడియారం ఉండనేఉన్నది. డ్యూటీవేళకు బిగిల్ వినిపిస్తూనే ఉంటుంది.

ఒకరోజు వాండా అధికారుల అనుమతి పుచ్చుకుని బస్తీకి బయలుదేరింది. అది అక్టోబరు నెలాఖరు అప్పుడు. ఒక్సానా తన చదువులో తాను నిమగ్నురాలై ఉన్నది. ఇగోర్ కూడా ఒక్సా నాతోపాటు వృక్షశాస్త్రం అభ్యసిస్తున్నాడు. ఒక్సానా వాండా వెంట బస్తీకి వెళ్ళలేక పోయింది. అంచాత వాండా ఒక్కతే కాలినడకన బయలుదేరింది. కొంతదూరం వెళ్ళి ట్రాంబండి ఎక్కింది. పెద్దబజారులో ట్రాం దిగింది. ఆమె వేసుకున్న నల్లటి ఓవర్‌కోటు, దానిమీద కాలనీ బాడ్జీ చూచువారలకు ముచ్చట గొలుపుతున్నాయి. ఆ పిల్ల ధీమాగా వీధివెంట నడిచివెడుతున్నది. వీధి చివరన తోటలో చెట్లనీడన జనం కూచుని మాట్లాడుకుంటు

న్నారు. ఆ పిల్ల వారి ముందునుంచి నడిచి వెడుతుంటే, వారంతా కళ్లు పులిసిపోయేట్టు ఆవిడవంక చూడసాగారు. వారి ముహాల్లో ఆనందం, ఆశ్చర్యం ద్యోతకమైనాయి. అంతలో ఆ పిల్లకు వెనుక నుంచి ఒక పిలుపు వినిపించింది:

"హల్లో డియర్!"

ఆ పిల్లకు తలమీద పిడుగు పడ్డట్టయింది. ఆ అపరిచిత స్థలంలో తనను అంత ఆప్యాయతగా పిలిచేవ్యక్తి ఎవరబ్బా అని నిర్ఘాంత పోయింది. ఎంతో ప్రయత్నంమీద వెనక్కు తిరిగి చూచింది.

కాలనీ కుర్రవాడొకడు ఎదుట కనుపించాడు. అతనూ తన లాగే నల్లటి ఓవర్ కోటు వేసుకుని, బాడ్జీ పెట్టుకున్నాడు. అతనే! ఆకుర్రాడే! ఆపచ్చటి కళ్ళూ, అతనూ!

"నీవెక్కడికిలా బయలుదేరావు?" అని అడిగాడు రైజికోవ్.

వాండా ఉక్కిరిబిక్కిరి అయింది. కొంతసేపటికిగాని తేరుకో లేకపోయింది. పూర్వం రైజికోవ్ మీద ఉండే అసహ్యం ఇప్పుడు మళ్ళీ ఒక్కమాటుగా ఆమెలో పుట్టుకొచ్చింది. కళ్ళు తీక్షణంగా జ్వలించాయి. క్రోధంతో అరుణిమ దాల్చింది. వళ్ళంతా కంపిం చింది. కాని మళ్ళీ తన్ను తాను నిభాయించుకున్నది. అవును: ఇది కాలనీకాదు. నగరంలో నడివీధి. అతనా అపరిచితుడుకాదు, కాలనీ సభ్యుడు. ఇక్కడ తగవులాడడం మంచిపనికాదు.

వాండా అతనికిలా జవాబు చెప్పింది:

"షాపుకు వెడుతున్నాను. వస్తువులు కొనుక్కోవాలి. మరి నీ వెక్కడికి?"

నేనా? మనకు పనేముంది! తోచక అలా షికారు కొట్టొద్దా మని బయలుదేరా." అన్నాడు రైజికోవ్.

ఆ పిల్ల అక్కడనుంచి కదిలింది. అతను ఆవిడ ప్రక్కనే నడవసాగాడు. ఇవాళ రైజికోవ్ చాలా పరిశుభ్రంగా ముస్తాబయి కనుపిస్తున్నాడు. కోటు ఎంతో చక్కగా అతనికి అమిరింది.

"నీ విప్పుడు టర్నర్‌గా పనిచేస్తున్నావుటగా!" అన్నాడు రైజికోవ్.

"అవును, చేస్తున్నాను" అన్నది వాండా.

"అది ఆడపిల్లలు చేయవలసిన పనికాదు!" అన్నాడు రైజికోవ్.

"మరేం చేయమంటావు?"

ఆడపిల్లలు చేసేపనులు అనేకం ఉన్నాయి. కాని ఈ పని మాత్రం నీవంటి పిల్లకు తగిందికాదు."

రైజికోవ్ ఇలా అంటుంటే వాండాకు చిత్రంగా తోచింది: అతనివాళ కాలనీ సభ్యుడిలా కనిపించడంలేదు, పూర్తిగా మారిపోయాడు. కాని అతనిప్పుడు కాలనీలోకాక నగరంలో రోడ్డుమీద ఉన్నాడు. ఆ పిల్ల కోపంతో ఇలా అన్నది:

"నీ దారిన నీవు వెళ్ళు, నా త్రోవన నే పోతాను."

"ఎందుకమ్మాయ్ అంతకోపం? నేనిప్పుడేమన్నానని? ఏదో తమాషాకంటే, అంతమాత్రానికే కోపంరావాలా?"

"బావుంది, బావుంది?"

రా! అలా హోటల్లోకి వెడదాంరా!"

ఆ పిల్ల జవాబు చెప్పలేదు. అతని వెనకాలే నడవసాగింది. కొంతదూరం వెళ్ళాక రైజికోవ్ వాండాకేసి చూచి ఇలా అన్నాడు:

"కొంచెం ద్రాక్షరసం సేవిద్దాం..."

ఆ పిల్లకు కోపం అసహ్యం పుట్టుకొచ్చాయి.

"ఊఁ, తాగుదామా! తాగి? తరువాత ఏంచేద్దాం.?" అని అడిగింది.

"ఏంచేద్దామనుకుంటున్నావు నీవు?..." అన్నాడతను. ఇలా అని లోలోపల నవ్వుకున్నాడు:

"ఏంచేద్దామో తాగాక ఆలోచిద్దాం!... మళ్ళీ వెనకటి లాగా గడుపుదాం, ఆ రోజులు, ఆ ఆనందాలు మళ్ళీ ఇప్పుడు వస్తాయేమో! ఏం? ఏమంటావ్?" అన్నాడుమళ్ళీ.

ఇరువురూ మౌనంగా నడక సాగించారు. అడ్డరోడ్డు దగ్గర అతను ఆగిపోయాడు. ఎదురుగా ఒక హోటల్ కనుపించింది. వాండా వంక సాభిప్రాయంతో చూచాడు: "రా! వెడదాంరా! మళ్ళీ ఆ రోజులు! ఆ కలలు ఆ అనుభవాలు! ఆ ఆనందాలు... అన్నాడు ఉన్మత్తుడై.

వాండా నలువంకల చూచింది. అతనికి చేరువుగా వెళ్ళింది. అతని కళ్ళలోకి చూచింది. ఛెడీల్‌మని చెంపమీద కొట్టింది:

"ఏమిట్రా అంటున్నావ్?

వెనకటి రోజులూ వెనకటి అనుభవాలా!" అన్నది.

సరిగ్గా ఆ సమయానికి త్రోవన ఎవరో వెడుతున్నారు. రైజికోవ్ జంకి, ఏమీ చెయ్యలేక వెనక్కు నాలుగడుగులు వేశాడు. వాండా చరచరా అక్కడనుంచి పక్కవీధిలోకి వెళ్ళిపోయింది.

అతను అలాగే శిలా ప్రతిమలా హోటల్‌ముందు నిల్చుండిపోయాడు.

# 11

# అందులో తప్పేముందీ!

కాలనీలో రైజికోవ్‌కు అంతా అద్భుతంగా ఉంటున్నది. అతనెప్పుడూ హుషారుగా ఉంటున్నాడు. నలుగురు పిల్లలు ఎక్కడ కూడితే అక్కడల్లా అతను హాజరు. అతను మాట్లాడని నిమిష మంటూ లేదు. అందరితోనూ కలిసిపోయి, కబుర్లాడుతూ, సరదాగా సంతోషంగా కాలక్షేపం చేస్తున్నాడు. ఫౌండ్రీలో పెద్ద పనికూడా సంపాదించాడు. ఇటీవలే అతను ఉద్యోగంలో మరో

మెట్టుపైకి వెళ్ళాడు. ఇప్పుడు ఫౌం డ్రీలో పోతపోయడం అతని పని. ఫోర్‌మన్. బంకోవస్కీకి రైజికోవ్ అంటే గొప్ప అభిమానం. అతని శక్తి, పనిలో చాకచక్యం చూచి మురిసిపోతుంటాడు. అతని మాటకు ఎంతో విలువ ఇస్తాడు.

ఒకనాడు ఫౌండ్రీలో రైజికోవ్ నెస్టెరెంకోలమధ్య వివాదం చెలరేగింది: రైజికోవ్ మాట్లాడినప్పుడల్లా ఏవో ఒట్లూ, సత్యాలు పెట్టుకుంటూ ఉంటాడు. ఇది అతని అలవాటు. కాని అవి వినే వాళ్ళకు విసుగ్గా ఉంటుంది. అందుకని నెస్టెరెంకో అతన్ని ఆ అల వాటు మానుకోమన్నాడు.

"ఊఁ, మానుకుంటాను. ఇంకేం చెయ్యాలి? నేనెలా మాట్లా డాలో నీవా చెప్పేదీ?" అని నెస్టెరెంకోను గద్దించాడు రైజికోవ్.

నెస్టెరెంకో నవ్వి ఊరుకున్నాడు.

ఆ సాయంకాలం ఒలెంకో, రైజికోవ్‌తో ఈవిషయం ప్రస్తా వించాడు.

"నెస్టెరెంకో నాతో ఏమన్నాడంటే........"

ఇలా అతను చెప్పబోతుంటే రైజికోవ్ మధ్యలో అడ్డు తగిలాడు:

"ఏమీలేదు. వండ్లగింజలోది బియ్యపుగింజ! చాలినన్ని అచ్చుదిమ్మలు ఫౌండ్రీలో లేవు. అందుకు నాకు కొంచెం చిరా కెత్తింది. ఆ చిరాకెలా గలిగిందో చెబుతాను. నమ్మండి, నా మాట! మీమీద ఒట్టు!" అన్నాడు.

"అదుగో! అదేవద్దు. ఒట్లు వేసుకోవద్దని నీకు వందసార్లు చేప్పాను." అన్నాడు ఒలెంకో.

"నీవు చెప్పక్కర్లేదయ్యా చక్రవర్తీ! నీవు చెప్పకుండానే నాకు తెలుసు. కాని ఏంచేయును? అలవాటు."అన్నాడు రైజికోవ్.

"ఆ అలవాటు మంచిది కానప్పుడు మానుకోవాలి: అలవా టును మానుకోవడం కష్టమంటావా?"

"కాకసులభమనుకుంటున్నావా? కాదు. ఎంతప్రయత్నించినా మానుకోలేక పోతున్నాను. మరీ కోపం వచ్చినప్పుడు ఒట్లు, వాటంతట అవే వస్తున్నాయి. ఫౌండ్రీలో నన్నేం చావమంటారు చెప్పండి? అక్కడ పరికరాలు చాలినన్ని లేవు. ప్రాణం ఉసూరుమంటున్నది. నమ్మండి నామాట! మీమీద ఒట్టు!"

"వద్దంటున్నా మళ్ళీమళ్ళీ అదేఒట్టు పెట్టుకుంటావేమయ్యా" అంటూ ఒలెంకో అతన్ని వారించాడు. కాని అతని అలవాటు మాత్రం పోలేదు. పాతనుంచి బయట పడడం అంత సులభంకాదని ఒలెంకోకూడా అవగతం చేసుకున్నాడు. మొత్తంమీద రైజికోవ్ ప్రవర్తన సక్రమంగానే ఉందని చెప్పాలి. ఫౌండ్రీలో మంచి పనివాళ్ళు కొందరున్నారు. అందులో రైజికోవ్ ఒకడు. ఈ విషయం ఇదివరకేరుజువైంది. అతనూ రోజువారీ జీతం తెచ్చుకుంటున్నాడు. మొన్న మొన్ననే అతని వాటాకు యాభై రూబుళ్ళు వచ్చాయి.

"ఈ డబ్బు నేనేం చేసేది?" అని అతను ఒలెంకోను అడిగాడు.

"ఏంచేసేదేమిటీ! హాయిగా ఖర్చు పెట్టుకో." అన్నాడు ఒలెంకో.

"ఖర్చు పెట్టుకోమంటారా?"

"అయితే వద్దులే! డబ్బు బ్యాంకులో వెయ్యి. నీకు కావలసినవన్నీ ఉండనేఉన్నాయి—ఇంకేం కావాలి కనుక? గడించినప్పుడు డబ్బు కూడబెట్టుకుంటే అవసరమొచ్చినప్పుడు అది అక్కరకువస్తుంది." అని చెప్పాడు ఒలెంకో.

ఫౌండ్రీలో రైజికోవ్‌కు బాగానే ఉంది. కాని స్కూల్లో మాత్రం అతని కేమీ తోచడంలేదు. నాలుగో ఫారంలో చేరాడు. రోజూ క్లాసులకు వెడుతున్నాడు, కాని, పాఠాలు చెపుతున్నప్పుడు అతనికి నిద్రవస్తున్నది — బల్లమీదనే కునికిపాట్లు పడుతున్నాడు. ఎన్నడూ హోంవర్కు చేసిన పాపాన పోలేదు.

స్కూల్లో అతని ప్రవర్తన బాగులేదని మానేటర్‌గా ఉన్న సావ్ చెంకో అప్పుడప్పుడు అతన్ని మందలిస్తున్నాడు.

ఇప్పుడు రైజికోవ్ మెల్లమెల్లగా పిల్లలందరితో సహవాసం చేస్తున్నాడు. అనేక కారణాలవల్ల కొందరు పిల్లలుమాత్రం అతనితో కలిసి ఎక్కువసేపు గడపడం లేదు. వారిలో రస్లాన్ ఒకడు. నిజానికి రస్లాన్‌కు తీరుబడిలేదు. అదీకాక అతను ఆరోఫారం చదువుతున్నాడు. అలాంటప్పుడు ఉబుసుపోని కబుర్లతో కాలం వ్యర్థం చేసి చదువు పోగొట్టుకొనడం అతని కిష్టంలేదు. ఇందులో రస్లాన్ తప్పేమీ లేదనుకున్నాడు రైజికోవ్. తనకు చదువుమీద శ్రద్ధ లేకపోయినా రస్లాన్ చదువు పాడుచెయ్యడం అతని కిష్టంలేదు. అది ప్యాసయ్యాక రస్లాన్ ఎలాగూ తనతో ఉంటాడు. అతనూ తనకోవలో చేరినవాడే. కాలనీ సభ్యులందరిలోకీ లెవిటిన్, రైజికోవ్‌కు సన్నిహితుడు. రైజికోవ్ కంటె రెండేండ్లు చిన్నవాడు. అంచేత అతను రైజికోవ్‌ను పెద్దగా చూచుకుంటూ వచ్చాడు. అది ఒకవిధమైన పూజ్యభావంగా కూడా పరిణమించింది. అందరిలోకీ లెవిటిన్ తెలివైనవాడు. బాగా చదువుకున్నవాడు. ఎప్పుడూ పుస్తకాలు చదివి ఆవిషయాలు అందరికీ చెబుతుంటాడు. నగరానికి వెళ్ళినప్పుడల్లా ఏదో ఒక చిత్రమైన వస్తువు కొనుక్కుచ్చుకుంటూ ఉంటాడు. అది ఒక్క రైజికోవ్‌కు మాత్రమే చూపుతుంటాడు. కాని అతనికి కాలనీ అంటే ఎందుకోకాని చెప్పలేనంత అసహ్యం ఉన్నది. ఎప్పుడూ ఏవో నసుకుతూ ఉంటాడు. రైజికోవ్‌తో ఏవేవో ఫిర్యాదులు చేస్తుంటాడు విమర్శిస్తూంటారు. రైజికోవ్ వాటిని శ్రద్ధగా వింటాడుగాని, లెవిటెన్ కాలనీని ఎందుకంత అసహ్యించుకుంటున్నాడో అతనికి అవగతం కావడం లేదు. లెవిటిన్ అసలే దృఢకాయుడు. అందులో కోపం వచ్చిందీ అంటే అతని ముఖమంతాఎర్రబారి రౌద్రాకారం దాలుస్తాడు. అతను ఏ నియమాలూ పాటించడు, కాలనీ నియమాలు, క్రమశిక్షణ, ఆ యూనిఫారము, ఆ పరిశుభ్రత, ఫ్యాక్టరీపని; ఇవే అతనికి గిట్టవు. అతను సోవియట్ జీవితాన్ని విచిత్రంగా అర్థం చేసుకున్నాడు.

బ్లమ్ తన ఒడిలో పోసుకునేందుకు ఆ పదివేల రూబుళ్ళు సంపాదించాడనీ, ఆ కొత్తఫ్యాక్టరీ కట్టడం కూడా తన స్వార్థం కోసమేననీ అతని నమ్మకం. అతని ఉద్దేశంలో జకరోవ్ కూడా అంతే. జకరోవ్ క్రింద కాలనీలో రెండువందల మంది పనిచేస్తున్నారు. ఇవాళో రేపో అతనికి ప్రభుత్వం బిరుదులిస్తుంది. సన్మానిస్తుంది. సత్కరిస్తుంది. అందుకే జకరోవ్‌కు ఈ తాపత్రయమంతా. అదీ లెవిటెన్ అభిప్రాయం.

ఒకనాడు లెవిటెన్ ఈ విషయమే రైజికోవ్‌తో ప్రస్తావించాడు. చివరకు రైజికోవ్ కూడా అతని మాటలను ఇలా ఖండించాడు :

"ఆ, అదేంకాదులే. జకరోవ్ కొంచెం గర్వపోతు! అంతే- ఇహ డబ్బు కాజేయడమంటావా ? అదంత తేలికైన పనికాదు. దానికి బోలెడన్ని లెక్కలు డొక్కలు ఉన్నాయి. గుమాస్తాలు, ఆడిటర్లు ఉన్నారు."

ఇదివిని లెవిటెన్ "నీకేం అర్థం కాదులేవయ్యా, ఈ విషయాలు !" అన్నాడు.

ఇదివరకు లెవిటెన్ అనేక బాలశిక్షణా కేంద్రాలలో ఉండి వచ్చాడు. ఒకచోట కేంద్రం డైరెక్టర్ మీద నేరారోపణ చేసి విచారించారు. మరో కేంద్రంలో అందరూ దొంగలే. అదంతా ఎందుకు? వాళ్ళనాన్న క్యాషియర్. ఆయనన్ను అందరూ నిజాయితీ పరుడని అనేవారు. కాని అతని నిజాయితీ ముప్ఫయివేల రూబుళ్లు ఇనప్పెట్టెలో కనిపించకపోయేసరికి బయటపడింది. ఇప్పటికీ తన తండ్రి జైల్లోనే ఉన్నాడు. అవకాశం లేకగాని అంతా దొంగలే! చేతికి చిక్కేవరకూ అందరూ పెద్దమనుషులుగానే నటిస్తారు. రైజికోవ్‌కు ఏం తెలుసును ? ప్రపంచమంతా అమాయకంగా ఉందనుకుంటాడు.

లెవిటెన్ అభిప్రాయాలతో రైజికోవ్ పూర్తిగా ఏకీభవించలేకపోయాడు. లెవిటెన్ కేం తెలుసును ? అతననుకున్నంత దుర్మా

ర్గంగా లేదులోకం. జీవితాన్ని గురించీ, మానవ స్వభావాన్ని గురించీ తనకు అతనికంటె ఎక్కువ తెలుసును. ప్రతివాడికీ పని చెయ్యకుండా డబ్బు గడించాలనీ, ఆస్తి సంపాదించాలనీ కోరిక ఉంటుంది. ఒకవస్తువును దొంగిలించడానికి అవకాశాలూఉంటాయి. కొందరు పనీపాటా లేకుండా దరిద్రంలో తమ జీవితాలు గడుపుతుంటారు. అయినప్పటికీ వాళ్లు దొంగతనాలు చేయలేరు. అది చేస్తే పట్టుబడిపోతామని వాళ్ళభయం. దొంగ తనాలకు కూడా ధైర్యం కావాలి. మాటలతో పనికాదు. పోలీసులన్నా జెళ్లన్నా లెక్కలేనివాళ్ళు మాత్రమే ఆపనిచేస్తారు. రైజికోవ్ దృష్టిలో లెవిజెన్ పనీపాటాలేని నిరర్థకుడు. అతనికి దొంగతనం చెయ్యాలని ఉంటుందికాని, చెయ్యడానికి గుండెల్లేవు. లెవిజెన్‌ని గురించి రైజికోవ్ ఇలా అనుకుంటున్నప్పటికీ అతనితో మాట్లాడడానికి ఇష్టపడుతూనే ఉంటాడు.

ఒకనాడు వారిరువురూ పడకగదిలో కూచుని ఇలా ముచ్చటించుకోసాగారు.

"అన్యాయం, చాలా అన్యాయం !" అన్నాడు లెవిజెన్.

"ఏమిటి అన్యాయం?" అని అడిగాడు రైజికోవ్.

"నిన్నగాక మొన్న వచ్చింది వాండా. అప్పుడే దానికో *'లేతు'మిషనా! నే నింకా ఈ వెధవ వడ్రంగం కార్ఖానాలో పడి ఏడుస్తున్నాను. ఇది న్యాయమేనంటావా?"

"వాండా విషయం నీకు తెలీదోయ్, అమ్మా, అసాధ్యురాలుకదూ! పదిమందిలో ఎలా మసులుకోవాలో ఆ పిల్లకు తెలుసు.

"అయితే నాకేనా తెలయంది?"

"నీ కేందోయ్ తెలసింది! – నీమచింతకాయపచ్చడి! ఆ పిల్ల దారి వేరు, నీదారి వేరు!"

"ఏం? ఆ పిల్ల ఆకాశంనుంచి ఊడిపడిందా?"

---

* తరిమిపట్టే ఒకానొక సాధనం—అనువాదకుడు.

"ఆమె విషయము నీకు తెలీదు. కాని నీవు ఊరుకో - భలే చమత్కారిలే! కాలనీలో చేరకముందు అదేం చేసిందో నీకు తెలుసునా?" ఇలా అంటూ రైజికోవ్, లెవిటిన్ చెవిలో ఏదో చెప్పాడు.

"ఛాఛా! ఊరుకో, అబద్ధం! ఏమిటా మాటలు?" అన్నాడు లెవిటిన్.

"ఒట్టురా. నీమీదఒట్టు! నాకంతా తెలుసుగా"

"భలే గమ్మత్తుగా ఉందే కథ! ఇంకా చెప్పు - చెప్పు విందాం" అని కుతూహలంగా అడిగాడు లెవిటిన్.

అందులో విశేషమేముందోయ్. అదీ అందరిలాటి పిల్లే! అందరూ చేస్తున్నపనే అదీ చేస్తున్నది! ఇందులో తప్పేమీలేదులే అందరిలోనూ ఈమె ఒకతె!" అన్నాడు రైజికోవ్.

"అయితే మరి ఇక్కడికొచ్చి పెద్ద మొహర్బానీగా ఉంటుందేం? తనేం గొప్పదాన్ని అనుకుంటున్నదా?..."

"అనుకోనిద్దూ - అందులో తప్పేముందీ!" అన్నాడు రైజికోవ్.

# 12
# చిలిపి రాతలు

త్వరలోనే జాతీయ దినోత్సవం రాబోతున్నది. రాబోయే ఉత్సవానికి కాలనీలో పిల్లలంతా ఇప్పటినుంచే అన్నివిధాల సన్నాహాలు చేసుకోవడం మొదలుపెట్టారు. నిజానికి నవంబరు నెలలో పిల్లలకు తీరుబడి ఉండదు. వాళ్ళకప్పుడు చేతినిండా పనే. కాలం అమూల్యమైనది. ఒక్క నిముషంకూడా వృథా పుచ్చకూడదు.

ఒకనాటి సాయంకాలం ల్యూబా గ్రంథాలయానికి వెళ్ళింది: తనకు కావలసిన ఒక పుస్తకాన్ని ఎంచుకుని తీసుకున్నది. అది తెరిచి

చూచేసరికి ఆవిడ కందులో ఒక చీటీ కనుపించింది. అది చదువు కుని ఆశ్చర్యపోయింది:

"చూశండ్రా ఈ చీటీ ఎంత అసహ్యంగా ఉన్నదో! లిడా! నీవిది ఒక్కమాటు చదివి చూడమ్మాయ్." అంటూ ల్యూబా ఆ చీటీని లిడాకు అందించింది.

లిడాకూడా దాన్ని చదువుకున్నది: అందులో ఇలాఉన్నది:

"వాండా స్ట్రాడ్నిట్స్కయా ఈ కాలనీకి రాకమునుపు ఏం చేసేదో, ఎలా బ్రతికేదో ఒక్కమాటు ఆ పిల్లనడిగి తెలుసుకోండి అందులో ఉన్న మజా మీకే తెలుస్తుంది!"

ఆ సమాయానికి గ్రైడోవిస్కీ గ్రంథాలయానికి వచ్చాడు. ల్యూబా చేతిలోఉన్న పుస్తకాన్ని చూచాడు. అది అతన్ని ఆక ర్షించింది. ఇదివరకు అతనాపుస్తకాన్ని చదవాలనుకున్నాడు. కాని తీరుబడి లేకపోయింది. ఇప్పుడా పిల్లచేతిలో ఉన్న ఆపుస్త కాన్ని చూచి ఆగిపోయాడు. ఆమె నడిగి దాన్ని తీసుకున్నాడు. ఒక మాటు పేజీలు తిరగేసి బొమ్మలు చూచాడు. అతనలా పొర టలు తిరగేస్తుండగా అందులో వున్న చీటీ క్రింద పడిపోయింది. కాని ఆ విషయం అతను గమనించలేదు. వెనకాల వస్తున్న రొగోవ్ దాన్ని చూచాడు. చీటీని కాలితో అదిమిపట్టి తరువాత అందిపుచ్చుకున్నాడు. అది చదువుకుని ఇలా అన్నాడు:

"ఒరేయ్ అబ్బాయిలూ! వాండా సామాన్యురాలు కాదురా! ఆరితేరిన ఘటమే!"

తరువాత గ్రైడోవిస్కీని చూచి "ఈ చీటీ నీకెక్కడ దొరి కింది?" అని అడిగాడు.

"ఏమిటీ ? చీటియా ? ఏంచీటీ ?" అని ఆశ్చర్యపోతూ అడి గాడు గ్రైడోవిస్కీ.

"ఇదే, ఈచీటి."

"నీవనేది నాకర్థం కావడం లేదు."

"అర్థం కాకపోవడమేమిటి ? నీ చేతిలోనుంచి ఈచీటీ జారి పడింది."

"కాదు. పుస్తకంలోనుంచి అయిఉంటుంది."

"ఈ పుస్తకం నీకెక్కడిది ?"

"లైబ్రరీది. ఇంతకూ ఆచీటీలో ఏమున్నది ?"

దీనికి రొగోవ్ బదులు చెప్పకుండా తిన్నగా కమాండర్ల గదిలోనికి వెళ్ళిపోయాడు.

"చూడండి, చూడండి ఈ చీటీ !" అన్నాడు.

గదిలో బల్లమీద అలాంటివే చాలా చీట్లు పడిఉన్నాయి. విట్యాటార్స్కీ అక్కడే నిలుచుని ఉన్నాడు.

"ఈ చీట్లన్నీ అరగంటబట్టీ చూస్తున్నాను. సరే. నీవు తెచ్చిన చీటీ నాలుగోది." అన్నాడు టార్స్కీ.

కొంతసేపు గడిచింది. ద్వారం దగ్గర బిగోనక్ కాపలా ఉన్నాడు. గదిలోటార్స్కీ, జిరియాన్స్కీ, మార్కుగ్రిన్‌హాస్‌లు ఏదో కూడబలుక్కున్నారు. ఆ చీట్లన్నీ చదివి జాగ్రత్తగా పరిశీలించాడు గ్రీన్‌హాస్.

"సందేహంలేదు. ఇది లెవిటిన్ చేసినపనే !" అన్నాడు జిరియాన్స్కీ.

"అంతేనంటావా ?" అన్నాడు గ్రిన్‌హాస్.

"ఆ, ముమ్మాటికీ అంతే. లెవిటిన్ దస్తూరి నాకు తెలుసు. వాడే ఇది రాసింది. మరుగుదొడ్డి గోడమీద మర్యాషాను గురించి వాడేం రాశాడో మీకు తెలుసునా ?"

"అయితే ఈ చీట్లను పుస్తకాల్లో ఎలా పెట్టాడంటావ్ ?"

"దానికేముందీ ! అతను గ్రంథాలయంలో సభ్యుడు."

వెంటనే లెవిటిన్‌ను పట్టుకరమ్మని బిగోనక్‌ను పంపించాడు టార్స్కీ.

లెవిటిన్ అక్కడ హాజరైనాడు; దొంగచూపులతో టేబిల్ మీద ఉన్న చీట్లనన్నీ పరికించాడు.

"నన్నెందుకో రమ్మన్నారట?" అని అడిగాడు.

"ఇది నీ పనేనా?" అని గద్దించాడు టార్‌స్కీ.

"మీా రనేదేమిటో నా కర్థం కావడంలేదు." అన్నాడు లెవిటిన్ ఏమీా ఎరగనట్టు,

"నానోటితో చెప్పాలా? నీ కళ్ళతో నీవు చూాళ్ళేవూ?"

"అసలిదంతా ఏమిటో నా తలకెక్కడంలేదు."

జిరియాన్‌స్కీ అతని బుజాలు పట్టుకుని టేబిల్ ముందుకు నెట్టాడు:

"నీవు రాసినవేగా! మళ్ళీ చదువుకోవడం యెందుకూ?"

"చదవందే నే రాసిందోకాదో నా కెలా తెలుస్తుంది?"

"అయితే నీవు కొన్ని రాశావన్నమాట!"

"నేను రాయలేదు."

"రాయలేదూ? అబద్ధం!"

"లేదు. నిజం."

జిరియాన్‌స్కీ అతనివంక గ్రుడ్లురిమిచూాచాడు. లెవిటిన్ తన చూపులు మళ్ళించుకున్నాడు. జిరియాన్‌స్కీ టార్‌స్కీతో ఇలా అన్నాడు:

"లిట్యాటార్‌స్కీ! వెంటనే కౌన్సిలు మీాటింగు ఏర్పాటు చెయ్యి."

కొద్దిసేపట్లో కౌన్సిలు సభ్యులు సమావేశమయ్యారు. లెవిటిన్ గదిలో ఒక మూాల నిలుచున్నాడు. జకరోవ్ ఒక్కొక్క చీటీ తీసి చదివి వినిపించాడు. సమావేశం జరిగే సమయానికి అయిదో దళం పడకగదిలో వాండా తన పరుపుమీాద పడుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది. ఆమె చుట్టూా కొంద రాడపిల్లలు పోగయ్యారు. క్లావా కపిరినా పరుగెత్తుకుంటూా అక్కడికొచ్చింది.

"వాండా! కౌన్సిలు సమావేశం జరుగుతున్నది. వాడిబుర్ర బ్రద్దలుచేస్తాను చూాడు. రా, వెళదాం" అన్నది.

వాండా ముఖానికి కప్పుకున్న తలగడ తీసి తలఎత్తింది:
"నేను రాను" అన్నది.

"ఎందుకురావూ! ఆ లెవిటిన్‌గాడి అంతు కనుక్కుందాం రా." అన్నది కషిరినా.

వాండా ఒక్సానా వంక చూచి "నీవేమంటావు ఒక్సానా వెళ్ళమంటావా?" అని అడిగింది.

ఒక్సానా పెదవులపై చిరునవ్వు విసిరింది.

"బయలుదేరు నేనూ వస్తాను. మనం వెడితే తప్పేమిటి?" చూద్దాం. వాడికి జలుబునీళ్ళు వదిలిద్దాం." అన్నది ఒక్సానా.

అందరూ బయలుదేరారు. గదిలో సమావేశం జరుగుతుండగా చాలమంది పిల్లలు ఇవతల పోగయ్యారు. టార్‌స్కీ వాళ్ళను అవతలికి పొమ్మని ఆజ్ఞాపించాడు. అప్పుడు పిల్లలంతా అక్కడినుంచి దూరదూరంగా, చెదురుచెదురుగా తప్పుకున్నారు. ఆ వింత ఏమిటో తెలుసుకుందామని ఆతృతతో అంతా ఎదురు చూడసాగారు. గది వాకిట్లో బిగోనక్ కావలి ఉన్నాడు. వాండా, ఒక్సానాలను మాత్రం లోపలికి పోనిచ్చాడు.

కొంతసేపు గడిచింది, టార్‌స్కీ ఇవతలి కొచ్చాడు. రైజికోవ్‌ను తీసుకరమ్మని బిగోనక్‌ను పంపించాడు. బిగోనక్ స్థానంలో వాన్యాగల్చెంకో నిలుచుని కాపలా కాయడం మొదలు పెట్టాడు. తరువాత బిగోనక్ రైజికోవ్‌ను వెంటపెట్టుకుని వచ్చాడు. ఈ లోపునే సమావేశంలో పెద్ద అలజడి చెలరేగింది. జిరియాన్‌స్కీ మండిపడుతున్నాడు :

"ఇహ నీముఖం నాకు చూపకు! నీముఖం చూస్తే పంచ మహాపాతకాలు చుట్టుకుంటాయి. ఇంతాచేసి ఇంకా దబాయిస్తున్నావే! ఇదేం నాటకం అనుకున్నావా? నీవు ఒప్పుకున్నాసరే — లేకున్నాసరే. ముందిక్కడనుంచి నిన్ను బయటికి గెంటేస్తాం."

ఇదివింటూ లెవిటిన్ గదిలో మూలన అలాగే నిలుచున్నాడు: కత్తి వేటువేసినా అతని ముఖాన నెత్తురు చుక్కలేదు.

కళ్లు కళావిహీనంగా ఉన్నాయి. కాళ్ళు వణుకుతున్నాయి. తూలి పడబోయాడు. ముందున్న టేబిల్‌ను ఊతం చేసుకుని నిలుచున్నాడు.

"నీకీ విషయం ఎలా తెలిసింది? ఎవరుచెప్పారు నీకో?" అని గద్దించాడు ఒలెంకో.

లెవిటిన్ ఏదో చెప్పాలని పెదవులు కదిల్చాడు. కాని మాట పెగిలిరాలేదు. చివరకు డగ్గుత్తికతో ఇలా అన్నాడు:

"నాకేం తెలీదు. నేనేం ఎరగను. అవి నేను రాయలేదు."

గదికి ఎదురుగా మరోమూల వాండా కూచుని ఉన్నది. ఆవిడ కిరువైపులా ఇరువురు ఆడపిల్లలు నిలుచుని ఉన్నారు.

"నేనొక మాటచెపుతాను విట్యా." అంటూ వాండా లేచి నిలుచున్నది. అందరూ ఆవిడవంక చూచి శ్రద్ధగా విన సాగారు. ఆమె గది మధ్యకు వచ్చింది. లెలిటిన్‌వంక తేరిపార చూస్తూ నిలుచున్నది. లెలిటిన్ మరింత కళవళ పడ్డాడు. గట్టిగా బెంచీని పట్టుకుని, దానిమీద వాలిపోయాడు. వాండా అతనివంక చూస్తూ ఇలా చెప్పసాగింది:

"ఇదిగో అబ్బాయ్! ఇది విను. నా గత చరిత్ర - దాన్ని గురించి నీవు ఏదేదో రాశావు-అదంతా నిజం. ఇందులో దాపరికం ఏమీలేదు. ఎవరికి తెలిసినప్పటికి నాకేం భయంలేదు. తెలిసిందే అని దిగులులేదు. ఇక్కడున్నవాళ్ళంతా నా స్నేహితులే, నా మంచిని కాంక్షించేవాళ్ళే: వాళ్ళను అలాగే తెలుసుకోనియ్యి. తప్పులేదు. కాని ఒక్క విషయం-ఆ జీవితానికి నన్ను నెట్టిందెవరు? దానికి బాధ్యులెవరు? - ఎవరోకాదు. సరిగ్గా నీలాంటివాళ్ళే! అవును నీలాంటివాళ్ళే! నీలాంటివాళ్ళే..."

ఆవిడ కనులవెంట కన్నీరు దారావాహికంగా ప్రవహించింది. ఎక్కడలేని దుఃఖం పొంగిపొరలి వచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చింది.బయుటికి వెళ్లేందుకు వాకిట్లోకి పరుగెత్తింది.కాని ఆవిడను వెళ్ళనీయకుండ నెస్త్రెంకో చేతులు అడ్డు పెట్టాడు. అవిడ అతని చేతులమీద ఒరిగిపోయింది.

నెప్ట్రింగ్ లెవిటిన్ వంకచూచి "ఆ పిల్ల చెప్పింది విన్నావా? ఆమెమీద అడ్డమైన బూతులు రాశావు. ఇప్పుడావిడ మీద మాకు మరింత గౌరవం కలుగుతున్నది. ఆమె మాకు సోదరితో సమానం. నీలాంటి భడవలకు సోదరి అనేమాటకు అర్థం తెలిస్తే కదూ. నిన్ను కాలనీనుంచి గెంటేస్తాం. గెంటేసిన మరుక్షణంలో నీ పేరే మరచిపోతాం" అన్నాడు.

"ఆ పని ఇప్పుడే అవుతుంది. సమావేశం ముగిసిన వెంటనే పందికొక్కును ఊరవతల విడిచిపెట్టినట్టు నిన్ను రోడ్డుమీద వదిలి పెడతాను" అన్నాడు జిరియాన్‌స్కీ.

అతనికి చేరువగానే లిడాటాలికోవా నిలుచున్నది:

"ఇంతవరకూ కాలనీనుంచి ఒకమనిషిని బయటికి పంపించమని నే నెప్పుడూ ఓటు చెయ్యలేదు. నీవు ఇక్కడ వేరుపురుగులా దాపురించావు. నిన్ను నల్లిని నలపినట్టు నలిపివెయ్యాలి" అన్నదామె.

తరువాత జిరియాన్‌స్కీ లెవిటిన్ చెంతకు వెళ్ళాడు:

"చాలు ఇహ ఈ చర్చ చాలు. తలనొప్పి వస్తోంది. ఏం లెవిటిన్ నీవిప్పటికైనా ఒప్పుకుంటావా లేదా? ఆమాట మళ్ళీ ఒక మాటు చెప్పు, విందాం." అన్నాడు.

లెవిటిన్ మాట్లాడలేదు. రుడ్నేవ్ జకరోవ్‌కేసి ప్రార్థనా పూర్వకంగా చూచాడు. కొంతసేపు గదంతా నిశ్శబ్దమైంది. పిమ్మట రైజికోవ్ కంఠస్వరం వినిపించింది :

"నేనొక విషయం చెప్పాలి టార్‌స్కీ." అన్నాడు.

"ఊ, చెప్పు. అందుకే నిన్ను పిలిపించాను." అన్నాడు టార్‌స్కీ.

"సరే. లెవిటిన్‌ను బయటికి పంపించాలంటున్నారు. దాని కేం? ఇక్కడుంటే అతను తక్కిన వాళ్ళందరిని కూడా పాడు చేస్తాడు."

లెవిటిన్ వెనక్కు తిరిగి చూచాడు : "నాకా పిల్లవిషయం చెప్పింది నీవేకదూ ?" అన్నాడు.

"అదీ సంగతి!" అన్నారు ఎవరో.

రైజికోవ్ ఏమాత్రం తొణకలేదు. ఇలాంటి సందర్భాల్లో ఎలా ప్రవర్తించాల్సిందీ అతనికి తెలుసు.

"అవును. నేనే చెప్పాను. చెపుతూ ఏమిటన్నాను? మనలో మాట. ఈ విషయం మరెవ్వరికీ చెప్పకు.' అని అనలేదూ? అదీ కాక ఇందులో తప్పేమీ లేదనికూడా అన్నాను"

"అవును, అన్నావు." అన్నాడు లెవిటిన్.

"మరి విని అంతటితో ఊరుకోక, ఈ పిచ్చిరాతలెందుకు రాశావు?"

ఇలా అని రైజికోవ్, వాండాను గురించి తనకు తెలిసిన విషయాలన్నీ మళ్ళీ సమావేశంలో వెల్లడించాడు. ఇగోర్ ముఖం కుంచించుకు పోయింది.

"రైజికోవ్! ఇహ నీకబుర్లు కట్టిపెట్టు! నేనేం చెప్పానో నీకు జ్ఞాపకమున్నదా? లేకపోతే గుర్తుతెచ్చుకో." అన్నాడు ఇగోర్.

రైజికోవ్ గబగబా ముందుకొచ్చాడు. ఎవరో అతని చెయ్యి పట్టుకుని ఆపారు.

"ఇది కౌన్సిలు సమావేశం. ఆట్టే అల్లరిచేస్తే ఏంచేయాలో నాకు తెలుసు."

ఇగోర్ తలఊపుతూ గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయాడు. రైజికోవ్ అందరివంకా ఒకమాటు చూచి చతికిలపడ్డాడు.

"నిన్ను ఎవరు కూచోమన్నారు? ముందు బయటికి నడువు." అన్నాడు టార్‌స్కీ.

రైజికోవ్ లేచి గబగబ వెళ్ళిపోయాడు. అతను వెడుతుంటే వాండా అతనివంక అసహ్యంగా చూస్తూ త్రోవఇచ్చింది. తరువాత నెస్ట్రెంకో గది తలుపు వేసివచ్చి కూచున్నాడు.

"ఇప్పుడంతా అర్థమైంది." అన్నాడు.

"ఈ లెవిటిన్ సంగతి ఏంచేద్దాం?"అనిఅడిగాడు టార్‌స్కీ.

జిరియాన్‌స్కీ, లెవిటెన్ వంక నిర్లక్ష్యంగా చూచి "ఇహ చర్చించి లాభంలేదు. రేపు ఇతనికి భోజనం పెట్టడం మానేద్దాం. అప్పుడతనికి సిగ్గొస్తుంది." అన్నాడు.

దీనికి జకరోవ్ ఒప్పుకోలేదు.

"అలా ఎవర్నీ అవమానించకూడదు. కొన్నాళ్ళు ఇతన్ని కాలనీనుంచి బహిష్కరించడం వేరు. తిండి పెట్టకుండా మాడ్చడం వేరు." అన్నాడు.

మూడవదళపు కమాండర్ బ్రటిట్‌సాన్ ఇలా అన్నాడు:

"నాదొక చిన్న సూచన." ఇలా అని లెవిటిన్‌ను పిలిచాడు.

"నిన్నిక్కడనుంచి పంపించం. నీకు భోజనం పెడతాం. కాని రేపు నవంబరు దినోత్సవం వస్తున్నది. ఆవేళ ప్రదర్శనాల్లో నీవు పాల్గొనడానికి వీలులేదు. మేం మా పతాకాలతో ప్రదర్శనాలు చేస్తాం. నీవు వెలివేసినట్టు ఉండిపోవాలి. ఇది నీకు సమ్మతమేనా?" అని అడిగారు.

తరువాత పోర్షినేవ్ ఇలా అన్నాడు:

"నవంబరు దినోత్సవంనాడు నేనే డ్యూటీలో ఉంటాను. ఆవేళ అతనేం చెయ్యాలో నేచెప్తానుండండి... ఏవోయ్ లెవిటెన్! ఆవేళ నీచేత వంట చేయిస్తా! సరేనా?"

దీంతో లెవిటెన్‌కు తల తిరిగిపోయింది. మూలకు ఒరిగిపోయాడు. వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

"బాగుంది! ఈ శిక్ష బాగుంది! అలాగే చేద్దాం. ఇంతటితో ఈ సమావేశం ముగిసింది." అన్నాడు టాక్‌స్కీ.

ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు. లెవిటెన్ గబాలున లేచి ఏడుస్తూ ఇలా అన్నాడు:

"కామ్రేడ్స్! నన్ను శిక్షించండి. ఇలా నన్నిక్కడ వదిలి వెళ్ళకండి!"

ఇంతసేపూ అవతల నిరీక్షిస్తున్న కుర్రవాళ్లు ఇప్పుడక్కడికొచ్చి అతనిచుట్టూ మూగారు. అది చూచి జకరోవ్ వాళ్ళనిలా మందలించాడు:

"వెళ్ళండి మీరంతా. ఇక్కడేముందని? పొండి! మీ పనులకు మీరు పొండి!

పిల్లలంతా చెల్లాచెదరయి అక్కడనుంచి పారిపోయారు. జకరోవ్, లెవిటెన్ బుజాలు తట్టుతూ "పద, నీకు మంచి శిక్ష వేస్తాను పద." అన్నాడు.

ఇలా అని జకరోవ్ తన ఆఫీసువైపునడక సాగించాడు, లెవిటెన్ ఏడుస్తూ అతన్ని అనుసరించాడు.

# 13

# ఎవడి ఆనందం వాడిది!

వార్షికోత్సవాలు మొదలైనాయి. రెండవరోజున జకరోవ్ తన కార్యాలయంలో ప్రశాంతంగా పనిచేసుకుంటూ కూచున్నాడు. బిగోనక్, వాన్యాలు అక్కడికొచ్చి వాకిట్లో నిశ్శబ్దంగా కూచున్నారు. జకరోవ్ వాళ్ళను చూచాడు. కాని మాట్లాడకుండా తనపనిలో తాను నిమగ్నుడైనాడు.

"నీవు చెప్పవ్, నాకు తెలుసు."

"చెపుతాను."

"మరి చెప్పవేం? ఎందుకలా మూతి ముడుచుకుని కూచున్నావ్?"

"తొందరెందుకోయ్. నెమ్మదిగా చెబుదాం."

"నాకు తెలుసులే నీసంగతి! కూచున్నట్టు కూచుని చెప్పకుండా తుర్రున లేచిపోతావు!"

వాన్యా గభాలున లేచాడు. జకరోవ్ దగ్గరికి వెళ్ళాడు. వాన్యా తనదగ్గరికి రావడం జకరోవ్ గమనించలేదు. అప్పుడు వాన్యా మరీ చేరువగా వెళ్ళి జకరోవ్ ముందున్న డెస్క్‌మీద చేతులానించాడు. వాలుచూపులతో బిగోనక్ వంక చూచాడు. అతని ముఖం ఎఱ్ఱబారింది.

"ఆ," అన్నాడు జకరోవ్ తలఎత్తకుండానే.

"అలెగ్జీ స్టెపానొవిచ్! ఇవాళ ఎనిమిదవ తారీకుకదూ?"

"అవును."

"ఇంకా అచ్చుదిమ్మలు కొత్తవి సిద్ధంకాలేదు."

"నాకు తెలుసు" అన్నాడు జకరోవ్ చిరునవ్వు నవ్వుతూ.

"అయితే మరి జిరియాన్‌స్కీ అన్నాడన్నమాట నిజమే నంటారా?"

"అంతే అనుకోవాలి..."

వాన్యా ఇంకా ఏదో చెప్పాలనుకున్నాడుకాని, చెప్ప కుండానే వెళ్ళిపోయాడు. బిగోనక్ అతన్ని అనుసరించాడు.

"సాలొమన్ డవిడొవిచ్ తనమాట నిలబెట్టుకున్నాడు కాదు." అన్నాడు వాన్యా వెడుతూ.

ఆ మాట విని జకరోవ్ తల పంకించాడు.

ఇప్పుడు బ్లుమ్ పరిస్థితి కాలనీలో అంత విముఖంగా లేదు. ఫౌండ్రీలో మాటమాటికీ పటకాలూ అవీ తెగిపోతూనే ఉన్నవి. అయినప్పటికీ కాలనీ సభ్యులు అతన్ని అల్లరిపెట్టడంలేదు. అతని పరిస్థితిని సానుభూతితో అర్థం చేసుకున్నారు. పూర్వంలాగా బ్లుమ్ ఇప్పుడు లేనిపోని వాగ్దానాలు చెయ్యడంలేదు.

డిసెంబరు నెలాఖరున కాలనీ జన్మదినోత్సవం జరగ బోతున్నది. కాలనీ సభ్యులు ఉత్సవ సన్నాహాలు ఇప్పటినుంచే కావిస్తున్నారు. సాధారణ సభ్యుల సమావేశంలో మకరెంకో కాలనీ సభ్యుల సాంప్రదాయాన్ని నిలపెట్టాలని ప్రబోధించాడు. ఉత్స వాలు బ్లుమ్ సహాయంలేనిదే జయప్రదంగా కొనసాగవు. అతని

సహాయం అన్నిట్లోనూ అవసరం. ప్రతిదశానికి ఒక్కొక్క సభ్యుణ్ణి ప్రతినిధిగా తీసుకుని ఉత్సవ సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఉత్సవ సంఘం చురుకుగా పనిచేయడం మొదలుపెట్టింది. ఆ కమిటీలో ఇగోర్, వాన్యా, ఒక్సానాలు సభ్యులు. వాన్యా ఇప్పుడు వాయిద్య దళంలో సభ్యుడుకూడా. కొత్తగా వాయిద్యం నేర్చుకోవడంవల్ల అతనికి ఈ సంఘంలో పనిచేయడానికి చాలినంత వ్యవధి లేక పోతున్నది. అయినప్పటికీవచ్చి ఉత్సాహంగా పనులలో పాల్గొంటు న్నాడు.

ఉత్సవంలో ఔత్సాహిక సంగీత పాఠకుల కచేరీ ఒకటి ఏర్పాటు చేయాలనుకున్నారు. ఇందుకు బ్లమ్ తోడ్పాటు అవసర మని ఉత్సవ సంఘం గుర్తించింది. అతనితో రాయబారాలు జరప డానికి ఇగోర్, షూరామిట్నికోవాలను నియమించారు. వాళ్ళి ద్దరూ వెళ్ళి బ్లమ్‌ను కలుసుకున్నారు. ఇగోర్ బ్లమ్‌తో ఇలా చెప్ప సాగాడు:

"ఉత్సవంనాడు ఒక సంగీతకచేరీ పెట్టాలనుకుంటున్నాం."

"నాకు తెలుసు. దీనికి మీకు కొన్ని సీనరీలు కావాలి. నన్ను మీరు అడగనక్కర్లేదు. కావల్సినన్ని పట్టుకపొండి. కాని పాడుచెయ్యకండి. ఇంతకూ ఆ కచేరి ఇప్పటికెన్నాళ్ళుంది.

"నెలా పదిహేను రోజులు."

"బాగుంది. మంచి ఏర్పాటు చేశారు. నేనుకూడా వీలు చేసుకుని ఆనాడొచ్చి అందులో పాల్గొంటాను."

"అదే మేమూ కోరేది కామ్రేడ్ బ్లమ్. మీరు పాల్గొనక పోతే మా పాటకచేరీ చప్పగా ఉంటుంది!"

"నేనూ చక్కని పాటకుణ్ణయ్యా! నృత్యంకూడా అద్భుతంగా చేస్తాను. మీలాంటి కుర్రాళ్ళకు నృత్యం చెయ్యడం నేర్పుతాను కూడా."

"ఉత్సవంనాడు మీ రెవరితో నృత్యం చేస్తారు? ఒక్సా నాతో కదూ?" అని అడిగాడు ఇగోర్.

"అవును, తప్పకుండా చేస్తాను. ఏం? ఆమెతో కలిసి డాన్సు చేయడంలో తప్పేముంది? నాకేం భయం లేదయ్యా."

ఇగోర్ సంతోషించాడు. తాము వచ్చినపని నెరవేరినందుకు ఆనందించింది షూరామిట్నికోవా.

రాయబారవర్గం సాధించిన ఘనవిజయానికి ఆశ్చర్య పోయాడు మలంకీ.

"బ్లిమ్ తనంతటతాను వచ్చి ఉత్సవాల్లో నృత్యం చేస్తా నంటే, అది నిజంగా మనకు వేడుకే. అదీకాక మనకు మంచి మంచి సీనరీలు, కాగితపు దీపాలు, రంగాలంకరణ వస్తువులు కావ ల్సినవన్నీ అతనే ఇస్తాడు." అన్నాడు మలంకీ.

ఒకవారం గడిచింది. బ్లిమ్ ప్రదర్శనంలో ఏవిధంగా పాల్గొ నేదీ ఇగోర్ కమిటీ సభ్యులముందు వివరించి చెప్పాడు. అది విని మలంకీ ఆశ్చర్యపోయాడు. తక్కిన సభ్యులు సంతోషించారు.

ప్రదర్శనలలో ఎవరెవరు పాల్గొనవలసిందీ, ఏఏ ప్రదర్శనలు ఇవ్వవలసిందీ కమిటీవారు నిర్ణయించుకున్నారు. ఒకవంక ఉత్సవా లకు సన్నాహాలు సాగుతున్నాయి. మరొకవంక ఫ్యాక్టరీ నిర్మాణ సన్నాహాలు ఒక కొలికికి వస్తున్నాయి. ఒకనాడు కొత్తఫ్యాక్టరీకి శంఖుస్థాపన జరిగింది. పూలతోట కెదురుగా ఆటస్థలంలో పునా దులు త్రవ్వడం మొదలుపెట్టారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో నుంచి ఇటుకబండ్లు కాలనీకి తెరిపిలేకుండా వస్తున్నాయి. శంఖు స్థాపన సమయంలో క్రుట్జర్ ఇంజనీర్ ఒర్లునోవ్ ప్రభృతులు హాజరయ్యారు. క్రుట్జర్ తనవెంట వచ్చిన స్నేహితులకు కాలనీ అంతా చూపించాడు. ఒర్గునోవ్ మాత్రం జకరోవ్ కార్యాల యంలో అతనితో మాట్లాడుతూ ఉండిపోయాడు. కొంతసేపటికి ఒర్గునోవ్ ఇలా అన్నాడు :

"శంఖుస్థాపన జరిగిందంటే సంబరంకాదు. కామ్రేడ్ జక రోవ్ ! నేనొకమాట అడుగుతాను. ఏమీ అనుకోకేం ?"

"ఏమీ అనుకోను - అడగండి." అన్నాడు జకరోవ్.

"మీ యువకులు ఇప్పుడు కట్టబోయే ఫ్యాక్టరీని నిజంగా నిర్వహించగలరా ?"

"ఆ, చక్కగా నిర్వహిస్తారు."

"ఓ, అలాగా ! సరే, పద. శంఖుస్థాపనోత్సవం మొదలవు తున్నది కాబోలు !" అంటూ లేచాడు ఒర్లునోవ్.

శంఖుస్థాపన చేసేచోట పిల్లలంతా ఉల్లాసంగా నిలుచుని ఉన్నారు. ఒర్లునోవ్ పునాదులచెంత నిలుచున్నాడు. అతన్ని చూచి క్రుట్జర్ ఇలా అడిగాడు :

"నీకు నచ్చిందనుకుంటాను ?"

"ఆ, పునాదులు చక్కగా తీశారు." అన్నాడు ఒర్లునోవ్.

నేలపై పలకరాళ్ళమీద శంఖుస్థాపన చేసినవారి పేర్లు వివరంగా వ్రాశారు. సోవియట్ ప్రభుత్వ ప్రతినిధులుగా, కాలనీలో అందరికంటె చిన్నవాడు వాన్యా, అందరికంటె పెద్దవాడు క్రుట్జర్ శంఖు స్థాపన చేశారు. వారి పేర్లక్కడ లిఖించబడ్డాయి.

ఆ వేళ రాత్రి పదిగంటలనుంచీ పన్నెండు గంటలదాకా వాన్యా కాపలాచేసే డ్యూటీలో ఉన్నాడు. రాత్రి పదిగంటలయ్యేసరికి కాలనీ అంతా మాటు మణుగుతుంది. అరగంటబోతే ఎవరి పక్కలమీద వారు వాలినిద్దర్లుపోతారు. వాన్యా ఒవర్ కోటు వేసుకున్నాడు. బెల్టు బిగించుకున్నాడు. చేతిలో రైఫిల్ మధ్య మధ్య పైకెత్తుతూ గస్తీ తిరుగుతున్నాడు.

రాత్రి పదకొండున్నరయింది. జకరోవ్ తన ఆఫీసుపని ముగించుకుని బయటికొచ్చాడు. కాపలాకాస్తున్న వాన్యాను చూచి ఇలా అన్నాడు :

"నీకు నిద్ర రావడంలేదా ?"

"తెల్లవారేదాకా నన్నిక్కడ కాపలా కాయమన్నా కాస్తాను !" అన్నాడు వాన్యా.

"అలా ఉండాలి హుషారంటే ! సరేకాని, నీతరువాత ఎవరిది వంతు ?"

"బిగోనక్ ది."

"అయితే రేపు బిగిల్ ఊదే వాళ్ళెవరు ?"

"ఫెట్కా."

"అయితే సరే" అంటూ జకగోవ్ వెళ్ళిపోయాడు.

పదినిముషాలసేపు గడిచింది. సింహద్వారం తెరుచుకుంది. ఎవరో మనిషి ఇవతలికొచ్చాడు. కళ్ళు తళ తళ మెరుస్తున్నాయి. ఆ మనిషి వాన్యావంక అనుమానంగా చూచాడు.

"నేను, నేనేరా! కులాసాగా అలా బస్తీకెళ్ళి కుషీచేసి వస్తున్నారా" అన్నాడామనిషి.

ఆ మనిషి రైజికోవ్! వెనకాలేవచ్చి వాన్యా భుజం తట్టి ఇలా అన్నాడు:

"రాసుకో, నీ రిపోర్టులో రాసుకోరా. నాకేం లెక్కలేదు. నీవేం రాసుకున్నా నాకొకటే. రాయరా. రాయవేం? నేచెబుతా. ఇలా రిపోర్టు రాసుకో. 'రైజికోవ్ మూడుగంటలు లేటుగా వచ్చాడు. పోయి నీ అబ్బతో చెప్పుకోమంటున్నాడు.

రైజి కోవ్ మేడమెట్లెక్కాడు. నాలుగు మెట్లెక్కి తూలి పడబోయాడు. కాని గోడ పట్టుకుని నిభాయించుకున్నాడు. అతని వాలకం చూచి వాన్యా భయపడ్డాడు. అంతలో బిగోనక్ దుస్తులు వేసుకుని తన డ్యూటీకి వచ్చాడు. వాన్యా రహస్యంగా అతనితో ఇలా అన్నాడు:

"రైజికోవ్ బస్తీలో మస్తుగా తాగి ఇప్పుడొచ్చాడు!"

"రైజికోవ్? తాగాడా?"

"అవును. ఒళ్ళూపై తెలీకుండా తాగాడు. ఆ తూళుడులో ఎక్కడ పడతాడో అనిభయపడ్డాను."

"ఇహ ఈసారి వాణ్ణి దయదలచరులే. బయటికి గెంటి తీరుతారు."

"నేను తాగడం ఎవరు చూచారని రైజికోవ్ అడిగితే?"

"అందుకే రేపు నీ డ్యూటీలో ఉన్న కమాండర్‌కు ఈ విషయం రిపోర్టు చెయ్యాలి" అన్నాడు బిగోనక్.

నా మాట అబద్ధమని రైజికోవ్ అంటే అప్పుడూ? అని మళ్ళీ అడిగాడు వాన్యా.

"అలా దబాయించడం వాడి తరంకాదు. నీ రిపోర్టుకు తరుగుండదు. తెలిసిందా?" అన్నాడు బిగోనక్.

# 14
# మార్పు

నవంబరు నెలాఖరున మంచు కురవడం మొదలవుతుంది. అప్పుడిక పిల్లల ఆనందానికి మేరఉండదు. కాలనీలో పిల్లలు మరింత ఉత్సాహ పడుతున్నారు. పార్కులో మంచుబంతులతో పిల్లలు ఆడుకుంటారు. మంచుతో ఇళ్ళు కట్టుకుంటారు. కాని ఈ ఏడు అనుకున్నంతగా మంచు కురవడంలేదు. కురిసిన మంచు ఇళ్లు కట్టుకోడానికి సరిపోవడంలేదు. అంచాత పిల్లలు కోనేట్లో ఏమైనా ఎక్కువ మంచు పేరుకుంటుందేమోనని ఆసపడసాగారు. కానిచివరకు అక్కడకూడా చాలినంత మంచు పేరుకోలేదు. * స్కేటింగ్‌లో మిహాగోంటార్ ఘటికుడు. స్కేటింగ్‌కు అవసరమైన సాధనాలను అతను స్వయంగా తయారు చేయగలడు.

ఒక్కొక్క దళానికి మూడు జతల స్కేటింగ్ సాధనాలను పంచిపెట్టారు. ఇవికాక పాతసభ్యులదగ్గర స్వంతసాధనాలు కొన్ని ఉన్నాయి. ఫిల్కాషేరీకి రెండు జతలున్నాయి.

కోనేట్లో నీరు గడ్డ కట్టలేదు. నీళ్ళల్లో వేసవికాలంలోలాగా ఆకాశం ప్రతిబింబిస్తూనే ఉంది...

---

* ఇదొక ఆట. మంచుబూట్లు వేసుకుని మంచుమీద ఒకానొక సాధనాన్ని సహాయం చేసుకుని జర్రున జారుతూ ఆడుకుంటారు— అనువాదకుడు.

ఇగోర్ కు కాలనీ సభ్యత్వం లభించినప్పటినుంచీ ఎంతో పరిశుభ్రంగా ఉండడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇప్పటిదాకా తను పెంచుకున్న గడ్డాలు, మీసాలు ఇహ తీసేసుకోవాలనుకున్నాడు. తానలా బైరాగిలా జుట్టు పెంచుకోవడం చూచి చిన్నపిల్లలు అపహాస్యంచుకుంటున్నారు, అదీకాక ఇలాంటి వెర్రివికారాలు రోడ్నేవ్ కు అసలు గిట్టవు. అతను డ్యూటీలో ఉండే పిల్లలంతా గడగడలాడతారు. శుభ్రంగా ముస్తాబులై వస్తారు.

## మొదటి నాలుగునెలలకూ కార్యక్రమం

లోహపు కార్మికులు:

నూనెపాత్రలు... ... ... ... ... ... : 2,35,000

235000 రూబుళ్ళు

వడ్రంగి పనివారు :

పాఠశాల భవనంలోకి కావలసిన

వ్రాతబల్లలు ... ... ... ... ... ... 1400

డ్రాయింగు బల్లలు... ... ... ... ... ...1250

కుర్చీలు ... ... ... ... ... ... ... ...1450

స్టూలుస ... ... ... ... ... ... ... ...1450

1,80,000 రూబుళ్ళు

దుస్తుల షాపు :

షాట్టి-చొక్కాలు... ... ... ... ... ...25000

పంట్లాములు... ... ... ... ... ... ...8870

కొమ్సోమోల్ యూనిఫారాలు...... 3350

క్రీడా దుస్తులు ... ... ... ... ... ... 4700

7,0000 రూబుళ్ళు

మొత్తం 485000 రూబుళ్ళు

రోడ్నేవ్ కమాండర్లందరిలోకీ చిన్నవాడు. కాని చాలా తెలివైనవాడు. కాలనీలో జరిగిన మొదటి నాలుగు నెలలలో జరగ వలసిన కార్యక్రమాన్నీ అతనొక ప్రణాళిక తయారుచేశాడు దాన్ని అందరికీ అగుపించేలా భోజన శాలముందు గోడకు వ్రేలాడగట్టాడు. ఆ ప్రణాళికలోని వివరాలు పై పట్టికలోనివి:

ఈ ప్రణాళిక అమలుపరచడం సులభమైన విషయంకాదు. అయినా దీన్ని జయప్రదం చేయాలని కాలనీసభ్యులు పట్టుదల తోను, ఉత్సాహంతోను ఉన్నారు. ఈ ప్రణాళిక జనవరి ఒకటో తేదీనుంచి అమలులోకి వస్తుంది. ఇహ తాము కులాసాగా షికార్లు చేస్తూ గడపడానికి వీలులేదని కాలనీసభ్యులు గ్రహించుకున్నారు. కొత్త కొత్త అనుభవాలను, ఆనందాలను తెచ్చి పెడుతుందని నాలుగోదళ సభ్యులకు తెలుసు. సాయంకాలం వేళ రోజూ కొమ్మో సల్ సమావేశాలు జరుగుతున్నాయి. బ్లమ్‌ను అందరూ అనేక విధాలుగా ప్రశ్నిస్తున్నారు. ప్రణాళికను ఎలా విజయవంతం చెయ్యాలో బ్లమ్ వారికి వివరిస్తున్నాడు. కాలనీ చరిత్రలో నూతన అధ్యాయం మొదలైంది. ఒకనాటి సమావేశంలో బ్లమ్ సభ్యుల కొక వార్త చెప్పాడు:

“ఇన్నాళ్లుగా మీరడుగుతున్న అచ్చుదిమ్మలు ఇవాళే వచ్చాయి.”

“ఇన్నాళ్ళకా!” అన్నాడు ఒక సభ్యుడు.

“ఇవాళ తారీకెంత?” అని ప్రశ్నించాడు మరొక సభ్యుడు.

“డిసెంబరు మూడు!” అని కేకలు వేశారు పిల్లలు.

“ఏమిటా కేకలు? తేదీతో మీకేమిటి పని? మీరడిగినవి వచ్చాయా లేదా? అది చూచుకోండి.” అని గద్దించాడు బ్లమ్.

కాలనీ సభ్యులంతా చప్పట్లు కొడుతూ కిలకిల నవ్వారు. సంతోషంతో వారి ముఖాలు విప్పారాయి.

“విన్నారా కామ్రేడ్స్! మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను. ఫ్యాక్టరీకోసం మీరు నన్ను ఏంచేయమన్నా చేస్తాను.” అని వాగ్దానం చేశాడు బ్లమ్.

బ్లమ్ నోటివెంట ఈమాట వెలువడగానే సభ్యులంతా మళ్ళీ కరతాళధ్వనులు కావించారు. జకరోవ్ కూడా పట్టరాని ఆనందంతో పొంగిపోయాడు. అందరితోపాటు తనూ చప్పట్లు చరిచాడు బ్లమ్. ఈ సమావేశం రైజికోవ్‌కు అందరికంటె ఎక్కువ ఉత్సాహం కలిగించింది. అచ్చుదిమ్మలు ఎప్పుడెప్పుడొస్తాయా అని ముఖ్యంగా అతను ఇన్నాళ్ళబట్టీ ఎదురు చూస్తున్నాడు. గడిచినమాసంలో అతనికి అన్నీ దురదృష్టకరమైన సంఘటనలే సంభవించాయి. లెవిటెన్ ఆడపిల్లలమీద తప్పుడు రాతలు రాశి, చీట్లు పుస్తకాల్లో పెట్టడం, అందుకు చీవాట్లు తినడం, తనుకూడా ఈ అసభ్యకరమైన పనుల్లో అంతో ఇంతో పాలు పంచుకోవడం సంభవించింది. రస్లాన్‌తో తనకు స్నేహం చెడిపోయింది కూడా. తనతో ఇహ మాట్లాడవద్దని నిర్మొహమాటంగా చెప్పి రస్లాన్ విడిపోయాడు. వీటికంటె మరో ముఖ్యమైన సంఘటన—ఆనాడు అర్ధరాత్రి, తాను బస్తీనుంచి తప్పతాగి కాలనీకి రావడం, గస్తీతిరుగుతున్న వాన్యాతో బూతులు మాట్లాడడం; ఇదంతా కమాండర్‌కు తెలిసిపోయింది. తాను కమాండర్ల కౌన్సిలుముందు తల వంచుకుని నిలుచోవలసి వచ్చింది. అప్పుడు తనను జిరియాన్‌స్కీ ఇలా మందలించాడు:

"రైజికోవ్! మనిషిలా బ్రతకడం నేర్చుకో. ఇష్టం వచ్చినట్టు తాగి తందనాలాడితే నీవే పాడైపోతావు. జాగర్త!" అంతటితో పోనీయక ఇంకా బాధ కలిగేటట్టు, వ్యంగ్యంగా ఇలా అన్నాడు కూడా: "రైజికోవ్ మంచి బేరగాడు లెండి! సారాయి కంటపడితే చాలు, వదిలిపెట్టి పోడు. చవగ్గా కొట్టేస్తాడు. కాని మీరు కొంచెం ఓపిక పట్టాలి. అతని మంచిమాటకారి. 'మాటలకేంలే, మప్పితే చిలకకూడా పలుకుతుందిలే' అంటారేమో మీరు. కాని చిలకకూ ఇతనికి తేడా ఉన్నది. చిలక తాగదు, రైజికోవ్ తాగుతాడు."

ఆనాటినుంచీ తాను మద్యం ముట్టుకోనని రైజికోవ్ ఒట్టు పెట్టుకున్నాడు. ఒట్టుఅయితే పెట్టుకున్నాడు కాని అది రైజికోవ్ నిలబెట్టుకోలేడని వాన్యాకు తెలుసును. వాన్యా ఇలా అన్నాడు :

"అలాంటి జీవితానికి రైజికోవ్ ఏనాటినుంచో అలవాటు పడ్డాడు. అతన్ని మీరు శిక్షించి లాభంలేదు. గతాన్ని పూర్తిగా మాపుచేసుకోవడం ఎవరికైనా కష్టమే. క్రమేణా అతనిలో మార్పు రావలి."

కమాండర్ల కౌన్సిలు ఏమి నిర్ణయం చేయకుండానే ఆనాడు రైజికోవ్‌ను పంపించివేశారు.

"అన్నమాట నిలబెట్టుకుంటావో లేదో చూస్తాంగా." అని మాత్రం అన్నారు కమాండర్లు.

ఆనాటినుంచీ రైజికోవ్‌లో గొప్పమార్పు వచ్చింది. ఎవరితోనూ అనవసరంగా మాట్లాడడంలేదు. కాలం వ్యర్థం చేయడం లేదు. ఎప్పుడూ తన పనిలోనే నిమగ్నుడై ఉంటూవచ్చాడు. అతని నేర్పును, చాకచక్యాన్ని చూచి బ్లమ్ ఆశ్చర్యపోయాడు. 'అందరూ రైజికోవ్‌లా శ్రమిస్తే మనం ఏడాదిలో మూడు లక్షలేకాదు, మూడు కోట్లు గడిస్తాం!' అన్నాడు బ్లమ్.

# 15
# వార్షికోత్సవం

కాలనీ వార్షికోత్సవాలు అద్భుతంగా మొదలైనాయి. నగరవాసు లనేకమంది ఆ ఉత్సవం చూడవచ్చారు. ఎక్కడ చూచినా ఉత్సాహం, ఆనందం అగుపిస్తోంది. కాలనీ ముందు రోడ్లన్నీ శుభ్రంచేసి, అలంకారాలు చేశారు. తోరణాలు, పతాకాలు కట్టారు. రంగు రంగుల విద్యుద్దీపాలతో ఆర్చిలు తీర్చి కన్నులపండువుగా అలంకరించారు. అవ్వాయి చువ్వాలు, టపాకాయలు,

చిచ్చుబుడ్లు పేల్చారు. దీపాల గుమ్మటాలు కట్టి ఆకాశంలోకి ఎగుర వేశారు. వేడుకలు ముగిశాక విందులు ప్రారంభమైనాయి. అనేక మంది అతిథులు, చిన్న కార్లమీద కాలనీకి వచ్చారు. కాలనీ కుర్రాళ్ళు వచ్చిన పెద్దలందరికీ స్వాగతమిచ్చారు. వారికి తమ పాఠ శాలలు, పడకగదులు, భోజనశాలలు, పఠనమందిరాలు, పార్కులు క్రీడాస్థలాలు అన్నీ చూపించారు. తమ కాలనీ కార్యక్రమాలను గురించీ, కాలనీ సాధించిన అభ్యుదయాన్ని గురించీ వారికి వివ రంగా చెప్పారు. తాము కొత్తగా కట్ట సంకల్పించుకున్న ఫ్యాక్టరీని గురించీ, నూతన ప్రణాళికను గురించీ, ఉత్పత్తిని గురించీ వివరిం చారు.

ఆనాటి వినోద కార్యక్రమాల్లో అతిప్రధానమైనదీ, అంద రినీ ఆకర్షించినదీ నాటకప్రదర్శనం. నాటకం పేరు. 'ఫస్టు ఆఫ్ మే కాలనీ సభ్యులతో యూరప్ యాత్ర' ఈ నాటకంలో ప్రధానపాత్ర ఫిల్కా-పేరీ ధరించాడు. వాన్యా గల్చెంకో కూడా ఒక వేషం వేశా డుగా? అది అంత పెద్ద వేషం కాదు. పేరీ 'మాగ్డెనాల్డు' పాత్ర ధరించి వ్యంగ్యంగా నటించాడు. ప్రదర్శన బాగా రక్తి కట్టింది.

నాటకం మొదట్లో వేషధారులంతా రంగస్థలంమీద వరు సగా నిలుచున్నారు. అందరి చేతుల్లోనూ టార్చిలైట్లున్నాయి. రంగస్థలంమీద దీపాలు ఆరిపోయాయి. నటులంతా ఒక రైలు బండిలా విన్యాసం తీర్చారు. రైలుబండి 'యూరప్ యాత్ర'కు బయలుదేరింది. యాత్రలో మధ్యమధ్య కొన్ని దేశాల్లో రైలు బండి ఆగింది. ఆయా దేశాల నియంతలను, అధినేతలను యాత్రీ కులు కలుసుకున్నారు. ఆ అధినేతల్లో మార్షల్ పిల్సూడిస్కీ, ముస్సోలినీ, మాగ్డొనాల్డు ప్రభృతులున్నారు. వారు తమ ఘనత లను యాత్రీకులు ఒప్పుకున్నారు. కాని యాత్రీకులకు పశ్చిమ రాజ్యాల అధినేతల డాంబీక వ్యవహారాలన్నీ తెలుసును. అంచాత వారు అంతగా మెచ్చుకోలేకపోయారు.

తరువాత రంగస్థలంమీద హఠాత్తుగా బ్లమ్ ప్రత్యక్ష మయ్యాడు. చక్కని గోధుమరంగు సూటు వేసుకున్నాడు. అతను

రాగానే ప్రేక్షకులు కరతాళ ధ్వనులు కావించారు. శాంకోజోరిన్ ఇలా ప్రకటన చేశాడు.

"సభ్యులారా! ఇప్పుడు కామ్రేడ్ బ్లమ్ 'బోరిన్ గొడినేవ్' అనే కావ్యంనుంచి కొన్ని భాగాలు చదివి అభినయించి మీకు చూపుతాడు. ఈకావ్యం రచించింది మహాకవి పుష్కిన్. దీన్ని మన ఇగోర్ చెర్నియావిన్ మన పరిస్థితులకు అనుకూలంగా అనువర్తింప చేశాడు."

ఈ ప్రకటన విని ముందు కూచున్న క్రుట్జర్ ఆశ్చర్యపోయాడు. తన చెవులను తానే నమ్మలేకపోయాడు.

"ఏమిటిదంతా! ఇదంతా నిజమేనా? పుష్కిన్ కావ్యాన్ని ఇగోర్ అనువర్తింపచేశాడా? అచ్చా! ఎంతచిత్రం!" అన్నాడు జకరోవ్ చెవిలో,

బ్లమ్ కనుబొమలు కుంచింపచేసి ఒక భంగిమ పెట్టాడు. అతనిముఖం గంభీరముద్ర వహించింది. ఇలా! గానం చేయడం మొదలుపెట్టాడు:

"అధికారమునకు వచ్చి నేను
ఆరు మాసములే అయింది!

అహరహం అభ్యుదయానికి
అంకితం చేశాను కాలం!

కాని ఆరునెలలు గడిచినవో లేదో,
ఇట్టే దాపురించింది నా కశాంతి!
లేదు నాకు సంతుష్టి, కలదు నాకిక దృష్టి!

సమిష్టిగా అందరూ సాగించాలి కృషి
అప్పుడవుతాడు మానవుడు ఋషి!
అదే నా దృష్టి, అదే నాకు సంతుష్టి!"

పాట వినగానే ప్రేక్షకుల్లో చాలామంది లేచి నిలుచున్నారు. కొందరు కళవళ పడ్డారు. మరికొందరు ఆనందించారు.

జకరోవ్ ప్రక్కనే కూచున్న ఉపాధ్యాయిని వాసిల్యోవ్నా కలలో నవ్వుతున్నట్టు కిలకిల నవ్వింది. జకరోవ్ చెవులు రెండూ అప్పగించి పాట వినసాగాడు. క్రుట్జర్, దృష్టంతా రంగస్థలంమీదనే ఉంచి తదేకంగా చూడసాగాడు. బ్లమ్ విషాదంగా పాట మొదలు పెట్టాడు:

"ఫ్యాక్టరీ కార్మికుల సౌఖ్యం
అదే ఎల్లప్పుడూ నాకు ముఖ్యం!

అందుకోసం చేశాను శాయశక్తులా ప్రయత్నం
తెచ్చాను పనిముట్లు, ఇచ్చాను యంత్రాలు
వేశాను పథకాలు, నేర్పాను పనివిధాలు!

ఎన్ని ఇచ్చినకాని, ఎంత నేర్పినకాని
మెచ్చరు కుర్రాళ్ళు, నచ్చరు పనివాళ్ళు!

నామీద కోపాలు, నాపైన తాపాలు
ఎందుకో ఈ బుసబుసలు!
ఎందుకో ఈ రుసరుసలు!!"

కాలనీ సభ్యులు కరతాళధ్వనులు కావించారు. బ్లమ్ మళ్ళీ పాడసాగాడు. మళ్ళీ ప్రేక్షకుల ఆనందం, కరతాళధ్వనులు.

"ఉరుమురిమి మంగలిపై పడినట్లు
ఫ్యాక్టరీలో ఏం జరిగినా నాకే అగచాట్లు!

క్రుట్జర్ మరీ పగలబడి నవ్వాడు. జకరోవ్‌తో ఇలా అన్నాడు:

"ఇగోర్ భలేబాగా దీన్ని అనువర్తన చేశాడే!"

బ్లమ్ ముఖం తుడుచుకున్నాడు. అతని బట్టతల వింతగా తళతళ లాడింది. ఒక చెయ్యి ముందుకు చాపుతూ ప్రేక్షకులనుద్దేసిస్తూ ఇలా అన్నాడు:

"పాట అయిపోవచ్చింది. కొంచెం నిశ్శబ్ధంగా వినండి."

కాలనీ సభ్యులు గంభీరంగా వినసాగారు. బ్లమ్ రెండడుగులు ముందుకు వేసి, గుండెలమీద చేతులు పెట్టుకున్నాడు. ఆకసం వంక చూస్తూ మళ్ళీ ఇలా పాడాడు:

"బ్లమ్ ఎంతచేసినా వ్యర్థం
బ్లమ్ మెదడంతా ఆలోచనల సమ్మర్థం!
వేగిపోతున్నాడు, ఊగిపోతున్నాడు పాపం!
కాని, సమిష్టిలాభం అతని ధ్యేయం
అదే అతను పాడే గేయం!!"

బ్లమ్ పాటముగించి రంగస్థలంమీద సమ్రతతో నిలుచున్నాడు, ప్రేక్షకులలోనుంచి మళ్ళీ కరతాళధ్వనులు వినిపించాయి. బ్లమ్ వారికి అభివాదంకావించాడు. తెరజారింది.

విరామ సమయంలో బ్లమ్ ప్రేక్షకుల్లోకివచ్చి కూచున్నాడు క్రుట్జర్ అతనితో కరస్పర్శకాలించి అభినందించాడు.

విరామం ముగిశాక ఈసారినృత్యం మొదలైంది. బ్లమ్మళ్ళీ లోనికివెళ్ళి వేషధారణచేసి రంగస్థలంమీదికి వచ్చాడు. యుక్రేనియన్ కోసక్కు దుస్తులు వేసుకున్నాడు. ఆవేషంలో అతనెంతో ముచ్చటగా ఉన్నాడు. ఒకాస్సనాకూడ చక్కగా ముస్తాబు చేసుకుని రంగభూమిమీదికి వచ్చింది. సన్నగా, తీగెలా ఉంది. బ్లమ్, ఒకాస్సనాతోకలిసి నృత్యం ప్రారంభించాడు. వారిరువురూ కలసి లయ తప్పకుండా అడుగులువేస్తూ, కోసక్కునృత్యంచేస్తుంటే ప్రేక్షకులు మంత్రముగ్ధుల్లా చూడసాగారు.

ప్రేక్షకులకర తాళధ్వనులమధ్య నృతం ముగిసింది.

# 16

# చోరీ

ప్రదర్శన అయిన మరుసటిరోజు ఇగోర్ చెర్నియావిన్ మామూలుగా ఉదయాన్నే లేచాడు. కాలకృత్యాలు తీర్చుకున్న తరువాత తన ఓవర్‌కోటు కోసం వెదుక్కున్నాడు. కాని వంకీకి తగిలించినకోటు ఎక్కడా అగుపించలేదు. మిషాగోంటార్, వంకీకి ఉన్న తనకోటు తొడుక్కుంటున్నాడు.

"మిషా! నా కోటు ఎవరో కొట్టేశారోయ్!" అన్నాడు ఇగోర్.

"కొట్టేయడమేమిటి?" అని ఆశ్చర్యపోతూ అడిగాడు మిషా.

"చూడుమరి గమ్మత్తు, వంకీకి తగిలించిన కోటు మటు మాయమైంది!"

"పొరపాటున ఎవరో తొడుక్కుని పోయిఉంటారు. కొంచెం నిదానంగా చూడు."

భోజనాలయిన తరువాత విరామసమయంలో ఇగోర్ అన్ని కోట్లూ పరిశీలించి చూచాడు. తన నెంబరున్న కోటుమాత్రం కనిపించలేదు. ఈ విషయం డ్యూటీలో ఉన్న కమాండర్ బ్రాట్‌సన్‌కు తెలియచేశాడు ఇగోర్.

"అయితే ఎవరో దొంగిలించారంటావా?" అని ప్రశ్నించాడు కమాండర్ బ్రాట్‌సన్.

"ఏమోమరి. దుస్తుల గదంతా కలయచూచాను. కోటు కనుపించలేదు."

"మళ్ళీ ఒకమాటు జాగ్రత్తగాచూడు. అదే కనుపిస్తుంది."
అంటూ బ్రాట్‌సన్ వెళ్ళిపోయాడు.

అందరూ ఎవరిపనులకు వారు పోయారు. డ్యూటీలు అయి పోయిన తరువాత విశ్రాంతి సమయంలో బ్రాట్‌సన్ మళ్ళీ వచ్చి ఇగోర్‌ను ఇలా అడిగాడు:

"కోటుజాడ ఏమైనా తెలిసిందా?"

"లేదు."

"నాలుగోదళ సభ్యుడు నోవక్ కోటుకూడా ఇలాగే గల్లంతయింది?"

"అదికూడా ఎవరో దొంగిలించారంటారా?"

దీనికి బ్రాట్‌సన్ ఏమీ జవాబు చెప్పలేదు: కారణం దొంగతనం జరగదని తన ఉద్దేశం.

యథాప్రకారంగా ఆనాటి సాయంకాలం బ్రాట్‌సన్ తన రిపోర్టును డైరెక్టర్‌కు అందజేశాడు:

"కామ్రేడ్ డైరెక్టర్! దుస్తులగదిలో చోరీ జరిగింది! ఇగోర్, నోవక్‌ల ఓవర్‌కోట్లు కనిపించకుండా పోయాయి!" అన్నాడు.

రిపోర్టు విని జకరోవ్ ఏమీ చలించినట్లు కనుపించలేదు.

"మంచిది," అంటూ శ్యాల్యూట్ చేశాడు.

కాని ఆనాటి సాయంకాలం వాతావరణం ఎప్పటిలాగా లేదు. రోజూ రిపోర్టు వింటున్నప్పుడు కాలనీ పిల్లలు సంతోషంగా ఉండేవారు. ఇప్పుడు ఎవరి ముఖంలోనూ కళ, కాంతులు లేవు. జకరోవ్ కుర్చీలో కూచుని ఫైళ్ళు తిరిగేస్తున్నాడు. చుట్టూ కుర్రాళ్ళు కూచుని ఉన్నారు. చోరీ మాట వినగానే నెస్ట్రెంకో సహితం ఆశ్చర్యపోయాడు. బ్రాట్‌సన్‌ను ఇలా మెల్లగా అడిగాడు:

"నీ కెవరిమీద అనుమానంగా ఉంది?"

నెస్ట్రెంకో మెల్లగా అడిగినా అది అందరికీ వినిపించింది. వస్తువు పోయింది, దొంగ కనుపించడు. దొంగ ఎవరో, దొర

ఎవరో కనుక్కోడం బ్రహ్మకైనా తరంకాకుండా ఉంది. కాని అప్పుడు డ్యూటీలో ఉన్నవాడు బ్రాట్‌సన్. నెస్ట్రెంకో వేసిన ప్రశ్నకు అతను ఏదో ఒక జవాబు చెప్పాలి. కొంచెం ఆలోచించి అతనిలా అన్నాడు:

"కోట్లు ఎలాపోయాయో ఎలా చెప్పడం? రాత్రి డ్యూటీలో ఉన్న కాపలావాళ్ళు నలుగురు. వాళ్ళు కాలనీ సభ్యులే. లొబోయికోవ్, గ్రాచోవ్, సులోవ్యోవ్, టోవెంకోవ్‌లు—వీళ్లు నలుగురూ రాత్రి కాపలాకాశారు. నలుగురూ మా నాలుగో దళంలో సభ్యులే. వీళ్ళంతా బుద్ధిమంతులు. అందుకేం సందేహం లేదు. కాపలా కాస్తున్నప్పుడు ఈగనైనా లోపలికి చొరనివ్వరు. వెయ్యి కళ్ళతో చూస్తుంటారు. దుస్తుల గదిలో దొంగ ప్రవేశించాలంటే, వాడు వాళ్ళకంటపడి తీరాల్సిందే. నాకు ఒక్కటే అనుమానంగా ఉంది. గది వెనకాల కిటికీలోనుంచి ఎవరైనా దూరారా అని——కాని అలా దూరాలన్నా చాలాకష్టమే. ఎంతో నేర్పరి అయితేకాని ఆ పని చెయ్యలేడు."

జకరోవ్ తన ఫైళ్ళు తిరగేసుకుంటూనే ఇలా అన్నాడు:

"రాత్రి కాలనీలోనుంచి ఎవరైనా బయటికి వెళ్ళారా?"

"లేదు కాని జిరియూన్‌స్కీ మాత్రం బస్తీనుంచి పదకొండు గంటలకు కాలనీకి వచ్చాడు. అతను మీ అనుమతిమీదనే నగరానికి వెళ్ళాడు. ఒకకోటు పోయినట్టయితే ఎక్కడో మరిచిపోయి ఉండవచ్చునని అనుకోవచ్చు. కాని రెండు కోట్లు పోయాయి! అందులోనూ ఆ రెండుకోట్లూ ఒకే దళానికి చెందిన కుర్రాళ్ళవి కావు. ఇగోర్ దళంవేరు. నోవక్ దళం వేరు." అని చెప్పాడు బ్రాట్‌సన్.

జకరోవ్ కొంత తడవు ఆలోచించి టార్‌స్కీని పిలిచి వెంటనే కౌన్సిలు సమావేశం ఏర్పాటు చెయ్యమని ఆదేశించాడు. వెంటనే గదిలోనుంచి అంతా వెళ్ళిపోయారు. కమాండర్లు

మాత్రమే అక్కడ ఉండిపోయాడు. టార్‌స్కీ గది తలుపులు బిగించి వచ్చి కూచున్నాడు.

విషయమంతా విన్నారు కదా. మీమీ అభిప్రాయా లేమిటో చెప్పండి" అన్నాడు జకరోవ్.

టార్‌స్కీ ఇలా చెప్పసాగాడు:

"ఎవరు దొంగిలించారో చెప్పడం కష్టం. వస్తువు ఒకచోట ఉంటుంది, అనుమానం మరొకచోట ఉంటుంది. ఇది సాధారణ మైన విషయం. ఆధారలేమీ లేకుండా ఒకమనిషిని అనుమా నించడం మంచిదికాదు, అపాయంకూడా. నా దృష్టిలో అనుమా నించ దగ్గవాళ్ళు పందొమ్మిదిమంది లెక్క తేలారు. వాళ్ళల్లో మాటవరుసకు దొంగ ఉన్నాడనుకుంటే ఒక్కడేకదా ఆ దొంగ. అందుకోసం తక్కిన పద్దెనిమిది మందినీ అనుమానించి అవమా నించడం న్యాయం కాదుకదా. అంచాత మనం ప్రతివాణ్ణీ నీవు దొంగిలించావా, నీవా, నీవా? అని అడగడంవేరు."

"అవును. అలా ఎవర్నీ అడగకూడదు." అన్నాడు జక రోవ్.

"అదే నేనూ అంటున్నది" అన్నాడు టార్‌స్కీ.

జిరియాన్‌స్కీ తన అభిప్రాయం ఇలా చెప్పాడు: "ఈ విషయం నేనిలా అర్థం చేసుకుంటున్నాను. మొదటిది, రాత్రి మాత్రం కోట్లుపోయి ఉండవు. కాని ఉదయాన్న అందరూ ఎవరి కోట్లు వారు తొడుక్కుంటున్నప్పుడు అవి పోయి ఉండాలి. దొంగ అయిన వాడు ఎవరికోటో తను వేసుకునిపోయి అథవా ఎవరైనా ఇదేమి అని అడిగితే పొరపాటున తొడుక్కున్నానని ఈపని చేసి ఉండాలి."

"కాని పోయింది ఒకకోటు కాదే, రెండుకోట్లు."

"అవును, నాకావిషయం తెలుసు. నోవాక్ కోటు అక్కడ వంకీకి మూడురోజులబట్టీ వ్రేలాడుతోంది. అతను కోటు తొడుక్కో

కుండానే తిరుగుతున్నాడు. ఆ కోటును మొన్ననే ఎవరో కొట్టేసి ఉండాలి!" అన్నాడు జిరియాన్‌స్కీ.

"నీవు చెప్పిన దాంట్లో కొంత నిజం ఉంది"అని నెస్త్రెంకో ఏదో చెప్ప బోతూఉంటే జిరియాన్‌స్కీ అతని మాటలకు అడ్డు వచ్చాడు :

"ఆగవయ్యా స్వామీ! నన్ను సాంతంచెప్పనీ. ఆకోటు కాలనీలోనే ఎక్కడో ఉండి ఉంటుంది. లేదా దాపులో ఉన్న ఏపల్లెటూరికైనా చేరిందో! పట్నానికి మాత్రం కోటు చేరిఉండదు. అక్కడ దొంగ ఇట్టే దొరికిపోతాడు."

అందరూ మౌనంగా వింటున్నారు. జిరియాన్‌స్కీ చెప్పింది బహుశా వాస్తవమే కావచ్చు. నెస్త్రెంకో అతని మాటలు విని కొంచెం అనుమానించాడు :

"నీవు చెప్పినదాంట్లో కొంత నిజం ఉన్నదనుకో. కాని గదిలో ఇగోర్ కోటు కుడిప్రక్కన ఉన్నది. నోవాక్ కోటు మరో ప్రక్కన ఉన్నది. ఎవరో దొంగ కోటు తొడుక్కుని బయటికిపోయి ఉంటాడని నీవంటున్నావు. అప్పుడతను దాన్ని బయటనే విప్పేసి, మళ్ళీ రెండో కోటుకోసం గదిలోకి వచ్చాడంటావా? పైగా రెండుకోట్లూ ఒకే సైజులో లేవు. ఇగోర్ సైజు వేరు. నోవాక్ సైజు వేరు. అంచాత నీవుచెప్పిన ప్రకారం జరిగితే ఇద్దరు దొంగలు వచ్చి ఉండాలి."

"అలా ఎప్పటికీ జరగదు." అన్నాడు ఒలెంకో.

"ఎందుకు జరగదూ?"

"కాలనీలో వాళ్లే కోట్లు దొంగిలించి ఉండాలి. అదేగా మీ అభిప్రాయం? అంచాత ఈపనిలో ఇద్దరు దొంగలులేరు, ఉంటే ఒకడే ఉండాలి." అన్నాడు ఒలెంకో.

"ఒలెంకో చెప్పింది రైటు, ఒక్కడేదొంగ. అదివాడెలా తస్కరించిందీ స్పష్టంగా మనం చెప్పలేం. బహుశా జిరియాన్‌స్కీ

చెప్పిన పద్ధతిలో కోట్లు మాయమై ఉండాలి. రైజికోవ్‌ను గురించి నీ అభిప్రాయము ఏమిటి ఒలెంకో?" అని అడిగాడు టార్‌స్కీ.

ఒలెంకో ఒక్క క్షణం ఆలోచించి ఇలా అన్నాడు:

"మా దళంలో అతనొక్కడే కాదు. అలా అనుమానించ దగ్గవాళ్ళు ఇంకా ఉన్నారు—గొరొఖోవ్, లెవిటిన్‌లు. కాని లెవిటిన్ ఈ మధ్య మంచివాడుగా ఉంటున్నాడు. ఆడపిల్లలమీద పిచ్చిరాతలు రాసినందుకు జకరోవ్ అతన్ని శిక్షించాడు కదా. దాని ప్రకారం ఒక నెలపాటు అతను తోట భాగు చేస్తుండాలి. ఇప్పుడా పనిలోనే అతను నిమగ్నుడై ఉన్నాడు. అందరినీ మెప్పించాలని రాత్రింబగళ్లు కష్టించి పనిచేస్తున్నాడు. అంచాత అతనీపని చేసి ఉండడు. ఇహ గొరొఖోవ్ విషయం—అతనిటీవల ఎప్పుడూ కొత్త ఫ్యాక్టరీని గురించే ఆలోచిస్తున్నాడు. మరో ధ్యానమే అతని కిప్పుడు లేదు. కనుక అతనిమీద కూడా నా కనుమానం లేదు."

"అవునులే. మరి రైజికోవ్ మాట?" అని అడిగాడు టార్‌స్కీ.

"రైజికోవ్ కొంచెం అలాంటివాడే అనుకోండి—కాని అతనికి కోట్లు దొంగిలించవలసిన అగత్యం లేదు. ఇప్పుడతను కాలనీలో అందరికంటె ఎక్కువ డబ్బు గడిస్తున్నాడు. గతవారం అతని రాబడి డెబ్బయి రూబుళ్ళు, యాభై రూబుళ్ళు సేవింగ్సు బ్యాంకులో వేసుకుని ఆ పుస్తకం దాచమని నాకిచ్చాడు. ఇప్పుడతనికి ఒకటే తపన—పనిచేసి ధనం సంపాయించడమే అతని లక్ష్యం. అలాంటప్పుడు అతనీపనెందుకు చేస్తాడు ? అదీకాక అతనీకాలనీకి కొత్తవాడు మరొకమనిషి తోడులేనిదే ఈ సాహసానికి దిగలేడు." అన్నాడు ఒలెంకో.

"అదెలా చెయ్యాలో రైజికోవ్‌కు తెలుసులే." అన్నాడు బ్రాట్‌సన్.

"కాదు కోట్లు ఇక్కడనుంచి బయటికి పంపడమంటే చాలా కష్టం" అన్నాడు నెస్త్రెంకో.

"మరి నీ అభిప్రాయమేమిటి లెవ్‌కా?" అని అడిగాడు టార్‌స్కీ.

"మా దళంలో నా కెవరిమీదా అనుమానం లేదు. అందరూ మంచివాళ్ళే." అన్నాడు రెండో దళం కమాండర్ పోర్షినేవ్.

"నీవలా హామీ ఇవ్వగలవా?" అని అడిగాడు టార్‌స్కీ.

"నేనెందుకివ్వాలి హామీ. ఎవరికివాళ్ళే ఇస్తారు. తాము మంచివాళ్ళమని రుజువు చేసుకుంటారు."

"సరే రెండోదళంలో ఎవరూ ఈ పనిచేసి ఉండరు." అన్నాడు నెస్ట్రెంకో.

ఇలా కమాండర్లందరూ ఈ పని ఎవరుచేసి ఉంటారని ప్రతి దళాన్నిగురించి వివరంగా చర్చించుకున్నారు. ఏ కమాండరూ ఏ దళసభ్యుణ్ణీ అనుమానించలేక పోయాడు:

"దళాల్లోని సభ్యులందరూ నీతి, నిజాయితీ కలవాళ్ళు. అందరూ తెలివైనవాళ్లు, బుద్ధిమంతులు." అన్నాడు చివరకు జకరోవ్.

కమాండర్ల ముఖాలు విప్పారాయి. జకరోవ్ లేచి నిలుచున్నాడు. కొంతసేపు ఆలోచించి ఇలా అన్నాడు.

"ఇది కాలనీకి రాకపూర్వం దొంగతనానికి అలావాటుపడ్డ కుర్రవాడెవడైనా పొరపాటున ఈపని చేసి ఉండాలి. మీరెవ్వరూ ఈ విషయం మీమీ దళసభ్యులతో చర్చించకండి. చోరీ జరగనట్టే ఊరుకోండి...విట్యా! రేపు ప్రొద్దున్నే నీవు ఇగోర్, నోవాక్‌లకు కొత్తకోట్లు తీసి ఇవ్వు."

కాలనీ సభ్యులంతా తమ తమ గదుల్లో కమాండర్ల రాక కోసం ఎదురుచూస్తూ కూచున్నారు. ఒలెంకో పడకగదిలోకి వెళ్ళగానే అతనేం చెబుతాడోనని అంతా ఆతృతతో చూడసాగారు.

"మేమూ విషయం చర్చించలేదు. ఏవో తక్కినవిషయాలు మాట్లాడుకున్నాం." అని చెప్పాడు ఒలెంకో.

"ఇంతకూ దొంగ ఎవరో తేలలేదన్నమాట ?"

"ఎవరో తీసిఉంటారు - దానికేంలెద్దూ; ఇహ ఆవిషయం పోనీయండి."

"దొంగ దొరికితేనా - వాడిభరతం పట్టేవాణ్ణి!" అన్నాడు రైజికోవ్. రెండుచేతులూ జేబుల్లో తురుముకుని గదిమధ్యకు వచ్చి నిలుచున్నాడు: "ఇంతకూ ఆ జీతాలు ఇచ్చే ఏర్పాటును గురించి అనాలి" అన్నాడు.

"అంటే ఏమిటి నీమాటకర్థం?" అని అడిగాడు సరోవ్‌నిచ్.

"విను చెబుతాను - నేను బాగా సంపాదిస్తున్నాను. అందరికీ కడుపుమంటగా ఉంది,"

రస్లాన్ గొరొఖోల్, అతనివంక తదేకంగా చూడసాగాడు :

"ఎవరికయ్యా నీవు గడిస్తున్నావని కడుపుమంట ?" అని అడిగాడు.

"ఎవరికేమిటీ ! తమ తిండికి సరిపడే సంపాదనకూడా కొందరికి లేదు. గొర్లెంకో, టాలెంకో, వాసిల్యేవ్, ఈ గల్చెంకోలు, ఈ బిగోనక్‌లు. వీళ్ళంతా ఎంత సంపాదిస్తున్నారు! వీళ్ళ సంపాదన వీళ్ళ పొట్టలకు చాలదు." అన్నాడు రైజికోవ్.

"అయితే కోట్లు దొంగిలించింది బిగోనక్ అంటావా ?"

"ఆమాట నేనన్నానా ?" అంటూ రైజికోవ్ తన మంచం దగ్గరికి వెళ్ళాడు.

రస్లాన్ అతన్ని అనుసరించాడు.

ఎందుకు నాకేసి అలా చూస్తావ్? అని రైజికోవ్, రస్లాన్‌ను అడిగాడు.

"నీవంటే నాకిష్టం" అని చెప్పాడు రస్లాన్.

ఒలెంకో చూసీ చూడనట్టు వారిరువురినీ పరిశీలించసాగాడు. అతని మనస్సులోకి ఒక ఆలోచన మెరుపులా వచ్చింది. "ఊహూ! అదా సంగతి!" అనుకున్నట్టుగా పెదవి కొరుక్కుంటూ ఆలోచనలో మునిగిపోయాడు.

# 17

# సిగరెట్టు పెట్టె

నాలుగో దళ సభ్యులకు రెండు అవలక్షణాలున్నాయి. వాళ్ళలో వాళ్ళు ఏవో గుసగుసలాడుకోడం, ఎవరినైనా పిలుస్తున్నప్పుడు పార్కులోనుంచి వచ్చి చప్పట్లు కొడుతూ పొలికేకలు పెట్టడం వాళ్ళకు అలవాటు. సాధారణంగా వాళ్ళు ఇతరులతో కలిసిమెలిసి ఉండరు. కొన్ని విషయాల్లో మరీ వేరుగా ఉంటారు. ఈ అవలక్షణాలు మంచివి కావని కమాండర్లకు తెలుసును.

ఒకనాడు నాలుగోదళ సభ్యులు కాలనీలో ఎన్నడూ లేనంత గడబిడ చేశారు. ఆవేళ క్లుష్న్యనోవ్ డ్యూటీలో ఉన్నాడు. అతనుకూడా ఆ అల్లరిలో చేరాడు. కాలనీలో సెమ్నోవ్ ఒక చక్కని పిల్లిని పెంచుకుంటున్నాడు. ఆ పిల్లిని పట్టుకుని దానికి సిల్కుదుస్తులు కట్టబెట్టి మూడో అంతస్థులోనుంచి గాలి గుమ్మటంలా క్రిందిగి వదిలిపెట్టాడు. దాంతో పెద్ద గందరగోళం బయలు దేరింది. కొంటెకుర్రవాళ్ళయిన నాలుగో దళసభ్యులంతా జకరోవ్ ఆఫీసులో హాజరయ్యారు.

"కాలనీలో ఇలాంటి తప్పుడు పనులు చేస్తే నేను సహించను ఈ పని రాక్షసులు చేస్తారు, మనుష్యులు చెయ్యరు. దీనికంతా నీవే బాధ్యుడివి. నిన్ను అయిదు గంటలసేపు నిర్బంధంలో పెడుతున్నాను." అన్నాడు జకరోవ్, క్లుష్న్యనోవ్‌తో.

"పిల్లికేమీ ప్రమాదం జరగలేదు. గాలి గుమ్మటంలాగా చక్కగా క్రిందికి దిగింది. 'మ్యావ్'మని అరవనుకూడా అరవలేదు. నాలుగుకాళ్ళూ నిటారుగాపెట్టి ఎంచక్కగా గెంతుకుంటూపోయింది!" అన్నాడు గైడోవిస్కీ.

"ఏమిటా మాట కర్థం? కోతుల్లాగా మీరు మేడెక్కి అల్లరి చెయ్యమని ఎవరు చెప్పారు? అసలు దాన్ని క్రింది కెందుకు తొయ్యాలి?" అని గట్టిగా మందలించాడు జకరోవ్.

నాటినుంచీ మళ్ళీ ఎవరూ ఆ మేడ ఎక్కలేదు. కాని కాల నీలో ఏదో ఒక రూపంలో ఇలాంటి ఆగడాలు జరుగుతూనే ఉన్నాయి. ఇలా కొన్ని రోజులు గడిచాయి. కాలనీ జీవితంలో హఠాత్తుగా స్తబ్ధత ఏర్పడింది. పూర్వంలాగా కుర్రవాళ్ళు అటూ ఇటూ గెంతడంలేదు. కోనేట్లో నీరు గడ్డకట్టుకపోయింది. దూరాన ఉన్న విద్యుద్దీపాల కాంతి ఆ మంచు మడులమీద పడి తళతళ మెరిసిపోతోంది. కాలనీ కుర్రవాళ్ళు జంటలు జంటలుగా కోనేట్లో స్కేటింగు ప్రారంభించారు. కమాండర్లు సహితం ఈ వినోద క్రీడలో పాల్గొంటున్నారు.

నాలుగోదళ సభ్యులుమాత్రం కోనేటిచాయల కనుపించటం లేదు. వాళ్ళు ఈ ఆటలో పాల్గొనకుండా పూర్తిగా దూరంగా ఉండిపోయారు. ఆఫీసు వేళల్లోకూడా నాలుగోదళ సభ్యులు ఆడు కునేందుకు వీలుగా, వాళ్ళను బిగోనక్ అప్పుడప్పుడు వదిలిపెడుతూ వచ్చాడు. కాని వాళ్ళు ఆ అవకాశాన్ని వినియోగించుకోడంలేదు. తమలోతాము ఏదో గుసగుసలాడుకుంటూరు. లేదా ఎవరిత్రోవన వారు మూతులు బిగించుకుని ఎటో పోతారు. వాళ్ళకూ కోనేటికీ చాలా ఎడమైపోయింది. కాలనీలో తక్కిన దళాలన్నీ కోనేట్లో హాయిగా, క్రీడా వినోదాల్లో పాల్గొంటూ ఉంటే, ఈ నాలుగో దళం కుర్రవాళ్ళు మాత్రం సమ్మె చేసినట్టు ఆదాయం పోకుండా తిరగసాగారు. పూర్వంలాగా కాలనీ సభ్యులు కోట్లు లేకుండా బయటికి రావడంలేదు. నాలుగోదళం కుర్రవాళ్ళుమాత్రం కోట్లన్నీ గదుల్లో విడిచేసి, బయట షికార్లు కొడుతున్నారు. కాపలా సైని కుడు వాళ్ళను హెచ్చరించేవాడు:

"కోట్లు గదుల్లో విడిచి పోతారేం? తొడుక్కుని పొండి. ఎన్నిసార్లు చెప్పాలి మీకు?"

ఇలా అతను హెచ్చరించినప్పటికీ వాళ్ళు ఖాతరు చేసే వాళ్లుకాదు.

నాలుగోదళంలో సాగుతున్న ఈ విపరీతపుచర్యలు బహుశా జకరోవ్ ఒక కంట కనిపెడుతూనే ఉండవచ్చు. అతనూ ఒంటిగా కాలనీలో అటూ ఇటూ పచార్లు చేస్తుంటాడు. అలా పచారు చేస్తున్నప్పుడు దుస్తుల గదిలోకి వెళ్ళి తొంగిచూస్తాడు. ఎప్పుడలా వెళ్లి తొంగి చూసినా గదిలో నాలుగోదళ సభ్యుడు ఎవడో ఒకడు అతనికి కనిపిస్తూనే ఉన్నాడు. ఆ సభ్యుడు జకరోవ్‌ను చూడగానే ఏదో తప్పుచేసినట్లు ఉలిక్కిపడి శాల్యూట్ చేసేవాడు. తరువాత పిల్లిలాగా చప్పుడుకాకుండా బయటికి వెళ్ళిపోయేవాడు.

ఒకనాడు సాయంకాలం కోనేట్లో పిల్లకాయలంతా స్కేట్ చేస్తున్నారు. వాన్యా గల్చెంకో, ఫీల్కా-పేరీలు మాత్రం స్కేటింగ్‌కు పోలేదు. పార్కుకు వెళ్ళే త్రోవలో ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లు వెనక్కు వెనక్కు తిరిగిచూస్తూ పచార్లు చేయడం మొదలుపెట్టారు. ఆ సమయంలో విడాటాలికోవా కోనేటికి వెడుతూ వాళ్ళను చూచి ఆగింది. వాన్యా బుజాలమీద చేతులువేసి ఇలా అన్నది:

"ఏమిటి వాన్యా! ఇక్కడ తిరుగుతున్నావేం!"

"ఏమీలేదు. ఊరికే అలా తిరుగుతున్నాను" అన్నాడు వాన్యా.

రైజికోవ్ ఒక భవనంలోనుంచి బయటికి వస్తున్నాడు. అతన్ని చూడగానే ఈ ఇద్దరి కుర్రాళ్ళ ముఖాలు విప్పారాయి. రైజికోవ్ ఇవాళ రోజూలాగా లేడు. తెల్లటి దుస్తులు, కొత్తవి వేసుకున్నాడు: ఠీవిగా నడుస్తూ వస్తున్నాడు. జీవితంలో నాకేం అన్నట్టుగా, సంతృప్తిగా చేతులూపుకుంటూ దర్జాగా అంగలు వేసుకుంటూ వాళ్ళ వైపుకు రాసాగాడు. అతనికి తలమీద టోపీలేదు, నున్నగా జుట్టు దువ్వుకున్నాడు. ముఖం మెద మెద లాడుతోంది. మెల్లగా సిగరెట్టు తీసి ముట్టించాడు. అతన్ని

చూడగానే చడీచప్పుడు లేకుండా వాన్యా, ఫిల్కాలు ఒకప్రక్కకు తప్పుకున్నారు. రైజికోవ్ వాళ్ళను గమనించలేదు. త్రోవన వెడుతూ చేతిలో సిగరెట్టుపెట్టె పైకెగరేసి పట్టుకున్నాడు. రెండుమూడుసార్లు అలా బంతులాడిదూరంగా విసిరేశాడు.

అతను చెట్ల చాటుకు వెళ్ళగానే వాన్యా, ఫిల్కాలు ఇవతలికొచ్చి ఆ సిగరెట్టు పెట్టె తీసుకున్నారు. వాన్యా దాన్ని అటూ ఇటూ ఆడించి,

"సిగరెట్టుపెట్టె!" అన్నాడు.

"ఏ మార్కు?" అని అడిగాడు ఫిల్కా.

"డ్యూబెక్"

"మంచిరకం సిగరెట్లే!"

ఇరువరూ క్లబ్ భవనం సమీపించారు. అక్కడ మలంకీ ఎదురుపడ్డాడు. తన చేతిలో ఉన్న సిగరెట్టు పెట్టె అతనికి చూపించి ఫిల్కా ఇలా అడిగాడు:

"ఈ సిగరెట్టు పెట్టె ఎంత ఖరీదుంటుంది?"

"అబ్బో! చాలా ఖరీదు! అయిదు రూబుళ్ళు!" అన్నాడు మలంకీ.

"అయిదు రూబుళ్ళా! ఒక పెట్టెఖరీదు అయిదురూబుళ్ళే!" అన్నాడు వాన్యా, ఆశ్చర్యంతో.

మరేమనుకున్నావు? డ్యూబెక్ సిగరెట్లు కాల్చడమంటే తమాషా అనుకున్నావా?" అంటూ మలంకీ వెళ్ళిపోయాడు.

పిమ్మట వాన్యా, ఫిల్కాలు గ్రంథాలయంవైపు నడిచారు.

"నాకు తెలుసునోయ్ వాడి సంగతి! అది వాడిపనే!" అన్నాడు వాన్యా.

"నోట్లు దొంగిలించడమేనా?" అని అడిగాడు ఫిల్కా.

"అవును, దొంగిలించడమేమిటి, అమ్మడమేమిటి? అంతా వాడే చేశాడు."

"ఎందుకామాట? వాడు మనందరికన్నా ఎక్కువ సంపాదిస్తున్నాడు. ఇలాంటిపని చెయ్యాల్సిన అవసరం లేదు అతనికి.

"అతను గడించేది ఎంత? ముప్ఫయి రూబుళ్ళేకదూ? ఆ విషయం నాకు తెలుసు. ఇది వాడిపనే."

"ముప్ఫయి ఏం కర్మ? ఒక్కొక్క నెలలో నలభయికూడా మిగులుస్తున్నాడు!"

"అసలు ఎంత గడిస్తే ఏం? దానికీ దీనికీ సంబంధం ఏమిటి? ఎంత సంపాదించినా దొంగతనం చేయవచ్చు. ఈ సిగరెట్టుపెట్టె ఖరీదు అయిదు రూబుళ్ళు. ఇలాంటి పెట్టెలు వాడు రోజు కెన్ని కాలుస్తున్నాడో!" అన్నాడు వాన్యా.

"సరే, వాడి సంగతేదో కనిపెడదాం రా...వాడిప్పుడు మొదటి దళంలోకదూ ఉన్నది?"

"అవును."

"ఆ దళంలోని పిల్లలంతా నీకు తెలుసు కదూ?"

"తెలుసును."

"అయితే ఒక పనిచెయ్యి."

"ఏమిటది?"

"దళసభ్యులందరినీ రైజికోన్ ఏ రకం సిగరెట్లు కాలుస్తున్నాడని రహస్యంగా కూపీ తియ్యి."

"ఆ, తీస్తే? ఏమిటవుతుంది?

"చెబుతాను విను. వాడు ఏం సిగరెట్లు కాల్చేదీ దళంలో కుర్రవాళ్ళ కెవరికీ తెలీకపోతే దానిఅర్థం ఏమిటంటావ్?" అన్నాడు ఫిల్కా.

"నీవే చెప్పు" అన్నాడు వాన్యా.

"అంటే వాడా సిగరెట్లు దొంగతనంగా కాలుస్తున్నాడనేగా అర్థం."

"అవును. వాడి స్వంతడబ్బులే అయితే దొంగతనంగా కాల్చవలసిన అగత్యం లేదు."

అప్పుడేమన్నమాట? వాడే కోట్లు కొట్టేసి అమ్ముకున్నాడన్నమాట!”

ఆ సాయంత్రంలోపునే రైజికోవ్ కాల్చే సిగరెట్లనుగురించి వాన్యా, ఫిల్కా లిరువురూ కూపీ తీశారు. దళసభ్యులంతా అతను ఏం సిగరెట్లు కాల్చేదీ ఎరగమని చెప్పారు.

భోజనాలయ్యాక వాన్యాతో ఫిల్కా ఇలా అన్నాడు:

“చూచావామరి? వీడి సిగరెట్ల విషయం ఎవరికీ ఏమీ తెలీదు! ... నాతోరా, మంచి తమాషా చూపిస్తాను.“

“ఎక్కడికి? ఏమిటి తమాషా?” అని అడిగాడు వాన్యా.

“మీటింగుకు – ఏం తమాషో అక్కడే చూద్దువుగాని” అన్నాడు ఫిల్కా.

రోజూ జరిగే సాధారణ సమావేశం ఇహ కొద్దిసేపట్లో ఆరంభమవుతుంది. ఫిల్కా తనపంట్లాం జేబులో ‘డ్యూబెక్’ సిగరెట్టు పెట్టె భద్రంగా దాచుకుని సమావేశానికివెళ్ళాడు. కొంత సేపటికి రైజికోవ్ కూడా అక్కడికి వచ్చాడు. అతను రాగానే, అతని చర్యలు కనిపెట్టమని ఫిల్కా, వాన్యాకు చెప్పాడు.

రైజికోవ్ ఒక బెంచీమీద కాళ్ళు నిటారుగా క్రింద తన్ని పెట్టి కూచున్నాడు. ఫిల్కా, వాన్యాలు అతనిముందు అటూ ఇటూ రెండు మూడుసార్లు పచార్లు చేశారు. రైజికోవ్ వాళ్ళవంక చూళ్ళేదు. తన కాళ్ళకేసి చూస్తూ ఈలపాట పాడసాగాడు. వాన్యా, ఫిల్కాలు అతని ప్రక్కనే బెంచీమీద చతికిలపడ్డారు. రైజికోవ్ నిర్లక్ష్యంగా వాళ్ళవంక చూసీ చూడనట్టు చూశాడు. మళ్ళీ ఈలపాట పాడుకోసాగాడు. ఫిల్కా తన పంట్లాం జేబులో నుంచి సిగరెట్టుపెట్టె బయటికి తీశాడు. వ్రేళ్ళతో దానిమీద దరువువేయడం మొదలుపెట్టాడు. ఇది రైజికోవ్ దృష్టిని ఆకర్షించింది. అతను ప్రక్కకు మళ్ళి ఫిల్కా చేతిలోని సిగరెట్టుపెట్టెవంక చూచాడు. ఫిల్కా సిగరెట్టుపెట్టె తెరిచాడు. లోపల అట్టముక్క మీద ఈ క్రింది అక్షరాలు రాసి ఉన్నాయి:

"మాకంతా తెలుసును!"

ఇది చూడగానే రైజికోవ్ ముఖం కుంచించుకపోయింది. నిబ్బరంగా కూచున్నవాడల్లా తొట్రుపడసాగాడు. ఫిల్కా, వాన్యా బుజం తట్టాడు. రైజికోవ్ గభాలున అక్కడనుంచి లేచి బయటికి వెళ్ళిపోయాడు.

"దొంగ దొరికాడురా!" అన్నాడు ఫిల్కా.

"సందేహం లేదు—వీడే కోట్లు కొట్టేసింది!" అన్నాడు వాన్యా

"రా, వెళ్ళి జకరోవ్‌తో చెబుదాం."

ఇరువురూ పరుగెత్తుకుంటూ ఆఫీసుకు వెళ్ళారు. కాని అక్కడ కమాండర్లు అందరూ జకరోవ్ చుట్టూ మూగి తమ తమ రిపోర్టు అందిస్తున్నారు. జకరోవ్ ఉల్లాసంగా ఉన్నాడు:

"ఈపూట సమావేశం త్వరగా ముగించు." అన్నాడు జకరోవ్ టార్‌స్కీతో.

సమావేశంలో టార్‌స్కీ ఇలా ఒక ప్రకటన కావించాడు:

"ఫాండ్రీలో ఎన్నడూ అనుకోనంత ఎక్కువ పని ఒక్క రైజికోవ్ చేశాడు! అందుకతన్ని అభినందిస్తున్నాం."

ఈ ప్రకటన వినటంతోనే వాన్యా, ఫిల్కాలు తెల్లబోయారు. రైజికోవ్‌వంక చూశారు. అతను గర్వంగా, నవ్వుతూ కూచుని ఉన్నాడు. వాళ్ళకేం అర్థంకాలేదు.

"ఇవాళ సమావేశంలో రైజికోవ్, రాజయిపోయాడే! ఎన్నడూ ఎవరికీ పట్టని అదృష్టం ఇవాళ వాడికి పట్టింది! కమాండర్లు అతన్ని ప్రత్యేకంగా అభినందించారు!" అనుకున్నారు వాన్యా, ఫిల్కాలు తమలోతాము.

# 18
# ఉత్పత్తిలో పోటీ

శీతాకాలం గడిచింది. 'కొమోసల్' సభ్యులు, కమాండర్ల కౌన్సిలు సభ్యులు రాత్రివేళల నిద్రపోవడంలేదు. తమతమ కార్యక్రమాలను గురించి సుదీర్ఘమైన చర్చలు సాగిస్తున్నారు.

ఒకనాటి చర్చలలో మార్కు గ్రీన్‌హాస్ ఇలా చెప్పాడు :

* ఇహ కొద్దికాలంలో మనం ఎలెక్ట్రిక్ డ్రిల్సు' తయారు చేయబోతున్నాం. ఇప్పుడు మనం దిగుమతి చేసుకున్న 'డ్రిల్సు'ను చూచారుకదా? పైన అల్యూమినియం పూతపూశారు. మన ఫ్యాక్టరీలకు, వైమానిక కర్మాగారాలకు, వాటిని మనం ఇంతవరకూ ఆస్ట్రేలియానుంచి దిగుమతి చేసుకుంటున్నాం. విమానాలను ఎలా తయారుచేస్తారో నేను కళ్ళారా చూచాను. 'ఎలెక్ట్రిక్ డ్రిల్లు'లేనిదే ఒక్క క్షణం పనిసాగదు. వాటికోసం మనం ఇతరదేశాలమీద ఆధారపడడం ఎంతమాత్రం మంచిదికాదు. మనమే ఈ కాలనీలో వాటిని తయారుచేసుకుంటే ఏ బెడదా ఉండదు. ఆస్ట్రేలియానుంచి మనం వాటిని తెచ్చుకుంటున్నాం, అందుకుబదులుగా మనం ఆ దేశానికి బంగారం పంపుతున్నాం. ఇహమీదట ఈ పరిస్థితి కొన సాగకూడదు. నే చెపుతున్నది 'మీకర్థమైందికదా?'

దళాల కమాండర్లందరూ ఇదేవిధంగా భావిస్తున్నారని ఒలెంకో తెలియచేశాడు:

"మనం ఒక్క నిముషం కాలం వ్యర్థం చెయ్యకూడదు. ధనాన్ని దుబారా చేయకూడదు. ఇప్పుడు మనం సాయంత్రం రెండుసార్లు భోజనం చేస్తున్నాం. అది వట్టి దండుగ

---

* రంధ్రాలు చేసే [బరమా] ఒకానొక విద్యుత్పరికరం .—రెంటాల.

అని నా అభిప్రాయం. ఒకసారి అయిదు గంటలకు, మరొక సారి మళ్ళీ ఎనిమిది గంటలకు – మనభోజనాలు. అయిదు గంటల భోజనం మనం మానుకోవచ్చు, అందువల్ల కాలమూ కలిసి వస్తుందీ, ఖర్చూ తగ్గుతుందీ. అలాగే మాంసం వారానికి మూడు తడవలు మాత్రమే పెట్టించాలి. రోజూ మాంసం తినడం మంచిది కాదని డాక్టర్లు చెబుతున్నారు. కాలనీ సభ్యులకు కొత్త దుస్తులు కుట్టించాలని మీరనుకుంటున్నారు. అది ఇప్పటికి విరమించుకోవడం మంచిది. బూడ్సులకు బదులు, చవకరకం జోళ్ళు సభ్యులంతా ఉపయోగించుకోవచ్చు. వీటన్నిటివల్లా మనకెంతో ఆదా అవుతుంది." అన్నాడు ఒలెంకో.

ఇదేవిధంగా 'కొమోసల్' సభ్యులంతా పొదుపు వుద్యమానికి తమ తమ సూచనలిచ్చారు. వాటినన్నిటినీ జకరోవ్ ఆమోదించాడు. ఇలాగ ఖర్చులు తగ్గించుకోవడంవల్ల, ఉత్పత్తి అధికం చేయడంవల్ల సంవత్సరాంతానికి మూడులక్షల రూబుళ్ళే కాక, ఇంకా ఎక్కువ గడించవచ్చునని కాలనీ సభ్యులంతా అభిప్రాయపడ్డారు.

భోజనశాలకు వెళ్ళే త్రోవలో ఒక ఆవరణం ఉంది. ఆ ఆవరణ కెదురుగా ఒక గోడ – ఆ గోడ ఇప్పుడు కాలనీ సభ్యుల దృష్టిని ఆకర్షిస్తోంది. అందరూ దానివిషయమే చెప్పుకుంటున్నారు, చర్చించుకుంటున్నారు. షలంకీ తదితర సభ్యుల సహాయంతో ఒక రేఖాపటాన్ని తయారుచేశాడు. కాలనీసభ్యులు ఉత్పత్తిని ఎలా అధికంచేయవలసిందీ, ఎవరెవరు ఎంతెంత ఉత్పత్తిని చేయవలసిందీ, ఉత్పత్తిపెరగడంవల్ల సంవత్సరాంతంలో కలిగే అభ్యున్నతీ; ఇవన్నీ వివరంగా తెలియజేస్తోంది. ఆ రేఖాపటం,అందులో ఒక యుద్ధరంగం కూడా చిత్రితమైంది. అడుగున మూడు వైపులనుంచీ కాలనీ సభ్యులు చేసే విజయయాత్ర ప్రారంభమైంది. కాలనీ సభ్యులు మూడు సైనిక దళాలుగా విడివడ్డారు. లోహపు కార్మికులు మధ్యన నిలుచున్నారు. వారికి ఎడమప్రక్క వడ్రంగం పనివాళ్ళు, కుడి

ప్రక్క దుస్తులషాపులో పనిచేసే బాలికలు స్థావరాలు ఏర్పాటు చేసుకున్నారు.

ఈ సైనిక దళాలలో లోహపు కార్మికులు ప్రధానబలంగా రేఖాపటంలో చిత్రితమైనారు. ఒక్కొక్క సైనిక దళం సాధించవలసిన విజయాలను వారి వారి శక్తినిబట్టి సూచితమై ఉన్నది. నూనె పాత్రలు ఏడాదికి పది లక్షలు తయారు కావాలి. అంటే వాటి ఖరీదు పది లక్షల రూబుళ్ళన్నమాట ఇహ వడ్రంగులు 7,50,000 రూబుళ్ళ విలువచేసే ఉత్పత్తిని సాధించాలి. దుస్తుల షాపులో పని చేసే బాలికలు మూడు లక్షల రూబుళ్ళ విలువైన బట్టలు తయారు చెయ్యాలి.

రేఖాపటం పై భాగంలో ఒక చక్కని నగరం చిత్రించారు. ఆ నగరం అనేక కర్మాగారాలతో, భవనాలతో, విశాలమైన వీధులతో, ప్రదర్శనశాలతో, పార్కులతో, క్రీడాస్థలాలతో అలరారుతోంది. దళాల సభ్యులందరూ విజయయాత్ర చేసి ఆ నగరాన్ని చేరుకుంటున్నట్టుగా పటంలో గీయబడి ఉంది. అంటే అలాంటి నగరనిర్మాణం కోసం కాలనీ సభ్యులందరూ ఇంత ఉత్పత్తిని పెంచవలసి ఉంటుంది.

రేఖాపటం క్రిందిభాగంలో, కార్మికులు ఒక ఏడాదికి ఎన్ని రోజులు పని చేయవలసిందీ ప్రత్యేకంగా గుర్తుపెట్టారు. ప్రణాళిక సరిగ్గా డిసెంబరు 31 వ తేదీన ప్రారంభమవుతుంది.

రేఖాపటంలో మొదటిభాగం ఒక నీలపుపెన్సలుతో ప్రత్యేకంగా గుర్తు పెట్టారు. ఆ నీలిగుర్తు శత్రువుల స్థావరానికి చిహ్నం. తమకు శత్రువు లెవరో కాలనీ సభ్యులకు తెలుసు. మనం కాలం వ్యర్థపుచ్చితే అదే మనకొక శత్రువవుతుంది. అలాగే ఉత్పత్తి చేసే వస్తువులు నాసిరకానికి చెందినవయితే—అవీ తమకు శత్రువులే. అంచాత కాలాన్ని సద్వినియోగం చేసుకుని, నైపుణ్యాన్ని ప్రదర్శించి, చక్కని ఉత్పత్తిని సాధించి ఈ శత్రువులను ఓడించాలి ఈ సంకల్పంతోనే కాలనీ సభ్యులు నిర్విరామంగా కృషి సలుపు

తున్నారు. ఎప్పటికప్పుడు తాము సాధించిన కృషిని తెలుపుతూ ఒక పట్టికను తయారుచేస్తున్నారు. దాన్ని అందరికి అగుపించేలా ఆఫీసు గోడకు వ్రేలాడ కడుతున్నారు. మార్చి 25 వ తేదీ పట్టిక ఈ క్రింది వివరాలను తెలుపుతున్నది:

"నిన్న యుద్ధభూమి ప్రశాంతంగా ఉన్నది. మధ్యభాగంలో ఉత్పత్తి విలువ మూడు వేల మూడువందల రూబుళ్ళు. ఎడమ భాగంలో సైనికులు, అనగా వడ్రంగులు మార్చి 15వ తేదీ వరకూ పురోగమించి అక్కడే ఆగిపోయారు. నాటినుంచి నేటిదాకా వాళ్ళు పీసమెత్తు ఉత్పత్తి సాధించలేదు. కుడిభాగంలో సైనికులు, అంటే కుట్టు పనివాళ్ళు తమశత్రువులను నిశ్శేషంగా తుడిచి పెట్టారు. మన మహిళాదళాలు నీలిరేఖలను, అనగా శత్రుస్థావరాలను దాటిపోతున్నాయి. శత్రువు తట్టుకోలేక తిరోగమిస్తున్నాడు. వాళ్ళు సాధించినఉత్పత్తి అనుకున్న దానికంటె అధికం. వడ్రంగులవల్ల వచ్చిన కొరతను వీరి ఉత్పత్తి భర్తీ చేసింది. అందువల్ల ఎక్కడో ఒకచోట కుంటుపడ్డా, మొత్తంమీద అనుకున్న దానికంటె ఒకరోజు ముందుకు పోయాం."

ఒకనాడు గోడదగ్గర నిలుచుని వాన్యాగల్చెంకో, అతని స్నేహితులు రేఖాపటాన్ని తిలకిస్తున్నారు. అతను, అతని సహచరులు పనిచేస్తున్న ఫౌండ్రీలో ఉత్పత్తి సంతృప్తికరంగా ఉన్నది. ఆనాటి రేఖాపటం ఆ విషయాన్నే స్పష్టం చేస్తున్నది. ఫౌండ్రీ కార్మికుల ధాటికి తట్టుకోలేక శత్రువులు తిరోగమిస్తున్నారు. అయితే మహిళాదళాలు సాధించిన విజయాలు మరీఎక్కువ. ఏప్రియల్ 18 వ తేదీకి సాధించవలసిన ఫలితాలను, వాళ్లు పదిరోజులు ముందుగానే సాధించారు. వాళ్లు సాధించిన ఈవిజయాలు చూచి యువకులు ఆశ్చర్య చకితులవుతున్నారు. అంతేకాదు. వాళ్ళను చూచి సిగ్గుపడుతున్నారు కూడా. ఆ రేఖాపటంముందు వాన్యా, అతని స్నేహితులు నిలుచుని ఉండగా అక్కడికి లీనా ఇవనోవా, ల్యూబా లు వచ్చారు. వాళ్ళను చూచి వాన్యా ఇలా అన్నాడు:

"దుస్తులు కుట్టడం ఏమంత కష్టమైన పనికాదు."

"ఓహో, అలాగా! ఏదీ కుట్టి చూపించు, కష్టమో తేలికో తెలుస్తుంది." అన్నది లీనా.

వాన్యా ముఖం జేవురించింది. మాటకుమాట అనాలనుకున్నాడు. కాని నోరాడిందికాదు. లీనా, ల్యూబాలు అతన్ని చూచి పకపకనవ్వారు.

"అది ఆడపిల్లలు చేసేపని—మేమెందుకు చేస్తాం?" అన్నాడు వాన్యా.

"అయితే ఆడపిల్లలు మరింకేపనీ చెయ్యలేరనా నీ తలంపు?" అని అడిగింది ల్యూబా.

"అయితే వాండా, ఒక్సానాలు ఫౌండ్రీలో పనిచేయడం లేదూ?" అని అడిగింది లీనా.

ఇహ వాన్యా వాళ్ళకు సమాధానం చెప్పలేక, ముఖం చిన్నబుచ్చుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు. నిజమే వాండా, ఒక్సానాలు ఫౌండ్రీలో చాలా నేర్పుగా పనిచేస్తున్నారు. నాలుగు గంటల్లో ఇరవై నూనెపాత్రలు తయారు చేస్తున్నారు! అలా వాళ్ళెలా చేయగలుగుతున్నారు? వాళ్ళకు బ్లమ్ మంచి మిషన్లు ఇచ్చాడు. అవి ఏమాత్రం చెడిపోయినా తక్షణం బాగుచేయిస్తున్నాడు. ఈ విషయం జకరోవ్‌కు చెప్పినా అతను వినిపించుకోడు. పైపెచ్చు మగవాళ్ళనే నాలుగుచివాట్లూ పెడతారు. "ఈరోజుల్లో ఆడవాళ్ళు పెత్తనాలుమాని పనిచేస్తున్నారు. మగవాళ్ళేమో పనిమాని పెత్తనాలు చేస్తున్నారు!" అంటాడతను. కాని వాన్యా దృష్టిలో అది నిజంకాదు.

వాన్యా తనలోతాను ఏదో ఆలోచించుకుంటూ నాలుగడుగులు ముందుకువేశాడు. అక్కడ ఇగోర్, పోర్షినేవ్‌లు తీవ్రంగా వాదించుకుంటున్నారు:

"నూనె పాత్రల కేముందయ్యా? ఎవడైనా చేసేస్తాడు. ఏముంది? రాగి ముక్కలు తెచ్చి అటూ, ఇటూ సాగగొట్టడం - అంతేకదా." అన్నాడు ఇగోర్.

"అసలు నీవు పట్టికి చదివావా? అని నవ్వుతూ అడిగాడు పోర్షినేవ్: "మేం తయారుచేసిన నూనె పాత్రలు మొత్తం 3,300. మరి మీరూ? 'ఎక్కడున్నావే గొంగళీ అంటే, వేసినచోటనే ఉన్నానురా సంగడీ' అన్నదట, ఆ సామెతగా ఉంది మీ పని."

"అలాగా! అయితే మేం చేసేపని అంత తేలికనుకున్నావు కాబోలు పాపం! ఒక వ్రాతబల్ల తయారు చెయ్యి. చూద్దాం, నీ పస బయటపడుతుంది. మీరు తయారు చేసే వందనూనె పాత్రలు, మేం తయారుచేసే ఒక్క వ్రాతబల్లకు సరిరావు మీదీ ఒక పనేనా? మేం ఒక బల్ల చేద్దామంటే వారం రోజులు పడుతుంది. ఆ ఒక్క బల్లకోసం అయిదారుగురు పనిచెయ్యాలి. మీరూ? ఒక గంటలో ఒక్కొక్కడు నాలుగు అయిదునూనెపాత్రను చేసి అవతల పారెయ్య వచ్చు. ఎవరిది కష్టమైనపని? మీదా మాదా?" అన్నాడు ఇగోర్.

ఇలా వారి వాదన సాగుతుండగా మధ్యలో వాన్యా జోక్యం కలిగించుకుని ఇగోర్‌ను ఉద్దేశిస్తూ,

"మీరు ఒక వీసమెత్తుకూడా ఉత్పత్తి చేయలేదు"అన్నాడు.

తన ప్రాణ స్నేహితుడు వాన్యాయే ఇలా అనేసరికి ఇగోర్‌కు కోపం వచ్చింది. కాని ఏమీ మాట్లాడలేదు. పోర్షినేవ్ మాత్రం అదే మాటను రెట్టించాడు. ఇగోర్ మండిపడి "పందెం వేస్తావా? ఒక్క వారంలో మిమ్మల్ని మించిపోతాం" అని సవాలు చేసాడు.

"నీతో ఎందుకు పందెం?" అన్నాడు పోర్షినేవ్.

"ధైర్యం ఉంటే వెయి." అన్నాడు ఇగోర్

"పందెం ఎందుకయ్యా పనిలేక క్రిందటి నెలలోనే తెలిసి పోయిందిగా మీ పస! మీరు చేసిన ఒక కుర్చీగాని, ఒక్క

బెంచీగాని ఎందుకూ పనికిరావని కమిటీవాళ్ళకుతిప్పి పంపారు" అన్నాడు ఫోర్షి నేవ్.

"పంపనీ. ఈసారి వాళ్ళే కళ్ళకద్దుకుంటారు. మీరెన్ని నూనెపాత్రలు తయారు చేస్తేనేం? మా ఒక్క కుర్చీముందు బలా దూర్! అన్నాడు ఇగోర్.

# 19

# ప్రేమకు ప్రతిబంధకం

**ఒ**కనాటి ఉదయం ఇగోర్, వాన్యాలు కాలనీకి చేరువగా ఉన్న అడవికి వెళ్ళారు. అనుకోకుండా అక్కడ వాళ్ళకు రైజికోవ్ తారసపడ్డాడు. అతన్ని చూచి ఇగోర్ వ్యంగ్యంగా ఇలా అన్నాడు:

"ఇవాళ కూడా నిన్ను కాలనీవాళ్ళు గొప్పగా పనిచేశావని అభినందిస్తారు కాబోలు!"

రైజికోవ్‌కు ఇగోర్‌తో ఆట్టేసేపు మాట్లాడడం ఇష్టంలేదు నాలుగడుగులు ముందుకు వేసి "నీ అభినందనలు నాకక్కర్లేదులే" అన్నాడు.

వాన్యా ఆ ఇద్దరికంటె కొంచెం ముందు నడుస్తున్నాడు. రైజికోవ్ అతన్ని దాటేసిపోతూ అతన్ని ముందుకు పడనెట్టాడు. వాన్యా క్రిందపడి లేవడానికి ప్రయత్నించాడు. రైజికోవ్ ఎదురుగా నిలుచుని నవ్వాడు.

"నన్నెందుకు పడద్రోశావు? వెళ్ళడానికి జాగా లేదేమిటి?" అన్నాడు వాన్యా, శాంతంగా.

అందులో ఇగోర్ కోపంతో ముందుకు వచ్చి రైజికోవ్ గొంతు పట్టుకున్నాడు. అతన్ని మంచులో పడేటట్టు ఒక తోపు తోశాడు. రైజికోవ్ గిరగిర తిరిగి మంచులో పడ్డాడు.

"ఇహ బుద్ధి వచ్చిందా? మళ్ళీ ఇలాంటి పని చేశావంటే మచ్చుకైనా దొరకవు! జాగ్రత్త!" అని అరిచాడు ఇగోర్.

రైజికోవ్ బిక్కముఖంవేసి ఇగోర్ వంక దీనంగా చూచాడు.

"నీవు నన్ను పడత్రోసినందుకు నీమీద నాకేం కోపం లేదయ్యా. నీవు చేసినపని వేరే ఉంది." అన్నాడు వాన్యా, రైజికోవ్ తో.

"ఏమిటది?" అని అడిగాడు రైజికోవ్.

"ఉందిలే! అదేమిటో నీకూ తెలుసు, మాకూ తెలుసు!" అన్నాడు వాన్యా.

"అదేమిటో చెప్పు" అన్నాడు రైజికోవ్.

"తరువాత చెబుతాను, తరువాత చెబుతాను" అంటూ వెళ్ళిపోయాడు వాన్యా.

వాన్యా దేన్నిగురించి మాట్లాడుతున్నాడో రైజికోవ్ కు అర్థం కాలేదు. అలా మాట్లాడడానికి అతనికేం అధికార మున్నదని అనుకున్నాడు రైజికోవ్. తను ఇటీవల ఫౌండ్రీకి కిరీటంలేని రాజులా ఉంటున్నాడు. బంకోవిస్కీకి తాను ఎంత చెబితే అంత. ఇన్నాళ్ళూ నెస్టెరింకో ఫౌండ్రీలో పనిచేసే వాడు. ఇప్పుడు యంత్రాలు అమర్చేషాపులో, పెద్ద ఉద్యోగంలోకి పోయాడు. కనుక ఫౌండ్రీలో నెస్టెరింకో చేసేపని తనకు లభించింది. అంతేకాదు. ఒలెంకో కూడా తనను మెచ్చుకుంటు న్నాడు. పనిబాగా చేస్తున్నావు రైజికోవ్, నీవు కొంతకాలానికి ఫోర్ మన్ వు అవుతావు, కొంచెం స్కూల్లో శ్రద్ధవహించి పాఠాలు చదివితే తప్పకుండా ఇంకా పైకి పోతావు.' అని అతను తనను అభినందిస్తున్నాడు. కాని తాను 'ఇప్పుడేం చదువండి, నాకు వయస్సు ముదిరిపోయింది' అని సమాధానం చెబుతూ వచ్చాడు. కాని తనకువయస్సు మీరిపోలేదనీ, ఎంతో చదువుకోవచ్చుననీ ఒలెంకో నచ్చచెబుతూ ఉండేవాడు: ఇలా ఆలోచించుకుంటూ రైజికోవ్ కొంతసేపు అడవిలో గడిపాడు.

ఆనాటినుంచీ మరికొన్నాళ్ళవరకూ ఆ ముగ్గురు కుర్రవాళ్ళు ఒకచోట కలుసుకోడం తటస్థించలేదు. కాని ఒకరోజున తలవని తలంపుగా ముగ్గురూ తటస్థపడ్డారు. రైజికోవ్, ఇగోర్ల మధ్య ఇది వరకటిలాగా వాగ్వాదం వచ్చింది. ఆనాడు రైజికోవ్ నగరానికి వెడుతున్నాడు. ఇగోర్, వాన్యాలు మరో త్రోవన నగరానికి వెడుతూ అతన్ని రహదారిలో కలిశారు. అప్పుడే నగరంనుంచి ఒక లారీ జోరుగా వస్తున్నది. లారీలో డ్రైవర్ ప్రక్కనే వాండా కూచుని ఉంది. కిటికీలోనుంచి వాళ్ళను చూచి నవ్వింది.

"ఎక్కడనుంచి వస్తున్నావు వాండా? అని బయటనుంచి కేకవేశాడు వాన్యా.

"బల్లచెక్కల కోసం నగరానికి వెళ్ళివస్తున్నాం" అని చెప్పింది వాండా.

ఆమె బుజాలకు తగులుతూ లారీడ్రైవర్ ఒరోబ్యోవ్ కూచుని ఉన్నాడు. అది చూచి సహించలేకపోయాడు రైజికోవ్.

చూడండయ్యా వాళ్ళ వాలకం! ఆడపిల్లప్రక్కన అలా రాచుక రాచుక కూచున్నాడేమిటి ఆ డ్రైవర్? వాడివెంట ఒంట రిగా ఆ పిల్ల వెళ్ళడ మెందుకు?" అన్నాడు రైజికోవ్.

"ఎందుకు వెళ్ళకూడదూ?" అన్నాడు వాన్యా.

"ఏమిటా వెధవ ప్రశ్న? వాడితో శృంగారం వెలగ బెట్ట డానికేగా ఆ పిల్ల వెళ్ళడం!" అన్నాడు రైజికోవ్.

"ఆ పిల్ల ఎలాంటిదో నీ వెరగవు. మాట్లాడక ఊరుకో."

"నాకంటె నీ కెక్కువ తెలుసుననన్నమాట!" అని గద్దిం చాడు రైజికోవ్.

"అవును నీకంటె వాన్యాకే ఎక్కువ తెలుసును"అంటూ మధ్యకు వచ్చాడు ఇగోర్.

రైజికోవ్ పక్కకు తప్పుకున్నాడు. "నీలాంటి అపభ్రష్టుడు కాలనీలో ఉండకూడదు!" గ్రుడ్లురిమాడు ఇగోర్.

రైజికోవ్ ఇహ మారు మాటాడక తన గ్రోవన తాను నగరానికి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు వాండా, లారీ డ్రైవర్ ఒరోబ్యోవ్‌ల మధ్య రాను రాను స్నేహం గాఢం కాజొచ్చింది. ఈ విషయం కాలనీలో అందరూ గమనించసాగారు. ఒరోబ్యోవ్ అంటే అందరికీ ఇష్టమే. సాధారణంగా అతను ముభావంగా ఉంటుంటాడు. ఎప్పుడో ఏదో గ్రంథపఠన చేస్తుంటాడు. లారీలో తన సీటు ప్రక్క ఏదో పుస్తకం ఉంటూనే ఉంటుంది. కాలనీలో ఇంతవరకూ గ్రంథాలయ పుస్తకాలను ఉపయోగించుకుంటున్నవాడు ఇగోర్. పుస్తకాలు చదవడంలో అతన్నికూడా మించిపోయాడు ఒరోబ్యోవ్, తరుచుగా గ్రంథాలయానికి వెడుతుంటాడు. అందువల్ల సహజంగా లైబ్రరీయన్‌గా ఉంటున్న వాండాకు అతనికీ స్నేహం కుదిరింది. వాండా కూడా అతనంటే ఇష్టపడేది. తరుచు లారీవద్దకు వెడుతుండేది. ఇరువురూ కబుర్లాడుకునేవారు. ఇరువురూ కలిసి మంచులో స్కేట్ చేస్తూ కులాసాగా గడిపేవారు. ఈ విషయమే కాలనీలో కుర్రాళ్లు తరుచు చెప్పుకుంటుండేవారు.

ఒకరోజున మిషాగోంటార్, ఇగోర్‌తో ఇలా అన్నాడు:

"నామాట నమ్ము. వాండా ఒరోబ్యోవ్‌ను ప్రేమించింది!"

"అబద్ధం—నేను నమ్మను." అన్నాడు ఇగోర్!

నమ్మకపోతేనేం –వారివురూ ప్రేమించుకున్న తరువాత ఒకరి నమ్మకాలతో వాళ్ళకు పనేమిటి?" అన్నాడు గోంటార్.

గోంటార్ అన్నట్టుగానే ఒకనాడు వాండా, ఒరోబ్యోవ్ లిరువురూ మంచులో స్కేట్ చేస్తుండగా ఇగోర్ చూచాడు. ఒరోబ్యోవ్ వాండాతో ఇలా అంటున్నాడు:

"అతనంటే నీకు భయంగా ఉన్నదా వాండా?"

"జిరియాన్‌స్కీ—యేనా? అతనంటే ఎవరికి భయంలేదు?" అన్నది వాండా.

జిరియాన్‌స్కీ అంటే వాండాకు తగనిభయం. అందుకు కారణాలున్నాయి. కొన్నాళ్ళు జరిగిన తరువాత ఒకనాడు ఇగోర్, జిరియాన్‌స్కీలు స్కేట్ చేస్తున్నారు. వాళ్ళకు కొంచెం దూరంలో వాండా ఒరోబ్యోవ్‌లుకూడా స్కేట్ చేస్తున్నారు. వాళ్ళిద్దరూ ఏవో కబుర్లాడుకుంటూ కిలకిల నవ్వుకుంటూ మంచుమీద జారుతూ ఉల్లాసంగా ఉన్నారు.

వీళ్ళ వ్యవహారం ముదిరిపోతున్నదే! వీళ్ళ వరస బాగలేదు. చూచి భరించలేకపోతున్నాను!" అన్నాడు జిరియాన్‌స్కీ, ఇగోర్‌తో.

ఈ మాటలు విన్నది వాండా. వెంటనే ఒరోబ్యోవ్‌ను వదిలి, వంటిగా దూరంగా వెళ్ళిపోయింది. జిరియాన్‌స్కీ ఒరోబ్యోవ్‌ను పిలిచి ఇలా అన్నాడు:

"ఒరోబ్యోవ్! ఇహనీ సరస సల్లాపాలు చాలించు. చెబుతున్నాను విను.

"ఏమిటి ఇందులో తప్పు! అన్నాడు డ్రైవర్ ఒరోబ్యోవ్, కలవరంతో.

"ఇహ కట్టిపెట్టమని చెబుతున్నానుగా. ఎందుకాపిల్లను చెడగొడుతున్నావ్? మళ్ళీ మీఇద్దరు ఒకచోట కనుపిస్తే సాధారణ సమావేశం ముందుపెడతాను, జాగర్త!" అన్నాడు జిరియాన్‌స్కీ.

"నన్నేం బెదిరించకండి. మీ సమావేశం ముందు పెట్టడానికి నేనేం కాలనీ సభ్యుణ్ణికాను." అన్నాడు ఒరోబ్యోవ్.

"నీ వెవరివో చూపిస్తాలే! నీవు కాలనీలో పనిచేస్తున్నంతసేపూ మా విషయాల్లో జోక్యం కలిగించుకోడానికి నీ కేమాత్రం హక్కు లేదు."

"నేనేం తప్పుపని చేయడంలేదు."

"అదితప్పో, ఒప్పో తేల్చవలసిన వాళ్ళం మేము, నీవు కాదు... ఆపిల్లను నీవు ప్రేమించావా?"

"ఆ అభిప్రాయం మీ కెందుకు కలగాలి ?"

"మరి ప్రేమించకపోతే, ఆమెను పట్టుక ప్రేలాడడం దేనికి ?"

"ఒకవేళ ప్రేమిస్తే మాత్రం తప్పేమిటి ?" అన్నాడు ఒరోబ్యోవ్.

జిరియాన్‌స్కీ అతనివంక కోపంగా చూచాడు.

"ఆ, అలాదారికిరా! ప్రేమిస్తున్నట్టు నీవే ఒప్పుకున్నావుగా. ఆవిషయం ఇప్పటికా నీకు తెలిసింది ?"

"ప్రేమించడానికి నేను తగనంటారా ?" అని అడిగాడు ఒరోబ్యోవ్.

జిరియాన్‌స్కీ కనుబొమలు చిట్లించుకున్నాను. ఒరోబ్యోవ్ ఉండవలసిన స్థితి ఏమిటో అతనికి చూపించాలనుకున్నాడు.

"ఇహ ఆపిల్ల విషయం పట్టించుకోకు. నీవెక్కడ ? ఆపిల్ల ఎక్కడ ? వాండా నీలాంటి వాళ్ళకోసం పుట్టలేదు !" అన్నాడు.

"నాలాంటి వాళ్ళకోసం పుట్టలేదూ ? ఆపిల్ల విషయం పట్టించుకోకుండా ఉండాలా ?"

"అవును." అన్నాడు జిరియాన్‌స్కీ.

ఆనాటినుంచీ వాండా, ఒరోబ్యోవ్‌లు కలిసి తిరగడం మానే శారు. ఇదివరకు విశ్రాంతి మందిరంలో, లారీలో, లైబ్రరీలో, కాలనీ సభ్యులకు ఆజంట కంటపడుతూ ఉండేది. ఇప్పుడు ఎవరితీరున వారు వుంటున్నారు. అయినప్పటికీ వాండా పూర్వంలాగా అనం దంగా కనుపిస్తున్నది. వర్కుషాపులోకూడా ఉల్లాసంగా పాడుతూ పనిచేస్తున్నది. లారీడ్రైవర్ ఒరోబ్యోవ్‌కూడా ఎప్పటిలాగే కులా సాగా పనిచేసుక పోతున్నాడు. అప్పటికంటె ఇప్పుడు ఎక్కువగా మాట్లాడుతున్నాడు. బుగ్గలుమరీ గులాబీల్లా ఎరుపెక్కాయి. విడి విడిగా ఉంటూ కూడా ఆఇరువురూ అంతహాయిగా గడపడం అం దరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

# 20

# దొంగఎవరు? దొరఎవరు?

ఏప్రిల్ నెలలో ఫ్యాక్టరీ నిర్మాణం చురుకుగా ప్రారంభ మైంది. అప్పుడే పునాదులమీద రెండంతస్థులు లేచాయి. ఆ కట్టడం చాలా పెద్దది. అనేక గదులు, విశాలమైన హాలులు ఉన్నాయి. ఈ భవన నిర్మాణం అందరినీ ఆకర్షిస్తోంది. కాలనీ పాతసభ్యులు దానివంక అదేపనిగా చూస్తున్నారు. ఆశ్చర్య చకితులవుతున్నారు. ఇహ నాలుగోదళ సభ్యుల విషయం వేరేచెప్పనక్కర్లేదు. ఫ్యాక్టరీ భవనం ఒక అయస్కాంతలా వారిని ఆకర్షిస్తోంది. తాపీపనివాళ్ళు పనిచేసుకుంటూఉంటే, నాలుగోదళ సభ్యులు అక్కడే నిలుచుని ఏవేవో ప్రశ్నలు వేస్తున్నారు. అనేక విషయాలు అడిగి తెలుసు కుంటున్నారు. అంతస్తుమీాద అంతస్తు లేస్తున్నకొద్దీ, కాలనీ సభ్యుల సందడి అణగిపోజొచ్చింది. అక్కడికి ఎవరు వచ్చినా, పని వాళ్ళువారిని రానివ్వడంలేదు. అక్కడెవరూ ఉండకూడదని చెబు తున్నారు.

ఇక్కడికెవరూ రాకండి. పొరపాటున కాలుజారిపడ్డారూ అంటే ప్రమాదం వస్తుంది.” అంటున్నారు పనివాళ్ళు.

“మేంపడం. మేడజాగర్తగా ఎక్కుతాం. ఎక్కిచూడ నివ్వండి” అంటున్నారు కుర్రవాళ్ళు.

ఒకవైపున ఇలా “భవననిర్మాణం చురుగ్గా సాగుతోంటే, మరొక వైపున ఈ వివరాలు కాలనీ సభ్యులకు ఎప్పటికప్పుడు తెలిసేలాగా రేఖాపటంలో స్పష్టంగా పేర్కొంటున్నారు. ఏప్రిల్ 15వ తేదీన పరిస్థితులు ఈ విధంగా వివరింప బడ్డాయి.

"యుద్ధరంగంలో కుడివైపున మహిళాదళాల పురోగమనం అప్రతిహతంగా సాగుతోంది. మే17వ తేదీకిసాధించవలసినవిజయాలు వారుఇప్పటికేసాధించారు. శత్రుసైనికులుభీభత్సంతో నలువైపులా చెల్లాచెదరై తిరోగమిస్తున్నారు. నూతన ఫ్యాక్టరీ నిర్మాణం శీఘ్ర గతిని కొనసాగుతున్నదని ప్రధాన కార్యాలయంనుంచి ఇప్పుడే తాజావార్తలందాయి, విప్లవ పతాకం అక్కడ ప్రతిష్ఠితమైంది. మధ్యభాగంలో ఏప్రిల్ 21 వ తేదీకి చేరవలసిన సరిహద్దులను మన సైనికులు నేడేచేరుకున్నారు. ఎడమవైపున మాత్రం మన సైనికుల పురోగమనం సంతృప్తికరంగా లేదు. వాళ్ళు ఇతర సైనికులతో పాటు సరిసమానంగా ముందుకు చొచ్చుకపోలేక పోతున్నారు. మార్చి 15 వ తేదీవరకూ వచ్చి అక్కడ ఆగిపోయారు – అంటే ఒకనెల వెనకపడి పోయారన్నమాట. వడ్రంగుల స్తంభన ఇలా ఉన్నప్పటికీ ఇతర సైనికుల పురోభివృద్ధి వల్ల శత్రుసేనలు వెనుకంజ వేస్తున్నాయి. అందుకు మధ్యభాగంలో, కుడిభాగంలో పోరాడు తున్న మన సైనికుల ధైర్యసాహసాలే కారణం. మొత్తంమీద అనుకున్న ప్రణాళిక కంటె మనం నాలుగురోజులు ముందున్నాం. ఇందుకు ప్రత్యేకించి మనం మహిళా దళాలను అభినందించవలసి ఉంది. మహిళా మణులారా! ముందుకు సాగండి! మీకృషి అనన్య సామాన్యమైనది! అయిదవ, పదకొండవ దళసభ్యులకు అభి వందనాలు!"

రేఖాపటంముందు కుర్రాళ్ళు గుమిగూడారు. రేఖాపటాన్ని పరిశీలించ సాగారు.

"అందరిలోకీ వెనకబడ్డది వడ్రంగులు." అన్నాడు వాన్యా.

"అవును అక్కడే స్తంభించి పోయారు." అంటూనవ్వాడు బిగోనక్.

వడ్రంగులెవరూ అప్పుడక్కడికి రాలేదు. ఇగోర్ కూడా వాళ్ళతోపాటు రాకుండా ఉండిపోయేవాడేకాని, తానుతయారు చేసిన ఆరేఖాపటపు నివేదికను చదివి అంతా ఏమనుకుంటున్నారో

విందామని అక్కడికి వచ్చాడు. అదీకాక అందరిలోను నిలుచుని తాను తయారుచేసిన ఆ నివేదికను మళ్ళీ చదువుకుంటే మరీ సర దాగా ఉంటుంది.

వడ్రంగులు పనిలో వెనక పడ్డారని వాన్యా, బిగోనక్ లు విమర్శిస్తున్నారు. అదివిని ఇగోర్ ఇలా అన్నాడు.

"అసలు విషయం మీకర్థం కాదు. మీరుచేసేపని వేరు-వడ్రంగంపని వేరు. ఒక మేజాబల్ల తయారుచేసి, చూడండి, మీకే తెలుస్తుంది, అది ఎంత కష్టమో"

"ఊరుకోవయ్యా ఎవరన్నా వింటే నవ్విపోతారు. మీ వాళ్ళు ఎక్కడ బయలుదేరారో అక్కడే ఉండిపోయారు. ఒక నెల వెనకబడిపోయారు" అన్నాడు వాన్యా.

"గురిందగింజ తన క్రిందనున్న నలుపు తానెరుగదట: అట్లా వుంది మీవిమర్శ. మీరా మమ్మల్ని విమర్శించేవాళ్ళు? బల్లలు తయారుచేసే పనే మీకు తెలీదు." అన్నాడు ఇగోర్.

"ఏమైనా సరే మీ పని అధ్వాన్నంగా వున్నది. రేఖా పటంలో ఎడమవైపు చూస్తే తలనొప్పి వస్తుంది" అన్నాడు బిగోనక్.

కొత్తగా కాలనీలో చేరిన కుర్రవాడు పొడ్విస్కో రేఖా పటాన్ని పరిశీలించిచూచాడు. కుడివైపున అరుణపతాకం గుర్తుగా గీసి వుంది. పొడ్విస్కో ఆరవదళంలో సభ్యుడుగా ఉంటున్నాడు. అతనికి కూడ మహిళా దళాలు చేస్తున్న కృషి అద్భుతం అనిపించింది.

ఈ ఏప్రిల్ నెలలో రోజులు హాయిగా, ఆనందంగా గడిచిపోతున్నాయి. హఠాత్తుగా ఋతువుమారిపోవడంవల్ల కాలనీవాతావరణం సయితం మారిపోయింది. తోటమాలి ఒక జర్మనీవాడు. తన పనిముట్లు పట్టుకుని తోటను బాగుచేయడం మొదలు పెట్టాడు. ఒక్కొక్క దళానికి ఒక్కొక్క సభ్యుడు చొప్పున సంఘాలుగా ఏర్పడి సభ్యులు, హుషారుగా తోటపనులు చేస్తున్నారు. కాలి

బొటలు, పూలత్రోవలు శుభ్రంగా తుడిచి బాగుచేస్తున్నారు. ఇదివరకు కాలనీలో కోట్లు ఎవరో దొంగిలించిన సంగతి సభ్యులు క్రమేపీ మరిచిపోసాగారు. కాని ఇంతలోనే అకస్మాత్తుగా ఒక సంఘటన జరిగింది. ఆరవదళం కమాండర్ పేరు షూరాజల్కిన్. అతని పంట్లాంలో పర్సు పత్తాలేకుండా పోయింది. అందులో పది రూబుళ్ళున్నాయి. ఎవరు కొట్టేశారో తెలీదు. అదేరాత్రి ప్రదర్శనశాలలో పెద్ద తెరగుడ్డ కూడా కనుపించకుండా పోయింది. అది ఎన్నో వందల రూబుళ్ళు ఖరీదుచేసే తెరగుడ్డ. ప్రత్యేకంగా, ముచ్చటపడి, దాన్ని కుట్టించారు కాలనీ అధికారులు. ఈ వ్యవహారం అంతాచూచి, దొంగలను పట్టేటందుకు ఒక మంచికుక్కను తెప్పిస్తానని చెప్పాడు జకరోవ్.

అప్పటినుంచీ కాలనీలో ఏకుక్క కనుపించినా పిల్లలు, అది దొంగలను పట్టేకుక్క అనే అనుకోసాగారు. కాని జకరోవ్ మాత్రం ఇంకా అలాంటి కుక్కను తెప్పించలేదు. ఈ విషయం అతను సాధారణ సమావేశం ముందు చర్చకు పెట్టాడు. సమావేశంలో మార్కు గ్రిన్‌హాస్ ఇలా అన్నాడు :

"కామ్రేడ్స్! కాలనీలో జరిగిన సంఘటనకు మనమంతా తలలు వంచుకోవాలి. ఇది అందరికీ అవమానకరమైన విషయం. కాలనీలో చీటికీ మాటికీ దొంగతనాలు జరుగుతున్నాయని నగరంలో వాళ్ళకు తెలిస్తే, మనపేరు, ప్రతిష్టలు ఏమవుతాయి? తెరగుడ్డ ఎవరు దొంగిలించారో, ఎలా పోయిందో - దాని అంతుమనం కనుక్కోవాలి. లేక మనం ఇలాగే తాత్సారం చేస్తూ చూస్తూ కూచుంటే ఇంకా కొన్నాళ్ళకు ఇనప్పెట్టెకూడా లపీమని ఎగిర పోతుంది !"

"అదెక్కడికీ పోదులే. కాపలావాళ్ళు అహర్నిశలూ అక్కడే ఉంటారు. కాలనీలో ప్రతివస్తువూ పోకుండా కాపలా కాయడమంటే అర్థంలేని పని. అసలదికాదు ప్రశ్న—దొంగతనం చెయ్యాలనే బుద్ధి ఎందుకు కలగాలి? ఇంటి దొంగను ఈశ్వరుడైనా

పట్టలేడట! అలా ఉంది కాలనీలో దొంగతనం. ఆ దొంగ మనతోనే ఉంటున్నాడు, మనతోనే భోజనం చేస్తున్నాడు, పనిచేస్తున్నాడు, మన మధ్యనే నిద్రపోతున్నాడు. ఆ ఒక్క దొంగను పట్టడం కోసం మనం కాలనీలో అందరినీ అనుమానించనక్కర్లేదు. అన్నిటికీ తాళాలు బిగించి కాపలాలు పెట్టక్కర్లేదు. అలా నేను చెయ్యను. చెయ్యమని మరెవరూ సలహా చెప్పక్కర్లేదుకూడా. కాని ఒక్క విషయం-ఎప్పుడో ఒకప్పుడు ఆ దొంగను నా చేతులతోనే నే పట్టుకుంటాను." అన్నాడు జిరియాన్‌స్కీ.

తరువాత రైజికోవ్ తను మాట్లాడతానని చెయ్యి ఎత్తాడు. అంచాత అతన్ని మాట్లాడమన్నారు సభ్యులు. అతనిలా చెప్ప సాగాడు :

"నేను ఒక విషయం చెప్పదలుచుకున్నాను కామ్రేడ్స్ ! జాగ్రత్తగా వినండి. నిన్న నాకు సెలవుదినం. బస్తీనుంచి కాలనీకి తిరిగి వస్తూంటే, కాలనీ వెలుపల అడవిలో మన కాలనీలో చేరిన కొత్తకుర్రాడు పాడ్విస్కీ అక్కడ తారట్లాడుతున్నాడు. అతని వాలకం చూడగానే నాకు అనుమానంతట్టింది. గబుక్కునచేతులు రెండూ పట్టుకుని వాడి పంట్లాం జేబుల్లో చెయ్యిపెట్టి చూచాను. వాడి జేబుల్లో ఇవిగో-ఈ వస్తువులు దొరికాయి." ఇలా అని రైజికోవ్ తన జేబులోనుంచి కొన్ని వస్తువులు తీసి బయట పెట్టాడు. అవి ఒక మరపెన్నలు, క్రిమియా ప్రకృతి దృశ్యాలతో ఉన్న ఒక ఫొటో ఆల్బమ్, ఒక సినిమా టిక్కెట్టు, ఒక చాకెలెట్ల ప్యాకెట్టు, రెండు వెన్న బిస్కెట్ల పొట్లాలు.

వాటిని చూచిన వెంటనే సభ్యులు ఆవేశపూరితులయినారు కొత్తకుర్రాడైన పాడ్విస్కీను పట్టుకుని ఘుంచుకు త్రోశారు.

"ఇవి నీవు కొనుక్కున్న వస్తువులేనా ?" అని అతన్ని అడిగాడు టూర్‌స్కీ.

"అవును. నేనే కొనుక్కున్నాను." అని చెప్పాడు పాడ్విస్కీ.

"నీకు డబ్బెక్కడిది ?" అని మళ్ళీ అడిగాడు టార్ స్కీ.

"మా అక్కయ్య డబ్బు పంపించింది. మనియార్డరు రావడం ఇక్కడందరూ చూచారుకూడా."

పొడ్వోస్కీ ఈ మాట అనగానే నలువైపులనుంచి "అవునవును" అంటూ కేకలు వినిపించాయి!

"అవును. మూడురోజులక్రితం అతనికి మూడు రూబుళ్ళు మనియార్డరు వచ్చింది."

తరువాత టార్ స్కీ అతన్ని కూచోమన్నాడు. కాని అతను కూచునేలోగా జకరోవ్ ఇలా అడిగాడు :

"పొడ్వోస్కీ ! బస్తీకివెళ్ళి నీవేం చేశావు ? ఎక్కడెక్కడ తిరిగావు, ఇంకా ఏమేమిటి కొన్నావు ? ఏమైనా పండ్లరసాలు తాగావా ?"

"ఆ, తాగాను."

"ఎన్ని గ్లాసులు ?"

"రెండు."

"సరే, అయితే-బిస్కట్లు ఎన్నితిన్నావు ? నాలుగా ?"

"కాదు-"

"అయితే ఎన్ని ?"

"మూడు."

"ఎంత డబ్బయింది ?"

"ఇరవై కోపెక్కులు."

"కాలనీనుంచి బస్తీకి ట్రాంబండిలోనే వెళ్ళావా ?"

"ఆ,"

"ట్రాం చార్జీ ఇచ్చావా ?"

"ఆ, ఇచ్చాను."

"మళ్ళీ తిరిగి వచ్చేటప్పుడు ?"

"ట్రాం మీదనే వచ్చాను."

"మళ్లీ చార్జీ చెల్లించావా ?"

"ఆ, చెల్లించాను."

"ఆ ఫొటో ఆల్బమ్ ఎంతకు కొన్నావు?"

"సరిగా గుర్తులేదు - నలుభయి అయిదో-యాభై అయిదో కోపెక్కులు."

"దాని ఖరీదు నలభై అయిదేలే-అయితే చాక్‌లెట్లు ఎంత?

"ఎనభై కోపెక్కులు."

"పెన్సిలు?"

"నలభై."

"బాగుంది. సినిమా టికెట్టు ముప్పయిఅయిదు కోపెక్కులు కదూ? ఇప్పుడు మొత్తం లెఖ్ఖ చూద్దాం......నీవు మొత్తం మూడు రూబుళ్ళ ముప్పయి అయిదు కోపెక్కులు ఖర్చు పెట్టావు అంతేనా?"

"అవును——అంతే."

"మరి నీదగ్గరున్నది మూడు రూబుళ్ళేగా-తక్కిన ముప్పయి అయిదు కోపెక్కులు ఎలా వచ్చాయి?"

"నేను ఖర్చుపెట్టింది మూడు రూబుళ్ళే - అంతకన్న ఎక్కువ డబ్బు నాదగ్గర లేదు. మాఅక్కయ్య నాకు అంతే పంపించింది." అన్నాడు పొడ్వొస్కో కంగారు పడుతూ.

"అది సరేలే - తక్కిన ముప్పయి అయిదు కోపెక్కుల మాటా అడుగుతున్నాను నేను."

"అంతఖర్చు పెట్టడానికీ నాదగ్గర లేనిదే."

"మరి ఈ వెన్న బిస్కట్లు ఎల్లావచ్చాయి? అవి నేనింకా లెక్క వెయ్యలేదే"

ఏ వెన్న బిస్కట్లు ?

"ఇవిగో ఇవి-ఈ పొట్లాలు ఇలాంటివింకా ఎన్నో కొన్నావు

పొడ్వొస్కో గాభరాపడ్డాడు. ఏదో గొణిగాడు. జకరోవ్ నవ్వుతూ ఇలా అన్నాడు.

"దీన్నిబట్టి నీ దగ్గర చాలా డబ్బున్నదన్నమాట ?"

పాడ్వోస్కీ జవాబు చెప్పలేదు. గ్రుడ్లువెళ్ళబెట్టి వకానంగా ఉండిపోయాడు. అతని ప్రక్కనే రోడ్నేవ్ నిలుచున్నాడు.

"చెప్పవయ్యా. భయంలేదు. అంతడబ్బు నీ వెక్కడనుంచి కొట్టుకొచ్చావో చెప్పు!

"నే నెక్కడనుంచీ కొట్టుకురాలేదు.

మా అక్కయ్యనాకు మూడు రూబుళ్ళు పంపించింది."

"నివ్వు అంతకంటె ఎక్కువే ఖర్చుపెట్టావుకదూ?"

పాడ్వోస్కీ తల ఊపాడు.

ఆ రాత్రి మెల్లగా షూరా జల్టకిన్ పంట్లాం జేబులో పర్సుకొట్టేసింది నీవేనన్నమాట?" అన్నాడు మళ్ళీరోడ్నేవ్.

టార్సీకీ నవ్వుతూ జకరోవ్ వంక చూచాడు.

"పాడ్వోస్కీ: ఇహ నీవు వెళ్ళి కూచో దొంగతనం నీకల వాటేలాగుంది. ఇంతటితో అయినట్టేనా లేకముందు కూడ ఇంకా సాగిస్తావా?" అని అడిగాడు.

"ఇహ ఎప్పటికీ చెయ్యను. ఇదే ఆఖరుసారి. ప్రమాణంచేసి చెబుతున్నాను."

"ఎందుకు చెయ్యవు ?"

"చెయ్యను-కలలోకూడా చెయ్యను. దొంగతనం చాలా నీచమైనపని."

సభ్యులవంక తిరిగి టార్సీకీ ఇలా అన్నాడు :

"ఇతన్ని శిక్షించాలంటారా ? లేక క్షమించి వదిలిపెడదా మంటారా ?"

ఒలెంకో లేచి ఇలా అన్నాడు :

"ఇహ ఆట్టే కాలయాపన చెయ్యకండి. ఈ విషయం ఇంత టితో వదిలేద్దాం. రైజికోవ్ మంచిపని చేశాడు. పాడ్వోస్కీ జేబులో తడిమి అతన్ని పట్టుకోకపోతే మనకీ విషయం తెలిసేది కాదు. మరొకర్ని అనుమానించి ఉండేవాళ్ళం. పాడ్వోస్కీ ఇంత

టితో ఊరుకుంటాడనుకోను నేను. అంచాత అతన్ని ఒక కంట కనిపెడుతూఉందాం,"

"ఇహ ఎన్నటికీ చెయ్యను, చెయ్యను - నా మాట నమ్మండి." అని అరిచాడు పొడ్వోస్కో.

"సరే,చూస్తాంగా ... ఇహానీవువెళ్ళొచ్చు ... ... పొడ్వోస్కో మహాఅయితే పదిరూబుళ్ళే కొట్టేసి ఉంటాడు. మరి తెరగుడ్డ సంగతి ? అది ఇతని పనికాదు. దాన్ని ఎవరో శత్రువులు కావాలని కొట్టేశారు. మన శత్రువులను మనం ఒక కంట కనిపెట్టి వుండాలి. తెర దొంగిలించడం ఏ ఒక్కడిపనో కాదు. నలుగురో, అయిదుగురో కలిసి చేసినపని అది."

ఈ విషయంపై మళ్ళీ సభికులలో తీవ్రంగా చర్చ కొంత సాగింది. ఆ శత్రువులు మన ప్రక్కనే ఉండవచ్చునన్నారుకొందరు. ఇక్కడే-ఈ సమావేశంలో కూచుని ఉండవచ్చునన్నారు మరి కొందరు. కాదు ఇది కాలనీ సభ్యులపని కాదు. ఇప్పుడు కొత్త ఫ్యాక్టరీ నిర్మాణం సాగుతున్నదికదా. బయటినుంచి అనేకమంది తాపీపనివాళ్ళు, తదితరులు వస్తున్నారు, పోతున్నారు. వాళ్ళలో దొంగ ఎవరో దొర ఎవరో ఎవరికి తెలుసు ? అని ప్రశ్నించారు ఇంకా కొందరు.

ఈ చర్చలన్నీ విన్నాడు డెమ్. అతను ఒక సాంకేతిక నిపుణుడు. ఫ్యాక్టరీ నిర్మాణంలో కాలనీ తరఫున బాధ్యత వహిస్తున్నాడు. అతనిలా అన్నాడు :

"బయటినుంచి వచ్చి పనిచేస్తున్నవారిలో తాపీపనివాళ్ళు పెద్దమనుష్యులే - అది నాఅనుభవం. వాళ్లెప్పుడూ ఇలాంటిపని చెయ్యరు. ఇహ తక్కిన వాళ్ళవిషయం నేనెలా చెప్పేది ? వాళ్ళ మీద నాకూ కొంత అనుమానం ఉన్నది."

డెమ్ మాటలు విని జకరోవ్ తలపంకించాడు :

అవును, వాళ్ళలో ఎవరో ఒకరు ఈపని చేసిఉండొచ్చు." అనుకున్నాడు తనలో.

# 21

# మేదినోత్సవం - శాంతిసందేశం

కాలనీలో జీవితం ప్రశాంతంగా గడిచిపోతున్నది. ఒకనాడు ఉదయం ఆరు గంటలవేళ బిగ్‌సన్ మామూలుగా బిగిల్ ఊదాడు:

"రాత్రి గడిచింది
రాత్రి గడిచింది !
నిద్రించనేల తమ్ముడూ !
నిద్రించనేల చెల్లెలూ !
ఎవరు నిద్రిస్తారు
సోమరులు తప్ప !
లేవయ్యా తమ్ముడూ
లేవమ్మ చెల్లెలూ !
పనిముట్లు తీసుకుని
పనులు చెయ్యండి !
పనివేళ అయినది
పనులు చెయ్యండి !!"

అని మేలుకొలుపులు పాడాడు.

సూర్యోదయం కాగానే పిల్లలు నిద్దర్లులేచారు. పడకగదుల లోనుంచి బయటకొచ్చారు. కాలకృత్యాలు తీర్చుకున్నారు. ఎవరి పనులలోనికి వారువెళ్ళిపోయారు. పాఠశాలలో పాఠాలు మొదలైనాయి. ఫ్యాక్టరీలో పనులు ప్రారంభమైనాయి. అంతటా సందడిగా ఉన్నది. కాలనీ కళకళలాడుతున్నది. కాలనీలో ఒకవైపు నుంచి సంగీతం వినవస్తున్నది. వింతవింత వాయిద్యాలు మ్రోగు

తున్నాయి. ప్రదర్శన శాలలో నాటకం రిహార్సల్సు చేస్తున్నారు. ప్రదర్శనశాలలో ఇదివరకు తెరగుడ్డ మాయమైనసంగతి ఇప్పుడు సభ్యు లెవరూ పట్టించుకోడంలేదు. క్రమేపీ ఆవిషయం మరచిపో సాగారు. మేదినోత్సవాలు ఆనందోత్సవాలు మధ్య సాగిపోతు న్నాయి. కాలనీసభ్యులు కొత్తదుస్తులు వేసుకున్నారు. దళాలుగా ఏర్పడ్డారు. నగరానికి వెళ్ళారు. అక్కడ ఇతర సైనిక దళాలతో కలిసి సైనిక విన్యాసాలు కావించారు. వారి విన్యాసాల వైఖరి చూచి నగరవాసులు అబ్బురపడ్డారు. ఆనందంతో పొంగిపోయారు.

వాన్యా గల్చెంకో ఇప్పుడు వెనకటిలా లేడు. వాయిద్య దళంలో మంచి వాయిద్యగాడై ప్రసిద్ధికెక్కాడు. కాని అతనికి అంతటితో సంతృప్తి చేకూరలేదు. అందరికంటె ఇంకా మిన్నగా సంగీతంలో ముందుకు పోవాలని అభిలషిస్తున్నాడు. అందుకు తగిన సాధన అనవరతం చేస్తున్నాడు.

మే 2 వ తేదీన కాలనీకి కొంతమంది సైనికులు విచ్చే శారు. వాళ్ళందరూ పెద్ద ఉద్యోగులు. వారితోపాటు ప్రధాన సైనికోద్యోగికూడా పర్యవేక్షణకోసం అక్కడికి విచ్చేశాడు. ఆ సైనిక బృందం కాలనీ అంతా తిరిగి పరిశీలించింది. కాలనీ సభ్యు లతో కలిసి విందులో పాల్గొన్నారు. సాయంకాలం బృంద గానం విన్నారు. తరువాత సభ్యుల సమావేశం జరిగింది. వేదిక మధ్యభాగంలో స్టాలిన్ విగ్రహం ప్రతిష్ఠించారు. రకరకాల, రంగు రంగుల పూలగుత్తులతో అలంకరించారు. బ్యాండు వాయి ద్యాలు మ్రోగాయి. బాల్కనీనుంచి మూడుసార్లు, మూడు పదాతి దళాలు కదం తొక్కుతూ, సమావేశస్థలానికి చేరుకున్నాయి. అందులో ఆఖరుదళం అరుణపతాకాన్ని తెచ్చి స్టాలిన్ విగ్రహం చెంత నిలబడింది. సైనిక అభివందన లాంఛనప్రాయంగా ముగి సింది. అందులో వాన్యా, బిగోనక్ లు ఉన్నారు. నగరంనుంచి వచ్చిన సైనికోద్యోగులు అంతర్జాతీయ పరిస్థితినిగురించి విపులంగా ప్రసంగించి ఇలా ముగించారు :

మిమ్మల్ని మేము హృదయపూర్వకంగా అభినందిస్తున్నాం. ఒక విద్యుచ్ఛక్తి పరికరాలు తయారుచేసే కర్మాగారం నెలకొల్పడమంటే సామాన్యమైన విషయంకాదు. మీరు ఉత్పత్తిచేసిన పరికరాలను ఎర్రసైనికులు సంతోషంగా స్వీకరిస్తారని చెప్పడానికి మేమెంతో గర్విస్తున్నాం. ఇంతకు పూర్వం మనకు కావలసిన పరికరాలను మనం విదేశాలనుంచి తెచ్చుకుంటున్నాం. కాని ఇప్పుడు ఆ బెడద తప్పింది. ఇహ దేనికీ మనం విదేశాలపైన ఆధారపడవలసిన పనిలేదు. విదేశాల పనిముట్లతో అవసరం లేకుండా, యువకులయిన మీరు ఆ పనిముట్లు మనదేశంలోనే తయారుచేసి దేశరక్షణకు, దేశాభ్యున్నతికి తోడ్పడాలని కంకణం కట్టుకున్నారు. ఇది ఎంతో ముదావహం. మీదీక్ష మీకృషి అనన్య సామాన్యమైనది. మరి కొంతకాలం పోతే మీరు విద్యుత్పరికరాలనేకాదు, ఆయుధాలను కూడా ఉత్పత్తి చేస్తారు. ఎర్ర సైన్యంలో మీరూచేరి ఉత్తమ సైనికులుగా ప్రసిద్ధికెక్కి, దేశరక్షణా బాధ్యతను స్వీకరిస్తారని ఆశిస్తున్నాము. ఇక్కడ — ఈ కాలనీలో మీరు మీ జీవితాలను ఎలా తీర్చి దిద్దుకుంటున్నదీ మేము కనులారా కాంచాము. మీ శ్రమశిక్షణకు, మీ బుద్ధికుశలతకు మెచ్చుకుంటున్నాము. ఏపనిచేసినా మీరు త్రికరణశుద్ధిగా చేస్తున్నారు: కాలనీ సభ్యులందరికి ఇవే మా అభివందనాలు."

ఈ ప్రసంగం విని వాన్యా మంత్రముగ్ధుడిలా నిలుచుండిపోయాడు. ఇహ కొన్నాళ్ళకు తన దేశరక్షణకోసం తనూ ఎర్ర సైన్యంలో చేరతాడట! అవును అప్పుడు తన దేశంకోసం తాను తన సర్వస్వం ధారపోస్తాడు. ఎంత ఆనందం!

రాత్రి నాటక ప్రదర్శనం మొదలయింది. అది శాంతిసందేశం ఇచ్చే నాటకం. దానిపేరు 'ఎర్ర సైన్యం.' నాటకం రచించింది కామ్రేడ్ జకరోవ్. నాటకం ఆడేవారు కాలనీ వైజ్ఞానికశాఖాబృందం.

నాటకంలో శాంతిచిహ్నమైన పావురాయిపాత్ర ధరించిన వాడు మిస్టర్ వాన్యా గల్చెంకో. 'శాంతి కపోతంగా' అతని నటన ప్రేక్షకు లందర్నీ మంత్రముగ్ధులను కావించింది.

తెర ఎత్తారు. రంగస్థలంమీద కొన్ని దేశాల అధినేతలు, సేనాపతులు కూచున్నారు. ప్రపంచ రాజ్యాలను ఎలా కబళించ వలసిందీ మంతనాలు సాగిస్తున్నారు, మాయోపాయాలు పన్ను తున్నారు. ఇంతలో 'శాంతికపోతం' మెరుపు తీగలావచ్చి అక్కడ వాలింది. నేపథ్యంలో శాంతి గీతం వినిపించ సాగింది. యుద్ధోన్మాదులు వెనకబడిన దేశాల సిరి సంపదలను ఎలా కొల్లగొట్టవలసిందీ చర్చించుకుంటున్నారు. తమ సమర సన్నాహాలకు స్వస్తి చెప్పి విశ్వమానవకళ్యాణానికి కంకణం పట్టమని 'శాంతి కపోతం' వారిని హెచ్చరించింది. ప్రబోధం చేసింది. కాని నరరూప రాక్షసులు, రక్తపిపాసులు అయిన 'బూర్జువాలు' శాంతి సందేశాన్ని పెడచెవిన పెట్టారు. శాంతిని అవహేళన చేశారు. వెర్రెత్తినట్లు వికటాట్టహాసాలు కావించి విలయనృత్యం చేయసాగారు. అప్పుడు నేపథ్యంనుంచి కోటానుకోట్ల మానవకంఠాలు భూనభోంతరాళాలు దద్దరిల్లునట్లు వినిపించాయి :

"ఆపండి సమరం
ఆపండి సమరం !

విలయ నృత్యాలింక
ఇలపైన సాగవు !

ఆపండి సమరం
ఆపండి సమరం !

కావాలి శాంతి
రావాలి క్రాంతి ! !"

ఇలా పాడుకుంటూ ప్రపంచ ప్రజానీకం రంగభూమిపైకి వచ్చింది. యుద్ధోన్మాదుల ఆట కట్టింది. విలయ నృత్యాలు ఆగి

పోయినవి. శాంతి నృత్యం మొదలయింది. శాంతికాముకులైన ప్రపంచ ప్రజలకు విజయం చేకూరింది.

ప్రదర్శన ముగియగానే ప్రేక్షకుల కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. వాన్యా 'శాంతి కపోత' పాత్ర ధరించి చేసిన అభినయం అందర్నీ ఆకర్షించింది. అంతా అతన్ని అభినందించారు.

ఇదే ప్రదర్శనాన్ని తీరిక ఉన్నప్పుడు ఏదో ఒకరోజున ఎర్ర సైన్యాల నివాసగృహంలో ప్రదర్శించాలని జకరోవ్‌ను, సైనికాధికారులు కోరారు. అనుకున్నట్టుగానే ఒక వారం గడిచిన తరువాత నాటక సమాజం సభ్యులు ఆ భవనం చెంతకు చేరుకున్నారు. వాయిద్యదళం కొన్ని గీతాలను ఆలాపించింది. తరువాత సమాజం వారు మళ్ళీ అక్కడ 'శాంతి సందేశం' అనే నాటకాన్ని ప్రదర్శించారు. ప్రదర్శన ఎంతో రక్తి కట్టింది. రాత్రి చాలా ప్రొద్దుపోయింది. మళ్ళీ సభ్యులంతా కాలనీకి తిరిగి వచ్చారు. ఆ రాత్రి ఎవరికీ నిద్దర్లులేవు. నాటక ప్రదర్శనాన్నిగురించే అంతా మాట్లాడుకున్నారు. కాని మరునాడు ఉదయం ఆరుగంటలకల్లా మళ్ళీ మామూలుగా కాలనీ కార్యక్రమాలు మొదలైనాయి.

# 22
# కొత్త జీవితం వస్తుంది!

మేనెల 10 వ తేదీన రేఖాపటాన్నిబట్టి చూస్తే సమర భూమి పరిస్థితి ఇలా ఉన్నది : కుడివైపున మన సైనిక దళాలు శత్రువులను నిశ్శేషంగా ఓడించాయి. ఇవాల్టికి మహిళాదళాలు జూన్ 30 తేదీదాకా పురోగమించాయి. మధ్యభాగంలో లోహపు కార్మికులు మే 25 తేదీవరకూ పురోగమించారు. అంటే 15 రోజులు ముందున్నారన్నమాట. ఎడమభాగంలో పరిస్థితిమాత్రం సంతృప్తికరంగా లేదు. అక్కడి దళాలు మార్చి 15 దాకా వచ్చి ఆగిపోయాయి. కాని ఆ దళాలు తమ మందకొడితనాన్ని విడిచి

పుచ్చి ముందుకు పోవడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్టు సాధికారంగా వార్తలు వస్తున్నాయి.

మే 12 వ తేదీనాటి పరిస్థితి :

కుడిభాగంలో మన దళాలు జూలై 3 వరకూ ప్రయాణం చేసాయి. మహిళాదళాలు 17 రోజులు ముందున్నాయి. ఎడమ భాగంలో వడ్రంగులు కొంచం కొంచంగా ముందుకు పోతున్నారు.

మే 14 నాటి పరిస్థితి :

ఎడమ భాగంలో పోరాటం తీవ్రరూపం తాల్చింది. శత్రువులు తిరుగు ముఖం పట్టారు. మన దళాలు వారిని వెంటాడుతున్నాయి. వడ్రంగులు ఈ విధంగా పురోగతిని సాధించారు :

"ఏడువందల మేజాబల్లలు అయిదువందల డ్రాయర్లు,ఎనిమిది వందలడెబ్బయి కుర్చీలు తయారుచేసారు. యుద్ధంలో పట్టుబడిన సైనికులు సంస్కరింపబడ్డారు. ఇవాళ మన దళాలు ఆరురోజులు ముందున్నారు.

శత్రుసైనికులు హతాసులవుతున్నారు. కాలనీ సభ్యులారా మీకు మాఅభివందనాలు :

రేఖాపటంవైపుచూస్తే ఆవేళ అందరికి ఆశ్చర్యంగానే ఉన్నది. ఇంతలోనే ఏంతమార్పువచ్చింది! శత్రుసైన్యాలు చెల్లా చెదురవుతున్నాయి. మహిళా దళాలు అప్రతిహతంగా సాగిపోతూ నగరాన్ని సమీపిస్తున్నాయి. రేఖాపటం చూచి వాన్యా ఆవేశ పూరితుడైనాడు, తాను పనిచేస్తున్నదళాలు ముందుకు చొచ్చుకు పోతున్నాయి. తనదళాలేకాదు, కాలనీలో అన్నిదళాలు ఒకేతీరున శత్రువులను ఓడించి విజయాలను సాధిస్తున్నారు. ఇదంతా అతని కొకతీయటి కలలాగ ఉన్నది. శత్రుసైనికులు తమస్థావరాలు వదలి పారిపోతున్నారు. మరికొందరు పట్టుబడుతున్నారు.

"ఆహా ! అద్భుతం ! శత్రువులు తోకముడిచి ఎలా పారిపోతున్నారో చూడండి !" అనుకుంటూ ఆశ్చర్యపోతున్నాడు వాన్యా:

అదేరోజున రేఖాపటం చూడడానికి వృద్ధంగులందరూ అక్కడికి వచ్చారు. పటం వంక చూచారు. అందరికన్నా తాము వెనకబడినమాట నిజమే. కాని తాము సాధించిన విజయం సామాన్యమైనదేమీ కాదు. తమ దళాలు తయారుచేసిన కుర్చీలు, బెంచీలు, మేజాబల్లలు అసంఖ్యాకం. రేఖాపటంలో స్టేడియమ్ చుట్టూ అవి నిండివున్నట్లు చూపబడింది.

బ్లమ్‌కూడా అక్కడికి వచ్చాడు. అతనక్కడికి రావడం ఇదే మొదటిసారి. అతన్ని చూచి ఇగోర్ చెర్నియావిన్ ఇలా అన్నాడు :

"కామ్రేడ్ బ్లమ్ ! ఈ విజయాలు సాధించినంతమాత్రాన్నే సంతృప్తిపడకూడదు. శత్రువులింకా పొంచుకుని ఉన్నారు. వాళ్ళను రూపుమాపాలి. అప్పటికికాని నిద్రపోకూడదు."

"ఎవరా శత్రువులు ?" అన్నాడు బ్లమ్.

"చక్కటి కలప ఉన్నట్టయితే ఈపాటికి ఎంతైనా చేసి ఉందుము. మీరది సప్లయిచేశారుకాదు-జూన్ 10 వ తేదీదాకా పురోగమించి ఉండేవాళ్ళం." అన్నాడు ఇగోర్.

"ఏమిటంటున్నావు ? మంచికలప ఉంటే నీవే అక్కర్లేదు-ఎవరైనా చేస్తారు. అది గొప్ప విషయంకాదు. అంతేకాక కలప ఎలా ఉంటే నీకెందుకు ? నీవు చేసిన వస్తువు బాగుండాలి."

"మిషన్లుకూడా బాగా లేవు-చెడ్డమిషన్లుకూడా మన శత్రువులే."

"అయితే నీవు అవికూడా మన శత్రువులే అంటావా ?"

"అవును, అంటాను. అవేకాదు, కుట్టుమిషన్లుకూడా."

"అయితే ఆ మిషన్లన్నీ పెంటపోగుల్లో పారెయ్యమంటావా ?"

"నేనయితే ఈపాటికి నిరాక్షిణగా పారేసిఉండేవాణ్ణి."

ఇరువురూ ఇలా ప్రసంగించుకుంటున్నారు. అంతలో అక్కడికి వ్లాడిమిర్ కొలోస్ వచ్చాడు. అతనివెంట మరికొంత మంది కొమ్సోమోల్ సభ్యులున్నారు.

"పని దండుగ కావడానికి ఇవన్నీ కారణాలు కావు. నే చెబుతున్నది జాగ్రత్తగా వినండి. రోజుకు పనిగంటలు ఎనిమిది-అందులో మూడుగంటలు వృథాగా పోతున్నాయి." అన్నాడు వ్లాడిమిర్ కొలోస్.

"అవును, ఆమాట నిజమే." అన్నాడు సెడోవ్‌నిచ్.

"అంతకంటె ఎక్కువకాలమే వృథా అవుతున్నది." అని రెట్టించాడు రొగోవ్.

"దానికి తగిన పరికరాలు లేకపోవడంవల్ల మనవంట్లో రక్తం హరించిపోతున్నది." అన్నాడు జోరిన్.

ఈమాటలు విని బ్లమ్ కోపోద్రిక్తుడైనారు :

"ఏమిటి మీరంటున్నది ? వంట్లో రక్తం హరించిపోతున్నదీ ! ఎలా మీ రక్తం హరించిపోతున్నదో కాస్త చూపించండి, చూద్దాం." అన్నాడు.

"నేను నా ఒక్కరి విషయం మాట్లాడడం లేదు. సభ్యులందరి విషయం చెబుతున్నాను. జాగర్తగా వింటే నే చెప్పేదేమిటో మీకేఅర్థమవుతుంది." అన్నాడు మళ్ళీ జోరిన్

"అదేమిటోచెప్పు, వింటాను" అన్నాడు బ్లమ్.

"పార్టీ విధానం ఏమిటో, పద్ధతి ఏమిటో మీకు తెలుసునా?"

"ఏమిటా ప్రశ్న ? నాకెందుకు తెలీదూ ?"

"సరేఅయితే—పార్టీ ఏమిటి చెబుతున్నది ?—ఉత్పత్తి విధానం అభివృద్ధి కావాలంటున్నది, పరిశ్రమలు పెంపొందాలంటున్నది.కాని కొందరి ఆపసవ్యపద్ధతులవల్ల అనుకున్నంతగా ఉత్పత్తిని పెరగడంలేదు. మనం నడుం వంచి అన్నివిధాలా కృషిచెయ్యవలసి ఉంటుంది. యంత్రసామాగ్రిని, కుట్టుమిషన్లనూ, లోహపు పనిముట్లనూ తయారుచేసుకోవలసి వుంటుంది."

"అవును, ఆవిషయం మా కంటే మీకేఎక్కువ తెలుసును. పూర్వం జారిస్టు రష్యాలో ఉత్పత్తి విధానం చాలా ఘోరంగా ఉండేది. అంతఘోరంగా ఉన్నా, ఉత్పత్తి పెంచాలని పరిపాలకులు పీడించేవారు. కాదూ?"

"అవును. అప్పటిపరిస్థితులు దుర్భరంగా ఉండేవి."

"ప్రజలు బికారులుగా మారిపోయారు. ఎందుకలామారి పోయారంటారు ! ఉత్పత్తి విధానం ఘోరంగా ఉండడం వల్లనే ప్రజలకు తినడానికితిండి, కట్టడానికి బట్టఇవ్వకుండానే వాళ్ళరక్తాన్ని పీల్చి పిప్పి చేసేవారు. ఇప్పుడు మనకా పీడనాపద్ధతి లేదు. ఉత్పత్తి విధానం మారింది. కొత్త యంత్రాలు వచ్చాయి. కొత్తపద్ధతులు కనుక్కున్నాం. అలాంటప్పుడు జీవితం స్వర్గధామం కాక మరేమవు తుంది? ఇప్పుడు మీరు ప్రొద్దున ఆరుగంటలనుంచి అర్ధరాత్రి వరకూ పనిచేస్తున్నారు. అంతసేపు పనిచేయమని ఎవరుచెప్పారు?"

ఇదంతావిని బ్లమ్ కొంతసేపు ఆలోచించాడు. పెదవులు కొరుక్కున్నాడు. జోరిన్ వంక తదేకంగా చూచి ఇలా అన్నాడు:

"నీవు చెప్పినదంతా నిజం. కాని వుత్పత్తివిధానం బాగా అభివృద్ధి అయ్యేటంతవరకూ నేను బ్రతకనేమోఅని బెంగావున్నది."

శాంకోజోరిన్ బ్లమ్ బుజాలమీద చేతులు వేశారు:

"విచారించకు కామ్రేడ్ బ్లమ్, అంతవరకూ నీవు ఉంటావు నీకేం భయంలేదు." అన్నాడు.

బ్లమ్ కనులవెంట గిర్రున నీళ్ళు తిరిగాయి.

"అటుచూడు ! ఆ రేఖాపటంలో మన పురోగమనం ఎంత అద్భుతంగా ఉన్నదో చూడు ! ఇహ కొద్దికాలంలో మనం కొత్త ఫ్యాక్టరీ నిర్మించబోతున్నాం. దాంతో మన జీవితమే మారుతుంది, మన జీవితం మనదేశానికి మార్గదర్శక మవుతుంది." అన్నాడు జోరిన్.

విచారంలో మునిగిన బ్లమ్ ముఖం ఇప్పుడు ఆనందంతో విప్పారింది. ఏవో కలల అలలు అతని కనులలో కదిలాయి. అక్క-

డున్న సభ్యులంతా రాబోయే తమ నూతన జీవిత విధానాన్ని గురించి కబుర్లాడుకున్నారు. సంతోషంతో పొంగిపోయారు.

# 23
# గు డా రా లు

మేనెల సగం గడిచాక పిల్లలు కాలనీ ఆవరణంలో విడిగా గుడారాలు వేసుకోవడం మొదలుపెట్టారు. ఈ విషయాన్నే జక రోవ్ కమాండర్ల కౌన్సిలులో చర్చకు పెట్టాడు :

"మనకు ఇరవై గుడారాలు లభించాయి." అని చెప్పాడు.

ఈ వార్త కాలనీ అంతా కమ్ముకున్నది. కాని ఎవరికీ ఆశ్చర్యం కలగలేదు. నాడు ప్రదర్శనలో వాన్యా అభినయాన్ని చూచి ఒక ఉన్నతోద్యోగి ఎంతో మెచ్చుకున్నాడు. తన ఆనం దాన్ని వెలిబుచ్చుతూ ఈ గుడారాలను కాలనీవాసులకు బహూక రించాడు. గుడారాలు పాతవి. అక్కడక్కడ చిరిగిపోయిఉన్నాయి కూడా. అయినప్పటికీ చాలా అందంగా ఉన్నాయి, వాటిని చూడగానే అవి ఆఫీసర్లు ఉపయోగించుకునే గుడారాలని ఇట్టే తెలిసిపోతుంది.

విడిదికోసం పార్కు అవతల కొంత ప్రదేశాన్ని కేటా యించుకున్నారు. గుడారాలన్నీ ఒకేవరుసలో వేయాలని నిర్ణయించుకున్నారు. ఏ దళానికి ఎన్నో నెంబరు గుడారం ఇవ్వాలో చీట్లు కలిపివేశారు. దాని ప్రకారం ఒక్కొక్క దళానికి ఒక్కొక్క గుడారం వచ్చింది. కాని క్లావా మాత్రం టార్స్కీని ఇలా అడి గింది:

"అయిదు, పదకొండు దళాలకు వరుసలో మొదటి గుడారం, చివరి గుడారం కావాలి.

"ఏం? ఎందుకూ? అందరూ అవే కావాలని అడుగుతారు" అన్నాడు టార్స్కీ.

"ఎందుకు అడుగుతారు?"

"నీ వెందుకు అడుగుతున్నావో వాళ్ళూ అందుకే!"

"అలా కాదు. ఆడనాళ్ళకోసం ఆ గుడారాలు ప్రత్యేకంగా కేటాయించాలి."

"ఎందుకూ?"

"ఎందుకేమిటి?మగపిల్లలమధ్య ఆడపిల్లలుంటే బావుండదు.

ఈ మాట విని అక్కడున్న కుర్రవాళ్ళంతా గొల్లున నవ్వారు.

"అది అర్థంలేనిమాట. ఆడపిల్లలతో ఉన్న చిక్కే ఇది!" అన్నాడు టార్స్కీ.

"కాదు. ఏమైనాసరే మాకు ఆ రెండుగుడారాలు కావాలి" అన్నది క్లావా.

చర్చలో శాంకోజోరిన్ జోక్యం కలిగించుకున్నాడు:

"ఏమైనాసరే అలా ఇవ్వడానికి వీల్లేదు" అన్నాడు.

"ఎందుకు వీలులేదూ?" అని అడిగింది క్లావా.

"నేనొకసూత్రంమీద ఆధారపడి ఈమాట చెబుతున్నాను!"

"ఏమిటా సూత్రం?"

"నీవు అవే కావాలని ఎలా అడుగుతున్నావో, అవే వద్దని నేనూ అంటున్నాను! నీ ఉద్దేశం మగపిల్లలు ఆడపిల్లలను కొరుక్కు తింటారనా?"

"కాదు. కొరుక్కు తినరు. కాని ఆడపిల్లలకు పరిశుభ్రత కావాలి."

"పరిశుభ్రత మీ ఒక్కరికేనా ఏమిటి? మగపిల్లలకు అక్కర్లేదా?"

ఇలా చర్చ సాగుతోంటే జిరిగ్యాన్స్కీ మధ్యలో ఇలా అన్నాడు:

మనమంతా కాలనీ సభ్యులం. మన కాలనీలో ఎలాంటి రహస్యాలూ లేవు. ఎవరికీ ప్రత్యేకంగా ఏ గుడారం కేటాయించవలసిన అక్కర్లేదు! చీట్లువేసి చీట్లప్రకారం పంచుకుందాం."

దాంతో ఆడపిల్లలు ఇం కేమీ మాట్లాడలేదు. చీట్లు కలిపి వేశారు. ఆడపిల్లలకు మూడు, ఎనిమిది నెంబర్ల గుడారాలు వచ్చాయి.

నే 17 వ తేదీకల్లా ఎవరి గుడారాలు వారే నిర్మించుకోవాలని కమాండర్ల కౌన్సిలు ఉత్తర్వు చేసింది. పగటిపూట పిల్లలంతా పనులలోకి వెళుతున్నారు సాయంత్రం గుడారాలు వేసుకునే పనిలో నిమగ్నులవుతున్నారు. ఇలా గుడారాలు తయారైనాయి. చీట్లలో వచ్చిన ప్రకారం కాకుండా ఆడపిల్లలు వరుసలో చివరన పది, పదకొండవ గుడారాలను కట్టుకుంటున్నారు. అందుకెవరూ అభ్యంతరం చెప్పడంలేదు. కాని తొమ్మిదవదళపు కమాండర్ పొఖోర్షువ్ అటుచూచి మండిపడ్డాడు. కోపంగా గుడారాలు వేసుకుంటున్న ఆడపిల్లల చెంతకు వెళ్ళాడు:

"ఇక్కడ గుడారాలు వేసుకోమని మీకెవరు చెప్పారు?" అని తీవ్రంగా అడిగాడు.

ఆడపిల్లలు అతనిమాట వినిపించుకోలేదు. పైగా పకపక నవ్వుతూ తమ పనులలో నిమగ్నులైనారు. పొఖోర్షువ్ మళ్ళీ అదే ప్రశ్న వేశాడు. అప్పుడు ఒక అమ్మాయి ఇలా సమాధానం చెప్పింది :

"నీకెందుకయ్యా మావిషయం, అన్నిట్లోనూ వేలు పెడతానంటావే! వెళ్ళు, వెళ్లు!"

"నేను వ్యక్తిగత హోదాలో మిమ్మల్ని ప్రశ్నించడం లేదు. అధికార పూర్వకంగా అడుగుతున్నాను చెప్పండి."

"చెబుతాం, చెబుతాం. మేం చెప్పకుండానే నీవు తెలుసుకోవచ్చు. తిన్నగా వెళ్ళి డ్యూటీలో ఉన్న కమాండర్‌ను అడుగు."

పొఖోర్షువ్ మెల్లగా కమాండర్ రొడ్నేవ్ చెంతకు వెళ్ళాడు. అప్పుడు అతనిదే డ్యూటీ. రొడ్నేవ్‌ను చూచి "ఏమి టయ్యా రొడ్నేవ్! ఆడపిల్లలు చీటీ ప్రకారం కాకుండా వాళ్ళిష్ట మొచ్చినట్లు ఆ చివర వేసుకుంటున్నా రేమిటి గుడారాలు? ఎవ రిచ్చారు అనుమతి?" అని అడిగాడు పొఖోర్షువ్.

"అందుకు నీకేమిటయ్యా ఆశ్చర్యం? పదో నెంబరు గుడా రం చీటీ ప్రకారం నాలుగోదళానికి వచ్చింది. పదకొండో నెంబరు ఎనిమిదో దళానికి వచ్చింది. వాళ్ళకొచ్చిన గుడారాలు మహిళా దళాలకిచ్చి, మహిళా దళాలకొచ్చిన గుడారాలు తాము తీసు కున్నారు. ఇలా మార్పిడి చేసుకున్నారు." అని చెప్పాడు రొడ్నేవ్.

"ఓహో, అదా విషయం! వెళ్ళి నేనే అడుగుతాను." అంటూ పొఖోర్షువ్ పొట్ట ఊపుకుంటూ నాలుగోదళం కమాం డర్ జిరియాన్‌స్కీ దగ్గరికి వెళ్ళాడు:

"గుడారాలు మార్పిళ్ళు చేశారెందుకు?" అని అడిగాడు.

"అందులో తప్పేముంది? వారూ మేమూ సమ్మతించాం. మార్చుకున్నాం."

"ఏమిటీ! కౌన్సిలు సమావేశంలో చేసిన నిర్ణయం తల్ల క్రిందులైందన్నమాట! అక్కడ మీరేం చెప్పారు?"

"నేను కొత్తగా ఏమీ చెప్పలేదు. ఎవరికి ఏ గుడారం రావాలో చీట్లు వెయ్యమన్నాను."

"మరి చీట్లువచ్చిన ప్రకారం కాకుండా గుడారాలు ఎందుకు మార్చారు?"

"ఆడవాళ్ళు ఎక్కడున్నా నాకేం అభ్యంతరం లేదు. కాని మేం ఆడవాళ్ళం కనుక మాకు ప్రత్యేక సౌకర్యాలు కావా లని వాళ్ళు ఎక్కడో ఆకాశంనుంచి ఊడిపడ్డట్లు, వేరే గుడారాలు కావాలని పట్టుబట్టారు. సిద్ధాంతరీత్యా అదితప్పు. అందుకని సమా వేశంలో వాళ్ళ వాదనను నేను వ్యతిరేకించాను."

"సరే అయితే – మీ గుడారాలు వాళ్ళకెందుకివ్వాలి?"

"చెప్పానుకదూ, అందుకు వారూ మేమూ అంగీకరించామని – కావాలంటే మీరూ మేమూ కూడా స్థలాలు మార్చుకుందాం. మాకు మూడో నెంబరు గుడారం వచ్చింది. మీది అయిదో నెంబరు. మార్పిళ్ళు చేసుకుందామా? ఎవరితో మార్పిడి చేసుకున్నా మాకేం ఇబ్బంది లేదు – ఆడపిల్లలయినా ఒకటే, మగపిల్లలయినా ఒకటే. ఇది స్నేహితుల పరస్పర సమ్మతిమీద జరిగే పని."

పాఖోర్ఘువ్ అక్కడనుంచి వెళ్ళిపోయాడు. సరాసరి నెస్ట్రింకో దగ్గరికి వెళ్ళాడు, అతన్ని కూడ ఇలాగే ప్రశ్నించాడు. అతను ఇలా సమాధానం చెప్పాడు.

"ఇంతలో ఏం కొంపమునిగిపోయిందయ్యా? పెద్దగందరగోళం చేస్తున్నావు.! ఆడపిల్లలు మా గుడారం కావాలన్నారు. మేం ఇచ్చాం. ఇంతకూ మావాళ్ళందరికీ వరుసలో చివరఉండడం ఇష్టంలేదు."

"అయితే కౌన్సిలులో నీవు మాట్లాడిన మాటలన్నీ అబద్ధాలేనా?"

"ఏమిటా వెర్రిమొర్రి ప్రశ్న? అక్కడ పరిస్థితి వేరు. అక్కడ అంతా .సమాసమే. కనుక చీట్లు కలపమన్నాం" అన్నాడు నెస్ట్రెంకో.

ఇది విని పాఖోర్ఘువ్ తల ఊపుకుంటూ ఫార్కువైపు వెళ్ళాడు. తనలోతాను నవ్వుకున్నాడు: ఇలాఅనుకున్నాడు.

"అవును. ఇందులో చిత్రమేముంది? నెస్ట్రింకో చెప్పింది. నిజమే"

అ సాయంకాలం భవన నిర్మాణ నిపుణుడు డెమ్. జకరోవ్ చెంతకు వచ్చాడు. పిల్లలు తమ గుడారాలునిర్మించుకుంటున్నారు. ఫ్యాక్టరీ నిర్మాణానికి కేటాయించిన బల్లచెక్కలను గుడారాలకు ఉపయోగించడం చూచి అతను జకరోవ్‌తో ఇలా ఫిర్యాదు చేసాడు;

"క్రామేడ్ జకరోవ్! బల్లచెక్కలు తెప్పించింది ఫ్యాక్టరీ కోసం ఈ పిల్లలు వాటిని గుడారాలకు ఉపయోగిస్తున్నారు. ఇలా చేస్తే తరువాత నా తాడు తెగుతుంది! ప్రతివస్తువుకూ నేను సంజాయిషీ చెప్పుకోవాలి. ఇలాగయితే ఎలాగయ్యా;"

జకరోవ్ చిరునవ్వు నవ్వాడు. సప్లయి మేనేజరును పిలిపించాడు.

"ఆబల్లచెక్కలు మళ్ళీవాళ్ళకు వాపస్ చెయ్యవయ్యా." అనిచెప్పాడు.

"హెమ్న్ వెళ్ళి వాళ్ళనడగమనండి." అన్నాడు సప్లయి మేనేజరు.

అయ్యో బాబోయ్! వాళ్ళు నా మీద గజ్జలగుర్రాలు లేచినట్టు లేస్తారు! నే వెళ్ళి అడగడమే! నావల్ల కాదుబాబూ, మీరే అడగండి" అన్నాడు డెమ్.

ఇంతలో ఒకమూల జిరియాన్స్కీ వాళ్ళకు కనిపించాడు. అక్కడఉన్న బల్లచెక్కలను అతను తన గుడారంలోకి పట్టుకపోతున్నాడు. అతన్ని చూచి డెమ్ ఇలా అన్నాడు:

చూడండి, అటుచూడండి! జిరియాన్స్కీ అందరికంటె ఎక్కువే పట్టుకపోతున్నాడు!"

జకరోవ్, జిరియాన్స్కీని కేకవేశాడు:

ఏమిటయ్యా జిరియాన్స్కీ? ఏమిటి పని?" అని అడిగాడు.

"చెబుతాను నెమ్మదిగా వినండి. బల్లచెక్కలు మేమేం దొంగతనంగా పట్టుకపోవడంలేదు. గుడారాలు ఎత్తివేసిన తరువాత మళ్ళీ ఎక్కడి చెక్కలు అక్కడే పెడతాం. ఎవరు ఎన్ని చెక్కలు తీసుకున్నారో, అంతా అక్కడే లెక్క వ్రాసిపెడుతున్నాం. కావాలంటే వచ్చి ఒకమాటు సరిచూచుకోండి" అన్నాడు జిరియాన్స్కీ.

"అయితే ఇన్ని చెక్కలెందుకు నీకు?"

"ఇవి ఒక్క గుడారానికేకాదు. పదకొండవదళానికికూడా" అన్నాడు జిరియాన్స్కీ.

"వాళ్ళకు నీ వెందు కూ మోసుకెళ్ళడం?"

"ఆడవాళ్ళు ఇలాంటి బండపనులు చేసుకోలేరు - అందు కని వాళ్ళకు సహాయం చేస్తున్నాం."

జకరోవ్ చిరునవ్వు నవ్వి తల పంకించాడు.

"సరే క్యామేడ్ జెమ్! ఎవరెవరు ఎన్నెన్ని బల్ల చెక్కలు తీసుకుంటున్నారో - అవన్నీ జాబితా రాసుకో - జాబితామీద నేను సంతకం పెట్టి ఇస్తాను. గుడారాలు తీసివేశాక - శిశిరరుతువులో మళ్ళీ మీ బల్ల చెక్కలు మీకు జాగ్రత్తగా అప్పగిస్తాం" అన్నాడు.

పదిహేడవ తేదీ సాయంత్రానికల్లా అందరూ గుడారాల్లోకి వచ్చేశారు. కమాండర్లు కౌన్సిలు సభ్యులకు ప్రత్యేకంగా గుడారాలు వేశారు. మిషాగోంటార్ విద్యుద్దీపాలు అమరుస్తున్నాడు. జకరోవ్ దగ్గరనుండి అలంకరణ పూర్తి చేయిస్తున్నాడు. చీకటిపడింది. విద్యుద్దీపాలు వెలిగాయి. అంతా భోజనాలు చేసారు. ఎవరి గుడారాల్లోకి వాళ్ళువచ్చారు. జకరోవ్ ఆ పూట చొక్కా తొడుక్కోకుండానే తన కుర్చీలో కూచున్నాడు. అతనిలా కూచోవడం ఇదే మొదటిసారి. సంతోషంతో పిల్లలు అతని చుట్టూ మూగారు. కొంతసేపటికి క్రావ్ చెక్ ఇలా అన్నాడు:

"ఏమిటిదంతా జకరోవ్? ఇవాళ మాకు నిద్ర రమ్మన్నా రావడంలేదు!"

"మరి మీరంతా ఘోటక బ్రహ్మచారులు కదయ్యా! అందుకూ నిద్రరాంది!" అన్నాడు జకరోవ్ పరిహాసంగా.

అందరూ పకాలున నవ్వారు. అవతలికొసన ఉన్న ఆడపిల్లలు మరీ గోలగా కిలకిల నవ్వసాగారు.

ఇటు మగపిల్లలూ అటు ఆడపిల్లలూకూడా అల్లరిచేయడం చూచి కొంతసేపటికి జిరియాన్స్కీకి కోపంవచ్చింది.

"ఏమిటి మీ అల్లరి? ఏమొచ్చింది మీ అందరికీ? ఇహ నోళ్ళు నొక్కుకుని ఎక్కడవాళ్ళక్కడ పడుకోండి" అని కేక వేశాడు.

దాంతో గప్‌చుప్ సాంబారుబుడ్డి! ఆడపిల్లలు, మగపిల్లలూ ఎక్కడివాళ్ళక్కడ గబుక్కున గుడారాల్లోకి పోయారు. దుప్ప ట్లలో దూరి పడుకున్నారు.

వెంటనే జిరియాన్‌స్కీ దీపాలు ఆర్పివేశాడు. కుర్రావాళ్లు తమ పక్కల మీదపడి పొర్లుతూ, గుడారాలలోని సందులలో గుండా పైకి చూచారు. పైన నిర్మల నీలాకాశం కనుపించింది. నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నాయి. దూరంగా నగరంలో చప్పుళ్ళు, ట్రాంబండ్ల రణగొణ ధ్వనులు మందంగా వినిపిస్తు న్నాయి. గ్రామంలోనుంచి కుక్కలు గుంపులు గుంపులుగా మొర గడం వినవస్తున్నది. కాలనీలో పిల్లలందరూ గుడారాల్లో, తీయ తీయని కలలుకంటూ కనులుమూసి నిద్రలో మునిగిపోయారు.

# 24

# ఇగోర్ సాహిత్యాభిలాష

కొద్దిరోజులకు స్కూలు మూసివేస్తారు, సెలవు లిస్తారు. నిరంతరం ఫ్యాక్టరీ నిర్మాణంలో పిల్లలంతా నిమగ్నులై ఉన్నా, స్కూలులో పాఠాలను శ్రద్ధగా చదువుతూనే ఉన్నారు. ఇప్పుడు పాఠశాల చాలా చక్కగా, పరిశుభ్రంగా ఉన్నది. అంతటా అందమైనతివాచీలు పరిచిఉన్నాయి. ఎటుచూచినా పూల మొక్కలు పువ్వులతో విదిలిపోతూ పరిమళాలను వెదజల్లు తున్నాయి. వాతావరణం నిర్మలంగా ఉన్నది. అంతటా నిశ్శబ్దం అలుముకున్నది. పిల్లలు ఇప్పుడు బిగ్గరగా అరవడంలేదు, మాట్లాడ డంలేదు. ఎడతెరిపి లేకుండా గ్రంథపఠన కావిస్తున్నారు. పాఠ శాల, జీవితంలో చాలా ప్రధానమైనదని పిల్లలందరికీ తెలుసును. ఉజ్వలమైన జీవితానికి ఉత్తమ పాఠశాలయే ప్రాతిపదిక. ఇదివరకు

ఈపాఠశాలలో అనేకమంది విద్యార్థులు విద్యనభ్యసించి ఉత్తీర్ణులై గొప్ప గొప్ప ఉద్యోగాలుచేస్తూ, తమ బాధ్యతలను చక్కగా నిర్వర్తించారు. మరికొందరు విద్యార్థులు ఇంకా ఉన్నత విద్యను నేర్చుకుంటూ పాఠశాలలో మెరికెలవలె తయారవుతున్నారు.

వేసవికాలంలో సెలవు లివ్వగానే ఇదివరకు చదువుకున్న పాత విద్యార్థులు కాలనీకి తరుచువస్తూ ఉంటారు. తమపాత స్నేహితులతో కబుర్లాడుకుంటూ కొంతసేపు హాయిగా కాలక్షేపం చేస్తుంటారు వాళ్ళను చూచి కాలనీ విద్యార్థులు ఆశ్చర్య పడతారు. అనేక ప్రశ్నలు వేస్తారు. తామూ వాళ్ళలాగే ఉన్నత విద్య నభ్యసించాలని కలలు కంటారు. ఇంతకంటె ఎక్కువగా కలలు కంటున్న కాలనీ విద్యార్థుల్లో ఒకడు. ఇటీవల అతను బుద్ధిమంతుడైనాడు. చదువుతప్ప అతనికి మరో జోలేదీ లేదు. వృక్ష శాస్త్రాన్ని అతడు అతిశ్రద్ధగా చదువుతున్నాడు. కాని అంతలోనే అతని దృష్టి సాహిత్యం మీాదికిమళ్ళింది. సాహిత్యగ్రంథాలన్నీ పఠించడమే కాక, స్వతంత్రగా రచనలు చేయడంకూడ ప్రారంభించాడు. ఒకనాడు అతను వ్రాసిన సాహిత్య వ్యాసాన్ని చదివి, ఉపాధ్యాయిని వ్యాసిల్యవ్నా ఉద్వేగ్నురాలయింది.

"నీవు చాలా మంచివ్యాసం వ్రాశావు ఇగోర్. చదువరుల కెంతో ఆసక్తి కలిగిస్తున్నది. ఇంకా కొంచెం శ్రమపడి రాస్తే, మరీ ఉత్తమంగా ఉంటుంది." అన్నదామె.

అప్పటినుంచీ ఇగోర్ తను ఏదివ్రాసినా చక్కగా ఆలోచించి మరీవ్రాయడం మొదలుపెట్టాడు. ఇతర రచయితల శైలిని వారుచర్చించిన విషయాలను సునిశితంగా పరిశీలించసాగాడు. రోజూ గంటల తరబడి రచనా వ్యాసంగంలో మునిగితేలుతూ వచ్చాడు.

ఒకనాడు క్లబ్‌లో అతనికి వాసిల్యవ్నా కనుపించింది. ఆమె అతన్ని ఇలా అడిగింది:

"ఏమిటి ఇగోర్, నీ చదువు బొత్తిగా వెనుకబడింది?"

అంటే? సాహిత్యంలో వెనుకబడ్డానా?" అని ఎదురుప్రశ్న వేశాడు. ఇగోర్. "కాదు, అది అద్భుతంగానే ఉన్నది. తక్కిన చదువుమాట చెబుతున్నాను." "సాహిత్యంతప్ప. తక్కిన విషయాలమీదికి నామనస్సు మళ్ళడం లేదు."

"ఇతర విషయాలు క్షుణ్ణంగా తెలుసుకోకపోతే, సాహిత్యం లో నీవు రాణించలేవు." అన్నది వాసిల్యావ్నా

నాకెందుకవన్నీ - నేను కేవలం రచయితను కాదలుచుకున్నాను." అన్నాడు ఇగోర్.

"అలాంటి రచయిత ఎవరినీ మెప్పించలేడు. ఏవిషయమూ తెలీకపోతే, ఇహ నీవు రాసేది దేన్నిగురించి?"

"అనేక విషయాలున్నాయి."

"ఏదీ, ఉదాహరణకు ఒక్క విషయం చెప్పు?"

"జీవితాన్ని గురించి వ్రాస్తాను."

"జీవితాన్ని గురించి నీకేం తెలుసు?"

"సాధారణంగా జీవితంలో......" అంటూ ఏదో చెప్పబోయాడు ఇగోర్.

"జీవితంలో ప్రేమను గురించా?"

"అవును - ప్రేమను గురించి రాస్తే తప్పేమిటి?"

"తప్పేంలేదు. కాని ఎవరిప్రేమను గురించి వ్రాస్తావు?"

"ఏం? ఎవరిప్రేమను గురించి అయినా వ్రాస్తాను..."

"ఏదీ, మాటవరుసకు ఒకరిప్రేమను గురించిచెప్పు, విందాం" అన్నది వాసిల్యావ్నా.

"ఒక అబ్బాయి అమ్మాయిని ప్రేమించాడు - ఇద్దరూ ప్రేమ కలాపాలలో మునిగి తేలుతున్నారు."

"వాళ్లెవరూ?"

"ఎవరేమిటి - వాళ్ళు ఎవరైనా కావచ్చు."

"ఎందుచేత అస్పష్టంగా చెబుతావు? వాళ్లెవరో విడమర్చి చెప్పరాదూ? ప్రతిమనిషీ ఏదో ఒక పనిచేస్తూనే ఉంటాడు. ప్రతి వాడికీ సుఖాలు, దుఃఖాలు వస్తూనే ఉంటాయి. నీవు ఎవరి ప్రేమను గురించి వర్ణించ దలుచుకున్నావు?"

ప్రేమను గురించి చెప్పడానికి ఇగోర్ కు సిగ్గువేసింది. చెప్ప సాహసించలేక పోయాడు. అదీకాక - ఈవిషయం వాచా చెప్ప వలసింది కాదు. దాన్ని అతను ఒక సాహిత్య ఇతివృత్తంగా మలుచుకోదలుచుకున్నాడు.

"ఆ ప్రేమికులెవరో - ఇంతవరకూ నాకు తెలీదు. ఎవరైతే నేమి? మాటవరసకు ఒక పంతులమ్మ ఒక యువకుణ్ణి ప్రేమించింది" అన్నాడు ఇగోర్.

"బాగానే ఉంది - అయితే ఆ పంతులమ్మ ఎలాంటిది?"

"ఆపంతులమ్మ మంచిదే. పాఠశాలలో లెక్కల మాస్టరుగా ఉంటున్నది."

"లెక్కల మాస్టరా? - లెక్కలను గురించి నీకేమీ తెలి యందే - సాహిత్యంలో ఆమె పాత్రను నీవెలా చిత్రిస్తావు?"

"అదే ఆలోచిస్తున్నాను."

"ఇగోర్! ఇటువిను. సాహిత్యంలో ఇతి వృత్తాలుగా స్వీక రించడానికి అనేక కథావస్తువు లున్నాయి - ప్రేమ ఒకటే కాదు. జీవితం చాలా సంకీర్ణమైంది. జీవితాన్ని రచనలో చిత్రించదలుచు కున్న రచయిత - జీవితాన్ని సమగ్రంగా పరిశీలించాలి. అన్నిటినీ ఆకళించుకోవాలి. అనేక జీవితరహస్యాలను తెలుసుకోవాలి. సాహి త్యం తప్ప ఇంకేమీ తెలీని నీవు - జీవితాన్ని పరిపూర్ణంగా దర్శించలేవు."

"మరి నీమాటేమిటి? నీకు కూడా సాహిత్యంతప్ప - జీవి తంలో మరేవిషయం తెలీదుకదా?"

"కాదు. నీవనుకుంటున్నది వాస్తవం కాదు. నాకు జీవి తంలో అనేకం తెలుసును. సాంకేతిక విద్య నేను నేర్చుకున్నాను.

కొన్నాళ్ళు ఫ్యాక్టరీలో పనిచేశాను. రసాయనిక శాస్త్రాన్ని అభ్య సించాను. సాంకేతిక పాఠశాలలో చదువుకున్నాను ఇగోర్ ! నీకు పరిపూర్ణమైన విద్య కావాలి. నీవు ప్రతి విషయం తెలుసుకోవాలి. మన మహారచయిత గోర్కీ చూడు ! ఆయనకు ఏ అధ్యాపకుడికీ, ఏ ఆచార్యుడికీ తెలీనన్ని అనేక విషయాలు తెలుసును.''

ఆమె చెపుతున్నదంతా చెవులు అప్పగించి వింటు న్నాడు ఇగోర్. ఆమెచెప్పే ప్రతి మాటలోనూ సంస్కృతి గర్భితమై ఉంది. ఆ మరునాటి నుంచీ ఇగోర్ ప్రత్యేకశ్రద్ధతో ప్రతి విషయాన్నీ పరిశీలించ సాగాడు. ఈ పరిశీలన అతని కెంతో ఆత్మానందాన్ని ఆత్మ గౌరవాన్ని చేకూర్చి పెట్టింది. పరిశీలిస్తున్నకొద్దీ ఇంకా పరిశీలించాలనే ఆసక్తి కలుగసాగింది. పరి శోధన మీదికి అతని దృష్టి మళ్లింది. తత్ఫలితంగా 'మే' నెలలో అతనికి పరీక్షలలో అన్ని విషయాల్లో ఫస్టుమార్కులు వచ్చాయి. అతనితో సరిసమానంగా మార్కులు తెచ్చుకున్నది ఒక్క ఒక్సానా మాత్రమే. ఇప్పుడు ఇగోర్‌లో ఒక మార్పు వచ్చింది. కాని తనలో కలిగిన మార్పును అతను గమనించలేకపోతున్నాడు. ఆడంబరంవైపు, డాబుదర్పాలవైపు అతని దృష్టి మళ్లింది. మాటి మాటికీ ఏదో విషయం ఎన్నో గంటలు మాట్లాడుతూ కాలక్షేపం చేస్తున్నాడు. అతని మాటల్లో కొంచెం హాస్యం, చమత్కారం, ద్యోతకమవుతూనే ఉన్నాయి. ఇదివరకటికంటె ఇప్పుడు అతని మాటలు వినసొంపుగా ఉంటున్నాయి. అతని ప్రసంగంలో గాంభీర్యం కనుపిస్తున్నది. కాని ఈ మార్పును అతను గుర్తించ లేకపోతున్నాడు.

ఒకనాడు ఇగోర్ శాంకోజోరిన్ దగ్గరికి వెళ్ళి ఇలా అన్నాడు:

''శాంకో: నేను 'కొమ్సొమోల్'లో చేరాలయ్యా...నీ ఉద్దేశం ఏమిటి? ఆ విషయం మనం కొంచెంసేపు మాట్లాడు కుందామా?''

"నీవు అందులో ఏనాడో చేరవలసినవాడవు - తరువాత రావలసిన అభ్యర్థివి నీవేనని మేం అనుకుంటున్నాం. అన్నట్టు నీ రాజకీయవిజ్ఞానం ఎందాకా వచ్చింది? పూర్తిగా చదువుతున్నావా."

బాగానే సాగుతున్నది. జాగర్తగానే అభ్యసిస్తున్నాను."

"వార్తాపత్రికలు, పుస్తకాలు చదువుతున్నావు కాబోలు సరే, వెడదాం రా. "మార్కు-గ్రిన్‌హౌస్‌తో ఈ విషయంమాట్లాడదాం."

ఇప్పుడు ఇగోర్ 'కొమోసామోల్' సమావేశాలకు హాజరవుతున్నాడు. మొదట ఆ సమావేశాలు అతనికి విసుగు అనిపించాయి. అందులో సభ్యులు తమకు అందని విషయాలను గురించి చర్చిస్తున్నారని ఇగోర్ అనుకోసాగాడు: కాకపోతే పదిహేడవ పార్టీ కాంగ్రెస్‌ను గురించి సెడోవ్‌నిచ్ తమ 'కొమోసామోల్' సమావేశంలో అంత దీర్ఘంగా ప్రసంగించడం దేనికి? అవేళ లెడోవినిచ్ ఏమిటేమిటో మాట్లాడాడు. కమ్యూనిస్టుపార్టీ సమావేశంగురించి ఒక నివేదికను అందజేశాడు. ఇగోర్‌కు అదేమిటో అర్థమైందికాదు. సెడోవ్‌నిచ్ మాత్రం సమావేశంలో నివేదిక సమర్పిస్తూ ఇలా చెప్పాడు:

"కామ్రేడ్స్! గతం ఎంత దుర్భరంగా గడిచిందో కుర్రవాళ్ళమైన మనం ప్రత్యక్షంగా చూడలేదు. కాని ఆ అవశేషాల ఫలితాలను మాత్రం మనం అనుభవిస్తున్నాం. జారిస్టు రష్యా ఆ రోజుల్లో ప్రపంచ దేశాలన్నిటికంటే వెనకబడి ఉండేది. కాని ఇప్పుడో! ఆ జారిస్టు రష్యాలేదు. ఆ దుర్భర బానిసత్వం, ఆ భయంకర పరిస్థితులు లేవు. అవన్నీ ఇప్పుడు సమసిపోయాయి. ఆనాడు వెనుకబడిన మనదేశం ఈనాడు అన్ని రంగాలలోనూ శరవేగంతో పురోగమిస్తున్నది. దీనికి కారణం ఏమిటి? మన ప్రజల అకుంఠిత దీక్ష అచంచల విశ్వాసం! మన ప్రజానీకాన్ని భవిష్యత్తువైపుకు నడిపిస్తున్న కమ్యూనిస్టు పార్టీ శక్తి అజేయమైనది! మన పార్టీ, మన ప్రజలు ఎంతలో ఎంత విప్లవాన్ని, అభ్యుదయాన్ని సాధిం

చారు ! తలుచుకుంటే ఆనందంతో వళ్ళు పులకరిస్తున్నది. ఇప్పుడు మన ప్రజలు సాధించిన విజయాలు నిర్దిష్టంగా మనముందున్నాయి. దేశంలో అన్నిరంగాలలోనూ ఉత్పత్తి ఎలా అభివృద్ధి చెందింది పదిహేడవ పార్టీ కాంగ్రెస్ ఒక పట్టికను తయారు చేసింది. మన పంచవర్ష ప్రణాళిక నాలుగు సంవత్సరాల్లోనే దిగ్విజయంగా పరిస మాప్తమైంది. ఇప్పుడు మనకు అన్నీ ఉన్నాయి. మనకు కావలసి నన్ని కర్మాగారాలున్నాయా? ఉన్నాయి. అవసరమైనన్ని యంత్ర పరికరాలున్నాయా? ఉన్నాయి. ట్రాక్టర్లు, వ్యవసాయ పనిముట్లు మనం నిర్మించుకున్నామా? అవును, నిర్మించుకున్నాం. పూర్వంలాగా ఇప్పుడు మనదేశంలో "ధనిక రైతులు" ఉన్నారా? లేరు. ఎక్కడా మచ్చుకు కనిపించరు. ఆ ధనిక "రైతులు" ఎలా ఉండేవారో, ఎలా ప్రవర్తించేవారో, పేద రైతులను ఎలాపీడించి, వారి రక్తమాంసాలు పిండి వారిచేత ఊడిగం చేయించుకునేవారో, వ్యవసాయ కూలీలను తమకమతాలలో పెట్టి వెట్టిచాకిరి చేయించు కొనేవారో అందరినీ బానిసలుగా చేసుకుని తాము భాగ్యవంతులై, ఎలా విలాసాలతో కులుకుతూ ఉండేవారో మనందరం తెలుసు కున్నాం. అలాంటి "ధనికరైతుల" దగ్గరఊడిగంచేసిఅష్టకష్టాలూ పడ్డఅనేకమంది వ్యక్తులుఇప్పటికీ సజీవులయి ఉన్నారు. వారందరినీ మనం ఎరుగుదుము. అటువంటి ఘోరనరక తుల్యమైన భూస్వామ్య వ్యవస్థ సామ్యవాద విప్లవంతో తుడిచిపెట్టుకపోయింది. ధనిక భూస్వామ్యవర్గం సమూలంగా నశించిపోయింది. ఇప్పుడు మనం నూతన వ్యవస్థను నిర్మించుకుంటున్నాం. ఇది సామ్యవాద వ్యవస్థ. ప్రపంచ చరిత్రలో సామ్యవాద వ్యవస్థ ఆవిర్భవించడం ఇదే తొలి సారి. మనదేశంలో మనం పాత విధానాలకూ, పాత పద్ధతులకూ స్వస్తిచెప్పి, యంత్ర పరికరాలతో, ట్రాక్టర్లతో, సామ్యవాద వ్యవ సాయపద్ధతులతో నూతన సంస్కృతినీ, సమాజాన్నీ నిర్మించుకుం టున్నాం. ఇదివరకు, విప్లవం దిగ్విజయం కాక మునుపు ట్రాట్స్కీ అనుయాయులు, అవకాశవాదులు ఏం చెబుతూ వచ్చేవారో మనకు తెలుసును. ఆనాడు వాళ్ళుచెప్పిన పెడమార్గాన్ని పట్టిఉంటే, మనం

ఈపాటికి చరిత్రలో నామరూపాలు లేకుండా పోయేవాళ్ళం. అంటే దానిఅర్థం ఏమిటి? మనం బికార్లుగా, పశువులకాపర్లుగా ఎల్లకాలం భూస్వాములకు పాదాక్రాంతులమై పడి ఉండేవాళ్ళమన్నమాట. కాని మనకలాంటి దుర్గతి పట్టలేదు – మన విప్లవం అప్రతిహతం కావడంవల్ల, మన ప్రజలు జైత్రయాత్ర సాగించడంవల్ల, రష్యా ఒక నూతన చరిత్రను సృష్టించుకోగలిగింది. ఇప్పుడు మనదేశంలో బికార్లు లేరు, పీడితులులేరు. నిరక్షరాస్యులు వెదికి, చూచినాలేరు. మనకాలనీలోవున్న పిల్లలందరికీ ఎల్లప్పుడూ చదువుకోవాలనే ధ్యాస తప్ప మరోదానిమీద దృష్టిలేదు. మీ ఎదుట నేను పదిహేడవ పార్టీ కాంగ్రెస్ నిర్ణయాలను వివరించ బోతున్నాను. ఆ నిర్ణయాలు ఎంత సముచితమైనవో ఆలోచిస్తే మీకే అవగత మవుతుంది.”

సమావేశంలో ఇగోర్ నిశ్శబ్దంగా కూచుని, ఉపన్యాసమంతా శ్రద్ధగా వింటున్నాడు. ఉపన్యాస సారాంశాన్ని నూతన దృక్పథంతో పరిశీలిస్తున్నాడు. అతని ప్రక్కన ఒక్సానా కూచుని ఉంది. సెడోవినిచ్ చేసిన ఉపన్యాసం ఆవిడ హృదయాన్ని ఆకర్షించింది. వింటున్నంతసేపూ ఆమె తదేకధ్యానంతో అటే చూడ సాగింది. తన్ను తానే మరిచిపోయింది. ఆ పిల్ల తన్మయత్వం పొందడంచూచి ఇగోర్ తనలోతాను ఏదో ఆలోచించ సాగాడు. సెడోవ్‌నిచ్ ఉపన్యాసం తనకంటె ఒక్సానాయే చక్కగా అర్థం చేసుకున్నదని అనుకున్నాడు. అయితే పెవ్‌నిచ్ అంత గంభీర్యంగా సభ్యుల హృదయాలకు హత్తుకుపోయేటట్టు ఎలా ఉపన్యసించ గలిగాడు? అతనికాశక్తి ఎక్కడనుంచి వచ్చింది? తనకూ అతనికీ ఉన్న తారతమ్యం ఏమటీ? అవును – అతను శక్తిమంతుడు. కొమోసామోల్ సభ్యుడు, ఇలా అనుకుంటూ ఇగోర్ హాలు చుట్టూ కలయచూచాడు. ఒక్సానా ఇంకా అలా ఆలోచిస్తూనే కూచున్నది. కొమోసామోల్‌లో సభ్యుడుకావడానికి, అందరి విశ్వాసాన్ని చూరగొనడానికి మనిషికి శక్తి కావాలి. పట్టుదల ఉండాలి. ప్రతిభ, కార్యదక్షత కలిగిఉండాలి. ఈ భావాలు ఇగోర్

మనస్సులో ఒక్కసారిగా రేకెత్తాయి. మళ్ళీ అతను ఒక్సానా వంక చూచాడు.

ఒక్సానాను ఇగోర్ మనసారా ప్రేమిస్తున్నాడు. తనా పిల్లను అలా ప్రేమిస్తున్నట్టు తన మనస్సు తనకు ఏకాంతవేళల వ్యక్తపరుస్తూనే ఉన్నది. ఇంతకూ ప్రే మంటే ఏమిటి? అదెలా కలుగుతుంది? ఇప్పటికే ఇగోర్ అనేక గ్రంథాలు చదివి ప్రేమ తత్వాన్ని అర్థం చేసుకున్నాడు. కాని ఒక్సానాను చూడగానే తనకు గలుగుతున్న భావాలు అతి మధురమైనవి. వాటి ఔన్నత్యాన్ని తేటపరిచేటందుకు ప్రేమ అనే మాటకు శక్తి చాలదు. ఇలా ఆలోచించుకుంటే రాను రాను అతని హృదయం భారం కాజొచ్చింది. ఏదో చెప్పలేని ఆవేదన అతన్ని ఆత్మలో అలుముకున్నది. మళ్ళీ ఇంకొక్కతడవ – 'రోమియో-జూలియట్' ప్రేమకథను చదవసాగాడు. కాని అందులో కథానాయకునిలా తాను కథానాయికతో ప్రాణత్యాగం చెయ్యడం అతనికి ఇష్టం లేదు. 'రోమియో-జూలియట్'ల వలెకాని తన ప్రేమగాథ ఒక్సానాతో సుఖాంతం కావాలి. ఇదీ అతని ఆకాంక్ష. షేక్స్పియర్ నాటకంలో కథానాయకుడి ప్రవర్తన నిర్దుష్టమైంది కాదు. ఆ ప్రేమికు లిరువురూ తమ జీవితాలను ఎలా సుఖవంతం చేసుకోవాలో తెలుసుకోలేకపోయారు. తమ జీవితాలను తీర్చి దిద్దుకోలేకపోయారు. శాంకోజోరిన్ అభిప్రాయంకూడా ఇదే.

"అవును – అ ప్రేమికు లిరువురూ విచిత్ర జీవులు! అతను ఆమెను ప్రేమించాడు, అలా ప్రేమించకూడదని ఎవరో అన్నారు– అందుకని అతను మానుకున్నాడు! ఇరువురూ ప్రేమించుకున్న తరువాత మరొకరితో పనేమిటి? ప్రేమించుకున్న తరువాత పెళ్ళి చేసుకుని తీరవలసిందే – అదీ నిజమైన ప్రేమ." శాంకోజోరిన్ అన్న ఈ మాటలకు మళ్ళీ ఒకమాటు జ్ఞాపకం చేసుకున్నాడు ఇగోర్. ప్రేమించుకున్న తరువాత పెళ్ళాడడమే మంచిది."

జోరిన్ అన్నట్లు పెళ్ళి చేసుకోవడం మంచిదేకాని ఇప్పుడు తనకు పెళ్ళి ప్రధాన సమస్యకాదు. మొదట తన చదువు పూర్తి

కావాలి. అదీకాక తను ఒక్సానానూ పెళ్ళిచేసుకుంటానని కమాండర్ల కౌన్సిలుకు తెలియచేసి అనుమతి తీసుకోవాలి. ఇప్పుడప్పుడే తనకు పెళ్ళేమిటని కాలనీలో పిల్లలంతా పరిహాసిస్తారు.

ఒక్సానాను తను ప్రేమిస్తున్నట్టు ఇగోర్ ఎవరికీచెప్పలేదు. ఆఖరుకు ఆవిషయం ఆ పిల్లకుకూడా తెలీదు. ఆపిల్ల ఇదివరకు లాయరు ఇంట్లో పనిచేస్తున్నప్పుడు ఇగోర్ ఆమెవంక చూడడానికి ఏమాత్రం బిడియపడేవాడు కాదు. ఇప్పుడు మాత్రం అతనికి ఆ పిల్లతో మాట్లాడాలంటే అమితభయం వేస్తున్నది. ఆమె అంటే అతనికే కాదు, అందరికీ భయమే. అందరికీ గౌరవమే. ఒక్సానా మౌనంగా తనపని తాను చేసుకపోతుంటుంది. ఎవరిజోలీ శొంఠీ ఆవిడ కక్కర్లేదు. పని అతిశ్రద్ధగా చేస్తుంది. ఆమె చాకచక్యం వల్ల కాలనీలో చేరిన కొద్దికాలానికే 'కొమ్సొమోల్' సభ్యత్వం సంపాదించింది. ఆమె మాట్లాడుతున్నప్పుడు అందరూ నిశ్శబ్దంగా వింటారు. సాధారణ సమావేశాల్లో ఆవిడ ఉపన్యాసాలు అందరి హృదయాలనూ ఆకట్టుకుంటాయి.

ఒకసారి కాలనీ సభ్యులకు ఒక సమస్యవచ్చి పడింది. కాలనీ చెంతనే బంగాళా దుంపలతోట ఒకటి ఉన్నది. దుంపలు త్రవ్వడానికి ఆ తోటవాళ్ళు కాలనీ పిల్లల సహాయం అర్థించారు. ఈవిషయం సాధారణ సమావేశంలో చర్చకు వచ్చింది. అప్పుడు ఒక్సానా కావించిన ఉపన్యాసం కాలనీ సభ్యులు ఇప్పటికి కూడా మరిచిపోలేదు. సమావేశంలో ఒక్సానాలేచి నిలుచున్నది. స్పష్టంగా గంభీరంగా, ప్రసన్నంగా, ప్రసంగిస్తూ ఆమె ఇలా చెప్పింది:

"కామ్రేడ్స్! ఒక్కమాట. తమ జీవితాలను తాము తీర్చి దిద్దుకోలేమనీ మనసహాయం కావాలనీ వాళ్ళు కోరినప్పుడు, సహాయం చెయ్యడం మనవిధి. అది సమిష్టి వ్యవసాయ క్షేత్రం. వాళ్ళకింకా పనులు చేయడం బాగా నేర్చుకోలేదు. నేర్చుకున్న మనలాంటివాళ్ళం చూస్తూ కూచోకూడదు. మనం శక్తివంతులం. అమిత శక్తివంతులైన లెనిన్, స్టాలిన్‌ల అనుచరులం. ఆ మహాపురుషు లిద్దరూ సమాజ శ్రేయస్సుకోసం పాటుపడినవాళ్ళు. జీవి

తాలను త్యాగం చేసినవాళ్ళు. లోకానికి వెలుగు చూపినవాళ్ళు. మనం అటువంటి మహనీయులకు అనుచరుల మనిపించుకోవాలంటే వారే మనకు ఆదర్శం కావాలి. వారి త్యాగబుద్ధినే మనం అల వర్చుకోవాలి. మనం ఆ సమిష్టి క్షేత్రానికి వెడదాం. వెళ్ళి మన సోదరులయిన వాళ్ళకు సహాయం చేద్దాం. సహాయ పడడమే కాదు. సామ్యవాద వ్యవస్థ ఎంత సౌందర్యవంతమైనదో, అది ఎటువంటి ఉత్తమ మానవులను తయారుచేస్తుందో ప్రత్యక్షంగా చూపిద్దాం. ఇప్పుడు మనం వాళ్ళకు సహాయంచేస్తే, మరొకప్పుడు వాళ్లు మనకు సహాయం చేస్తారు. మనం వాళ్ళకు తోడ్పడగలమా లేమా అనే చర్చ ఇప్పుడు, ఇక్కడ అనవసరం. వెడదాం పదండి, అంతా వెడదాం పదండి."

తన ఉపన్యాసంలో ఆమె మాటిమాటికీ 'నేను' అనేమాట ఉపయోగిస్తూ వచ్చింది. ఆమాట ఆమె అంటున్నప్పుడు ఒకవింత అయిన యుక్రేనియన్ యాస ధ్వనించింది. పిల్లలకు ఆయాస విన్నప్పుడు ఎంతో ముచ్చట కలిగింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పిల్లలంతా పని చేస్తున్నప్పుడు ఆ యాసమాటనే మాటిమాటికీ ఉచ్చరిస్తూ తమలో తాము నవ్వుకున్నారు. వాళ్ళమాటలువింటూ ఒక్సానా సయితం ఆనందించింది.

ఒక్సానాతో కాలనీలో పిల్లలంతా చనువుగానే మాట్లాడుతున్నారు. ఆ పిల్లలకున్న ధైర్యం ఇగోర్‌కు లేకపోయింది. ఇద్దరి మధ్యా మూడో మనిషి ఉంటేనే కాని ఇగోర్, ఒక్సానాతో మాట్లాడలేక పోతున్నాడు: ఆమె ఒంటిగా ఉన్నప్పుడు దగ్గరికి వెళ్ళడానికే భయపడుతున్నా . ఒకవేళ వెళ్ళినా తన సహజ ధోరణిలో, చమత్కారంగా మాట్లాడలేక పోతున్నాడు. కాని పదిమందితో కలిసి ఉన్నప్పుడు మాటల్లో మాటకలిపి ఆమెతో ఛలోక్తు లాడుతున్నాడు. అతని పరాచకాలకు మిత్రులంతా మిక్కిలి సంతోషిస్తున్నారు. కాని ఇగోర్ వాంఛిస్తున్నది మిత్రుల మెప్పుకాదు. తన పరాచకాలకు ఒక్సానా కిలకిల నవ్వాలని అతని కోరిక. ఆపిల్ల నవ్వుతున్నది కాని ఆనవ్వు అతను ఆశించినట్టుగా

ఉండడం లేదు. ఏదో మర్యాదకు నవ్వుతున్నట్టుగా ఉంది ఆమె నవ్వు. ఆమె నవ్వుతూ ప్రక్కకుతిరిగి ఇంకేదో విషయం మాట్లాడుతూ ఉంటుంది. అది ఇగోర్‌కు మరీ కష్టమనిపిస్తున్నది. ఈవైఖరి అతనికి నచ్చడం లేదు.

ఒక్కసారి మాత్రం ఒక్సానా అతని ఛలోక్తికి మైమరిచింది. అతనివంక ఓరగా చూచి కిలకిలనవ్వింది. ఆ చూపులు అతన్ని తాకాయి. కొత్తచూపులు అవి, ఆచూపుల్లో ప్రేమ ఉట్టిపడింది. అతని హృదయం ఉద్వేగంతో ఉయ్యాలలూగింది.

# 25

## విశ్రాంతి వేళ

ఆ సంవత్సరానికిక పాఠశాల మూసివేసే తరుణం వచ్చింది. సాధారణ సర్వసభ్య సమావేశంలో కామ్రేడ్ జకరోవ్ ఇలా ఉపన్యసించసాగాడు:

“మనం అనుకున్నట్లుగానే అన్ని పనులూ చకచకా సాగిపోతున్నాయి. ఫ్యాక్టరీ నిర్మాణం బాగానే సాగుతున్నది. యంత్రపరికరాలు ఇహకొద్ది రోజుల్లో మనకు అందుతాయి. బ్యాంకులో డబ్బు నిల్వచేయబోతున్నారు. సమిష్టికృషి ఇంచుమించు సంతృప్తికరంగానే ఉన్నది. ప్రదర్శనశాలలో దొంగతనం జరగడం ఒక్కటే మన దురదృష్టం. పాఠశాలకు సెలవులివ్వబోతున్నారు. అయితే ఎప్పటిలాగా ఈఏడు సెలవు దినాలను మనం చక్కగా అనుభవించలేం. అదీకాక ఈ ఏడాది మనవాళ్ళ ఆరోగ్యం అంత బాగాలేదు: ఆ విషయం గురించి ఇప్పుడు – డాక్టరుగారు ప్రసంగిస్తారు.”

ఇలాచెప్పి కామ్రేడ్ జకరోవ్ కూచున్నాడు. తరువాత డాక్టర్ లేచి నిలుచున్నాడు. ఆయన ఏం చెబుతాడో అనిపిల్లలంతా

ఆత్రుతతో ఎదురు చూడసాగారు. ఉదయం అయిదు గంటల్లోకల్లా అందరికీ వెనకటిలాగా టీ ఇవ్వాలనీ, కాలనీలో ప్రతి పిల్లవాడూ డాక్టర్ చేత శ్రద్ధగా ఎప్పటికప్పుడు పరీక్ష చేయించుకుంటూ ఉండాలనీ, ఆరోగ్యాభివృద్ధికి అనేక రకాల స్నానవిధు లున్నాయనీ, వాటిని తూచ తప్పక అమలులో పెట్టాలనీ, మధ్యాహ్నపు భోజనాలు అయిన తరువాత విధిగా అందరూ ఒకగంట విశ్రాంతి తీసుకోవాలనీ డాక్టర్ సలహా ఇచ్చాడు.

ఆయన ప్రసంగం పూర్తికాకమునుపే నలుప్రక్కలనుంచి నిరసన వాక్యాలు వినిపించాయి. నూతన కర్మాగారం అంటే డాక్టర్‌కు ఇష్టంలేదా? డబ్బు అనవసరంగా ఖర్చుపెట్టించడమే ఆయన ఉద్దేశమా? లేకపోతే ఉదయం అయిదు గంటలకల్లా టీలు తాగడమెందుకూ? భోజనాలయిన తరువాత ఒక గంట విశ్రాంతి దేనికి? కాలనీ ఏమన్నా ఒక విశ్రాంతి మందిరమా, లేక ఆసుపత్రా ఏమిటి? విశ్రాంతి గంటలో ఎవరూ నిద్రపోరు. జీవితమంటే డాక్టర్ ఉద్దేశంలో తినడం, తాగడం, నిద్రపోవడం, పదేపదే తన దగ్గరికి వెళ్ళి పరీక్ష చేయించుకోవడం!

సభ్యుల వాక్యాలు వినగానే డాక్టర్‌కు ఒళ్ళుమండుకొచ్చింది కూచునేవాడల్లా మళ్ళీ వేదిక ఎక్కి నిలుచున్నాడు:

"మీరంతా అనాగరికులవలె అగుపిస్తున్నారు. అర్థం పర్థం లేకుండా నోటికి వచ్చినట్లు మాట్లాడతారేం? ఆరోగ్యమంటే ఏమిటి? ఆరోగ్య సూత్రాలనుగురించి మీకేం తెలుసు? ప్రొద్దున్నే టీ మానుకున్నందువల్ల అదనంగా మిగిలేదేమీ లేదు, ప్రొద్దున్నే కాలనీలో ఇదివరకు పిల్లలకు ఫలహారాలు పెట్టేవారు. ఆదా చెయ్యడంకోసం అది ఇప్పుడు మానుకున్నారు. అందువల్ల కొత్తగా మిగిలిన డబ్బేమీ లేదు. మధ్యాహ్నంపూట పిల్లలు ఎప్పటికంటె ఇప్పుడు ఎక్కువ ఆహారం తీసుకుంటున్నారు" అని చెప్పాడు డాక్టర్.

ఇదివిని జకరోవ్ ఆశ్చర్యపోయాడు :

"ఏమిటీ డాక్టర్ మీరంటున్నది? ప్రొద్దున్నే పలహారాలు మానుకుని మేం కొంత ఆదా చేసుకుంటూఉంటే మీరు లేదంటా రేమిటి? ఆహారాన్ని పరిమితం చేసుకుంటున్నాం." అన్నాడు జక రోవ్. "ఏమిటీ? తిండి తగ్గించుకుంటున్నారా? నే చెబుతున్నాను వినండి. అందువల్ల మీకు ఒక్క రూబులు కూడా మిగలడంలేదు. గుమాస్తా నడిగి లెఖలు తీయించండి, మీకే తెలుస్తుంది. అప్పు డెంత అవుతున్నదో ఖర్చు ఇప్పుడూ అంతే అవుతున్నది. అబ్బా యిలూ! నా మాట విని అయిదు గంటలకల్లా అందరికి టీలు ఇవ్వ వలసిందే." అన్నాడు మళ్ళీ డాక్టర్ నిక్కచ్చిగా.

ఇహ ఆయనతో వాదించి లాభంలేదని జకరోవ్ నవ్వుతూ కూచుండిపోయాడు. సమావేశంలో తరువాత విషయం చర్చకు వచ్చింది. మధ్యాహ్నం ఒకగంట విశ్రాంతి కావాలా వద్దా అన్న విషయం. జిరియాన్‌స్కీ ఇలా చెప్పసాగాడు.

"మేము క్రమశిక్షణను ఎలా పాటిస్తామో ప్రతి ఒక్కరికీ తెలుసును. కాని డాక్టర్‌గారూ! ఒకచిన్న ప్రశ్న. ఒక గంట విశ్రాంతి ఇచ్చి మమ్మల్ని నిద్రపొమ్మని ఎలా నిర్బంధిస్తారు చెప్పండి? నామటుకు నాకు కళ్ళు గట్టిగా మూసుకున్నా నిద్ర పట్టదు. నాకు నిద్రపోవాలని లేనప్పుడు కాలం వృధా చెయ్యడం దేనికి? మీరిచ్చిన సలహా ఏమాత్రం బాగాలేదు."

ఇహ ఇప్పుడు డాక్టర్ తన ధోరణి మార్చాడు.ధోరణిమార్చి మరోతీరులో ఉపన్యాసం ప్రారంభించాడు. మానవ శరీర నిర్మా ణాన్ని గురించీ, విశ్రాంతి, నిద్ర, వీటి ఆవశ్యకతను గురించీ చెబుతూ ఆయన వైద్యశాస్త్రంలోని విషయా లనేకం ఉద్ఘా టించాడు :

"అబ్బాయిలూ! అమ్మాయిలూ! ఇటువినండి. ఒకగంట విశ్రాంతి తీసుకోవాలని నా సలహా. దానికి మీరు అభ్యంతరం చెప్పడం ఏమాత్రం మంచిదికాదు. విశ్రాంతి, నిద్ర మనిషికి ఎంత అవసరమో తెలుసుకోలేని అనాగరకులం కాదు మనం.విశ్రాంతివల్ల

ఎంతో మేలు చేకూరుతుంది. ఇప్పుడు మీకున్న నిద్రచాలదు. మీరంతా రోజూ రాత్రి పదకొండుగంటలకుపడుకుంటున్నారు. కాని మీకు తీరా నిద్రపట్టేసరికి పదకొండుగంట లవుతుంది. ఇంకా చెప్పాలంటే ఇగోర్ చెర్నిషేవిన్‌లాంటి వాళ్ళు ఆ పదకొండు గంటలకు కూడా నిద్రపోరు. పుస్తకం చేతబుచ్చుకుని అర్ధరాత్రి దాకా అలాగే చదువుతూ కూచునే కుర్రాళ్లు మన కాలనీలో చాలమంది ఉన్నారు." అన్నాడు డాక్టర్.

డాక్టర్ ఉపన్యాసం ఊరికపోలేదు. విసుక్కుంటూనే పిల్లలంతా విశ్రాంతి తీసుకోవాలన్న విషయం అంగీకరించారు. డాక్టర్ పెట్టిన తీర్మానానికి అనుకూలంగా ఓటు చేశారు.

"ఇది ఎప్పటినుంచి అమలులోకి వస్తుందిరా బాబూ? రేపటి నుంచేనా ?" అన్నాడొక కుర్రవాడు.

"ఇంకా ఇలాంటివి ఎన్ని తెస్తారోరా నాయనా మన పీకల మీదికి ?" అని విసుక్కున్నాడు మరొక పిల్లవాడు.

ఆ మరునాటి నుంచి మధ్యాహ్నపు భోజనం తరువాత కాలనీలో పిల్లలంతా ఒక గంట విశ్రాంతి తీసుకోవడం మొదలయింది. పిల్లలంతా భోజనాలు చేస్తుంటే డాక్టర్, తాను విజయం పొందానన్న గర్వంతో, నీటుగా పిల్లలవంక చూస్తూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. అబ్బో! డాక్టర్‌గారికి ఎంతగర్వం! తానూ ఒక కార్యకర్తవలె, నిర్మాణదక్షునివలె హాలులో షికార్లు కొడుతున్నాడే!

పిల్లలంతా భోజనాలు ముగించారు. విశ్రాంతికి వేళఅయిందని బిగోనక్ బిగిల్ ఊదాడు. ఎండ ప్రచండంగా కాస్తున్నది. పిల్లలంతా తమతమ గుడారాల్లోకి చేరారు. జకరోవ్ గుడారాలన్నీ పర్యవేక్షించాడు. అంతా నిశ్శబ్దంగాఉంది.

జకరోవ్ తన గుడారంలోకి వెళ్ళాడు. కుర్చీలో కూచుని జాగర్తగా వినసాగాడు. బయట గదులలోనుంచి రణగొణధ్వనులు వినిపిస్తున్నాయి. పిల్లవాళ్ళు తమ తమ ప్రక్కలమీద వాలి కబుర్లు

సాగిస్తున్నారు. ఎంత మెల్లగా మాట్లాడుకుందామన్నా వాళ్ళ గొంతులు అప్పుడప్పుడు శ్రుతిమించి రాగాన పడుతున్నాయి. మగపిల్లలే కాదు, ఆడపిల్లలుకూడా అంతే. ఆడపిల్లలు మరీ అఘాయిత్యం చేస్తున్నారు. వాళ్ళ నవ్వులు, తువ్వులు ! అబ్బబ్బ! ఏంగోల, ఏం కథ ? అన్ని దళాలలోకీ నాలుగోదళం మరీ కోలాహలంగా ఉన్నది. గుడారంలో పెద్ద ముష్టియుద్ధం జరుగుతున్నంత కేకలు, పెడబొబ్బలు వినవస్తున్నాయి. జకరోవ్ గభాలున లేచి అక్కడికి వెళ్ళాడు.

"అబ్బాయిలూ ! ఏమిటీ అల్లరి ? నిశ్శబ్దంగా ఉండలేరూ ? కాలనీలో క్రమశిక్షణ పాటించడమంటే ఇదేనా ? ఇది విశ్రాంతి తీసుకోవలసిన సమయం. హాయిగా కాసేపు ఓ చిన్న కునుకు తీయండి." అంటూ జకరోవ్, పిల్లలను మందలించాడు.

వెంటనే అందరినోళ్ళూ మూతలు పడ్డాయి. చీమ చిటుక్కుమన్నంత నిశ్శబ్దం అంతటా అలుముకున్నది. జకరోవ్ తిరిగి తన గుడారానికి వెళ్ళాడు. గుడారంలో బల్లదగ్గర నిలుచుని డ్యూటీలో ఉన్న కమాండర్ ఒలెంకో ఏదో వ్రాసుకుంటున్నాడు.

"ఓ పావుగంటపోయిన తరువాత నీ వొకమాటు అటువెళ్ళి ఆ పిల్లకాయలేం చేస్తున్నారో చూడు. అన్నాడు జకరోవ్.

"అలాగే కామ్రేడ్ డైరెక్టర్." అని జవాబిచ్చాడు. ఒలెంకో.

"నా ఉద్దేశం ఏమిటంటే కంమాండర్లలో ఎవరినో ఒకరిని అరెస్టు చేయడం మంచిదని—"అన్నాడు మళ్ళీ జకరోవ్.

అందుకు ఒలెంకో సమాధానం చెప్పలేదు. ఒకగంట విశ్రాంతి ఇవ్వడం అవవసరమని అందరిలాగే అతనూ భావిస్తు న్నాడు. జకరోవ్ కుర్చీలోకూచుని పిల్లలంతా నిశ్శబ్దంగా ఉన్నారో లేదో అని మళ్ళీ జాగర్తగా వినసాగాడు. రాత్రివేళ లాగా అంతా నిశ్శబ్దంగా ఉన్నది కాలనీ. జకరోవ్ లేచి తన మంచంమీద వాలాడు.

"వీళ్ళు చిత్రమైన పిల్లలు! ఇలాంటప్పుడు నిజంగా ఒకగంట విశ్రాంతితీసుకోవడం ఎంతో బావుంటుంది. అయినా సరే, వాళ్ళు మాత్రం విశ్రాంతి వద్దని పట్టుపట్టారు." అన్నాడు జకరోవ్.

"విశ్రాంతివల్ల ఒకగంట కాలం వృథా అయిపోతున్నది." అన్నాడు ఒలెంకో.

"మరేం కొంపలు మునిగిపోలేదులే. చూశావామరి? పిల్లలంతా ఉప్పిడి చప్పిడిలేకుండా ఎలా నిద్రిపోయారో! అంటే వాళ్ళ శరీరాలకు విశ్రాంతి అవసరమన్నమాట." అన్నాడు జకరోవ్ మళ్ళీ.

ఒలెంకో, జకరోవ్ మాటలు వింటూనే మెల్లగా బయటికి వెళ్ళిపోయాడు. ఒక్కపదినిముషాల్లో మళ్ళీ తిరిగివచ్చి తనస్థానంలో తనుకూచున్నాడు.

"పిల్లలంతా నిద్దర్లుపోయారా ?" అని అడిగాడు జకరోవ్.

"ఆ, ఎక్కడివాళ్ళు అక్కడ కునుకు తీశారు !" అని చెప్పాడు ఒలెంకో.

ఇలా కొంచెంసేపు గడిచింది. డాక్టర్ వచ్చి గుడారంలోకి తొంగిచూచాడు. ఇలా అన్నాడు :

"చూశారామరి ? నే చెప్పింది అక్షరాలా నిజం. పిల్లలందరూ హాయిగా నిద్దర్లుపోతున్నారు–నిద్ర వద్దని వాదించినవాళ్ళు సహా ! మనకు ఎప్పుడు ఏది అవసరమో మన శరీరమే తెలుసుకుంటుంది." ఇలా అని డాక్టర్ లోపలికొచ్చి కూచున్నాడు.

గోడనున్న గడియారం టిక్కుటిక్కుమని ధ్వనిచేస్తున్నది. విశ్రాంతివేళ ముగియవచ్చింది. ఇంకొక్క అయిదు నిముషాల వ్యవధి ఉందనగా ఒలెంకో బయటికి వెళ్ళాడు. నిద్రపోతున్న బిగోనక్‌ను లేపి తీసుకొచ్చాడు. బిగోనక్ నిద్రపోయి లేచి చాలా హుషారుగా కనుపిస్తున్నాడు. ఒలెంకో గడియారంవంకచూచాడు, "ఇహ నీపని నీవు కానియ్యవోయ్ బిగోనక్" అని ఆజ్ఞాపించాడు.

వెంటనే బిగోనక్ విశ్రాంతి సమయం అయిపోయిందని సూచిస్తూ బిగిల్ ఊదాడు. బిగిల్ కూత చెవులు గింగుర్లుపట్టేటట్లు

వినిపించి గాలిలో కలిసిపోయింది. ఇంతవరకూ అలుముకుని ఉన్న నిశ్శబ్దం అప్పు డొక్క-క్షణంలో పటాపంచలయిపోయింది. కాని ఇంతలో ఒక వింత జరిగింది. కాలనీలో బిగోనక్ మొదటిసారి బిగిల్‌కూత ఊదాడో లేదో-తక్షణమే కాలనీలో పెద్ద కోలాహలం బయలుదేరింది. నలువైపులనుంచీ పకపకలు వికవికలు వినిపించాయి. కొందరు పిల్లకాయలు విరగబడి నవ్వుతున్నారు. కొందరు చప్పట్లు చరుస్తున్నారు. కొందరు కేకలు, పెడబొబ్బలు పెడుతున్నారు. ఇంకా కొందరు ఈలలు వేస్తూ గోలచేస్తున్నారు. అంతా కోలాహలంగా ఉంది. భరించలేనంత అలజడి బయలుదేరింది. ఆ గోలలో ఆఖరుకు ఆడపిల్లలగొంతులుకూడా వినిపించాయి.ఇదంతా ఏమిటో జకరోవ్‌కు అవగతం కాలేదు. ఆతృతతో లేచి గుడారం లోనుంచి బయటికి తొంగిచూచాడు. కాలనీలో మర్యాదస్తులనుకున్న పెద్ద పెద్ద కుర్రాళ్లుకూడా ఈ కోలాహలంలో పాల్గొనడం కనుపించింది. వాళ్ళుకూడా పగలబడి నవ్వుతూ, కేకలుపెడుతూ, చేతులూపుతున్నారు. ఇహ కుర్రకుంకల సంగతి చెప్పతరం కాకుండా ఉన్నది, కాలనీ నలువైపులా ఎగురుతూ గంతులు పెడుతున్నారు.

"అయ్యొయ్యొయ్యో! ఈ కుర్రకుంకలు వట్టి పుండాకోర్లు! ఇంతకూ ఈ గడుగ్గాయలు ఇంతసేపటిబట్టీ నిద్రల్లో లేదయ్యా!" అన్నాడు. డాక్టర్. అతని ముఖం వివర్ణమైంది.

కాలనీస్టాఫ్ ఉండే గుడారంచుట్టూ పిల్లలు గుంపుకూడారు. ఈలోగా బిగోనక్ తనడ్యూటీ ప్రకారం బారులుతీరిఉన్న గుడారాల చుట్టూ తిరుగుతూ బిగిల్ ఊదుతున్నాడు. అమాయకంగా దిక్కులు చూస్తున్నాడు.

"ఇప్పుడుచూడయ్యా, ఓగంట విశ్రాంతి ఇచ్చినందువల్ల ఎంతప్రయోజనం కలిగిందో! ఈ గంటసేపూ నీవు, హాయిగా కునుకుతీశావుకదా. వంట్లో ఉన్నబద్ధకమంతా వదిలిపోయింది. ఇహ ఇప్పుడు నీవు కావలసినంత ఉత్సాహంతో పనిచేయగలవు."

అన్నాడు జకరోవ్, ఇలా అంటూ కళ్ళజోడు సవరించుకుని పెట్టుకున్నాడు.

కాలసీ కుర్రాళ్ళు నవ్వుతున్నారు కాని ఆ నవ్వులో కపటం లేదు. అంతేగాదు. మధ్యాహ్నం భోజనాలయ్యాక ఓగంట నిద్ర పోవడం వంటి కెంతో మంచిదన్నవిషయం వారేమాత్ర కాదన లేదు.

ఆ మరుసటిరోజు మధ్యాహ్నం భోజనాలయ్యాక మళ్ళీ మామూలుగా పిల్లలకు విశ్రాంతి ఇచ్చారు. అప్పుడేమీ గడబిడలు జరగలేదు. కాని ఓ పదినిముషాలుగడిచిన తరువాత వాన్యా గల్చెంకో, ఫిల్కా-మేరీలు నిద్రపోకుండా అల్లరిచేస్తూ ఉండడం చూచాడు జకరోవ్. వాళ్ళిరువురూ గుడారం వెనకవైపునుంచి బయటకి వెళ్ళిపోయారు. తరువాత నేలమీదపడి దొర్లుతూ ఒకరితో ఒకరు కుస్తీపట్లు పడుతున్నారు. మధ్యమధ్య ఒకరినొకరు కేకలువేసుకుంటున్నారు. ఒకరినొకరు బెదిరించుకుంటున్నారు. వాళ్ళుచేసే అల్లరివిని జకరోవ్ వెనుకనుంచి అక్కడికి వచ్చాడు. వాన్యాగల్చెంకో వంక తీక్షణంగా చూచాడు. జకరోవ్‌ను చూడగానే వాన్యా అదిరిపడ్డాడు. తాము చేస్తున్న అల్లరికి తాను బాధ్యుడు కానట్లు అమాయంగా ముఖం పెట్టాడు. ఫిల్కా-మేరీ, జకరోవ్ వంక నిశ్చేష్టుడై చూచాడు.

"బావుంది మీ వరస ఇక్కడేంచేస్తున్నారు మీరు? ఏం ఫిల్కా? చెప్పవేం? చేసినతప్పు ఒప్పుకోకుండా నాతో వాదించ టానికి సిద్ధపడతారా?" అంటూ జకరోవ్ ఉరిమి చూచాడు. దీనికి ఫిల్కా ఏమీ సమాధానం చెప్పలేదు.

"ఏం, మాట్లాడవేం ఫిల్కా? నాతో నీవు వాదించదలుచు కోలేదా ?" అంటూ మళ్ళీ రెట్టించి అడిగాడు జకరోవ్.

"వాదించి లాభమేమిటి? చేసిందితప్పే." అన్నాడు ఫిల్కా, చివరకు.

"అవునులే – లాభంలేదు. చూడు, అటుచూడు ! పాపం ఆకాపలా కుర్రాడికి విశ్రాంతిలేదు. నీవుకాస్త అక్కడికి వెళ్ళి

అతనిడ్యూటీ నీవు పుచ్చుకుంటే అతను కాసేపు విశ్రాంతి తీసు కుంటాడు."

గుడారం వెనకాల గ్రైడొవిస్కీ రైఫిల్ పట్టుకుని కాపలా కాస్తున్నాడు. ఫిల్కా ఒకమాటు అతనివంక చూచి ఇలాఅన్నాడు

"గ్రైడొవిస్కీకి నిద్రరావడం లేదు."

"అతనికి నిద్ర రావడంలేదన్న విషయం నీకెలా తెలుసును" అని అడిగాడు జకరోవ్.

"ఎలాగంటే - కాపలావాడు నిద్రపోడు కనుక." అని చెప్పాడు ఫిల్కా.

"మరి మీరెందుకు నిద్ర పోవడంలేదూ! మీరు కాపలా కాయడం లేదుగా? ... తిన్నగావెళ్ళి ఆ రైఫుల్ పుచ్చుకుని అక్కడ నిలుచో. అతను ఒకచిన్న కునుకుతీస్తాడు."

"నేనొక్కణ్ణేకాదు-ఇక్కడ మేమిద్దరం ఉన్నాం." అన్నాడు ఫిల్కా.

"అయితేసరే—ఇద్దరూ కాపలాకాయండి, కాసేపునీవు—కాసేపు వాన్యా—ఊఁ. త్వరగా వెళ్ళండి."

వాన్యా, ఫిల్కాలిరువురూ "అలాగే కామ్రేడ్ డైరెక్టర్." అంటూ అభివాదంచేసి వెళ్ళిపోయారు. జకరోవ్ తిన్నగా తన బసకువెళ్ళిపోయాడు. అందరూ ఎవరిగుడారాల్లో వారునిద్దర్లు పోతున్నారు.

మొట్టమొదట గ్రైడొవిస్కీకి విశ్రాంతి ఇచ్చి వాన్యా కాపలా కాయడం మొదలుపెట్టాడు. రైఫిల్ బుజాన పెట్టుకుని ఎంతసేపు నిలుచున్నా అతనికి కాళ్ళు నొప్పి అనిపించలేదు. కాని కొంతసేపటికి అతనికి బడలిక వచ్చింది. ఎండ తీక్షణంగా కాస్తున్నది. కాలనీ అంతా నిశ్శబ్దంగా ఉన్నది. తనుఒక్కడే అలా నిలుచోవడం వాన్యాకు విసుగనిపించింది. నెమ్మదిగా గుడారంవైపు రెండడుగులు వేశాడు. గుడారం అవతల ఎడమవైపు ఎవరో నడుస్తున్నట్లు అలికిడి అయింది. మూడో గుడారం దగ్గర ఎవరో ఒక

వ్యక్తి నడిచి వెడుతున్నాడు. వాన్యా హఠాత్తుగా ఆగిపోయి అతని కదలికను పరీక్షించసాగాడు. అప్పుడు ఆవ్యక్తికూడా ఆగిపోయాడు. వాన్యా అతనికి అగుపించకుండా అవతలనిలుచుని అంతా కనిపెట్ట సాగాడు. ఆవ్యక్తి నేలమీద వెల్లకిలా పడుకున్నాడు. పడుకుని గుడారం అంచులు తొలగించి లోపలికి దూరాడు. కొంచెంసేపు గడిచాక మళ్ళీ అలాగే పడుకుని దొర్లుతూ గుడారంలోనుంచి ఇవతలికొచ్చాడు. అతను రైజికోవ్. వాన్యా అతన్ని కళ్ళారా చూచాడు. వాన్యా తనను చూడడం రైజికోవ్ గమనించాడు. గమనించి ఉప్పిడి చప్పిడి కాకుండా పడుకున్నవాడు పడుకున్నట్టే ఉండిపోయాడు. కాని అతను చేత్తోమాత్రం ఏదో వస్తువును మెల్లగా సర్దుకుంటున్నాడు. అప్పుడు వాన్యా బుజంమీద రైఫిల్ దిటవుగా ఉంచుకుని అతనిచెంతకు వెళ్ళాడు.

"ఇక్కడెందుకు పడుకున్నావు?" అని రైజికోవ్‌ను అడిగాడు వాన్యా.

"నేనెక్కడ పడుకుంటే నీ కెందుకోయ్?" అని పెడసరంగా సమాధానం చెప్పాడు రైజికోవ్.

"నాకెందుకేమిటీ? ఇది నీ గుడారం కాదు. పదో దళానికి చెందిన గుడారం. ఇక్కడికి నీ వెందుకొచ్చినట్లు?" అని మళ్ళీ గద్దించి అడిగాడు వాన్యా.

రైజికోవ్ అతనివంక నిర్లక్ష్యంగా చూచాడు. గుడారం వైపున ఉన్న తన చేతులను మెల్లగా దగ్గరికి లాక్కుని సర్దుకున్నాడు:

"ఏంలేదోయ్. ఆరుబయట పడుకుంటే హాయిగా ఉంటుందని పడుకున్నాను." అన్నాడు.

"ముందిక్కడనుంచిలే – కదులుతావా, కదలవా? అని ఆజ్ఞాపిస్తున్నట్లుగా అడిగాడు వాన్యా.

వెంటనే రైజికోవ్ నిద్రమత్తులో ఉన్నవాడిలా కాసేపు కళ్ళు నులుపుకుంటూ నటించాడు. చికాకుపడుతూ లేచి నిలుచున్నాడు. బద్ధకంగా పళ్ళు విరుచుకున్నాడు:

"ఏడిచినట్లుంది. బంగారంలాంటి నిద్ర పాడుచేసావు" అంటూ మొదటి దళానికి చెందిన గుడారంవైపు నడవసాగాడు రైజికోవ్.

వాన్యా అక్కడే నిలుచుని ఆశ్చర్యంగా అతనివంక చూడ సాగాడు. అతను వెళ్ళిపోయిన తరువాత క్రిందికి వంగి గుడారపు అంచులు పైకెత్తాడు. లోపలికి తొంగిచూచాడు. లోపల గుడా రంలో పిల్లలంతా నిద్రపోతున్నారు. ఎడమప్రక్క గుడారపు అంచులదగ్గర రెండు పంట్లాంలు, చిన్న తాళం వేసిఉన్న ఒక నల్లటి పర్సు, పడిఉన్నాయి. తరువాత వాన్యా కళవళపడిన మనస్సుతో గబగబా అక్కడనుంచి వెళ్ళి తన మామూలు స్థానంలో నిలుచున్నాడు.

# 26

# ముసలాడికి ముక్కు మీదనే కోపం

**నా**లుగోదళంలో రుసరుసలు ఎక్కువయ్యాయి. దానికి తోడు కష్టాలు పెరగజొచ్చాయి. కొత్త బాధ్యతలు, బరువులు నెత్తిన బడ్డాయి. అయినా దళంలో కుర్రాళ్ళు ఉత్సాహాన్ని కోల్పోలేదు. ఫ్యాక్టరీ గోడలు కట్టడం పూర్తి అయింది. తాపీపని వాళ్ళు మరోపని మొదలెట్టారు. కర్మాగారంలో యంత్రాలు అమర్చేచోట దిమ్మలు కడుతున్నారు. వడ్రంగులు కిటికీలు, తలు పులు మొదలైనవి బిగిస్తున్నారు. పనిఇలా చకచకా జరిగిపోతున్నా జెమ్ మాత్రం అసంతృప్తిగా సణుక్కుంటూ అందరిమీదా ఫిర్యా దులు ప్రారంభించాడు:

ఛా, ఛా! పని బొత్తిగా వెనకబడింది. వడ్రంగులులేరు, సిమెంటు కార్మికులు కనిపించరు. ఎవరూలేకుండా ఇన్నిపనులూ మనమెలా చేస్తామయ్యా? మీరంతా ఏమైనాగయ్యా! ఏమిటి

చేస్తున్నట్టుమీరు? అందరికీ చేతినిండా పనిఉంది. కాని ఎవరూ పని పట్టించుకోరు" అని డెమ్ విసుక్కుంటున్నాడు.

నాలుగోదళ సభ్యులకు అతని విసుగుదల చూస్తే అసహ్యం వేయసాగింది.

ప్రతిరోజూ కొత్త యంత్రాలు కాలనీకి దిగుమతి అవుతున్నాయి. ఒరోబ్యో నగరానికివెళ్ళి తన లారీమీద యంత్రాలు తీసుకొస్తున్నాడు. లారీ రాగానే పిల్లలంతా చుట్టూ మూగుతున్నారు. కాని బ్లమ్ మాత్రం సమయానికి కాలనీలో దూరంగా ఏదో ఒకమూల ఉండిపోతున్నాడు. లారీలు వచ్చిన కొంతసేపటికి గాని అతనికావిషయమే తెలియడంలేదు. లారీ వచ్చినట్టు తెలియగానే గబగబావచ్చి చేతులూపుకుంటూ కేకలుమాత్రం పెడుతున్నాడు. లారీచుట్టూ మూగుతున్న పిల్లగుంపునుచూచి.

"యంత్రాలచుట్టూ ఎందుకు మూగుతారు? ఏంచేస్తారు మీరిక్కడ? వెళ్ళడి వెళ్ళండి" అంటూ అదిలిస్తున్నాడు, కాని కుర్రవాళ్లు కదలడంలేదు.

"పోండి, దూరంగా పోండి. ఇదేం పండ్లగంపా? చుట్టూ మూగడానికి" అని అరుస్తున్నాడు.

కాలనీకి కొత్తయంత్రాలు రావడమే తరవాయి. నాలుగోదళం సభ్యులు దానిచుట్టూ మూగుతారు. బ్లమ్ ఎంత గొంతు చించుకున్నా అతనిమాట వినిపించుకోరు.

"సాలొమన్ డవిడొవిచ్! నీ వూరుకోవయ్యా! లారీలోనుంచి యంత్రాలను మేమే దింపుతాం" అంటారు పిల్లలు.

"దింపుతారా? మీరా దింపేవాళ్ళు. మాట్లాడేటప్పుడు కాస్త బుర్ర ఉండాలి! వేలెడంత లేరు, యంత్రాలు దింపుతారట! మీరే ఈపని చేసేటట్టయితే ఈ యంత్రాల ముఖం మళ్ళీ మనం చూడక్కర్లేదు. మీవల్లకాదు. ఈపని పెద్దవాళ్ళకు వదిలిపెట్టండి."

బ్లమ్ ఇలా అరుస్తూ ఉంటే, తమ విధులను నెరవేర్చేందుకు అక్కడికి పెద్దకుర్రాళ్లు వచ్చారు. నెక్రెసింకో, కొలోస్,

పోర్షినేవ్, సెడొనొవిచ్; ఈ నలుగురినీ చూచి బ్లమ్ ఇలా అన్నాడు:

"కామ్రేడ్ నెస్టెరెంకో! కాస్త ఇలా వచ్చి చెయ్యి ఆసరా ఇయ్యి ఇది బహునాజూకైన మిషను. చాలా జాగర్తగా దింపాలి. ఈ కుర్రకుంకలందరినీ దూరంగా పొమ్మను ముందు."

లారీ చుట్టూ మూగిన పిల్లలకేసి ఒకమాటు గుడ్లురిమి చూచాడు నెస్టెరెంకో. అంతే దాంతో ఎక్కడివాళ్ళక్కడ ఒకటే పరుగు.

తరువాత ఆ వచ్చిన పెద్దకుర్రవాళ్ళు లారీమీదనుంచి యంత్రాలను క్రిందికి జాగర్తగా దింపుతున్నారు. పిల్లలు దూరంగా నిలుచుని వాటివంక ఆసక్తితో చూస్తున్నారు.

కాలనీ సభ్యులు ఒక్కొక్క మిషను మెల్లమెల్లగా సామాను గదిలోకి చేరుస్తున్నారు. అక్కడ గుమాస్తా వాటిని లెక్కల్లో నమోదు చేసుకుంటున్నాడు. పిల్లలు మళ్ళీ మెల్లగా అక్కడికి చేరారు.

"ఇది చాలా మంచిమిషన్" అన్నాడొక కుర్రాడు.

"ఇంతకూ దీని పేరేమిట్రా?" అని అడిగాడు మరొక కుర్రాడు.

"యూనివర్సల్!" అని చెప్పాడు వేరొకడు.

"భలేబాగా తిరుగుతుంది ఇది మామూలు మిషను కాదోయ్."

కుర్రవాళ్ళంతా ఇలా తమలోతాము ఆ యంత్రాలను గురించీ, వాటి తరహాలనుగురించీ, అవి పనిచేసే తీరునుగురించీ, ఇంకా ఇలా ఏవేవో కబుర్లాడుకుంటూ సంబరాలు పడుతున్నారు.

సామాను గదిలోకి క్రమేపీ మంచి మంచి మిషన్లు వచ్చి చేరుతున్నాయి. మరాత్, రీనెంకర్, లడ్విగ్, సిన్సినాటీ; మొదలైన మిషన్లు అక్కడికి వచ్చాయి.

నాలుగైదు రోజులు పోయాక కాలనీకి ఇంజనీర్లు సయితం వచ్చారు. ఛీఫ్ఇంజనీర్ పేరు ఒర్లనోవ్ మనిషి కోపిష్టి. ముఖం

ఘుమఘుమ లాడుతున్నది. అతన్ని చూడగానే, అతనే ఛీఫ్ ఇంజనీర్ అని పిల్లలు ఇట్టే పసికట్టేశారు. కాని అతనికి నమస్కరించాలో అక్కర్లేదో కాళ్ళకు తెలిసిందికాదు. ఒర్గునోవ్ మాత్రం పిల్లల కేసి చూడనైనా చూడలేదు. పెద్దపెద్ద అంగలు వేస్తూ ముందుకు నడిచిపోసాగాడు. అతనెలాంటివాడో తెలుసుకోవాలని పిల్లలందరికీ కుతూహలంగా ఉన్నది. అందుకని తక్కిన ఇంజనీర్ల చుట్టూ తిరగ సాగారు. ఛీఫ్ ఇంజనీర్ ఒర్గునోవ్ కాలనీకి రాగానే కాలనీ ఇంజనీర్ మీద మండిపడ్డాడు:

"ఏదీ, నీవు తయారుచేస్తున్న ముసాయిదా ఏదీ? మూడు రోజుల క్రితమే తయారైపోతుందన్నావు?" అని అడిగాడు.

కాలనీ ఇంజనీర్ గ్రిగోరియవ్‌కు గుండెలు దడదడ కొట్టు కున్నాయి. గడగడ వణికిపోతూ ఇలా సమాధానం చెప్పాడు:

"పరికరాలన్నీ పూర్తిగా రాలేదు. ముసాయిదా ఎలా తయారు చేస్తాను? తప్పు నాదికాదు."

ఇదివిని ఒర్గునోవ్ తల పంకించాడు. పండ్లు కొరికాడు. కళ్ళు ఇంతింత చేశాడు:

"ఇహ ఈవేషాలు కట్టిపెట్టు. నాదగ్గరటయ్యా నీవేషాలు? పరికరాల కొలతలుతీసుకో. కావలసినవన్నీ పట్టీ వ్రాసుకో. వారం రోజుల్లో పనంతా పూర్తి కావాలి. తెలిసిందా?" అని అరిచాడు.

"వారంరోజుల్లోనా?"

"అవును, వారంరోజుల్లోనే – వినపడుతున్నదా? అంత కంటె ఒక్క పూటకూడా గడువియ్యను." అని కేకపెట్టాడు ఒర్గు నోవ్.

అతని అరుపుకు ఇంజనీరేకాదు, పిల్లలంతాకూడా భయపడి పోయారు. గ్రిగోరియెవ్ వంక జాలిగా చూశారు. ఒర్గునోవ్ పిల్ల లను పురుగులను చూచినట్లు చూస్తూ మండిపడ్డాడు. ఛీఫ్ ఇంజ నీర్‌కు, తక్కిన ఇంజనీర్లకు అనుక్షణం సంఘర్షణ సాగుతూనే ఉన్నది. రోజూ సాయంకాలం జకరోవ్ ఆఫీసులో వాళ్ళమీద

వాద ప్రతివాదాలు టార్‌స్కీ వింటూనే ఉన్నాడు. ఈ ఘర్షణలో బ్లమ్‌కూడా పాల్గొంటున్నాడు.

ఒకనాటి సాయంకాలం జకరోవ్ ఆఫీసులో ఒర్గునోవ్, బ్లమ్‌లమధ్య తీవ్రమైన చర్చలు చెలరేగాయి. ఇద్దరూ ఒకరిమీద ఒకరు ఆకాశం అంటుకునేటట్టు అరుచుకున్నారు.

"మానెత్తురు పిండి ఒక్కొక్క కోపెక్కు మేము కూడబెట్టుకున్నాం. ఫ్యాక్టరీఅంతా కట్టిన తరువాత పెద్ద దొరల్లాగా ఇంజనీర్లువచ్చి దిగబడ్డారు. లేబరేటరీ అనీ, డిజైనింగ్‌హాల్ అనీ, ఇప్పుడు మీరొచ్చి మాతాడు తెంపుతున్నారు. ఈపాటిదానికి ఎందుకింత మంది ఇంజనీర్లు ఇక్కడికి!" అని అరిచాడు బ్లమ్.

"మాటలు విన్నంతసేపూ తోకతొక్కిన తాచులా లేచాడు ఒర్గునోవ్,

"ఏమిటయ్యా నీ మెట్టవేదాంతం? నెత్తురు పిండి డబ్బు బెట్టావా? ఎన్నివేల బస్తాలకు ధనం నిల్వ చేశావయ్యా?" అని అడిగాడు.

"ఎంత నిల్వచేశామో, బ్యాంకులోనుంచి తీసి మా డబ్బు ఖర్చుపెడుతున్న దొరగారికి నీకు తెలీదూ?" అన్నాడు బ్లమ్.

"చాల్లే, నీ డబ్బూ నీవు – మహా లావుడబ్బు! ఈ ఫ్యాక్టరీ నేను నీ కోసం కట్టడంలేదు. దేశంకోసం, సోవియట్ ప్రభుత్వం కోసం కడుతున్నాను."

"అయ్యా ఇంజనీర్‌గారూ! తికమకగా మాట్లాడకండి. ఒక దానితో ఒకటి ముడిపెట్టకండి——ప్రభుత్వం వేరు, కాలనీవేరు. మీరు ఈ ఫ్యాక్టరీని కాలనీలో ఉన్న సభ్యులకోసం కడుతున్నారు. ఆ సభ్యుల సలహా మీరు వినకుండా పెడచెవిన పెడితే... ...సరేలే ఇప్పుడెందులకా గొడవ? మిషనుపెట్టే దిమ్మలు అలా ఎందుకు కట్టారు వాళ్ళు? ఏవయ్యా, ఇవాన్ సెమినోవిచ్! ఆ ఉంగరాల జుట్టువాడూ... ...వాడికి మతి ఉందా లేదా? మిషన్‌కు ఏరంగు వెయ్యమని వాడితో చెప్పావు?" అన్నాడు బ్లమ్.

"పసుపురంగు వెయ్యమని చెప్పాను."

"మరి నీవు చెబితే, వాడు అలా పూశాడే రంగు?"

"నేనేం చెయ్యను?" అన్నాడు సెమినోవిచ్ కొమెరోవ్.

గ్రిగొరియెవ్ అతన్ని నాలుగు చీవాట్లు వేశాడు. కొమెరోవ్ ముఖం వెలవెలపోయింది. అక్కడిహ కూచోలేక బయటికి వెళ్ళిపోయాడు. ఒర్లనోవ్ కూడా అవతలికి వెళ్ళిపోయాడు. తరువాత టారస్కీ ఇలా అన్నాడు:

"ఎందుకయ్యా అముసలాడికి అంతకోపం?"

"అతనికి కోపంలేదే – ఉత్సాహంవల్ల అలా ఉంటాడు. ఉత్సాహం పట్టలేక అలా అందరిమీదా కేకలు వేస్తుంటాడు" అన్నాడు జకరోవ్.

"ఉత్సాహం పట్టలేకపోవడమేమిటయ్యా బాబూ?"

"అదే ఉన్న చిత్రం స్వామీ! ఏంచేస్తాం? ఒక్కొక్క మనిషి తీరు అలా ఉంటుంది!" అన్నాడు మళ్ళీ జకరోవ్.

# 27

# లెవిటిన్

కొలనీలో జరుగుతున్న కృషి వివరాలనుగురించి రోజూ యథాప్రకారంగా ఒక రేఖాపటం తయారుచేసి గోడకు వ్రేలాడ కడుతున్నారు. గోడకు వ్రేలాడుతున్న ఆ పటాన్ని చూచి కాలనీ సభ్యులు ఉత్సాహవంతులవుతున్నారు, సభ్యులందరిలోకీ ఇగోర్ చెర్నియావిన్ కావించిన కృషి అద్భుతమని ఆ పటంలో స్పష్టంగా పేర్కొన బడింది.

ఒకనాటి రేఖాపటంలో ఈ క్రింది వాక్యాలు పొందుపరచ బడ్డాయి.

"యుద్ధరంగంలో మన సైనికులు అప్రతిహతంగా పురోగ మిస్తున్నారు. రక్షణ శ్రేణులను కట్టుదిట్టం చేసుకుంటున్నారు. మనదేశాన్ని పారిశ్రామిక వంతంచేయడమే మన సైనికుల ధ్యేయం. ఈరోజు మన దళాల ధాటికి తాళలేక శత్రువులు చాలా దూరం తిరోగమించారు.

"కామ్రేడ్స్! యుద్ధరంగంలో మనం సాధించిన విజయా లను మనవాళ్ళు పదిల పరుచుకుంటున్నారు. ఈరోజు కార్మికులు ఆరు కొత్తయంత్రాలను తయారుచేశారు. దీంతో సాంకేతికంగా మన కాలనీ వెనకపడడమనేది పూర్తిగాపోతుంది. నిన్న మనకు కొత్తమిషన్లువచ్చాయి. ఈరకం మిషన్లు మనదేశంలో ఇంకా తయారు చేయడంలేదు. కానికొద్ది కాలంలో వీటికంటె అద్భుత మైన యంత్రాలను మనం తయారు చేసుకొని తీరుతాం. సోవియట్ యూనియన్‌లో నేటివరకూ విద్యుత్పరికరాలను మనం తయారుచేసుకొని ఎరుగం కానిహాటిని రేపు మనం మనకాలనీలో తయారుచేసు కోబోతున్నాం. 'సాంకేతిక అవిద్య' మనకు బద్ధశత్రువు. ఆ శత్రువు నెమ్మది నెమ్మదిగా తిరోగమిస్తున్నాడు. ఇంకొకటి రెండుసార్లు మనం ఎదిరించి దెబ్బతీస్తే శత్రువు నామ రూపాలు లేకుండాపోతాడు. కాలనీ సభ్యులారా? వార్తాపత్రికలను ఒక్కతడవ చదవండి. మన కార్మికులు మన దేశసౌభాగ్యంకోసం ఎంత మహత్తరకృషి కావిస్తున్నారో, ఎన్నెన్ని సత్ఫలితాలను సాధి స్తున్నారో, మీాకే అవగతమవుతుంది. దేశంలో జరిగేకృషితో సరి పోల్చి చూస్తే మన కాలనీలో జరుగుతున్న కృషి అత్యల్పం. అయితేనేమి? సామ్యవాద రంగమనే మహాసముద్రంలో మనకాలనీ కృషి ఒక కెరటం వంటిది. ఇలాంటి కెరటాలన్నీ కలిస్తేనే ఒక మహాసముద్రంఅవుతుంది యిప్పటికి మనదండంగులు ఇరవైఎనిమిది రోజులుముందుకు నడిచారు! కార్మికులు కలకాలం వర్ధిల్లుదురుగాక:"

కాలనీకృషి వివరాలను తెలిపి ఈ పటాన్ని రూపొందించిన ఉద్యోగులలో ఇగోర్ చెర్నియావిన్ ముఖ్యుడు ఈవిషయం అంద రికీ తెలుసును. రానురాను కాలనీలో అతని పలుకుబడి పెరగ

జొచ్చింది. అతను అగుపించగానే కాలనీ సభ్యులు చిరునవ్వులతో పలకరిస్తున్నారు, అభివాదాలుచేస్తున్నారు.

ఈ పటానికితోడు అప్పుడప్పుడు ఒకచిన్న నివేదికను, బొమ్మల వివరాలను తయారుచేసి అందిస్తున్నాడు ఇగోర్ చెర్ని యావిన్. కాని ఈనివేదిక ప్రత్యేకంగా గోడవార్తాపత్రికలో చేర్చ వలసిందని కొమోసొమోల్ సభ్యులు అభిప్రాయపడ్డారు. అందుకు ఇగోర్ అంగీకరించాడు. అంటే కాలనీ సభ్యులందరికి గౌరవం ఉన్నా కొందరికి మాత్రం లోలోపల ఈర్ష్యగా ఉన్నది: వాళ్ళలో జీన్‌గ్రిఫీ, పెట్రోవ్, క్రుకోస్నెవ్‌లు ముఖ్యులు. గ్రిఫీ రెండవదళంలో సభ్యుడు. పెట్రోవ్ తొమ్మిదవ దళంలో ఉంటున్నాడు. క్రుకోస్నెవ్ ఏడవ దళంలో పనిచేస్తున్నాడు. వీరు ముగ్గురూ కలిసి ఒకచిన్న ప్రతిపక్షంగా ఏర్పడ్డారు. ఈ ప్రతిపక్షానికి నాయకుడు క్రుకోస్నెవ్. అందుచేత అతని విధానాలకు, ధోరణికి "క్రుక్నిజమ్" అని పేరు పెట్టారు. నిజానికి క్రుక్సు వర్గీయులు కృషిలో ఎప్పుడూ వెనక పడిందిలేదు. ఒళ్ళువంచి పనిచేస్తుంటారు. కాని పని అయిపోగానే సాయంకాలంవేళ ఒకచోట కూడి వింతవింత వదంతులను పుట్టిస్తూ ఉంటారు. కాలనీలో ఏదో ఒక ప్రచారంచేస్తూ ఉండడమే వాళ్ళ పని. కాలనీలో విద్యుత్పరికరాలు యంత్రాగారాన్ని నెలకొల్పడం శుష్కదండుగ అని ఇటీవల వీళ్లు ఒకప్రచారం లేవదీశారు. ఆ అభి ప్రాయం మెల్లమెల్లగా అందరిలోకీ పాకింది. అలాంటి ఫ్యాక్టరీలు, భారీ పరిశ్రమలు ప్రజాసంఘాలు నిర్మించాలేతప్ప ఇలాంటి కాలనీ సభ్యులకు తగవని క్రుక్సు అనుయాయులు ఒక సిద్ధాంతాన్ని సృష్టించారు.

పెట్రోవ్‌కు సినిమాలపిచ్చి జాస్తి. గ్రిఫీ సంగీతమంటే చెవి కోసుకుంటాడు. క్రొకోస్నెవ్‌కు ఆటలంటే అభిమానం. ఒకనాటి రాత్రి ఇగోర్, మలంకీ లిరువురూ కూచుని ఆనాటి కార్యకలా పాలను సమీక్షిస్తూ, ఒక నివేదిక తయారుచేశారు. ఆ మరుసటి రోజు ఆ నివేదిక పటంతోపాటు గోడమీద ప్రత్యక్షమయింది. వాళ్లు తయారుచేసిన నివేదికలో క్రుక్సు వర్గీయులను గురించి ఒక్క

అక్షరంకూడా లేదు. కాని వాళ్ళబొమ్మలు మాత్రం ఉన్నాయి. పట్టికలో అందమైన నగరం గంట స్తంభాలతో, అంతఃపురాలతో గీయబడిఉంది. నగర ప్రాకారాలు చెంత భీకరసంగ్రామం సాగు తున్నట్టు చిత్రితమైంది. ఆయుధ సన్నద్ధులై ఎర్రసైనికులు ముందుకు దూసుకుని వెడుతున్నారు. తుపాకులు కాలుస్తున్నారు. నలుదెసల పొగలు కమ్ముకున్నాయి. ఆ సైనికుల వెనకాల దూరాన పచ్చని రంగుతో కొన్నిపొదలు, గుబుర్లు బొమ్మలుగీసి ఉన్నాయి. అ పొదలదగ్గర ఒక బండిఉన్నది. బండిలో ముగ్గురు వ్యక్తులు కూచు న్నారు. వారిలో ఒకడు సినిమా కెమేరా చేతపట్టుకున్నాడు. మరొకడు మద్దెల మెడకు తగిలించుకున్నాడు. ఇహ మూడోవాడు ఫుట్‌బాల్ చేతపట్టుకున్నాడు: ఆ ముగ్గురినీ చూడగానే వాళ్లెవరో ఇట్టే తెలిసిపోయింది అందరికీ.

కాలనీ కుర్రాళ్ళు ఆ బొమ్మచూస్తూ నవ్వుకోసాగారు. నిము షం సేపట్లో ఎక్కడెక్కడున్న కుర్రాళ్ళంతా వచ్చి అక్కడ పోగయ్యారు. ఛలోక్తులు, వ్యంగ్యోక్తులు వినిపించసాగాయి. ఆబొమ్మ ఇంకా ఎలావేస్తే బావుంటుందో ఎవరికి తోచిన సలహా వాళ్ళు చెప్పసాగారు. ఇదిచూచి కుక్స్ వర్గీయులు మండిపడ్డారు. సర్వసభ్య సమావేశంలో ఆ త్రిమూర్తులు రభస ప్రారంభించారు.

"ఏమిటీపని? తనకు తోచింది తోచినట్టు ఇగోర్ అలా పిచ్చి గీతలు గీయడమేనా? వాడికి ఆ అధికారం ఎవరిచ్చారు?" అని తీవ్రంగా ప్రశ్నించాడు క్రుకోవ్: "అనుకున్న దానికంటే నూటికి ముప్పయిపాళ్ళు ఎక్కువ పనిచేశాను నేను. పనిలో నేనేం వెనకపడలేదు. అప్పుడప్పుడు ఏదో నా ఇష్టంవచ్చినట్లు మాట్లాడా నంటే అందులో తప్పేముంది? ఏదో సరదాకలా ఏవేవో మాట్లాడు కుంటాం." అన్నాడు.

"అలా మాట్లాడావు కనుకనే ఇలా ఈ బొమ్మగీశారు. సరి పోలేదూ?" అని సమాధానం చెప్పాడు టార్‌స్కీ.

ఇగోర్ తనను అకారణంగా అవమానించాడని క్రుకోవ్ అభిప్రాయం. తక్కిన ఇరువురూ ఆవేళ సమావేశంలో ఒకపెద్ద

గోడన లేవదీశారు. త్రిమూర్తులు లేవదీసిన ఈఅల్లరి జిరియాన్‌స్కీ జోక్యంతో కాని తగ్గలేదు. జిరియాన్‌స్కీ ఇలా అన్నాడు :

"నోటికి వచ్చినట్లల్లా బాధ్యతారహితంగా మాట్లాడితే ఏమవుతుంది? మీలాంటి వాళ్ళవల్ల ఫ్యాక్టరీకి ఏమీ లాభంలేదు. కాలనీలో ఫ్యాక్టరీ కట్టడంవల్ల ఏమీ లాభం లేదని మీరు డప్పు వేసుకుని ప్రచారం చేస్తున్నారు. నిజంగా ఫ్యాక్టరీవల్ల ఏమీ లాభం లేదంటారా? కాస్త ఆలోచించి చూడండి. విప్లవానికి పూర్వం మన కార్మిక వర్గం చూచేటందుకు ఎన్ని సినిమాలుండేవి? ఎన్ని వాయిద్య దళాలుండేవి? ఎన్ని క్రీడారంగాలుండేవి? ఈ నిధులన్నీ మీకు సమకూడాయంటే కారణం ఎవరు? మనకు ఈ ఫ్యాక్టరీలు, ఈ పరిశ్రమలు లేకపోయినట్లయితే జీవితంలో సంగీతం, క్రీడావినోదాలు; ఏవీ ఉండేవికావు. మీ ముగ్గురికీ ఫ్యాక్టరీలో కృషి చేయడమంటే ఇష్టంలేదు.

ఫ్యాక్టరీలో కాకుండా ఫ్యాక్టరీ బయట ఇతరపనులు చేస్తూ ఉండండి."

జిరియాన్‌స్కీ ఇలాఅనేసరికిపెట్రోవ్ తలక్రిందులైపోయాడు:

"కామ్రేడ్స్! కామ్రేడ్స్! ఫ్యాక్టరీకి వ్యతిరేకంగా ఎన్నడైనా నేను పల్లెత్తు మాటన్నానా? ఫ్యాక్టరీలో ఎంత శ్రద్ధగా పని చేస్తున్నానో మీ అందరికీ తెలీదూ?" అంటూ పెట్రోవ్ బ్రతిమాలుకోసాగాడు.

ఇహ క్రుకోవ్స్కీన్ వంతు వచ్చింది. అతనుకూడా తన తప్పు క్షమించమని ప్రాధేయపడ్డాడు. ఇహ క్రుకిస్టిజం గురించి కాలనీ సభ్యులెవరూ పట్టించుకోవద్దనీ, దానికి ఇంతటితో స్వస్తి చెబుతున్నాననీ మాట ఇచ్చాడు.

ఈ సంఘటనలో ఇగోర్ గౌరవప్రతిష్టలు ఇనుమడించాయి. నివేదికా సంపాదకుడుగా తన బాధ్యతలను తాను ఇంకా చక్కగా నిర్వహించసాగాడు ఇగోర్.

బ్లమ్ ఫ్యాక్టరీ నిర్మాణం దాదాపు పూర్తి కాజొచ్చింది 'స్టేడియం' అందమైన గోడలతో, అద్భుతంగా తయారయింది.

పూర్వంలాగా ఇప్పుడు పొగబాధ లేదు. పనిముట్లకు కొదువలేదు. అందుచేత కాలనీ కుర్రాళ్ళు ఎవరూ వెనుకటిలాగా ఇప్పుడు బ్లమ్ మీద ఫిర్యాదులు చెయ్యడంలేదు. యంత్రాలకు ఏమాత్రం మరామత్తు వచ్చినా కాలనీ కుర్రవాళ్ళే స్వయంగా బాగుచేసుకుంటున్నారు. ఒలెన్‌చెక్ సయితం కుర్రాళ్ళ చాకచక్యానికి అచ్చెరువు చెందుతున్నాడు. పెట్కాలాంటివాడు ఒకేసారి విరామం లేకుండా నాలుగు గంటలసేపు పని చేస్తున్నాడు. రోజుకురోజు పిల్లలకు పట్టుదల పెరగజొచ్చింది.

ఒకనాడు క్రుట్జర్ యంత్రశాలకు వచ్చాడు. ఆవేళ అతను పర్యవేక్షకుడు. యంత్రశాలలోకి వచ్చి తలుపు తెరిచి లోపలికి తొంగి చూచాడు. లోపల అందరూ ప్రశాంతంగా పనులు చేసుకుంటున్నారు. అతను ఒక అడుగు ముందుకు వేశాడు. అందరూ అతన్ని చూచి చిరునవ్వులతో ఆహ్వానించారు. యంత్రాలయం పరిశీలించి చూచేసరికి క్రుట్జర్‌కు ఆనందం పొంగిపొరలింది. పైన చక్రాలు గిర్రున తిరుగుతున్నాయి. కప్పీలు క్రిందికీ పైకీ ఆడుతున్నాయి. చకచకా పని సాగిపోతున్నది. యంత్రాలయం పైకప్పు పడిపోతుందా అన్నట్లు ఊగిపోతోంది.

"పైకప్పు విరిగి మనపైన పడదుకదా?" అని నవ్వుతూ ప్రశ్నించాడు క్రుట్జర్.

వాన్యా మరేమీ ప్రమాదం లేదన్నట్టు చిరునవ్వు నవ్వాడు నవ్వుతూనే తన పనిలో తాను నిమగ్నుడైనాడు.

"ఏమంటావు వాన్యా? అది పైన పడుతుందంటావా?" అని అడిగాడు మళ్ళీ క్రుట్జర్.

"పడదులెండి." అన్నాడు వాన్యా.

"కాదులే, పడవచ్చు. ఎందుకంటే పై కప్పు దిట్టంగాలేదు. దూలాలు గట్టిగానే ఉన్నాయి."

ఇంతలో అక్కడికి బ్లమ్ వచ్చాడు. పై కప్పు కూలి పడే ప్రమాదం ఇంతలో ఏమీలేదనీ, అది కూలిపడేలోగా మహో

పది కొత్త ఫ్యాక్టరీలు కట్టవచ్చుననీ, ఒకవేళ కూలిపడినా దూలాలు వచ్చి సరాసరి పిల్లల తలకాయలమీద పడవులెమ్మనీ వ్యంగ్యధోరణిలో అన్నాడు. క్రుట్జర్ ఇందుకేమీ సమాధానం చెప్పలేదు: అక్కడనుంచి ఎకాఎకి వడ్రంగం చేసేచోటికి వెళ్ళాడు. ఇక్కడ పైకప్పేమీ లేదు? ఒక ఖాళీజాగాలో పనివాళ్ళు పనులు చేస్తున్నారు. ఇగోర్ చెర్నియావిన్ కూడా ఇక్కడే పనిచేస్తున్నాడు. అతనిప్పుడు వెనకటిలాగా కుర్చీలకు, బల్లచెక్కలకు మెరుగుపెట్టడం లేదు. వ్రాతబల్లలు తయారు చేస్తున్నాడు. ఇది చాలా కష్టమైన పని, ఎంతో తెలివిగా జాగర్తగా నిర్వహించవలసిన పని. అయినా ఇగోర్ చాలా నేర్పుగా, హుషారుగా పనిచేస్తున్నాడు. కుర్రవాళ్ళందరిలోకీ ఎంతో అనుభవం గడించినవాడిలా కనుపిస్తున్నాడు. పనిచేస్తుంటే అతని ముఖకవళికలు చిత్రవిచిత్రంగా మార్పు చెందుతున్నాయి. రకరకాలుగా భంగిమలు పెడుతున్నాడు. క్రుట్జర్ అక్కడికి రావడం గమనించాడు ఇగోర్. వెంటనే సాల్యూట్ చేశాడు. క్రుట్జర్ తన సహజ భంగిమలో ముఖంపెట్టి అతని అభివాదం అందుకున్నాడు:

"ఇవాళ మా పని ఎలా సాగుతున్నదయ్యా ఇగోర్?" అని అడిగాడు.

"లోహాపు కార్మికులకంటే మేం ముందు ఉన్నామండీ!" అన్నాడు ఇగోర్.

"ఇవాళ ఉంటే ఉన్నారేమోకాని, ఏడాదిమొత్తం ఇలా ఉండడం మీకు సాధ్యంకాదులే." అన్నాడు క్రుట్జర్.

"ఎందుకుకాదూ? అవుతుంది. లోహాపు కార్మికుల పని చాలా అధ్వాన్నంగా ఉంది. వాళ్ళలా మాంద్యంగా పనిచేయడం ఇహమీదట ఏమాత్రం కుదరదు. కొత్త ఫ్యాక్టరీ నిర్మాణం సాధ్యమైనంత త్వరలో పూర్తికావాలి" అన్నాడు ఇగోర్.

"త్వరలోనా? మరి ఆ మూడులక్షల మాటేమిటి?"

"ఇప్పుడు మేం ఆగష్టు 19 వ తేదీవరకూ వచ్చాం. ఇహ మూడు మాసాల్లో ఏడాదికి వేసుకున్న ప్లాను ప్రకారం పని పూర్తి చేస్తాం. అలా చేస్తే మనకు నాలుగు లక్షలు మిగులుతాయి,"

ఇగోర్ ఇలా అనేసరికి క్రుట్జర్ అతనివంక ఆశ్చర్యంగా చూచాడు. అతని ఉత్సాహానికీ, పట్టుదలకూ లోలోపల మెచ్చు కున్నాడు. నిశ్వసించి ఇలా అన్నాడు:

"మూడు నెలలు... అవుతుందా అని?"

"అవుతుందనే ధైర్యం మాకు ఉన్నది. ఉన్నా చిక్కల్లా ఏమిటంటే సరిపడినన్ని యంత్రాలు లేవు" అన్నాడు ఇగోర్.

"అవును. ధైర్యం ఉంటే అవుతుంది...ఇలా అని వెళ్ళి పోయాడు క్రుట్జర్.

ఇహ నాలుగోదళం పరిస్థితి వేరుగా ఉన్నది. రైజికోవ్ విశ్రాంతివేళ చేసిన దొంగతనంగురించి నాలుగోదళ సభ్యులందరికీ తెలిసింది. జరిగిన సంగతంతా పూసగుచ్చినట్టు చెప్పాడు వాన్యా. అతని మాటలను జాగ్రత్తగా విన్నారు సభ్యులంతా. జిరియాన్స్కీ చాలా కోపగించుకున్నాడు. కాని ఈ విషయం ఎవ్వరికీ తెలియ నివ్వకూడదనీ, రైజికోవ్ ముందుముందు ఏంచేస్తాడో ఒకకంట కని పెడుతూ ఉండాలని సభ్యులు నిశ్చయించుకున్నారు. ఇందుకు మాత్రం బిగోనక్ వ్యతిరేకించాడు.

"ఈ విషయంలో ఇంకా మనం ఎందుకు ఆలస్యం చేయడం రైజికోవ్‌ను ఎన్నిసార్లనీ, ఎంతకాలమనీ పరీక్షిస్తూ కూచుంటాం? వాడు పచ్చి దొంగ అని ఏనాడో తేలింది. ఇహ ఎంతమాత్రం కాలయాపన చేయకుండా వెంటనే మనం వాడిమీద చర్య తీసు కోవాలి. మనంఊరుకుంటే వాడు మరీ పెచ్చుమీరిపోతాడు. రేపు సాధారణ సమావేశంలో నేనీ విషయం చర్చకు పెడతాను" అన్నాడు బిగోనక్ ఖచ్చితంగా.

"చర్చకు పెడితేమాత్రం లాభమేమిటి?" అని అడిగాడు ఫిల్కా.

"అంటే ఏమిటి నీ ఉద్దేశం?—లాభమెందుకు లేదూ?"

"అదికాదయ్యా. తీరా సమయం వచ్చేసరికి ఆ రైజికోవ్ గాడు తనమీదికి రాకుండా చల్లగా తప్పించుకుంటాడు. అందులో వాడు మొనగాడు. నేనేం దొంగతనం చెయ్యలేదని బుకాయిస్తాడు. గుడారం దగ్గర ఆరు బయట పడుకున్నానని బొంకుతాడు."

"అది సరేనోయ్. అతను పడుకుని ఉండగా చేతులేం చేశాయి?"

"ఏమీ చెయ్యలేదూ. పడుకున్నాడు. నిద్రలో వాడి చేతు లెక్కడున్నాయో వాడి కెలా తెలుస్తుంది? ఇలా అని వాడు చెబితే అందుకు నీవేం సమాధానం చెపుతావో చెప్పు?"

"జరిగిందేమిటో వాన్యా కళ్లారా చూచాడు కదయ్యా!"

"చూస్తేనే సరిపోతుందా? వాడు దొంగతనంచేసినప్పుడు, దొంగిలించిన వస్తువుతో సహా వాణ్ణి తక్షణం పట్టివ్వాలి."

బిగోనక్, ఫిల్కా లిద్దరూ ఇలా వాదించుకోసాగారు. అప్పుడు జిరియాన్‌స్కీ ఇలా అన్నాడు :

"ఎందుకోయ్ మీరిద్దరూ అలాగొంతులు చించుకుంటారు? సర్వసభ్య సమావేశంలో రైజికోవ్ దొంగఅని ఎవరూ చెప్పలేదు. వాడుచేసిన పనులనేకం వాన్యా కళ్ళారాచూచి ఉండవచ్చును. చూచిన దాన్నిబట్టి తనకు తోచినవిధంగా ఊహించుకోవచ్చును. కాని అంతమాత్రంచేత అతని ఊహ నిజమని ఎలా నమ్మడం? రైజికోవ్ దొంగ కాకపోనూవచ్చు. ఇంతవరకూ అతను దొంగి లించిన వస్తువుతో సహా ఎన్నడూ పట్టుబడలేదు. ఇదివరకు పొడ్వొస్కోను రైజికోవ్ పట్టుకున్నాడు. పొడ్వొస్కో చేతిలో పోయిన వస్తువులున్నాయి. అందుచేత అతను దొంగని రుజువైంది. మరి రైజికోవ్ విషయంలో అలా జరగలేదు. పోయిన వస్తువొకటి - అతనిదగ్గర మీరు చూపించిన వస్తువు మరొకటీ. ఆవేళ అతని

జేబులో సిగరెట్టుపెట్టె ఉన్నదని కదూ మీరు చూపించారు? అలాంటి ఖాళీపెట్టెలు కాలనీలో ఎక్కడబడితే అక్కడ దొరుకుతాయి. గుడారం కొసన రైజికోవ్ పడుకున్నాడని మీరు చెప్తున్నారు. గుడారం లోపల పర్సు పడిఉన్నదని కూడా అంటున్నారు. కాని ఇది సమంజసంగా లేదు. గుడారాలలో అనేక వస్తువులు విడివిడిగా పడేసి ఉంటాయి. అంతమాత్రం చేత గుడారం ప్రక్కనుంచి వెడుతున్న ఒక వ్యక్తిని దొంగని అనగలమా?"

జిరియాన్స్కీ ఇలా అడిగేసరికి బిగోనక్, ఫిల్కాలు కిక్కురుమనకుండా ఊరుకున్నారు. కష్టమని వారు గ్రహించుకున్నారు.

కాని ఆ మరునాటినుంచీ కాలనీలో దొంగతనాలు ఎక్కువైనాయి. పోయిన వస్తువులన్నీ సామాన్యమైనవే. అయినా కాలనీలో ఇలా దొంగతనాలు జరగడం అందరికీ బాధగా ఉన్నది. ఒకరికి ఒక చేతిగడియారం పోయింది. మరొకడికి చాకు పోయింది. ఇంకొకడికి పంట్లాములు పత్తాలేకుండా పోయాయి. వేరొక గుడారంలో ఒక కెమేరా పోయింది. ఇవన్నీ ఎలా పోయాయో ఎవరికీ తెలీదు. రోజూ ఏదో ఒక వస్తువు పోతున్నట్టు డ్యూటీలో ఉన్న కమాండర్, జకరోవ్‌తో ఎప్పటికప్పుడు ఫిర్యాదు చేస్తూనేఉన్నాడు దొంగతనం ఎలా జరిగిందీ వివరాలడిగి పరిస్థితులు అవగతం చేసుకుంటూ వచ్చాడు జిరియాన్స్కీ. కమాండర్లుజరుగుతున్న దొంగతనాలను గురించి గడబిడ చెయ్యడం లేదు. ఎక్కడివాళ్ళక్కడ విని ఊరుకుంటున్నారు. సభ్యులు సయితం అదే పద్ధతి అవలంభించారు.

జూన్ నెల వచ్చింది ఈసారి యంత్రశాలలో పరికరాలే మాయమైపోతున్నాయి. రంపాలు, బాడిసెలు, ఉలులు, నూనె పాత్రలు, రాగిరేకులు; క్రమేణా అన్నీ మాయమై పోతున్నాయి.

ఒకనాడు సర్వసభ్య సమావేశం జరుగుతుండగా హఠాత్తుగా బ్లమ్ లేచి నిలుచున్నాడు. దొంగతనాల విషయం ప్రస్తావించాడు. ఆవిషయం అతను ప్రస్తావిస్తాడని సభ్యులెవరూ ముందుగా అనుకోలేదు. బ్లమ్ ఇలా చెప్పడం మొదలుపెట్టాడు:

"ఇప్పుడు నేను మీకొక విషయం స్పష్టంగా చెప్పదలుచుకున్నాను మీరు పనిలో మంచి నిపుణులు. మీ సమావేశాల్లో అనేక విషయాలను గురించి ప్రసంగించుకుంటున్నారు. కాని కాలనీలో జరుగుతున్న దొంగతనాలను గురించి ఎవరూ పల్లెత్తుమాట పలకడం లేదు. నావంటి పెద్దవాడికి సయితం మీవైఖరి ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. దేశ పునర్నిర్మాణంకోసం, అనేక రంగాలలో మీరు పురోగమిస్తున్నారు. గోడమీద రోజూ కనుపించే రేఖాపటంలో మీరు సాధించిన అభ్యున్నతి అగుపిస్తూనే ఉన్నది. మీరు సమర రంగంలో శత్రువులను తరిమి కొడుతున్నారు. అలాంటప్పుడు ఫ్యాక్టరీలో ఎవరో పరికరాలు దొంగిలిస్తుంటే మీరెలా ఊరుకోగలిగారు? అలా ఎందుకు ఊరుకున్నారు. ఇంతకుముందు ఫ్యాక్టరీలో పరికరాలు బాగాలేవనీ, మంచివి కావాలనీ మీరంతా ఆందోళన సాగించారు. మీకోరిక ప్రకారం ఫ్యాక్టరీకి కావలసినన్ని మంచి మంచి పరికరాలు దిగుమతి కావించబడినాయి. కాని ఏంలాభం? ఆ పరికరాలిప్పుడు ఫ్యాక్టరీలో ఉంటున్నాయా? వాటిని పోకుండా మీరు భద్రపరుచుకోగలిగారా? చెడ్డయంత్రాలు మనకు శత్రువులని కామ్రేడ్ జోరిన్ ఇదివరకు అన్నాడు సరే. ఆమాట నిజమేనని అంగీకరిద్దాం అయితే ఇప్పుడు మంచి పరికరాలను దొంగిలిస్తున్నవాళ్ళు శత్రువులు కారా? వాళ్ళమాట ఏమిటి?"

ఇలా అంటూ బ్లుమ్ విచారంగా సభ్యులవంక చూచాడు:

"మాయమవుతున్న పరికరాలు చాలా విలువైనవి ఆ విషయం మీకు తెలుసునా?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

"తెలుసును, తెలుసును!" అంటూ ఒక సభ్యుడు ఒక మూలనుంచి కేక పెట్టాడు.

సభ్యులకు చిన్నతనమనిపించింది. బ్లుమ్ ముఖంకేసి చూడలేక పోయారు. అతని కాలిబూట్లువంక చూచారు. బ్లుమ్ తొడుక్కున్న బూట్లు నలిగిపోయి. దుమ్ము కొట్టుకుని ఉన్నాయి. పాపంఆయన ఎన్నెన్ని పనులమీదనిర్విరామంగా తిరుగుతున్నాడో! అవును. ఆయన బాధ్యతలు అలాంటివి.

బ్లమ్ మరొక తడవ మౌనంగా సభ్యులందరివంక చూచాడు బుజాలు కుంచించుకు క్రింద చతికిలబడ్డాడు. జకరోవ్‌తో ఏదో చెప్పబోయాడు కాని అతను వినకుండా ముఖం ప్రక్కకు తిప్పు కున్నాడు విట్యాటార్‌స్కీ క్రిందికి చూస్తూ మెల్లగా ఇలా అడిగాడు:

"ఈ విషయంమీద సభ్యులెవరైనా మాట్లాడతారా—"

సభ్యులందరూ తలలు వాల్చుకున్నారు. కాని అక్కడక్కడ గుసగుసలు బయలుదేరాయి. ఆడపిల్లల ముఖాలు అరుణిమ దాల్చాయి. క్లావా కషిరినా మాత్రం తలఎత్తి టార్‌స్కీవంక చూస్తోంది. ఆమెను అటుకేసి చూడవద్దని పక్కనున్న పిల్ల మోచేత్తో పొడిచింది. క్లావా ఆ పిల్లవైపు చురచుర చూచింది. టార్‌స్కీ తన చేతిలో ఉన్న నివేదికను టేబిల్‌మీద ఉంచాడు. ఎవరైనా మాట్లాడతారో అన్నట్టు మళ్ళీ ఒకమాటు సభ్యులను కలయచూచాడు. ఇగోర్ చెర్నియావిన్ గబగబ లేచినిలుచున్నాడు:

"సాలొమన్ డవిడొవిచ్ చెప్పింది అక్షరాలానిజం. ఆ విషయాన్ని గురించి మనం ఎందుకు మాట్లాడకూడదు? అన్నాడు ఇగోర్.

"అయితే ముందు నీవే మాట్లాడవయ్యా."

"అవును నేనే మాట్లాడతాను."

"మంచిది మాట్లాడు చెర్నియావిన్" అన్నాడు టార్‌స్కీ.

"నాకు దొంగ ఎవరైందీ తెలీదు కాని తన ప్రవర్తనను గురించి తాను చెప్పుకోవాలి రైజికోవ్"

"రైజికోవ్‌మీద ఎందుకు నేరారోపణ చేస్తున్నావు?"

ఈ ప్రశ్న విని ఇగోర్ కంగారుపడ్డాడు. ఒక అడుగు ముందుకు వేశాడు. తల పంకించి బిగ్గరగా ఇలా అన్నాడు:

"అవును. సందేహంలేదు. రైజికోవ్ దొంగ. అతనిమీద నేను నేరారోపణ చేస్తున్నాను."

పిల్లలంతా నిశబ్దంగా కూచుని ఉన్నారు.

"నేరం ఆరోపించగానే సరికాదు. రుజువు చెయ్యాలి— అంటే సాక్ష్యం కావాలి" అన్నాడు టార్‌స్కీ.

"నాలుగోదళం సభ్యులు నా కా విషయం రుజువు చేస్తారు - వాళ్ళే సాక్ష్యం. వాళ్ళ కంతా తెలుసును. తెలిసిన విషయాన్ని బయటికి చెప్పక వాళ్ళెందుకు ఊరుకున్నారు?" అన్నాడు ఇగోర్.

సమావేశంలో స్టాలిన్ విగ్రహం చుట్టూ కూచునిఉన్న నాలుగోదళ సభ్యులు ఒక్కమాటుగా గొల్లున నవ్వారు. బిగోనక్ బిగిల్ ఊదాడు.

"నేను మాట్లాడతాను !" అన్నాడు బిగోనక్ ఉత్సాహంగా.

"అయితే మాట్లాడు" అన్నాడు టార్‌స్కీ.

బిగోనక్ లేచాడు. కాని అతను లేవకుండానే నాలుగోదళం కమాండర్ జిరియాన్‌స్కీ ఇలా అన్నాడు :

"టార్‌స్కీ! నాలుగోదళం కమాండర్ ఇక్కడే ఉన్నాడు కదయ్యా !"

"ఓహో, అన్నట్టు మరిచాను. జిరియాన్‌స్కీ! నీవే మాట్లాడవయ్యా." అన్నాడు టార్‌స్కీ.

జిరియాన్‌స్కీ లేచి నిలుచుని ఇలా చెప్పాడు :

"కామ్రేడ్ ఇగోర్ చెప్పింది తప్పు. నాలుగోదళ సభ్యులకు ఈవిషయం ఏమీ తెలీదు. అలాంటప్పుడు రైజికోవ్ మీద నేరారోపణ చేయలేం."

ఇగోర్ ముఖం నల్లబడింది. కాని తను ఎక్కడున్నదీ ఒక్కమాటు జ్ఞాపకం చేసుకున్నాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. జిరియాన్‌స్కీ వంక తిరిగి వ్యంగ్యంగా ఇలా అన్నాడు:

"నీ అభిప్రాయంతో బిగోనక్ ఏకీభవిస్తున్నట్లు కనిపించడంలేదే! దీని కేమంటారు?"

"బిగోనక్ కు ఏమీ తెలీదు. నా అభిప్రాయమే అతని అభిప్రాయం"

"అయితేనేం? అతన్ని మాట్లాడనివ్వండి" అన్నాడు ఇగోర్ పట్టుదలగా.

బిగోనక్ ను మాట్లాడమని ఆదేశించాడు టార్ స్కీ, బిగోనక్ లేచి నిలుచున్నాడు. కాని గాభరా పడసాగాడు:

"గాభరా పడకు. నీకు తెలిసిందేమిటో చెప్పు." అన్నాడు టార్ స్కీ.

"నేను... ఆలోషా... చెప్పినట్లుగా..." అని ఏదో నసిగాడు బిగోనక్.

"నీకేం తెలీదన్నమాట?" అని అడిగాడు టార్ స్కీ.

"ఏం తెలీదు" అని గొణిగాడు, బిగోనక్.

"మరి ఇంతకు ముందేదో మాట్లాడబోయావు?"

"మాట్లాడబోయాను......ఇదే...ఇదే...ఇదే చెపుదామనుకున్నాను. నాకేం తేలీదని, ..."

టార్ స్కీ అతనివంక తీక్షణంగా చూచాడు. తక్కిన పిల్లలు కూడా అతనివంక చురచుర చూచారు.

"ఇహ కూచోవోయ్!" అని కసురుకున్నాడు టార్ స్కీ.

బిగోనక్ బిత్తరబోయి మెట్లమీాద కూచున్నాడు.

"ఇహ నీవేమైనా మాట్లాడతావా లేక కూచుంటావా? ఏం చెర్నియావిన్? ఏమంటావ్?" అని ఇగోర్ ని ప్రశ్నించాడు.

ఒక్సానా ఇగోర్ వంక చూచింది. ఇగోర్ మూతిముడుచుకున్నాడు. ఒక్క క్షణం ఆలోచించి తల పంకిస్తూ ఇలా అన్నాడు:

"కాలనీలో జరిగే దొంగతనాలకు రైజికోవ్ బాధ్యుడని నా నమ్మకం. ఆ మాటే నేనిప్పుడు చెప్పదలచుకున్నాను. ఇహ దానికి రుజువంటావా? తరువాత చూపిస్తాను." ఇలా అని ఇగోర్ తిరిగి తన స్థానంలోకి వచ్చి కూచున్నాడు:

సభాధ్యక్షుడు టార్‌స్కీ తన అభిప్రాయాన్ని ఇలా ప్రకటించాడు:

"సాక్ష్యం, రుజువు లేకుండా ఇలాంటి ఆరోపణను నిజమని అనుకోవడానికి వీల్లేదు."

రైజికోవ్, టారస్కీ వంక తీవ్రంగా చూచాడు. టార్‌స్కీ అతన్ని ఇలాగ శాంతిపరిచాడు:

"నీమీద ఏమీ నేరారోపణ చెయ్యలేదనే భావించు. ఇగోర్ ప్రవర్తనను గురించి కొమోసామోల్ సభ్యులు తరువాత విచారిస్తారు. ఇంతటితో ఈ సమావేశం ..."

ఇంతలో "నేను మాట్లాడతాను" అని ఒక గొంతుక వినిపించింది.

సభికులందరూ సభా మధ్యలో నిలుచున్న ఒక వ్యక్తివంక చూచారు. అతను రైజికోవ్. అతను నిటారుగా నిలుచున్నాడు. చెదిరిపోయిన జుట్టును కొనవ్రేళ్ళతో సవరించుకున్నాడు. మనిషి ఉల్లాసంగా అగుపిస్తున్నాడు. ముందుకువచ్చి ఇలా అన్నాడు రైజికోవ్.

"ఇగోర్ నన్ను అవమానించాడూ అంటే అందుకు కారణం ఉన్నది. నా గత జీవితం ఎలాంటిదో అతనికి తెలుసును. కాని ఇప్పుడు ఇగోర్ తన వైఖరిని మార్చుకోక తప్పదని మనవి చేస్తున్నాను. ఇంతవరకూ కాలనీలో ఒక చీపుర పుల్లయినా నేను దొంగిలించిన పాపాన పోలేదు. ఇహ ముందుకూడా అలాంటి దొంగతనాలు చెయ్యను. ఏమీ ఆధారం లేకుండానే ఇగోర్ నేను దొంగతనం చేశానంటున్నాడు. మీకు దొంగ ఎవరో తెలుసుకోవాలని ఉంటే ఒకమాటు లెవిటిన్ పెట్టె తెరిచి చూడండి. ఇవాళ రెండు రెంచీలు పోయాయి. యంత్రశాలవైపు నేను వెడుతూ ఉంటే లెవిటిన్ అక్కడ నాకు కనుపించాడు. అతను రెంచీలు దొంగిలించడం నా కళ్ళారా చూచాను. ఇంతే నేను మీకు చెప్పదలుచుకున్నది."

తన ప్రసంగం ముగించి కూచున్నాడు రైజికోవ్. సభలో కలకలం బయలుదేరింది. ఒకరు దొంగనుకుంటే మరో దొంగ బయటపడ్డాడు. సమావేశం చాలాసేపు కొనసాగింది. తీవ్రంగా చర్చలు జరిగాయి. పోయిన రెంచీలు వెదికి అక్కడికి తీసుకొచ్చారు. అవి లెవిటిన్ పెట్టెలో దొరికాయి. అవి ఒలెన్‌చెక్ రెంచీలు. లెవిటిన్‌ను దీనికి సంజాయిషీ చెప్పమని అడిగారు. అతను సమావేశం ముందు నిలుచున్నాడు. కాళ్ళు, చేతులు వణుకుతున్నాయి. బిగ్గరగా ఏడ్వసాగాడు. తాను వాటిని దొంగిలించలేదని మొరపెట్టుకున్నాడు. సభ్యులు అతన్ని రకరకాల ప్రశ్నలు అడిగి అతనికి ఊపిరి సలపకుండా చేశారు. పాపం ఇహ అతను తట్టుకునేటట్లు లేడు. అక్కడే క్రింద పడిపోతాడా అనిపించింది. ఇదంతా గమనించాడు జకరోవ్. వెంటనే అతన్ని డాక్టర్‌దగ్గరికి తీసుకపొమ్మని ఆదేశించాడు. ఆరోగ్యదళ మానేటర్, లీడా ఇవనోవ్నాలిరువురూ లెవిటిన్‌ను నెమ్మదిగా డాక్టర్‌దగ్గరికి తీసుకెళ్ళారు. గదిలోనుంచి ఇవతలికొచ్చిన తరువాత కూడా లెవిటిన్ ఏడ్పు మానలేదు. అలా ఏడుస్తూనే డాక్టర్ దగ్గరికి వెళ్ళాడు.

"అబ్బో! వాడు చాలా అల్లరి పెడుతున్నాడే!" అన్నాడు గొరొవోయ్.

సమావేశంలో రైజికోవ్ ప్రదర్శించిన వైఖరికి అందరూ హర్షించారు. అతను చెప్పిన ఆ నాలుగు మాటలకూ అంతా మెచ్చుకున్నారు. తనపట్ల ఇగోర్ చూపిన ధోరణికి నిరసనగా అతన్ని రైజికోవ్ దుయ్యబడతాడని అందరూ అనుకున్నారు. కాని తన ప్రసంగంలో రైజికోవ్ ఆ విషయమే ప్రస్తావించలేదు. ఇలా ఇగోర్‌పట్ల గౌరవం చూపడమే కాక రైజికోవ్, కాలనీలో అసలు దొంగను పట్టించాడు.

దొంగతనం చేసినందుకు లెవిటిన్‌కు ఏం శిక్ష విధించాలని సభ్యులు చర్చలు సాగించారు. మార్కు-గ్రీన్‌హాస్ కావించిన ఉపన్యాసంతో ఆ చర్చలు తీవ్రరూపం దాల్చాయి. గ్రిన్‌హాస్ ఇలా చెప్పాడు:

"కామ్రేడ్స్! నాదొక్కమాట వినండి కాలనీలో లెవిటిన్ చాలా కాలంబట్టి ఉంటున్నాడు. ఎన్నడూ చెయ్యని పని ఇవాళ చేశాడూ అంటే దానికి కారణం ఏమిటి? అది ముందు మనకు స్పష్టం కావాలి. మన నిర్మాణంలోనే ఏదో ఒక దోషం ఉండి ఉండాలి. లేకపోతే సత్ప్రవర్తన గల లెవిటిన్ లాంటివాళ్ళు ఎందుకు దొంగతనం చేస్తారు? ఆ రెంచీలు అతను దొంగిలించాడు. సరే, దొంగిలించి వాటిని తను ఏం చేసుకుంటాడు? అమ్ముకుంటాడా? ఎక్కడ అమ్ముకుంటాడు? ఎవరికి అమ్ముతాడు? ఇంతకూ అమ్మితే అతనికి ఎంత వస్తుంది? అసలు సమస్య ఆ రెండు రెంచీలు దొంగి లించడంలో లేదు. లెవిటిన్ ఇందాక అంతగా గుండె బేజారయి పోవడానికి కారణం ఏమిటి? అతనికి ధైర్యం ఎందుకు సడలిపోవాలి? దీనికి ఒలెంకో సమాధానం చెప్పవలసి ఉన్నది. ఒలెంకో, లెవిటిన్ లిరువురూ కొమ్సొమోల్ సభ్యులు. లెవిటన్ దళకమాండర్‌గా తన బాధ్యతలను ఎంతో చక్కగా నిర్వహిస్తూ వస్తున్నాడు. అంతటి బాధ్యత కలిగిన వ్యక్తి, నిర్వహణదీక్షతఉన్న కుర్రవాడు ఇలాంటి తప్పుడు పనులు ఎందుకు చేస్తాడు? అతని మనోధైర్యం చెడడానికి కారణం ఏమిటి? అంటే దాని అర్థం లెవిటిన్ కాలనీలో బాగుపడడానికి మారుగా రానురాను చెడిపోతున్నాడనేగా? దీనికి ఒలెంకో ఏం సంజాయిషీ చెపుతాడో చూద్దాం."

గ్రిన్‌హాస్ చెప్పినదంతా విని ఒలెంకో కొంచెం తికమక పడ్డాడు. మెల్లగా లేచి నిలుచున్నాడు. అతని ముఖం ఎర్రబారింది. నాలుగోదళం సభ్యులు అతనివంక తేరిపార చూచారు.

"దానికి కారణం ఏమిటో నేను స్పష్టంగా చెప్పలేను కామ్రేడ్స్." అన్నాడు ఒలెంకో. "మాది చాలా మంచిదళం. మాలోకొందరు కొమ్సొమోల్ సభ్యులుగా ఉంటున్నారు కూడా. మా దళంలో చెడ్డవాడు ఒక్కడుకూడా లేడు. ఇదివరకు నోజిల్ కొంచెం ఆకతాయిగా ఉండేవాడు. కాని అతనుకూడా తన ప్రవర్తనను సరిదిద్దుకున్నాడు. ఇప్పుడతనిమీాద మాకెలాంటి ఫిర్యాదులు లేవు. ఇహ లెవిటిన్ ఇలా కావడానికి కారణమేమిటో

బోధపడకుండా ఉంది. అతను చాలా మంచివాడంటే నమ్మండి. స్కూల్లో బాగా చదువుకున్నాడు. మంచి మార్కులు తెచ్చుకున్నాడు. ఉపాధ్యాయులందరికీ అతనంటే అభిమానం. ఇప్పటికీ అతను ఏదో ఒక పుస్తకం చదువుతూనే ఉంటాడు. అనవసర విషయాల్లో అతనెన్నడూ జోక్యం కలిగించుకోడు. యంత్రశాలలో అతను చేస్తున్న కృషి అమోఘం. ఈవిషయం నాకంటె ఎక్కువగా మీకు గొరొఖోవ్ చెప్పగలడు. అలాంటి లెవిటిన్ దొంగతనం చేశాడంటే నాకు ఆశ్చర్యంగా ఉంది అంతేకాదు, అర్థంకాకుండా ఉందికూడా." అన్నాడు.

ఇంతలో డాక్టర్ దగ్గరనుంచి తిరిగి వచ్చాడు లెవిటిన్. మళ్ళీ సమావేశంలోకి వచ్చి కూచున్నాడు:

"అలా నీవు గాబరా పడడానికి కారణమేమిటి? అనవసరంగా కంగారుపడకు. ఏమీ భయంలేదు, జరిగిన విషయమంతా నెమ్మదిగా చెప్పు. లెవిటిన్! లేచి నిలుచుని విషయమంతా చెప్పు" అని లెవిటిన్‌తో అన్నాడు టార్‌స్కీ.

లెవిటిన్ లేచి నిలుచున్నాడు. నాలుగోదళం సభ్యులు అతనివంక తేరిపార చూచారు

"ఇక్కడదాకా రావలసిన పనిలేదు, అక్కడే నిలుచుని మాట్లాడు. కంగారుపడకు." అన్నాడు టార్‌స్కీ.

లెవిటిన్ అధ్యక్షుని వంక తదేకంగా చూచాడు. అతని కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి :

"నేనేం దొంగతనం చేయలేదు. నిజం నామాట నమ్మండి" అన్నాడు లెవిటిన్ గాద్గదికంగా.

అతనికళ్ళు సభలో మధ్య ఎవరిమీదనో ఉన్నాయి. ఏదో ఆలోచిస్తూ అలాగే నిలుచుండి పోయాడు. సభికుల మనస్సులు పోయిన రెంచీలమీద లేవు. లెవిటిన్ దొంగ అవునా కాదా అన్నవిషయం కూడా వాళ్ళకు పట్టినట్లులేదు. ఆరోజే గోడమీద అంటించిన సభ్యులకృషి నివేదికలో ఇలా స్పష్టంగా పేర్కొనబడింది :

"మన యుద్ధరంగంలో ఎడమభాగాన కృషి అమోఘంగా సాగుతున్నది. ఇంకా శిక్షణదశలో ఉన్న లెవిటిన్ అతనివంతు కృషిని అద్భుతంగా సాగించాడు. ఒకటికి రెండింతలుగా పని సాధించాడు."

ఈవిషయం సభ్యులందరికీ జ్ఞాపకం వచ్చింది. లెవిటిన్ లాంటి కుర్రాడు దొంగతనం చేస్తాడని వాళ్ళు విశ్వసించలేక పోయారు. అయితే ఎంతో అనుభవం, క్రమశిక్షణ ఉన్న లెవిటిన్ అలా పిరికివాడిలా బేజారయిపోయి ఏడ్వకూడదు. మనోధైర్యాన్ని అలవరచుకోవాలి.

లెవిటిన్ ఇంకా అలా నిలుచునే ఉన్నాడు. ఇగోర్ తల ఎత్తి అతనివంక చూచాడు. నాలుగోదళం సభ్యులు గుసగుసలాడు తున్నారు. ఒలెంకో మోకాళ్ళమీద చేతులు పెట్టుకుని, పెదవి కొరుక్కుంటూ కూచున్నాడు. జకరోవ్ తనచేతిలో ఉన్న పుస్తకం వంక చూస్తూ ఊరుకున్నాడు. అతడే మైనామాట్లాడుతాడేమోనని సభ్యులు ఆతృతగా నిరీక్షించసాగారు కాని అతనేమీ మాట్లాడ లేదు.

పిల్లలంతా పడుకునే వేళయింది. డ్యూటీప్రకారం బిగిల్ ఊదాడు. బిగోనక్ సమావేశం ముగిసింది.పిల్లలంతా వెళ్ళిపోసాగారు. బిగోనక్ బిగిల్ పట్టుకుని ద్వారం అవతల నిలుచున్నాడు.

అంతా ఎవరి గుడారాల్లోకి వారు వెళ్ళిపోయారు. జకరోవ్ వెడుతూ వెడుతూ బిగోనక్‌ను చూచి ఆగాడు.

"బిగోనక్! ఒకమాట... లెవిటిన్‌ను ఒకసారి నా దగ్గిరికి రమ్మను... ఈ విషయం ఎవరికీ చెప్పకు" అన్నాడు."

"అలాగే కామ్రేడ్ డైరెక్టర్" అన్నాడు బిగోనక్,

జకరోవ్ వెళ్ళి తన ఆఫీసుగదిలో కూచున్నాడు. బిగోనక్ లెవిటిన్ దగ్గరికి వెళ్ళాడు. జకరోవ్ ఒకమాటువచ్చి కలుసుకో మన్నాడని చెప్పాడు. బిగోనక్ మళ్ళీ ఆఫీసు దగ్గరికి వెళ్ళేసరికి జకరోవ్ కుర్చీలో ఆలోచిస్తూ కూచుని ఉన్నాడు:

"నీవు దొంగతనం చేయలేదు. ఆ విషయం నాకు తెలుసును! ఇప్పుడేకాదు. ఎప్పుడూ నీవు దొంగతనం చేయలేదు. నీ వంటే నాకు గౌరవం, కాని ఒక్కమాట. నీవు అంత అధైర్యపడి పోకూడదు, ఎప్పుడూ నిబ్బరంగా వుండాలి. నిజమే నీవు చేయని నేరం నీమీదపడింది. అందుకు నీకు బాధగానే ఉంటుంది. అయితే మాత్రం? అందుకు బెదిరిపోతావా? పిరికివాడిలా ఏడుస్తావా? అన్ని విషయాలూ నెమ్మదిగా బయటికి వస్తాయి. దొంగ ఎవరో తెలిసి పోతుంది. అంతవరకూ మనం ఓపికపట్టాలి. నిబ్బరంగా ఉండాలి. తెలిసిందికదూ?"

ఈ మాటలకు లెవిటిన్ హృదయంలో సంతోషంతో పొంగి పోయింది. అతనికళ్ళనుండి ఆనందాశ్రువులు రాలాయి. కృతజ్ఞతా పూర్వకంగా జకరోవ్ వంక చూచాడు.

"అవును. నీవు చెప్పింది అర్థమైంది. కాని... ...కాలనీలో అందరూ నన్ను దొంగక్రింద జమకట్టారు!" అన్నాడు.

"కడితే కట్టనీ. అంతమాత్రంచేత నీగౌరవానికి భంగం రాదులే. కాని ఒక్కమాట. మనిద్దరం ఇలా మాట్లాడుకున్నట్లు ఎవరికీ తెలియకూడదు." అంటూ జకరోవ్, ఇంతసేపూ అక్కడే ఉన్న బిగోనక్ వంక సాభిప్రాయంగా చూచి మళ్ళీ ఇలాఅన్నాడు: "ఏం బిగోనక్? నే చెప్పినమాట విన్నావా? మనం మాట్లాడు కున్న విషయం ఎవరితోనైనా చెప్పావా...జాగర్త!"

బిగోనక్ చిరునవ్వునవ్వాడు. ఎవరికీ చెప్పనని వాగ్దానం చేశాడు. లెవిటిన్ కళ్లు తుడుచుకున్నాడు. ఎప్పటిలా ధైర్యం తెచ్చుకున్నాడు. వెళ్ళి వస్తానని చెప్పి జకరోవ్ దగ్గర సెలవు తీసు కున్నాడు. నవ్వుతూ ఆఫీసులోనుంచి ఇవతలికొచ్చాడు. ఆఫీసు బయట అతనికి రస్లాన్ అగుపించాడు.

"నేను లోపలికి రావచ్చునా కామ్రేడ్ జకరోవ్?" అని అడిగాడు రస్లాన్.

"రా." అని అనుమతించాడు జకరోవ్.

రస్లాన్ లోనికివచ్చాడు. జకరోవ్‌తో ఏదో చెప్పబోయాడు కాని మళ్ళీ ఆగిపోయాడు. బిగోనక్ వంక చూచి "ఇతనెందుకూ ఇక్కడ? బయటికి వెళ్ళమని చెప్పండి." అన్నాడు.

"అక్కర్లేదు. అతనుంటే ఫర్వాలేదు. అదేమిటో చెప్పు!" అన్నాడు జకరోవ్.

"ఇదంతా అబద్ధం. రెంచీలు పోలేదు. తెలిసిందికదూ?" అన్నాడు రస్లాన్.

బిగోనక్ బిగ్గరగా నవ్వసాగాడు, జకరోవ్ అవునన్నట్లు తలపంకించాడు. నవ్వుతూ రస్లాన్ చెయ్యి పట్టుకున్నాడు. ఇరువురూ కరస్పర్శ కావించుకున్నారు.

"రస్లాన్! ఈవిషయం ఎవరికీ చెప్పకు. రహస్యం రహస్యంలాగానేఉంచు." అన్నాడు జకరోవ్.

"నేనెందుకు చెప్తానూ? నాకు మతిపోయిందా ఏమిటి? నావల్ల ఎప్పుడూ రహస్యం బయటపడదు. ఇహ బిగోనక్ సంగతి మీరే ఆలోచించుకోవాలి." అన్నాడు రస్లాన్.

"బిగోనక్ సంగతా? వాడు బ్రహ్మరుద్రుడికి తెలియనివ్వడు!" అన్నాడు జకరోవ్.

"అయితే వెళ్లొస్తాను. ఇప్పుడు మీకంతా అర్థమైందికదూ? జరిగినదంతా వట్టిది!" అంటూ వెళ్ళిపోయాడు రస్లాన్.

# 28

# మనం ప్రేమించుకున్నాం!

ఇగోర్, కోమోసామోల్ సమావేశానికి హాజరయినాడు. సమావేశంలో సభ్యులతని వైఖరిని తీవ్రంగా విమర్శించారు. కాని ఇగోర్ ఏమాత్రం చలించలేదు. తను చేసింది తప్పని మొదట ఒప్పుకోలేదు. ఇతర సభ్యులతో ఆలోచించకుండా బాధ్యతలో ఉన్న ఒక వ్యక్తి మరొక వ్యక్తిమీద నిరాధారంగా నేరారోపణ

చెయ్యడం తగదని సభ్యులతన్ని హెచ్చరించారు. 'అవును, నిజమే' నని తుట్టతుదకు ఇగోర్ అంగీకరించాడు. ఏ మాత్రం అసంతృప్తి చూపకుండా సాధారణ సభ్యుల సమావేశంలో తన తప్పును అంగీకరించడానికి సంసద్ధుడయ్యాడు. ఆ విధంగానే సమావేశంలో ఇలా చెప్పాడు:

"తోటి కామ్రేడ్‌ను ఎట్టి ఆధారం లేకుండా నేను మీ అందరిముందూ అవమానించాను. నాది పూర్తిగా తప్పు. ఇందుకు రైజికోవ్‌ను క్షమించమని కోరుతున్నాను."

రైజికోవ్ నవ్వుతూ ఇలా అన్నాడు:

"నన్ను నీవు అవమానించలేదు. అలా అవమానించావని నేననుకోవడంలేదు."

ఈ సంఘటన ఇంతటితో ముగిసింది. కాలనీలో దొంగతనాలు ఆగిపోయాయి. లెవిటిన్ పట్టుబడ్డాడు. కనుక దొంగతనాలు ఆగిపోయాయని సభ్యులంతా అనుకోసాగారు. ఇగోర్ గౌరవప్రతిష్టలు నానాటికీ పెరుగుతున్నాయి. కాలనీలో ఉత్పత్తి అధికమవుతున్నది. కొత్త ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తికావచ్చింది. పై కప్పు వేస్తున్నారు. లోపల యంత్రాలు అమరుస్తున్నారు.

ఆవేళ సెలవు. ఇప్పుడు ఇగోర్ మరీ ఆనందంగా ఉన్నాడు. పార్కులో బెంచీమీద కూచూని నవల చదువుకుంటున్నాడు. నవల చాలా బాగుంది. అతనలా చదువులో నిమగ్నుడై ఉండగా మెల్లగా, చప్పుడు కాకుండా ఎవరో వచ్చి అతని ప్రక్కన కూచున్నారు. వెంటనే ఇగోర్ ప్రక్కకు తిరిగి చూచాడు ఒకామె నవ్వుతూ కూచుని ఉండడం కనుపించింది. వెంటనే ఇగోర్ హృదయం ఒక అలలా కదిలింది.ఆనందంతో మైమరచాడు. చేతిలో పుస్తకాన్ని జారవిడిచాడు. ఆ పిల్ల ఎంత చక్కగాఉంది! తళతళలాడే తెల్లటిగౌను వేసుకుంది. ఉల్లిపొరలాంటి గౌను ఆదుస్తుల్లో ఆ అమ్మాయి అతనికొక దేవకన్యలా అగుపించింది. అహా! ఏమా చక్కదనం! ఆ నీలాల కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి. ధనస్సులా

వంగిన ఆ కనుబొమలు తీర్చిదిద్దినట్లున్నాయి. ఆ కళ్ళవంక, ఆ కనుబొమలవంక, ఆ గులాబీ చెక్కిళ్ళవంక తదేకంగా, తన్మయుడై చూస్తూ ఇగోర్ ఆ పిల్ల చేతులను మెల్లగా స్పృశించాడు. వంకు వంకులు తిరిగిన ఆమె ముంగురులలో సౌందర్యం మూర్తీభవించి ఉంది. ఇగోర్ ఈ లోకాన్ని మరిచి ఒక శిలాప్రతిమలా అలా చూస్తూ ఉండిపోయాడు. అతని హృదయంలో ఒక ఉప్పెన లేచింది. తనూ, ఆ అమ్మాయి రెక్కలు కట్టుకుని, పక్షుల్లా అంబర వీధికి ఎగిరిపోతున్నట్లనిపించిం దతనికి. చక్కదనాల చుక్కల్లో విలాసంగా విహరిస్తున్నట్లు తోచింది. అవును. ఆకాశంలో విహ రిస్తుంటే క్రిందనున్న చెట్లు, చేమలు అన్నీ చిన్నచిన్న నలుసుల్లా అగుపిస్తాయి.

అతను తనచుట్టూ ఉన్న వాతావరణాన్ని మరిచిపోయాడు: అతని కంటికి ఒక్క ఒక్సానా తప్ప మరేమీ కనిపించడం లేదు. ఈ పార్కులు, ఇక్కడున్న పూలమొక్కలు, పార్కు అవతలనున్న బాటలు, బాటల చివరనున్న పేటలు, పేటల్లో ఉన్న భవనాలు, భవనాల్లో ఉన్న మనుష్యులు: అన్నీ ఉన్నా అతనికి లేనట్టే! తన ఎదుట ఆమె, ఆమె ఎదుట తాను! తనొక రోమియో, ఆమె ఒక జూలియట్! తన మధుర సంభాషణలకు ఆమె మంత్రిత ముగ్ధ అవు తుంది. ఆమె కౌగిళ్ళ పూపొదరింటిలో తానొక పిట్టలా ఒదిగి పోతాడు తను కనే కలలు ఆమెకు కథలుగా చెప్తాడు. ప్రేయసీ ప్రియుల కలల కథ ఒక కమ్మని, వెన్నెల గీతి. ఆ గీతాన్ని తాను మధురంగా ఆలాపించాలనుకున్నాడు ఇగోర్. కాని అతని నోట వెంట మాటరాలేదు. ఆమె, అతను ఒకరివంక ఒకరు మూగ సౌంజ్ఞలు చేసుకుంటూ చూచుకున్నారు. ఒక్సానా ఓరగా అతని వంక చూస్తూ ఇలా అన్నది:

"నేను నగరానికి వెళ్ళాలనుకుంటున్నాను ఇగోర్."

ఆమాట అతను వినిపించుకోలేదు. నగరం... ...నగరాని కెందుకు ? నగరంలో ఏమున్నది ? ఇరువురిమధ్యా ఉన్న ఈలోకం తప్ప మరొకటి ఏమున్నది ?

"ఒక్సానా ! ఒకమాటిలాచూడు ! నేను నిన్ను ప్రేమిస్తు న్నాను. మనసారా ప్రేమిస్తున్నాను. నీవు లేనిక్షణం నాజీవితం దుర్భరం. నీకోసం ఎంతకాలం ఈ నిరీక్షణ ఒక్సానా ? ఇహనావల్ల కాదు. ఒక్కసారి నన్ను ప్రేమించానను! నీపెదవి తెరిచి ఆమాట అను."

అతని చేతులు అప్రయత్నంగా అటువైపు వెళ్లాయి. ముందుకు ఒరిగాడు. ఆమె బుజాలను స్పృశించాడు. ఆమె కళ్లల్లో కళ్లుంచి చూచాడు. ఆకళ్ళలో ఏదో గంధర్వలోకం కనుపించింది. ఆపిల్ల ఏమీ చలించలేదు – పలకలేదు, ఉలకలేదు. అలాగే మల చిన శిలాసుందరివలె కూచున్నది. చల్లని, మెల్లని గాలివీచింది. గాలికి ఆమె వలిపెపు గౌనుకదిలి, అల్లలాడింది. ఆమె పెదవులు కొంచెంగా విప్పారాయి. ఇహ అతను ఆమెకళ్లల్లోకి చూడలేక పోయాడు. చుట్టూఉన్న ప్రపంచం ఉయ్యేలలా ఊగుతున్నట్లు అతనికి అనిపించింది. తన ప్రేమను వ్యక్తం చేయడానికి చేతకావ డంలేదు మాటలు రావడం లేదు. తన ప్రేమను తాను చక్కగా ఆమెకు విప్పి చెప్పాలి. కాని ఎలాగ ? మాటలుచాలవే ! తను ఇంకా ఏదో చెబుదామనుకుంటున్నాడు, ఇంతలో ఆమెలేచి నిలు చున్నది. నీళ్ళల్లోకి జారిపోతున్న చేపలా ఒక్సానా అటు తిరిగింది. తిరుగుతూనే అతనివంక ఒరగా చూచింది. ఇరువురి చూపులూ కలుసుకున్నాయి. ఈచూపులు అతన్ని ఏలోకానికో తీసుకుని వెడుతున్నాయి, ఆమెచూపులు, ఆ చూపుల్లోని భావాలు అతని కేదో అర్థాన్ని విప్పి చెబుతున్నాయి. ఆమెకళ్లలో ఒకవెలుగు గోచరించాయి. నీళ్లు కదులుతున్నట్లు అనిపించింది. ఒకవిధమైన అమాయకత్వం, కృతజ్ఞత, ఆర్ద్రత ఆమె నీలాలకళ్ళలో కదులు కనుపించసాగాయి. ఆభావాలే, ఆ నిగూఢార్థాలే అతన్ని అనున యించాయి.

ఒక్సానా అతనివంక తిరిగి ఇలా అన్నది :

"ఇగోర్! నాప్రియమైన ఇగోర్! అనకు, ఆమాటనకు ..." అంటూ రెండుచేతులతో తన ముఖాన్ని కప్పుకున్నది. అలాగే,

అదే భంగిమలో నాలుగడుగులు నడిచి, మబ్బులో మెరుపులా మెరిసి, అతన్ని విడిచి ఇట్టే మాయమైంది!

ఎదీ ఆమె? ఎటుపోయింది? ఆమె అతనికి కనుపించలేదు. పార్కులో గుబుర్లు గుబుర్లుగా ఉన్న పూలమొక్కలవంక చూచాడు. తరువాత అలాగే బెంచీ ప్రక్కన నిలుచుని తాను క్రింద జారవిడిచిన పుస్తకంవంక చూచాడు.

ఒక్సానా అలా వెళ్ళిపోవడం అతనికి బాధ అనిపించింది.

కాని ఈ ఉదయం తన జీవితం ఎంత మధురమైన సన్నివేశాన్ని కల్పించింది. తాను ఒంటిగా ఇక్కడ కూచుని ఉండడం అకస్మాత్తుగా ఆ పిల్ల ఇక్కడికి వచ్చి సరసన కూచోవడం ఇరువురూ తనివితీరా ఒకరినొకరు చూచుకోవడం — ఏవేవో మూగసౌంజ్ఞలతో పలకరించుకోవడం! నిజంగా ఇది తీయటి కల వంటిది కాదూ? ఈ భావమే అతని హృదయానికి శాంతి చేకూర్చింది.

ఇగోర్ తల పంకించాడు, క్రింద ఉన్న పుస్తకం తీసుకుని అక్కడనుంచి కదిలాడు.

కలవంటి, అలవంటి అమ్మాయి. తన కనులముందునుంచి చెదిరిపోయింది. ఆ పిల్ల ఎదుట ఉన్నంతసేపూ అతని భావంలో ఉన్న గంధర్వలోకం ఇప్పుడు ఆమె లేకపోగానే మాయమై పోయింది. ఇప్పుడు నిజమైన మామూలు ప్రపంచం అతని కళ్ళకు కనిపించసాగింది. దూరంగా వినిలాకాశం. పూలమొక్కలతో కళ కళ లాడుతున్న పార్కు, పార్కు కొసన బాటలు, బాటల చివర నున్న భవనాలు, భవనాల్లో ఉన్న మనుష్యులు; అన్నీ ఉన్నవి ఉన్నట్లు ప్రత్యక్షమైనాయి.

ఇగోర్ పెదవులమీద చిరునవ్వు తొలకరించింది. చేతిలో పుస్తకాన్ని పదిలంగా పట్టుకున్నాడు. ఇవాళే అతని జీవనకుసుమం విరిసింది. ఆ విరులతోటలో తాను విహరించాడు. తాను, ఒక్సానా

చెట్టా పట్టాలు పట్టుకుని మధురస్వప్నాల సుందరలోకంలో, ఆడుతూ పాడుతూ పయనిస్తారు. తాను రోమియో? ఊహు, కాదు.

ఆ సాయంకాలం సమావేశానంతరం దారిలో ఒక్సానాను ఒంటరిగా కలుసుకున్నాడు ఇగోర్,

"అలా ఉన్నట్టుండి మాయమైనావేం ఒక్సానా? మనం చాలా చాలా విషయాలు మాట్లాడుకోవాలి ఒక్సానా" అన్నాడు.

ఒక్సానా సిగ్గుతో తలవాల్చుకుంది. అప్రయత్నంగా ఆమె పెదవులపై చిరునవ్వు మొలిచింది.

"ఎందుకు వెళ్ళిపోయానో నాకే తెలీదు ఇగోర్. అప్పుడు నాకు అదోలా అనిపించింది" అమ్మాయి.

ఒక్సానా అతనివంక చిలిపితనంగా చూచింది. "ఇద్దరం వెళ్ళి మాట్లాడుకుందామా?" అన్నాడు ఇగోర్. ఇలా అని ఆమెకు దగ్గరిగా వచ్చాడు. ఒకరి బుజాలు ఒకరికి వత్తుగా ఒరుసుకున్నాయి.

"మాట్లాడుకోవడానికి ఇంకేముంది?" అన్నది ఒక్సానా.

"అవును - ఇంకేమీ లేదు. నేను నిన్ను ప్రేమించాను. అంతే!" అన్నాడు ఇగోర్.

"నాకు ఏమిటి ఇష్టమో నీకు తెలుసుకదా ఇగోర్? చెప్పు మళ్ళీ ఒక్కమాటు చెప్పు?" అన్నదామె.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను ఒక్సానా!"

"నిజంగానా? నిజంగానా..."

"అవును, అవును... నిజంగా... నీతోడు!"

"ఒక్సానా రెండుచేతులతో ముఖాన్ని కప్పేసుకున్నది.

"దాగుడుమూతలాడకు!" అంటూ అతను ఆమె చేతులు పక్కకు ఒత్తిగిలించాడు.

ఆమె అతని ముఖంలోకి తొంగిచూచింది. అతని అధరాలు కదిలాయి.

"నీవన్నది నిజంకాదేమో ఇగోర్! నీకలా ఊరికనే అని పిస్తున్నదేమో ఇగోర్!" అన్నది మళ్ళీ.

"అదేమిటి ఒక్సానా అలా అంటావ్? నా జీవితమే నీకు అంకితము చేశాను. నీవు నాదానవు, నేను నీవాడను" అన్నాడతను.

వెనుకనుంచి ఎవరో వస్తున్న అలికిడి అయింది. ఇరువురూ ఊపిర్లు బిగబట్టి ఒకరి నొకరు చూచుకున్నారు."

అలా అనడం న్యాయమా చెప్పు? నీవు నన్ను ప్రేమించావని అను. ఆ మాట అనడానికి నీకు సిగ్గెందుకూ!" అన్నాడు ఇగోర్.

ఒక్సానా మాట్లాడలేదు-"ఎప్పుడూ నాచేత మాట్లాడిస్తావా ఒక్సానా? నీ పలుకే బంగారమా!" అన్నాడు మళ్లీ ఇగోర్.

"ఆ మాట మళ్ళీ నానోట అనిపించాలా నీవు ఇగోర్?"

"కాదు. ప్రేమ లేదనికాదు. నీ నోరారా ఆ మాటంటే నా చెవులారా విని ఆనందిస్తాను."

"నీవు చిత్రమైన కుర్రాడివి!"

"ఏమిటో ఆ నాలో ఉన్న చిత్రం?"

"ఒష్! నీకు మహా తెలీనట్లు? నే నెవరిదాననో నీకుమాత్రం తెలీదూ? నేను నిన్ను ప్రేమిస్తున్నాను ఇగోర్. మనసారా ప్రేమిస్తున్నాను ఇగోర్! ఇరువురం ఇలాగే కలకాలం ఉండిపోదాం." అన్నదా పిల్ల.

ఇగోర్ మత్తులో తూగిపోయాడు, కనులు మూతలు పడుతున్నాయి. ఆమె తీయటి పలుకులు ఇంకా వినాలని అలాగే ఉండిపోయాడు. కాని ఆమె మాట్లాడలేదు. అతని బుజంమీద చేతులు వేసింది. కిలకిల నవ్వింది. అతను ఆమె చుబుకం చేత్తో స్పృశించాడు.

"మన ఇరువురం ఎల్లకాలం ఇలాగే ఉంటాంకదూ ఒక్సానా?" అన్నాడు.

ఆమె "అవును" అని తల ఊపింది.

ఇరువురూ ఒకరి కళ్ళలోకి ఒకరు గుచ్చిగుచ్చి చూచుకున్నారు. అలాచూస్తూనే ఒక్సానా ఇలా అన్నది:

నాకు తెలుసు ఇగోర్. ఇప్పుడు నీ కెలా ఉందో నాకు తెలుసు. నన్ను ముద్దాడాలనుకుంటున్నావు కదూ?"

"అవునుగాని, మరి నీకుమాత్రం నన్ను ముద్దాడాలని లేదూ!" అన్నాడు ఇగోర్, గుసగుసలుగా.

ఒక్సానా మోచేయి అతనికి తాకింది. అబ్బా వద్దు ఇగోర్, వద్దు. ఇప్పుడొద్దు. అమ్మో! ఎవరైనా చూస్తే? నవ్విపోతారు. ఇది కాలనీ కదూ? అందరూ? అటూ ఇటూ తిరుగుతుంటారు. మన ఇరువురం ఇక్కడ ఒంటిగా ఉండడం బావుండదు. ఎవరైనా చూస్తే ఏమనుకుంటారో?

"అబ్బా ఒక్కసారి... ఏదీ?"

"అమ్మో, వద్దు."

"పోనీ పెదవి వద్దులే—నీ చెయ్యి ఇలా ఇవ్వు."

"ఇక్కడ ముద్దాడు ఒక్కమాటేసుమా?" అంటూ ఆమె తమలపాకులాంటి చెయ్యి అతనికి అందించింది.

అతను ఆమె చేతిని ముద్దాడాడు.

"ఇవాల్టినుంచీ మన ఇరువురం ఒకటేకదూ? ముందు మన కెంతో జీవితం ఉంది. ఇద్దరం చదువుకుందాం. మాస్కో వెడదాం. అక్కడ ఇంకా పెద్ద చదువు చదువుకుందాం. నీకు సాహిత్యమంటే ఇష్టం కదూ?" అన్నదామె.

"అవును; మరి నీకో?" అని అడిగాడతను:

"నాకు వృక్షశాస్త్రమంటే ఇష్టం." అన్నదామె.

"అయితే ఇహనేం? ఇరువురం మాస్కో వెళ్ళి అవే చదువుకుందాం." అన్నాడు ఇగోర్.

# 29

# ఎంతకాలం ఈ దొంగతనాలు?

ఆ మరుసటిరోజు రాత్రి డ్యూటీలో ఉన్న కమాండర్ ఒలెంకో. అతను ఒకటవ దళానికి కమాండర్ కూడా. అతను రాత్రి పదిగంటలకు డ్యూటీలోకి వచ్చాడు. రాగానే కాలనీలో రాత్రి కాపలాకాసే కుర్రవాళ్ళను మార్చాడు. క్యాంప్‌లోను, ప్రధాన భవనందగ్గర, వరండాలోను; అన్నిచోట్లా కొత్తవాళ్ళకు డ్యూటీ అప్పచెప్పాడు. ఫ్యాక్టరీ ఆవరణంలోను, సామాన్ల గదుల చెంతను, రాత్రి కాపలాకాసే కుర్రవాళ్లందరినీ జాగర్తగా తనిఖీ చేశాడు. ఎవరి కివ్వవలసిన ఉత్తర్వులు వారికిచ్చి అంతా కట్టు దిట్టం చేశాడు. వరుసగాఉన్న గుడారాలన్నీ తిరిగి చూచాడు. అంతా సక్రమంగా, బందోబస్తుగా ఉన్నదీ లేనిదీ పరిశీలించాడు. ఏర్పాట్లన్నీ చేసి మరోమాటు ప్రధాన భవనం చెంతకు వచ్చాడు. మరుసటిరోజు భోజనాలకు ఏమేమి తయారు చేయించాలో చూదా మని ఒకమాటు వంటశాలలోకి వెళ్ళాడు.

వరండాలోనుంచి వెడుతుండగా అతనిదృష్టి గోడకు వ్రేలా డుతున్న పెద్ద గడియారంమీద పడింది. అతను ఉలికిపడ్డాడు. గడి యారంలో పదిగంటల అయిదు నిముషా లయింది.

అక్కడున్న కాపలావాణ్ని పిలిచి "ఏమిటి? ఈ గడియారం తప్పు నడుస్తున్న దేమిటి?" అని అడిగాడు.

"ఆ గడియారం ఆగిపోయిందండీ. పెట్రోవ్ దాన్ని బాగు చేస్తానన్నాడు. రేపుఉదయం బాగుచేసి ఇస్తాట్ట" అని చెప్పాడు కాపలా కుర్రాడు.

"ఈరాత్రే ఎందుకు బాగుచేసి ఇవ్వకూడదూ ?" అని అడిగాడు ఒలెంకో.

"గడియారంలోనుంచి ఏదోమర తీసుకపోయూ డతను. దాన్ని ఏదో కడిగి శుభ్రం చెయ్యాలట."

"మరి అప్పటిదాకా మనకు టైం తెలిసేది ఎలాగ ? టైం తెలీకపోతే మనమంతా డ్యూటీ ఎలాచేస్తాం ? రేపు ఉదయాన్నే వేళకు అందర్నీ లేపి ఎవరి పనులకు వాళ్ళను పంపించడ మెలాగ ?"

"ఏమోనండీ మరి." అన్నాడు కాపలా కుర్రవాడు.

ఒలెంకో ఒక్క-క్షణం ఆలోచించాడు. తరువాత జకరోవ్ ఉండే గుడారానికి వెళ్ళాడు.

"అలెగ్జీ స్టెపానొవిచ్! మేం చిక్కు-లో పడ్డాం. గోడగడియారం పనిచేయడం లేదు." అన్నాడు జకరోవ్‌తో.

"అయితే నా జేబుగడియారం తీసుకెళ్ళు." అన్నాడు. జకరోవ్ ఇలా అంటూ తన జేబుగడియారం తీసి అతనికి అందించాడు.

"కాని ఎలా? ఇది వెండిదే!" అన్నాడు ఒలెంకో, గడియారం తీసుకోడానికి సందేహిస్తూ.

"అయితే ఏమయ్యా? వెండిదైతే ఏం? కొంప మునిగిందా ఏమిటి? ఇదేం వేలూ, లక్షలూ కాదులే; తీసుకెళ్ళు."

"కాకపోయినా వెండిగడియారం! సరే కానివ్వండి." అంటూ గడియారం తీసుకున్నాడు ఒలెంకో. జకరోవ్‌కు కృతజ్ఞత తెలిపి మళ్ళీ డ్యూటీలోకి వెళ్ళిపోయాడు.

తెల్లవారింది. ఉదయం ఉజ్వలంగా ప్రకాశిస్తోంది. తెల్లవారంగానే వచ్చిన ఎండపొడ ఎంతో ముచ్చట గొలుపుతోంది. చల్లనిగాలి వీస్తోంది. పిల్లలంతా కళ్ళు ఇంతింతలు చేసుకుని ఎండపొడవకం ఆహ్లాదంగా చూస్తున్నారు. హాయిగా గాలి పీల్చుకుని ఆనందిస్తున్నారు. కాని ఆ తరువాత కొంతసేపటికి వాళ్ళకు తెలిసింది ఆరోజు వాళ్ళు రోజుకంటె పెందలకడనే లేచారు. గడియారం

తప్పు నడుస్తున్నందున తమందర్నీ ఒలెంకో ఒక అరగంట ముందు లేపాడని వాళ్ళకు తెలియవచ్చింది. ఒలెంకో దళాలను తనిఖీ చేస్తున్నప్పుడు మనిషి చాలా గాభరా పడిపోయినట్లు కను పించాడు. తన్నుతాను నిభాయించుకోవడానికి ఎంతో ప్రయత్ని స్తున్నాడుకూడా. ఈ విషయం సభ్యులంతా గ్రహించుకున్నారు.

"ఎందుకయ్యా అంతగాభరా. ఇవాళ రోజుకంటే ఓ అర గంట ముందుగా నిద్దరు లేచారు కుర్రాళ్ళు ఏం? అంతమాత్రం చేత ఆరోగ్యం చెడదులే నీవు అనవసరంగా గాభరా పడకు." అన్నాడు నెస్ట్రెంకో, ఒలెంకో వైఖరిచూచి.

కాని ఒలెంకో మామూలుమనిషి కాలేదు. ఇంకా కలవర పడుతూనే ఉన్నాడు. ఉదయం ఫలహారాలకు గంట కొట్టారు. పిల్లలంతా ఉల్లాసంగా భోజనశాలలోకి పరుగుతీశారు నెస్ట్రెంకో మాత్రం లోపలికి వెళ్ళలేదు. ఎవరికోసమో వేచిఉన్నట్లు వసా రాలో నిలుచుండిపోయాడు. లోపలికి వచ్చి పోయే కుర్రవాళ్ళంద రినీ పరిశీలించి చూస్తున్నాడు. చివరకు జిరియాన్‌స్కీ వచ్చాడు. అతన్ని చూచి ఒలెంకో ఇలా పిలిచాడు:

"అల్యోషా! ఒక్క నిముషం ఇలా వచ్చిపో."

వారిరువురూ వసారాలో ఒక ప్రక్కకు వెళ్ళారు. అక్కడ నుంచి చేరువలోనే ఉన్న పూలతోటలోకి వెళ్ళారు.

"ఏమిటీ? ఏమిటి విశేషం?" అని అడిగాడు జిరియాన్‌స్కీ.

"గడియారం...గడియారం కనుపించడంలేదు....అలెగ్జీ జేబుగడియారమయ్యా—వెండి గడియారం." అన్నాడు ఒలెంకో.

"ఏమిటీ? అలెగ్జీ జేబుగడియారం పోయిందా? అతనే పోగొట్టుకున్నాడా?"

"లేదయ్యా. రాత్రి ఆ గడియారం ఆయన దగ్గరనుంచి నేను తీసుకున్నాను డ్యూటీలో అవసరమై... మన గోడగడియారం ఆగిపోయింది."

"అంటే నీవనేది—గడియారం ఎవరో దొంగిలించా రంటావా?"

"అవును ఎక్కడా కనుపించడం లేదు."

"నీవుదాన్ని జేబులో పెట్టుకోలేదా?"

"లేదు. నా తలగడక్రింద పెట్టుకున్నాను."

"చచ్చాంరా భగవంతుడా!... కుర్రాళ్ళంతా భోజనశాల లోకి వెళ్ళారా? అందరిదగ్గరా వెదుకుదాం! రావయ్యా రా. ఆలస్యం చేయకు." అన్నాడు జిరియాన్‌స్కీ.

ఒలెంకో ఎకాఎకీ జకరోవ్ దగ్గరికి వెళ్ళాడు. జిరియాన్‌స్కీ మాత్రం తలుపు ఇవతల నిలుచున్నాడు.

"అలెక్జీ స్టెపానొవిచ్! మీ జేబుగడియారం నా దగ్గర నుంచి ఎవరో తీసుకున్నారయ్యా!" అనిచెప్పాడు ఒలెంకో.

"ఎవరు తీసుకున్నారు? ఎందుకు తీసుకున్నారు?" అని అడి గాడు జకరోవ్.

"ఎవరో దొంగిలించారు!" అన్నాడు ఒలెంకో. ఇలా అంటూంటే అతని పెదవులు తడబడ్డాయి.

జకరోవ్ ముఖం వివర్ణమైంది. కనుబొమలు ముడివడ్డాయి. ఒక్కక్షణం మౌనం దాల్చాడు. తరువాత ఒలెంకోవైపు తిరిగి "ఎవరైనా పరాచకానికి తీసి దాచారేమో?" అన్నాడు.

"లేదు లేదు. ఇది పరాచకం కాదు. దొంగిలించిన బాపతే, మనం సోదాచేసి పట్టుకోవాలి" అన్నాడు ఒలెంకో.

అంతలో జోరిన్, రైజికోవ్‌లు అక్కడికి వచ్చారు రైజి కోవ్ ముందు గబగబా ఆఫీసులోనికి వచ్చి ఇలా అన్నాడు:

"అలెక్జీ స్టెపానొవిచ్! జోరిన్ కొన్ని బల్లలు నగరానికి తీసుకు వెడుతున్నాడు. అవి అక్కడ ఇచ్చేసి కొంత రాగి పట్టుక రావాలి. అతనితో వెంట నన్నుకూడా నగరానికి వెళ్ళి రమ్మంటారా?"

కాని అతనిలా చెపుతుండగానే వాకిట్లో ఉన్న జిరియాన్‌స్కీ అతనికి అడ్డుతగిలి ఇలా కేకలేశాడు: "ఇహ ఆపవోయ్, నీ రాగీ నీవూను! నోరుమూసుకునికూచో. ఎవరూ నగరానికి వెళ్ళక్కర్లేదు."

"ఎందుకని?"

రైజకోవ్ ఇలా అడుగుతున్నాడే కాని వాళ్ళెవరూ ఇతని విషయం పట్టించుకోలేదు. జకరోవ్ లేచినిలుచున్నాడు.

"సోదాచెయ్యడమా? ఎంతమందిసని సోదాచేస్తామయ్యా" అన్నాడు

"ఎంతమందేమున్నది? ప్రతి ఒక్కరినీ సోదా చెయ్యాల్సిందే!" అన్నాడు ఒలెంకో.

"అర్థంలేని పని! అది మనవల్ల అయ్యేదికాదు" అన్నాడు జకరోవ్.

"కాదు అలెక్జ్ స్టెపానోవిచ్! ఏమైనా సరే అందర్నీ సోదా చేసి తీరాలి!"

పాపం రైజకోవ్‌కు ఈ గొడవేమీ అర్థం కాలేదు. కలవరంతో అటూ ఇటూ చూడసాగాడు.

"ఏమిటీ? ఏంజరిగింది? మళ్ళీ ఏదైనావస్తువు దొంగతనం జరిగిందా?" అని రైజకోవ్ గాభరాగా అడిగాడు.

"అవును జరిగింది. అలెక్జ్ స్టెపానొవిచ్ జేబుగడియారం— వెండిది. నాదగ్గరనుంచిఎవరో కొట్టేశారు!..."అన్నాడు ఒలెంకో.

జకరోవ్ కిటికీలోనుంచి బయటనున్న పూలపాదులవంక తదేకంగా చూడసాగాడు. ఎదో ఆలోచిస్తూ అలా నిలబడిపోయాడు.

"ఒకవేళ ఎవరో ఒకరు దొంగిలించారనే అనుకుందాం. దొంగిలిస్తేమాత్రం అది ఇంకా వాళ్ళజేబుల్లో కూచోబోయిందా, నీ వెర్రిగాని? ఎక్కడో దాచేస్తారు. ఈపాటిదానికి మనం ప్రతి కుర్రాణ్ణి పట్టుకుని సోదాచేయడం దేనికి? ఏమిటి ప్రయోజనం? పైగా ప్రతిఒక్కరినీ అవమానించినట్టవుతుంది." అన్నాడు జకరోవ్.

జోరిన్ కాస్త ముందుకువచ్చాడు. డైరెక్టర్ జకరోవ్‌వంక తీక్షణంగా చూచాడు :

"మరేం ఫర్వాలేదు. దీనివిషయం ఏమిటో మనం అంతు తేల్చుకోవలసిందే అందరి గదులలో ఉన్న వస్తువులన్నీ కూడా

ఒక్కొక్కటే బయటపడేసి సోదా చెయ్యాలి. కాలనీ మొత్తం గాలించాలి! అప్పుడుగాని బయటపడదు. అరెరే! ఒకటా, రెండా! ఎన్ని దొంగతనాలు, ఏంకథ!" అన్నాడు.

"నీ ఆలోచనకు అర్థంపర్థం లేదు. ఇహ ఊరుకోవయ్యా!"

"ఏం? అర్థ మెందుకు లేదూ? మరి గడియారం ఏమైనట్టు? ఎలా మాయమైంది?" అని అరిచాడు రైజికోవ్.

"ఆ గడియారమేమీ వందలూ వేలూ చెయ్యదులే ... ఎందుకు గొడవ...పోయిందేమో పోయింది...పోయింది మళ్ళీ తిరిగిరాదు ...

"పోయిందా? పోయిందని నీళ్ళువదిలి ఊరుకోవాలా? లేదు - వీల్లేదు. ఎవడో దొంగవెధవ దాన్ని కొట్టేసి అమ్మేసుకున్నాడు. చివరకు మరెవడో తుంటరివచ్చి అది నేనే తీశానని నా మీద పెడతాడు. ఇదీ జరుగుతున్న వరస - అదేమిటో కర్మ? ఎప్పుడూ నాకింతే! ఎప్పుడూ నన్నే అనుమానిస్తారు! ఇలా ఎంత కాలమని నన్ను సహించి ఊరుకోమంటారు? అసలు దొంగ ఎవరో మనం పట్టుకుని తీరాలి," అన్నాడు రైజికోవ్, అందరివంక కోపంగా చూస్తూ.

జిరియాన్‌స్కీ గదితలుపు తెరుచుకుని చల్లగా అవతలికి వెళ్ళిపోయాడు. ఆనాడు కాపలా డ్యూటీలో ఉన్నది ఇగోర్ చెర్నియావిన్. ఇగోర్‌ను పిలిచి జిరియాన్‌స్కీ ఇలా ఉత్తర్వు చేశాడు.

"భోజనశాల దగ్గర నిలుచుని ఎవర్నీ బయటికి పోనీయకు."

"ఏం! ఎందుకూ?" అని ఆశ్చర్యంగా అడిగాడు ఇగోర్.

"ఎందుకైతే నీ కెందుకూ? నే చెప్పింది చెయ్యి" అన్నాడు జిరియాన్‌స్కీ.

"నీవు చెప్పింది నేను చెయ్యడానికి నీవివాళ కమాండర్ డ్యూటీలో లేవే!"

"ఓహో! అదా సంగతి!" అంటూ జిరియాన్‌స్కీ ఎకాఎకి ఆఫీసుకు పరుగు తీశాడు.

అప్పుడే ఒలెంకో ఆఫీసులోనుంచి బయటి కొస్తున్నాడు.

''కామ్రేడ్ ఒలెంకో! నీవువెళ్ళి ఇగోర్‌ను భోజనశాల ద్వారంచెంత నిలుచోమని ఆజ్ఞాపించవయ్యా.'' అన్నాడు జిరియాన్‌స్కీ.

''ఇవాళ నాకు డ్యూటీలో ఉండాలని లేదు,'' అన్నాడు ఒలెంకో.

''ఏమిటా మూర్ఖత్వం !''

''చెపుతున్నాను కదూ, ఇవాల్టికి నన్ను వదలిపెట్టండి.''

''అయితే సరే - జకరోవ్ దగ్గరికి వెడదాం పద.''

ఒలెంకో, మళ్ళీ జకరోవ్ ఆఫీసులోకి వెళ్ళాడు. జకరోవ్ అతని వాలకం కనిపెట్టాడు. ఒలెంకో ముఖం ఎర్రబారి ఉంది. జకరోవ్ కుర్చీప్రక్కన నిలుచుని ఒలెంకో మెల్లగా ఇలా అడిగాడు:

''ఇవాళ నా డ్యూటీ ఎవరికి అప్పచెప్పను?''

''ఏమిటంటున్నావు ఒలెంకో?''

''ఇవాళ నాకు అదోలా ఉంది. డ్యూటీచేసే స్థితిలో లేను''

''అయితే పోనీలే నీడ్యూటీ జిరియాన్‌స్కీ తీసుకుంటాడు.''

ఒలెంకో తన భుజానికి తగిలించుకున్న బాడ్జీ తీసి జిరియాన్‌స్కీ చొక్కాకు తగిలించాడు. కాని అతనలా చేయడం నియమ విరుద్ధమైన పని. సంప్రదాయానుసారం జకరోవ్ లేచి నిలుచున్నాడు. ఒలెంకో అతనికెదురుగా నిలుచుని చేయి చాచాడు. ''ఒకటవదళం డ్యూటీలో ఉన్న కమాండర్ తన చార్జీ అప్పగిస్తున్నాడు.'' అన్నాడు ఒలెంకో.

జిరియాన్‌స్కీ సైనికుడిలా నిలుచున్నాడు.

''నాలుగోదళం సభ్యుడు జిరియాన్‌స్కీ డ్యూటీలో ఉన్న కమాండర్ విధులను స్వీకరిస్తున్నాడు'' అన్నాడు జిరియాన్‌స్కీ.

జిరియాన్‌స్కీ, జకరోవ్‌కు శాల్యూట్ చేసి డ్యూటీలోకి వెళ్ళిపోయాడు. తిన్నగా భోజనశాల దగ్గరికి వెళ్ళాడు. కాపలా కాస్తున్న ఇగోర్‌ను చూచి ''ఏవోయ్ ఇగోర్! ద్వారందగ్గర

నిలుచో. లోపల్నుంచి ఎవర్నీ బయటికి పోనీయకు." అని ఆజ్ఞా పించాడు.

"అలాగే కామ్రేడ్ కమాండర్." అని సవినయంగా జవా బిచ్చాడు ఇగోర్.

జిరియాన్‌స్కీ వెనక్కి తిరిగి మళ్ళీ జకరోవ్ ఆఫీసుకు వెళ్ళి పోయాడు.

"అలెక్సీ స్టెపానోవిచ్! ఇహ నేను కుర్రవాళ్ళను సోదా చేయడం ప్రారంభిస్తున్నాను" అన్నాడు జకరోవ్‌తో.

"వద్దు. వద్దని చెప్పానుకదయ్యా."

"అది నీ గడియారమనేనా వద్దంటున్నావు. అలా కుదరదు సోదా చెయ్యాల్సిందే."

"ఏమిటంటున్నావు జిరియాన్‌స్కీ?"

"సోదాచేసే బాధ్యత నేనే స్వీకరిస్తాను."

"అంటే ఏమిటి దాని అర్థం కామ్రేడ్ జిరియాన్‌స్కీ?"

"అర్థానికేముంది? సోదా చెయ్యక తప్పదంటున్నాను. ఆ బాధ్యత నాది. సోదా చెయ్యక పోతే అందరూ ఒలెంగో ను అను మానిస్తారు." అన్నాడు జిరియాన్‌స్కీ.

జకరోవ్ కొంచెంసేపు ఆలోచించాడు. ఆలోచించి చివరకు సరేనన్నాడు.

భోజనశాల లోపల పిల్లలంతా ఒకచోట గుంపుకూడారు. ఇగోర్ ఎవరినీ లోపల్నుంచి బయటికి రానివ్వడంలేదు. అందుకు నెస్టెరింకో ఎగిరిపడుతున్నాడు.

"ఏమిటీ నాటకం? మమ్మల్ని బయటికి పోనివ్వరేం? మమ్మల్ని ఇక్కడ, లోపల బంధించమని, ఎవరు ఆజ్ఞాపించారు?" అని అడిగాడు.

"ఎవరు ఆజ్ఞాపించారో తెలీదు. డ్యూటీలోఉన్న కమాండర్ నాకు చెప్పిన ప్రకారం నేను చేస్తున్నాను" అన్నాడు ఇగోర్.

"ఎవడా కమాండర్? ఒలెంకోయేనా?"

"కాదు. జిరియాన్‌స్కీ."

"అయితే ఒలెంకో ఎక్కడున్నాడు?"

"ఏమో, నాకు తెలీదు."

"నిర్బంధంలో ఉన్నాడా?"

"అదీ తెలీదు. బహుశా అతన్ని డ్యూటీచెయ్యొద్దన్నారు కాబోలు!"

ఇగోర్, నెస్త్రెంకోలమధ్య ఇలా మాటకుమాట పెరుగుతున్నది. ఇంతలో జిరియాన్‌స్కీ అక్కడికి వచ్చాడు. అతన్ని పిల్లలు ప్రశ్నలువేసి ఉక్కిరిబిక్కిరి చేశారు. కాని జిరియాన్‌స్కీ చలించలేదు. ఎవరి ప్రశ్నలకూ సమాధానం చెప్పలేదు. తిన్నగా భోజనశాలలోకి వెళ్ళాడు. గదిమధ్యలో నిలుచుని చెయ్యిచాపి గట్టిగా ఇలా అన్నాడు:

"అందరూ ఇక్కడికిరండి."

భోజనశాల నిశ్శబ్దమైంది. "కామ్రేడ్స్! అలెగ్జీస్టెపానొవిచ్ (జకరోవ్) తాలూకు వెండి జేబుగడియారం ఎవరో కాజేశారు! రాత్రి ఒలెంకో ఆగడియారం ఆయనదగ్గరనుంచితీసుకునిడ్యూటీలోకి వెళ్ళాడు. ఒలెంకో కళ్ళకు మస్కాకొట్టి ఎవడో దాన్ని దొంగిలించాడు! ఏయ్ బిగోనక్!"

"ఆ, ఇక్కడ – ఇక్కడున్నాను."

"తిన్నగా యంత్రశాలల దగ్గరికి వెళ్ళు. ఇవాళ పిల్లలు పనిలోకి రావడం రెండు గంటలు ఆలస్యమవుతుందని చెప్పు."

"అలాగే-అలాగేచెప్తాను కామ్రేడ్ కమాండర్."

కాలనీ సభ్యులు నిశ్చేష్టులై, మౌనంగా కమాండర్ వంక చూడసాగారు. కమాండర్ జిరియాన్‌స్కీ కుర్చీమీద నిలుచున్నాడు. అతని చొక్కాకు ఉన్న బాడ్జీ తళతళ మెరుస్తూ అందరికీ కనుపిస్తున్నది.

"మిమ్మల నందరినీ ఇప్పుడు సోదా చెయ్యవలసి ఉంటుంది. మీకు అంగీకారమేనా? ఈ విషయాన్ని నేను ఓటుకు పెడు తున్నాను" అన్నాడు జిరియాన్‌స్కీ.

"ఓటింగు పెట్టడంలో అర్థమేమిటి?" అన్నాడొక కుర్రవాడు. సోదా చేస్తామని ఎవరితో చెప్పక్కర్లేదు. చెప్పకుండానే నిక్షేపంలా చేసుకోవచ్చు.'' అన్నాడు మరొకడు.

"ఎందుకీ కాలయాపన? అదేదో త్వరగా కానియ్యండి."

"నిశ్శబ్దం, నిశ్శబ్దం! చెవులు గింగుర్లెత్తుతున్నాయి. కమాండర్స్! అంతా ఇలా రండి! మిమ్మల్ని నాలుగో దళ సభ్యులు సోదా చేస్తారు...తక్కినవాళ్ళంతా దూరంగా వెళ్ళండి" అన్నాడు జిరియాన్స్కీ.

నాలుగో దళ సభ్యులు, కమాండర్ల జేబులన్నీ సోదా చేస్తున్నారు. బూట్లు విప్పి చూస్తున్నారు. ఈ సంఘటన కమాం డర్లకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. వాళ్ళను సోదా చెయ్యడం పూర్తి అయ్యాక కాలనీ సభ్యుల వంతు వచ్చింది. సోదా చెయ్య డం రెండు గంటలు పట్టింది. జిరియాన్‌స్కీ పడకగదులు, సామాను గదులు, పాఠశాల గదులు, గ్రంథాలయం, ఇవన్నీ గాలించివేస్తు న్నారు. ఎక్కడా కూడా పోయిన గడియారం దొరకలేదు. అతని ప్రాణం విసిగెత్తిపోయింది. మనిషి అలిసిపోయాడు. తిన్నగా జక రోవ్ చెంతకు వెళ్ళాడు.

"ఎక్కడా కనుపించలేదు. ఇహ మనం ఉద్యోగుల గదులు మాత్రం చూడాల్సిఉంది." అన్నాడు జకరోవ్‌తో.

"అ పని మనం చెయ్యలేం" అన్నాడు జకరోవ్.

"ఎందుకు చెయ్యలేం? చేసి తీరాలి."

"ఆ అధికారం మనకు లేదు. తెలిసిందా?"

"మనకులేక మరెవరి కున్నది ?"

"మనకు లేకపోయాక మరెవరికుంటేనేం? ఈపాటికి ఆ గడి యారం ఏ అంగడికో వెళ్ళిపోయి ఉంటుంది!"

జిరియాన్‌స్కీ పెదవులు కొరుక్కున్నాడు. ఏంచేయాలో బోధపడలేదతనికి.

ఆ సాయంకాలం కాలనీలో అంతటా నిశ్శబ్దం తాండవించింది. అందరూ ఆవేదనతో కుమిలిపోతున్నారు. "కాలనీలో ఎవడో ఒకద్రోహి ఈపని చేశాడు! ఎవడా ద్రోహి! ఇలాంటి పని ఎందుకు చెయ్యాలి? ఆ ఒక్కడివల్ల అందరికీ ఎంత అవమానం వచ్చింది?" ఇలా కాలనీ సభ్యులు పరితపించ సాగారు. ఎవరికి వారు, తమలోతాము కుమిలిపోతున్నారే కాని ఒకరితో ఒకరు మాట్లాడుకోవడంలేదు. ఇలా కొంతసేపు గడిచింది. రైజికోవ్‌కు నోజిక్ ఎదురుపడ్డాడు.

"ఆద్రోహి ఎవడోకాని, మన దళంలోమాత్రం లేడు." అన్నాడు రైజికోవ్.

"అవును కాని ఇంతకూ ఆద్రోహి ఎక్కడున్నాడంటావు?"

"ఎక్కడున్నాడో, వాడెవడో ఆ దేవుడికే తెలియాలి!"

ఇలాగే ఎనిమిదోదళ సభ్యులు మిషాగొంటార్; శాంకో జోరిన్‌కూడా మాట్లాడుకోసాగారు. గొంటార్ జోరిన్‌ను ఒక ప్రశ్న వేశాడు:

"అయితేమరి, తెలీక అడుగుతాను – ఒలెంకోను ఎందుకు సోదా చెయ్యలేదయ్యా?"

"ఓరిగాడిదా! ఏమిట్రా ఆ ప్రశ్న?"

"నీ వనుకున్నట్లు నేనేం గాడిదనుకాను. ఆ రాత్రి ఒలెంకో దగ్గర జేబుగడియారం ఉందని ఎవరికి తెలుసునయ్యా"

"గొప్ప ప్రశ్నే వేశావు! అయినా నీవు గాడిదవే!"

నాలుగోదళ సభ్యులు బిగోనక్, వాన్యాలు ఇలా ప్రసంగించుకోసాగారు:

"వాన్యా! ఆ పనిచేసింది ఒలెంకోమాత్రం కాదోయ్" అన్నాడు బిగోనక్.

"మరి ఎవరు చేశారంటావు?" అని అడిగాడు వాన్యా.

"ద్యూబెక్ మార్కు సిగరెట్లు కాలుస్తున్నాడే - వాడే ఆ మహానుభావుడు!"

"ఏమిటేమిటీ? రైజికోవా? ఛా ఛా! నేను నమ్మను."

"ఎందుకు నమ్మవు? వాడే!"

"నీవు ఎన్నయినా చెప్పు, నేను నమ్మను,"

"అయితే వాడు దొంగ కాదంటావా?"

"దొంగే—సందేహం లేదు. కాని ఈ పనిమాత్రం వాడిది కాదు. ఇది ఎవరో చేసినపని ఇలా నేను అనుకోటానికి కారణం వేరే ఉందిలే." అన్నాడు వాన్యా.

## 30

## అరుణపతాకచ్ఛాయల్లో

జూలై నెల వచ్చింది. సీనియర్ విద్యార్థులకు కాలనీలో చదువు పూర్తయింది. ఇహ వాళ్ళు కాలేజీలో ప్రవేశించడమే తరవాయి. కాలేజీ ప్రవేశ పరీక్షలకు విద్యార్థులు విద్యార్థినులు తర్ఫీదు అవుతున్నారు. వారిలో వాసిల్యవ్నా ఒకతె. సెలవు లివ్వగానే ఆ పిల్ల అక్కడే ఉండిపోయి విద్యార్థులతో కలిసి చదువు సాగిస్తుంది. ఏమది క్రితం కాలనీలో చేరిన విద్యార్థులు రమారమి ముప్పయి మంది ఉంటారు. వాళ్ళు ఒకనెల ముందుగానే కాలనీలో వేరే ఒకగుడారం వేసుకుని చదువుకుంటున్నారు. ఆ గుడారం ఆడపిల్లల విడిదికి ఎదురుగా ఉన్నది. తాముకూడా అందరిలాగే ఫ్యాక్టరీలో పనిచేస్తామని విద్యార్థులు అన్నారు కాని జకరోవ్ అందుకు అంగీకరించలేదు. శీతాకాలంలో అదేపనిగా

పని చేయడంవల్ల విద్యార్థులు అలసిపోయారు. ఇప్పుడు వాళ్ళకు విశ్రాంతి కావాలి.

"మీరెందుకు అలా చిక్కిపోయారు ? కాస్త కడుపునిండా తిండ్లు తినండి :" అన్నాడు జకరోవ్.

"అదేం లాభంలేదు కామ్రేడ్ డైరెక్టర్ ! మేమూ పని చేయాలి !" అన్నారు విద్యార్థులు.

విద్యార్థులు ఏదోఒక పని చేస్తూనే ఉన్నారు. కొందరు మానేటర్ విధులను నిర్వహిస్తున్నారు. మరికొందరు బ్లమ్‌కు సహాయపడుతున్నారు. ఇంకా కొందరు జూనియర్ విద్యార్థులకు పాఠాలు చెపుతున్నారు.

కాలేజీ ప్రవేశ పరీక్షలకు నెస్ట్రెంకో, క్లావా కపిరినాలు కూడా హాజరవుతున్నారు. ఇప్పటిదాకా ఇరువురూ కమాండర్లుగా పనిచేస్తూ వచ్చారు. కమాండర్ డ్యూటీనుంచి వాళ్ళను విడుదల చేయడానికి కొమ్సొమోల్ బ్యూరో నిశ్చయించుకుంది. అంచాత అయిదు, ఎనిమిది దళాల కమాండర్లను సర్వసభ్య సమావేశంలో కొత్తగా ఎన్నుకోవలసి ఉంది. ఇప్పుడు జీవితం నిస్తబ్ధతగా లేదు. చకచకా సాగిపోతోంది. ఎనిమిదో దళం తన కమాండర్‌గా ఇగోర్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకోవాలనుకున్నది. అలాగే అయిదోదళం ఒక్సానాను నిర్ణయించింది. తానొక కమాండర్‌ను అవుతానని ఇగోర్ కలలోనైనా అనుకోలేదు. సర్వసభ్య సమావేశం జరుగుతూఉంటే నెస్ట్రెంకో అభ్యర్థులను ప్రతిపాదించవలసినదిగా కోరాడు. ఎనిమిదోదళ సభ్యులు ఏకగ్రీవంగా ఇగోర్ పేరు చెప్పారు :

"మేం ఇదివరకే నిర్ణయించేశాం. కమాండర్ పదవి మాలో ఒక్కడే ఒక్కడున్నాడు అతనే ఇగోర్." అన్నాడు శాంకో జోరిన్.

తనను కమాండర్‌గా తన దళసభ్యులు ఇలా ఎన్నుకుంటారని ఇగోర్‌కు ముందుగా తెలీదు. వాళ్లు ఇలా తనను ఎప్పుడు నిర్ణయిం

చారోకూడా అతనికి అవగాహన కాలేదు. తాను కమాండర్‌గా ఉండనని ఇగోర్ సమావేశంలో ప్రకటించాడు. కమాండర్‌గా ఉండడమంటే మాటలతో పనికాదు. పెద్దబాధ్యత. ఆ విషయం తనకు తెలుసును.

శాంకోజోరిన్, సెరిడిన్, బోరిస్, గోంటూర్, గొరొవోయ్; మొదలయిన కుర్రవాళ్ళ పేరు ప్రతిపాదించాడు ఇగోర్. కాని వాళ్లెవరూ అందుకు అంగీకరించలేదు. తరువాత ఇగోర్ డిప్యూటీ కమాండర్‌గా ఉంటున్న నెస్ట్రెంకో పేరు సూచించాడు. అప్పుడు నెస్ట్రెంకో లేచి ఇలా అన్నాడు:

"కమాండర్‌గా ఉండడానికి మాలో ఎవ్వరమూ తగం. శాంకోజోరిన్‌కు ముక్కుమీదనే కోపం. శాంతం అలవరచుకునే వరకూ అత నా పదవికి పనికిరాడు. ఇహ అస్ట్రోవ్‌చిన్ సహాయకుడుగా ఉండడానికే పనికొస్తాడు. గొరొవోయ్‌కి చురుకుదనం లేదు. పోతే సెరిడిన్ చాకచక్యం కలవాడే కాని, అతనికీ అనుభవం చాలదు. గోంటూర్ డ్రైవర్‌గా ఉంటే బావుంటుంది. అతని శిక్షణ కాలం పూర్తి కావచ్చిందికూడా. అలాంటప్పుడు అతన్ని డ్రైవర్‌గానే ఉండనివ్వక కమాండర్‌గా పెట్టడం ఎందుకు? ఎనిమిదోదళం ఇగోర్‌ను కమాండర్‌గా నిర్ణయించడం సవ్యంగాను, సబబుగాను ఉన్నది. అతనికంటే సమర్థులూ మాలో మరెవరూ లేరు. అతను తన రంగంలో తాను చక్కగా రాణిస్తున్నాడు. అదీకాక కొమ్సొమోల్ సభ్యుడు. అతను చేస్తున్న సాంఘిక సేవ అమోఘం. కాని ఉన్న విషయం ఒక్కటే. ఇగోర్ తనసభ్యులపట్ల నిరంతరం అమిత శ్రద్ధాశక్తులు అగుపర్చాలి. నే చెప్పుతున్నది వింటున్నావా ఇగోర్? ఎవరిమీదా ప్రత్యేక అభిమానం కూడదు. అన్నిటికీ నీ డిప్యూటీలమీదనే ఆధారపడకూడదు. కమాండర్ అన్నవాడు ఎల్ల వేళలా హుషారుగా ఉండాలి. ఒకకంట అన్నీ కనిపెడుతుండాలి. కంగారు పడకూడదు. వదరుబోతులా మాట్లాడకూడదు. అధికారం చేతికి వచ్చిన తరువాత దుర్వినియోగం చేయకూడదు. దాన్ని సక్రమంగా నిలబెట్టుకోడంలోనే ఉన్నది గొప్పదనం. మనం

ఒక తప్పుచేస్తే దాని ఫలితం అందరికీ చుట్టుకుంటుంది. సోవియట్ ప్రభుత్వానికి దేశానికి చెడ్డపేరువస్తుంది. ఒకతడవ నేను డ్యూటీలో ఉండగా ఒక గమ్మత్తు జరిగింది. ఫ్రాన్సు దేశపు మంత్రి హెరియెట్ మన కాలనీలో చూడడానికి వచ్చాడు. అప్పుడు నేను ఏస్థితిలో ఉండి ఉంటానో మీరు ఆలోచించండి! నేను ఎవరికి ప్రతినిధిని? ఒక్క కాలనీకే కాదు. యావత్ సోవియట్ భూమికీ నేనే ప్రతినిధిని కాదూ మరి? నేనొక తప్పు చేశానూ అంటే మీ అందరికే కాక దేశానికే తలవంపులొస్తాయి. నేనలాగే అనుకుంటున్నాను. నీవూ అలాగే భావించాలి ఇగోర్. నీకు జాలి, కరుణ, ఇవన్నీ ఉండవచ్చు. కాని డ్యూటీలో ఖచ్చితంగా ఉండాలి. నీకు బద్ధకం ఉండవచ్చు. కాని డ్యూటీలో ఉన్నప్పుడు చురుగ్గా ఉండాలి. ఒలెంకో చూడు! ఎంత హుషారుగా ఉంటాడో! డ్యూటీలో ఉన్నప్పుడు అతన్ని చూసితీరాలి! నేనూ అతనూ ఎంతో స్నేహితులం. ఒకనాడు అతన్ని భోజనం విషయంలో ఏదో అడిగాను. అప్పుడ తను మండిపడ్డాడు. డ్యూటీలో ఉన్న కమాండర్ తో ఆవిధంగా మాట్లాడకూడదని హెచ్చరించాడు".

కొమోసొమోల్ సమితి ఇగోర్ను ఏకగ్రీవంగా కమాండర్ పదవి నిర్ణయించింది. ఈ విషయం సర్వసభ్య సమావేశంలో ప్రకటించగానే సభ్యుల హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి. పిమ్మట జిరియాన్స్కీ ఇలా ఉపన్యసించాడు:

"కాలనీలో నెస్ట్రెంకో వంటి కమాండర్లు అరుదు. అతనికి సాటిరాగల కమాండర్ ఒక్కడే ఒక్కడున్నాడు. అతను రోడ్నేవ్ ఇగోర్ సయితం వాళ్ళలాగే సమర్థుడనిపించుకుంటాడు. అతనితో దళసభ్యులు సహకరించాలి. ఇహ ఒక్కొనా విషయం. అమెకూడా చాకచక్యం కలపిల్ల. మనమంతా వీరిరువురినీ కమాండర్లుగా ఏకగ్రీవంగా నిర్ణయిద్దాం."

సభ్యుల్లో ఎవరూ ఇందుకు వ్యతిరేకించలేదు. డ్యూటీలో ఉన్న కమాండర్ వచ్చాడు:

"మన అరుణపతాక చాయలో అందరూ పదండి, ముందుకు పదండి!" అన్నాడు.

స్టాలిన్ విగ్రహం చుట్టూ నిలుచునిఉన్న వాయిద్యదళం శ్రావ్యంగా వాయిద్యాలు వినిపిస్తూ, కదం తొక్కుతూ నడిచింది. అరుణపతాకానికి అందరూ సైనికాభివందనం కావించసాగారు. అరుణపతాకం రెపరెపలాడుతూ అంబరవీధుల్లో ఎగురుతోంది. కొన్ని పతాకాలు పట్టుకుని పతాక దళ సభ్యులు స్టాలిన్ విగ్రహం వద్ద నిలుచున్నారు. డైరెక్టర్ జకరోవ్ పతాకం దగ్గరికి వెళ్ళాడు. అప్పుడు తను ఏంచేయాలో ఇగోర్‌కు బోధపడింది. ఒక్సానా ఒక ప్రక్క నిలుచున్నది. ఆమెకు చేరువగానే అతను నిలుచున్నాడు. వీరిరువురి జీవితంలో ఇది అద్భుతమైన సంఘటన, పవిత్రమైన అరుణ పతాకపు నీడలో ఆ యువతీ యువకుల జీవితం కొత్తకొత్త పుంతలు తొక్కుతుంది. ఇరువురూ పూలబాటల్లో పయనించనున్నారు. ఇరువురూ కమాండర్లుగా 'మే కాలనీ'కి సేవ చేయబోతున్నారు. ఇగోర్ ఒక్సానాల కనులనుండి ఆనందాశ్రువులు రాలాయి. ఒక మాటు ఇగోర్ ఒక్సానా వంక చూచాడు. ఆమె అతన్నిచూచింది. ఇప్పుడు ఒక్సానా ఎంత అందంగా ఉంది! ఎన్నడూ లేనంత అందంగా ఉన్నది. ఆ పిల్ల కళ్ళలోనుంచి నవ్యకాంతులు ప్రసరిస్తున్నాయి. అచంచలమైన దీక్ష, ఆశాభావం, ఆవిడ ముఖంలో స్పష్టంగా ద్యోతకమవుతున్నాయి. అప్పుడే విరిసిన ఎర్రగులాబీలా పరిమళించింది ఆ పిల్ల! ఇగోర్ ఇప్పుడు మామూలుగా లేడు. అతనిలో ఏదో నూతనావేశం ప్రాదుర్భవించింది. ఆత్మవిశ్వాసం హెచ్చింది. ఇన్నాళ్ళబట్టీ కంటూ వచ్చిన ఇగోర్ కలలు ఇప్పుడు నిజమవుతున్నాయి. ఇన్నేళ్ళుగా ఎండిపోయిన అతని జీవనవనం ఇప్పుడు చిగురిస్తున్నది. పుష్పించి ఫలించబోతున్నది.

నెస్ట్రెంకో, జకరోవ్ దగ్గరికి వెళ్ళి తన నివేదికను అందచేశాడు:

"కామ్రేడ్ డైరెక్టర్! ఎనిమిదోదళం కమాండర్ డ్యూటీలను నేటినుంచీ ఇగోర్‌కు అప్పచెపుతున్నాను." అన్నాడు.

ఇగోర్ పదవీస్వీకారం చేస్తూ "కా|మ్రేడ్ డైరెక్టర్! ఫస్టు ఆఫ్ మెకాలనీ అష్టమదళ కమాండర్ విధులను ఇవాల్టినుంచీ నేను స్వీకరిస్తున్నాను." అన్నాడు.

ఒక్సానా కూడా పదవీస్వీకారం చేయబోతున్నది.

అయిదోదళపు కమాండర్ క్లావా కషిరినా తన విధులను ఒక్సానాకు వప్పగించినట్లు ప్రకటించింది. తన విధులను తాను స్వీకరించినట్లు ఒక్సానా తెలియజేసింది.

శ్రద్ధాభక్తులతో కాలనీలోని రెండువందల మంది పిల్లలూ అరుణపతాకానికి అభివాదం కావించారు.

# 31
# నిష్క్రమణ

ఒకటవదళం సభ్యులు ఒంటిగా, తమలోతాము మథనపడ సాగారు. పోయిన గడియారం విషయంలో రకరకాలుగా కథలు చెప్పుకుంటున్నారు. ఆ గడియారం దొంగిలించింది కాలనీ కుర్రాళ్లు కాదనీ, రాత్రివేళ ద్వారంలోఉన్న కాపలావాడు ఏ క్షణంలోనో నిద్రకు ఆగలేక కునుకుతీసి ఉంటాడనీ, ఆసందు కనిపెట్టి ఆవరణ లోకి వచ్చిపోయే జనంలో ఎవరో భవనం లోపలికి చొరబడి గడి యారం కాజేసి ఉంటారనీ ఒకసభ్యుడు కథఅల్లి చెప్పసాగాడు. కాని ఈ కట్టుకథను ఎవరూ నమ్మలేదు. ఆఖరుకు ఒకటోదళ సభ్యులుకూడా విశ్వసించలేకపోయారు.

దళసభ్యుల సమిష్టికృషి, ఉత్సాహం సన్నగిల్లాయి. ఎవరి గోలలో వాళ్ళు పడిపోయారు. ఎవరిదారి వారిదైంది. ఒకడు ప్రవేశ పరీక్షలకు చదువుకుంటున్నాడు. మరొకడు ఆటల్లో మునిగి పోయాడు. ఇలాగా అందరూ తలాఒక పనిలో నిమగ్నమైపోయారు.

లెవిట్టిన్ రాత్రింబగళ్ళు గ్రంథాలయంలోనే ఉండి చదువు సాగిస్తున్నాడు. నోజిక్ నాలుగోదళ సభ్యులతో ప్రొద్దస్తమానం గడుపుతున్నాడు. వాళ్ళందరితోనూ అతనికి చనువు ఎక్కువైంది. చివరకు తనను ఒకటో దళంనుంచి నాలుగో దళంలోకి మార్చమని కమాండర్ల కౌన్సిలును కోరాడు. ఈ విషయం చర్చించడం కష్టమైనపని. ఇందుకు పెద్దచర్చ అనవసరమని టార్‌స్కీ అభిప్రాయపడ్డాడు ఒలెంకో, జిరియాన్‌స్కీలతో సంప్రతించాము. నోజిక్‌ను మరోదళంలోకి మార్చే విషయంలో తమకేమీ అభ్యంతరం లేదన్నారు వాళ్ళు. ఆ సాయంకాలమే నోజిక్ ఒకటోదళం వదిలిపెట్టి నాలుగో దళంలో చేరాడు. నాలుగో దళం సభ్యులకు ఈ సంఘటన కష్టమనిపించింది. ఎవరి ప్రక్కలమీద వాళ్ళు నాలి ముసుగులు పెట్టుకుని పడుకున్నారు. ఆ మరుసటిరోజు కూడా వాళ్ళు విచారంగా ఉన్నారు.

కాలనీలో తక్కిన దళసభ్యులంతా చాలా హుషారుగా ఉన్నారు. వాళ్లకు ఏ చీకూ చింతా లేదు. వాళ్ళు కాలనీ జీవితం హాయిగా, ఆనందంగా గడుపుతున్నారు. కొత్త ఫ్యాక్టరీలో కొన్నిచోట్ల యంత్రాలు అమర్చారు, కాలనీ కుర్రాళ్ళు ఎక్కడ, ఏ యంత్రందగ్గర పనిచేయాలో తెలుసుకుంటున్నారు అక్కడికి వెళ్ళి చూచి వస్తున్నారు, తర్ఫీదు అవుతున్నారు. కొమోసామోల్ బ్యూరో తరుచు సమావేశాలు జరుపుతోంది. సమావేశాల్లో సభ్యుల కష్టసుఖాలను గురించి విపులంగా చర్చిస్తోంది. కొత్తపద్ధతుల ప్రకారం కాలనీ కుర్రాళ్ళు పని చేయలేరనీ, అంతటి సమర్థత వాళ్లకు లేదనీ ఒర్గునోవ్ ఒకవాదన లేవతీశాడు. కాని అతని అభిప్రాయంతో ఎవరూ ఏకీభవించలేదు. అందరికీ కోపాలు వచ్చాయి. ప్రధాన ఇంజనీరు వృద్ధుడు. అతను ఇంతవరకూ పిల్లలకేమీ బోధించలేదు. అయినా సరే, అతను ఏ సాంకేతికవిషయం మాట్లాడుతున్నా పిల్లలువిని అర్థం చేసుకోగలుగుతున్నారు.

చాలామంది ఉద్యోగులు కాలనీలోనే నివసిస్తూ వచ్చారు. ఉపాధ్యాయులు, అకౌంటెంట్లు, ఫోర్‌మన్‌లు మొదలైన వారం

దరి నివాసం కాలనీలోనే. రానురాను కాలనీలో నివసించే ఉద్యో గుల సంఖ్య హెచ్చసాగింది. పార్కుకు కొంచెం దూరంగా సాంకేతిక రంగంలో పనిచేసే కార్మికులకోసం ఒక హోటల్ వెలిసింది. అక్కడికి కాలనీ కుర్రాళ్ళు ఎప్పుడోకాని వెళ్ళరు. కాలనీలోకి కొత్తగా ఇరువురు ఇంజనీర్లు వచ్చారు. ఆ ఇరువురూ యువకులే. ఒకతనిపేరు కొమొరోవ్, రెండో అతనిపేరు గ్రిగొరియెవ్. వాళ్ళిద్దరూ పనిచేస్తూ ఉంటే కాలనీ కుర్రవాళ్ళు ఇంకా అనుభవం గడించలేదు. కాని వాళ్ళ నైపుణ్యం ఎటువంటిదో మాత్రం తెలుసుకోగలిగారు. కొమొరోవ్ చాలా ఉత్సాహవంతుడు. ఏపని చేసినా శ్రద్ధగా చేస్తాడు. గౌరవంగా, హుందాతనంగా ప్రవర్తిస్తాడు.మనిషి హృదయం ఉన్నవాడు కాలనీ అన్నా, కాలనీ కుర్రవాళ్ళన్నా ఎంతో ప్రేమ, ఆదరమూను. అదీకాక అతను వాసిల్యెవ్నాను ప్రేమించాడు. ఆమె కాలనీలో ఉపాధ్యాయినిగా ఉంటున్నది. గ్రిగొరియెవ్ అదోరకంమనిషి. కొమొరోవ్ లాంటివాడుకాదు. అతన్ని చూడగానే ఎవరికైనా అనుమానం పుట్టుకొస్తుంది. అతను మిలిటరీ దుస్తులు వేసుకున్నాడు. అలాంటి దుస్తులు వేసుకున్న మనిషి సహజంగా కాలనీ కుర్రాళ్ళను ఆకర్షిస్తాడు. కాని ఎందుచేతనో గ్రిగొరియెవ్ మాత్రం ఎవరినీ ఆకర్షించలేకపోయాడు. అతను కాలనీకి వచ్చిన కొత్తలోనే పిల్లలతనికి మారు పేరుపెట్టారు. అతన్ని "బాడ్జీలమనిషి"అని పిలవసాగారు!

గ్రిగొరియెవ్‌కుకూడా కాలనీ కుర్రవాళ్ళపట్ల అంత ఆదరాభిమానాలు లేవు. ఒర్లనోవ్ కాలనీ కుర్రవాళ్ళు సమర్థులు కారని చెప్పడానికి కారణం గ్రిగొరియెవ్‌యే. అతనికి గ్రిగొరియెవ్‌మీద అంత ఇష్టం లేకపోయినా అతని ప్రభావంలో పడిపోయాడు. కొత్త ఫ్యాక్టరీ నిర్వహణోద్యోగులకు కాలనీలో తాత్కాలికంగా ఒక ఆఫీసు ఏర్పాటు చేశారు. పాత పాఠశాలా భవనంలో ఆ కార్యాలయం పెట్టారు అక్కడ కూచుని ఉద్యోగులు తమ పనులు చేసుకోసాగారు. ఆ ఆఫీసు గదుల కిటికీలు ఎల్లవేళలా తెరిచే ఉంటాయి. అంచాత ఒర్లనోవ్ అస్తమానం గ్రిగొరియెవ్‌కోసం

అక్కడికి వెళ్ళి వస్తూ ఉండడం కాలనీ కుర్రవాళ్ళందరికీ కనుపిస్తూ ఉంది. ఇంతకంటె అర్థాన్నంగా తయారయిన విషయం కూడా మరొకటుంది, అదేమిటి అంటే—కొమెరోవ్ లాగానే గ్రిగొరి యెవ్ కూడా వాసిల్యవ్నాను ప్రేమిస్తున్నాడు. అయినా ఇంతకూ ఆ పంతులమ్మ మనస్సు వీరిరువురిలో ఎవరిమీద ఉన్నదో కుర్ర వాళ్ళకు తెలీదు. కాని ఆమె కొమెరోవ్ ను ప్రేమిస్తేనే బావుం టుందని కుర్రవాళ్ళ ఉద్దేశం. ప్రేమ అంటే సామాన్యమైన విష యంకాదు కదా! కాలనీలో ప్రేమకలాపాలు సాగించడానికి వీలు లేదు. ఈ విషయం అందరికీ తెలుసును. అల్లరిచిల్లరగా ఆడపిల్లలూ మగపిల్లలూ ప్రవర్తించకూడదని సర్వసభ్య సమావేశంలో ఏనాడో తీర్మానించారు. పిల్లలంతా ఆ తీర్మానాన్ని తూ. చ తప్పకుండా కొన్ని ఏండ్లబట్టీ అనుసరిస్తూ వస్తున్నారు. ఇప్పుడుకూడా దాన్ని అలాగే అనుసరించాలి. నైతికంగా ఎవరూ పతనం కాకూడదని తీర్మానోద్దేశం.

దురదృష్టవశాత్తూ కాలనీలో ఒకమాటు ఒక సంఘటన జరి గింది. ఒకనాటి ఉదయం మామూలుగా నోజిక్ కాపలా డ్యూటీలో ఉన్నాడు. కాలనీ అంతా నిశ్శబ్దంగా ఉంది. పిల్లలెవరూ ఇంకా నిద్దర్లు లేవలేదు. జిరియాన్స్కీ మాత్రం తన కార్యాలయంలో కూచుని పనిచేసుకుంటున్నాడు.

నోజిక్ కాపలా కాస్తున్నాడు. అక్కడికి వాసిల్యవ్నా వచ్చింది. 'సాలొమన్ డవిడొవిచ్ ఇక్కడికి వచ్చాడా?' అని నోజిక్ ను అడిగింది. ఇంకా రాలేదనీ, త్వరలో రావచ్చుననీ అతను సమాధానం చెప్పాడు. అప్పుడాపిల్ల పార్కులోకి వెళ్ళి ఒక బెంచీ మీద కూచుంది. పుస్తకం తెరిచి చదువుకో సాగింది. కొంత సేపటికి కొమెరోవ్ ఆమె దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు:

"గుడ్ మార్నింగ్ వాసిల్యవ్నా!"

"గుడ్ మార్నింగ్ కామ్రేడ్ కొమెరోవ్!" అన్నదా అమ్మాయి మళ్ళీ.

మాటల్లో మాటకలిపి కొమొరోవ్ వాసిల్యావ్నాతో ఇలా అన్నాడు:

"నీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి వాసిల్యావ్నా!"

"దానిమాటకేంకాని, ముందుస్టేషన్‌కు టెలిఫోన్‌చేసి మాస్కోనుంచివచ్చే సాయంకాలం బండి ఎన్ని గంటలకు వస్తుందో కనుక్కో" అన్నదా పిల్ల.

అతను వెళ్ళి ఫోన్ చేశాడు. ఆమె అతనికోసం వేచి ఉంది. కొంతసేపటికి అతను తిరిగివచ్చి ఇలా అన్నాడు.

"నీకో విషయం చెప్పాలి."

"ఏమిటా విషయం?"

"ఒకానొకవిషయం"

"అదే, ఏమిటని అడుగుతున్నాను?"

అతను మాట్లాడలేదు.

మళ్ళీ ఆమె ఇలా అన్నది:

"ఇవాళ కాలనీ సభ్యులు సాంస్కృతిక వినోదయాత్రకు బయలుదేరనున్నారనే విషయం నీకు తెలుసునా?"

వారిరువురూ మాట్లాడుకుంటున్న విషయంఎలా పసికట్టాడో కట్టాడు గ్రిగోరియెవ్. గభాలున వారిరువురి దగ్గరికీ వచ్చాడు. వస్తూనే "వాసిల్యావ్నా! ఫ్యాక్టరీలో డ్రిల్లింగ్ మిషన్లు ఎంత అధ్వాన్నంగా అమర్చారో చూచావా? అలాఎందుకమర్చారు?" అని అడిగాడు. "నాకూ అవిషయాలకూ ఏమీ సంబంధంలేదు." అన్నది వాసిల్యావ్నా.

"యంత్రాలు అలా అస్తవ్యస్తంగా అమర్చడానికి కారణం ఏమిటని గ్రిగోరియెవ్ మళ్లీ కొమొరోవ్‌ను కోపంగా అడిగాడు. ఇక్కడికెందు వచ్చావని ప్రశ్నించాడు. వాసిల్యావ్నాతో ఒక విషయం మాట్లాడడానికి వచ్చానన్నాడు కొమొరోవ్.

"నీ వెవడిరా వచ్చి ఆ పిల్లతో మాట్లాడడానికీ?" అంటూ గ్రిగోరియెవ్, కొమొరోవ్ మీదికి కస్సుమని లేచాడు.

ఇరువురూ ఒకరి నొకరు బాడబూతులు తిట్టుకోసాగారు. చివరకు చేతులు చేతులు కలిశాయి. అంతలో ఒర్లనోవ్ అక్కడికి వచ్చాడు. వారిరువురినీ విడదీశాడు. కొమొరోవ్‌ను రెక్క పుచ్చుకుని దూరంగా తీసుకెళ్ళి అవతలికి పంపించివేశాడు. మళ్ళీ అక్కడికివచ్చి కొమొరోవ్‌తో ఇలా మొరటుగా కలియబడినందుకు గ్రిగొరియెవ్‌ను మందలించాడు. వాసిల్యెవ్నా ఎదుట తననలా ఒర్లనోవ్ అవమానించినందుకు కోపం తెచ్చుకున్నాడు గ్రిగొరియెవ్. ఒర్లనోవ్ అతన్ని అవమానించడమే కాదు. "గాడిద!" అని తూలి మాట్లాడాడు కూడా.

"పరాయి ఆడపిల్ల ఎదుట నన్నిలా అవమానిస్తావా? అన్నాడు గ్రిగొరియెవ్.

ఒర్లనోవ్ అంతటితో ఆగలేదు కళ్ళెర్రచేసుకున్నాడు.

"అవమానించడమా? ఎవరు అవమానించారు నిన్ను. నీవే కాలనీవాసులను అవమానిస్తున్నావు! పనీపాటా లేకుండా వచ్చి ఒంటిగా ఆడపిల్లతో గుసగుసలాడడానికి నీ కధికారం ఎవరిచ్చారయ్యా?" అని అరిచాడు: "ఫ్యాక్టరీ వేళయింది ఇహ నీ పనిలోకి నీవు వెళ్ళు!" అన్నాడు.

గ్రిగొరియెవ్ ఇహ ఏమీ మాట్లాడకుండా అక్కడనుంచి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే ఒర్లనోవ్ వాసిల్యెవ్నాతో ఇలా అన్నాడు:

"ఇలా అంటున్నందుకు నన్ను క్షమించు వాసిల్యెవ్నా! దీనికంతటికీ నీవే కారణం! తప్పంతా నీది! ఈ ఇంజనీర్లు ఇరువురూ ఇలా పని మానుకుని నీ చుట్టూ తిరుగుతున్నారు? నీవే దీనికి కారణం!"

కాని అతనిమాటలు ఆఅమ్మాయికి అర్థంకాలేదు.

"అంటే ఏమిటి నీ ఉద్దేశం? వాళ్ళిరువురూ నావల్ల చెడిపోతున్నారా? వాళ్లు పని మానుకుని తిరగడానికి నేనాకారణం? అందుకు నన్నేం చేయమంటావు? అని అడిగిందామె.

నీవేంచెయ్యాలో నేనేంచెప్తానూ? అన్నీ నీకే తెలుసును." అన్నాడు ఒర్లనోవ్.

"అయితేసరే–వాళ్ళను దూరంగా ఉంచాలి. అంతేకదూ?"

ఒర్లనోవ్ ఒక్క-క్షణం మౌనంవహించి మళ్ళీ ఇలా అన్నాడు:

"నే చెప్పేది జాగ్రత్తగా విను వాసిల్యావ్నా! ప్రేమించడం వేరు? ఒక వ్యవహారం చేయడం వేరు. వ్యవహారం వ్యవహారమే, ప్రేమ ప్రేమే! రెంటినీ కలపకూడదు. పనులు మానుకుని ప్రేమ కలాపాల్లోకి దిగితే వ్యవహారాలు చెడతాయి. వాళ్ళు ఇంజనీర్లు – నీవు పంతులమ్మవు, వాళ్ళ పనులు నీవు చెరపకూడదు – నీ పనికి వాళ్ళు ఆటంకం కాకూడదు."

ఇలా అని ఒర్లనోవ్ చరచరా అక్కడనుంచి వెళ్ళి పోయాడు.

ఇలాగే మరొక ప్రేమకలాపంకూడా కాలనీలో జరిగింది. లారీ డ్రైవర్ ఒరోబ్యోవ్, వాండాతో కలిసి పార్కులో బెంచీ మీద రోజూ కూచుంటున్నాడు. వారిరువురు ఒకరినొకరు ఒరుసుకుని కూచుని కబుర్లు, నవ్వులు, కిలకిలలు సాగిస్తూ వచ్చారు. ఇరువురూ ఏకాంతంగా తిరుగుతున్నారు. వాండా కాలనీలో అడుగు పెట్టిన లాగాయతూ అందర్నీ ఆకర్షిస్తోంది. ఆమె నడవడికను అందరూ మెచ్చుకుంటున్నారు. పోలెండు నాజీల బారినుంచి విముక్తి పొందిన తరువాత కొంతమంది పోలిష్ కమ్యూనిస్టులు తమ కృతజ్ఞతలు అందచేయడంకోసం సోవియట్ రష్యాకు విచ్చేశారు. వారి గౌరవార్థం పోలిష్ కన్య అయిన వాండా కాలనీలో ఒక విందు ఏర్పాటు చేసింది. అందుకు కొమ్సొమోల్ బ్యూరో అంగీకరించింది. విందు చాలా బాగా జరిగింది. ఏర్పాట్లన్నీ చక్కగా చేశారు. అతిథులు ఎంతగానో ఆనందించారు. తమ కృతజ్ఞతలు తెలియచేశారు. విందు అనంతరం వాండా ఇలా ప్రసంగించింది.

"నేను పోలిష్ యువతిని ఇక్కడ – రష్యాలో నేనెంత హాయిగా ఉంటున్నానో మీరు కళ్ళారా చూచారు. నేనొక్క తెనేకాదు. ఇక్కడ అందరూ హాయిగా గడుపుతున్నారు. రష్యన్‌లు, యుక్రీనియన్‌లు, యూదులు; అందరూ సమానంగా, ఏక కుటుంబంగా జీవిస్తున్నారు. ఇక్కడ జీవితం ఆనందమయంగా ఉన్నది."

ఈవిందు జరిగిన తరువాత వాండా కాలనీలో మరీ ప్రసిద్ధురాలయింది. ఆడపిల్లలు, మగపిల్లలు కూడా ఆమెను మెచ్చుకుంటున్నారు. కాని ఆమె లారీడ్రైవర్ ఒరోబ్యోవ్‌తో అలా అస్తమానం పైనా ప్రక్కనా పడుతూ తిరుగుతూ ఉండడం ఎవరికీ నచ్చలేదు. చివరకు వాండా ఒరోబ్యోవ్‌ల ప్రేమకలాపం జిరియాన్‌స్కీ చెవిదాకా వెళ్ళింది. అతను ఒరోబ్యోవ్‌ను తీవ్రంగా హెచ్చరించాలనుకున్నాడు. కాని పనులలో నిమగ్నుడై ఉన్నందున అందుకు అతనికి తీరుబడి చిక్కడంలేదు.

కాలనీలో ఒకవైపు ఇలా సంఘటనలు జరుగుతూ ఉంటే ఒకనాడు మరొక కొత్తసమస్య వచ్చిపడింది. ఆవేళ కమాండర్ల కౌన్సిలు సమావేశం జరుగుతున్నది. కౌన్సిలుముందు టార్‌స్కీ ఒకచీటీ చర్చకు పెట్టాడు. ఆచీటీ వ్రాసింది ఒలెంకో. తన తల్లికి జబ్బుగా ఉన్నదనీ, తాను వెళ్ళాలనీ, అంచాత సెలవు ఇవ్వవలసిందనీ కౌన్సిలువారిని అభ్యర్థించాడు ఒలెంకో.

చీటీ చదివి కౌన్సిలు సభ్యులు మౌనం వహించారు. ఎదురుగా ఒలెంకో నిలుచుని ఉన్నాడు. కొంతసేపయిన తరువాత టార్‌స్కీ ఇలా అన్నాడు :

"చర్చ ప్రారంభిస్తున్నాను. ముందు ఎవరు మాట్లాడతారో చెప్పండి ?"

"నేను మాట్లాడతాను" అన్నాడు జకరోవ్. ఇలా అని ఒలెంకోను ప్రశ్నించాడు :

"నీవు ఇంటికి దేనికి వెళ్ళాలనుకుంటున్నావు ఒలెంకో?"

"మా ఇంట్లో పరిస్థితులు బాగా లేవండీ" అన్నాడు ఒలెంగో.

"ఇంతకుముందు బాగుండేవా?"

"ఇంతకన్నా బాగుండేవి. ఇప్పుడు మా అమ్మ చికాకుల్లో ఉంది."

"ఆమె క్షేమసమాచారాలు ఎప్పటికప్పుడు నీకు అందుతున్నాయా?"

"ఆ, అందుతున్నాయి."

"మరి కొత్తగా ఇప్పుడొచ్చిన ప్రమాద మేమిటి?"

"అంత పెద్ద ప్రమాదమేమీలేదు. కాని నేను మాత్రం ఒకమాటు ఇంటికి వెళ్ళిరావాలి. మా అమ్మను చూడాలి."

"మరి నీ చదువు పాడయిపోతుందే? ఇది నీకు ఆఖరు సంవత్సరం కదూ?"

"అయినా సరే—వెళ్ళి తీరాలి." అన్నాడు ఒలెంగో.

వారిరువురి సంభాషణా ముగిసింది. మళ్ళీ టార్స్కీ లేచి "ఇంకా ఎవరైనా మాట్లాడతారా?" అని అడిగాడు.

మొదట ఎవరూ మాట్లాడలేదు. కొంతసేపు గడిచింది. తరువాత ఫిల్కా—షేరీ గడుసుతనంగా లేచి ఇలా అన్నాడు:

"ఒలెంగో వాళ్ళ ఇంటికి వెడతాడు. బాగానే ఉంది. కాని వాళ్ళ అమ్మదగ్గరనుంచి వచ్చిన ఉత్తరం ఏమిటో ఒకమాటు మనందరికీ చూపిస్తాడా?"

ఇది వినేసరికి ఒలెంగోకు కోపం వచ్చింది.

"ఏమిటా కుంటిప్రశ్న? నేనేం పసిపిల్లవాణ్ణనుకున్నావా? నేనెలాంటివాణ్ణో మీకు తెలీదూ? నా ఉత్తరాలు నేనొకరికి ఎందుకు చూపించాలి?" అన్నాడు ఒలెంగో.

"ఎందుకు చూపించాలంటే...బాగున్నది నీవడగడం?... ఎందుకంటే నీవు చెప్పింది నిజమో అబద్ధమో మేం తెలుసుకోవడానికి—నీమాట మేం నమ్మవద్దూ?"

"మీరు నమ్మండి. నమ్మకపోండి—నాకు నిమిత్తంలేదు. కాని నాకు ఇంటికి వెళ్ళవలసిన పని ఉంది. నేను వెళ్లాలంటున్నాను. కొమోసామోల్ బ్యూరో నా కోరికను మన్నించింది."

"అవునవును—బ్యూరో అంగీకరించింది!" అన్నాడు మార్కు-గ్రీన్‌హౌస్.

టార్‌స్కీ ఒకమాటు చూట్టూ కలయచూచాడు. తరువాత రొడ్నేవ్ లేచి ఇలా అన్నాడు:

"ఇదంతా మాకు చిత్రంగానే ఉంది. నీవు ఇంటికి వెళ్ళాలని ఎందుకంత ఆదుర్దా పడుతున్నావో మాకు అర్థం కావడంలేదు. నీకు ఇల్లంటూ ఒకటున్నదన్న సంగతి ఇంతవరకూ మాకు తెలియనే తెలియదు!"

ఈ ఆఖరుమాట వినేసరికి ఒలెంకోకు తీవ్రంగా కోపం వచ్చింది. కాని మళ్ళీ దిగమింగుకుని ఊరుకున్నాడు. అంతలో ఎవరో లేచి "అనవసరంగా ఈ చర్చ ఎందుకు? ఈ విషయంపై ఓటు తీసుకోండి—తేలిపోతుంది." అన్నారు.

"ఆగండి, ఆగండి! నేను మాట్లాడతాను!" అంటూ జిరియాన్‌స్కీ లేచి నిలుచున్నాడు: దీనికి పెద్దఓటింగ్ ఎందుకు? ఒలెంకో మంచి కామ్రేడ్. కాలనీలో అతని ప్రవర్తన మనసందరం చూచాం. అతనిమాట మనం నమ్మాలి. అతను ఒకసారి ఇంటికి వెళ్ళిరావాలంటున్నాడు. వెళ్ళనివ్వండి. అతను కాలనీలో చేసినసేవ అద్భుతం. అందుకు ప్రతిఫలంగా మనం అన్ని మర్యాదలతోను అతడికి వీడ్కోలు ఇద్దాం. కమాండర్ల కౌన్సిలు నిధినుంచి అయిదు వందల రూబుళ్ళు అతనికి బహుమతిగా ఇద్దాం. కొత్త ఉలెన్ సూట్లు కుట్టిద్దాం." అన్నాడు.

జిరియాన్‌స్కీ ప్రతిపాదన ఓటుకు పెట్టాడు సభాధ్యక్షుడు టార్‌స్కీ. ప్రతిపాదనకు అనుకూలంగా అందరూ చేతులెత్తారు. ఫిల్కా-షేరీ మాత్రం తనకు ఓటుచేసే హక్కు లేకపోయినా లేచి నిలుచుని ఇలా అన్నాడు:

"అతన్ని వాళ్ళఅమ్మ వ్రాసిన ఉత్తరం చూపించమనండి!"

కాని అతనిమాట వినిపించుకోకుండా ఒలెంకో, కౌన్సిలు సభ్యులకు తన కృతజ్ఞత తెలిపి సభాభవనం నుంచి అవతలికి వెళ్ళి పోయాడు. సమావేశం ముగిసింది.

ఆ సాయంకాలం ఒలెంకోను తనదగ్గరికి రమ్మని జకరోవ్ కబురు పెట్టాడు. ఒలెంకోవచ్చి డైరెక్టర్ ముందు నిలుచున్నాడు.

"నీవు వెళ్ళిపోవడం బాగాలేదు ఒలెంకో, ఎక్కడికి వెడతావు?" అని అడిగాడు జకరోవ్.

ఒలెంకో జవాబు చెప్పకుండా ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు: సిగ్గుతో తల వాల్చుకుని "ఎక్కడికో అక్కడికి పోతాను- సోవియట్ భూమి చాలా విశాలమైంది కదా!" అంటూ మళ్ళీ తలఎత్తి జకరోవ్ వంక చూచాడు: "అలెగ్జీ స్టెపానొవిచ్!" అన్నాడు.

"ఆ, ఆ, వింటున్నాను, చెప్పు." అన్నాడు జకరోవ్.

"ఇక్కడ నా మనస్సేమీ బాగాలేదు అలెగ్జీ! ఇక్కడ నా పరిస్థితి ఏమిటో నా కర్థమైంది. ఆ పెండిగడియారం నేనే దొంగిలించానని అంతా అనుకుంటున్నారు! అనుకుంటే అనుకోనీ! పాపముంటే భయం. నన్ను బాగా ఎరిగినవాళ్ళు, నన్ను అర్థం చేసుకున్నవాళ్ళు ఇక్కడ చాలమంది ఉన్నారు. వాళ్ళెవరూ ఈ మాట నమ్మరు. ఒకవేళ వాళ్ళుకూడా నమ్మినా - నాకేం బాధ లేదు. కాని ఒకటే ప్రశ్న. ఈ దొంగతనం నేను డ్యూటీలో ఉన్నప్పుడే ఎందుకు జరగాలి? నా దళంలోనే, నా మొదటి దళంలోనే ఎందుకు జరగాలి? లెవిటిన్ కాని, రైజికోవ్ కాని, గొరొకోవ్ కానీ; ఎవరైతేనేం? వీరంతా నా దళంలోనే ఉన్నారుకదా? దొంగలంతా నాదళంలోనే ఉన్నారుకదా? ఈవిషయం కాలనీలో పిల్లలందరికీ తెలుసునుకదా? అందుకే నేను డ్యూటీలో ఉన్నప్పుడు వాళ్ళు నాకేసి విచిత్రంగా చూస్తారు! 'చూశావా? ఒలెంకో దళంలో ఎంతమంది దొంగలో! అని వాళ్లలో వాళ్లు గుసగుస లాడుకుంటారు. నేనొక పచ్చిదొంగ నయినట్లు నావంక

అదోలా చూస్తారు. ఈబాధ నేనిక భరించలేను అలెగ్జీ! ఇహ ఇక్కడ నేనుండలేను. ఒక్కనిముషం ఉండలేను అలెగ్జీ! కాని ఏమాట కామాట అనుకోవాలికదా? కాలనీలో ఉన్న నా కామ్రేడ్స్ ఎవరూ నన్ను నిందించలేదు. నామీద నేరారోపణలు చెయ్యలేదు. అయినా నేనెంత ఆవేదన పడుతున్నానో, ఎందుకు కుమిలిపోతున్నానో మీరు అర్థం చేసుకోవాలి అలెగ్జీ! నా ఆవేదన ఒకరికి అర్థంకాదు. అందుకు మీరెవరూ విచారించవలసిన పనిలేదు. శ్రమపడవలసిన పనికూడా లేదు. నేనేం జీవితంలో క్రుంగిపోను. తాత్కాలికంగా నాకీ దురవస్థ వచ్చింది. ఒక చీకటి తెర వచ్చి నామీద వాలింది. అంతమాత్రంచేత జీవితాంతం నేను క్రుంగిపోవలసిన పనిలేదు."

"నీవలా క్రుంగిపోకూడదు ఒలెంకో. నీవు మంచివాడివి. ఏ విషయమైనా అంతగా మనస్సుకు పట్టించుకోకూడదు. కష్టాలను తేలికగా తీసుకోవాలి. వీలైనంతవరకూ వాటిని మరిచిపోవడానికి ప్రయత్నించాలి." అన్నాడు జకరోవ్.

ఆ మరుసటి రోజు ఒలెంకో తన ప్రయాణానికి సర్వ సన్నాహాలు చేసుకున్నాడు – పక్కచుట్ట సర్దుకున్నాడు. ఓవర్ కోటు వేసుకున్నాడు. పెట్టె చేతపట్టుకున్నాడు. వెళ్లి వస్తానని చెప్పడానికి జకరోవ్ చెంతకు వచ్చాడు.

జాగ్రత్తగా వెళ్ళు! ఉత్తరాలువ్రాస్తూ ఉండు. కాలనీకి మరిచి పోకు."అంటూ జకరోవ్ ఒలెంకోతో కరస్పర్శ కావించాడు. నమస్కారంచేసి "వెళ్ళొస్తాను. మీ అదరాభిమానముల కెంతో కృతజ్ఞుణి" అన్నాడు.

జకరోవ్‌కు కళ్ళవెంట నీళ్ళుతిరిగాయి. చేరుమాలుతోకళ్ళు తుడుచుకున్నాడు. అతనివంక తేరిపారచూడలేక ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు.

ఒలెంకోవెళ్ళి పోతున్నాడు. అతను కనుచూపు మేరదాటే వరకూ జకరోవ్ అలాగే తదేకంగా చూస్తూనిలుచుండి పోయాడు.

ఒలెంకో కాలనీదాటిమార్గంపట్టాడు. అతను అడవిలోకివచ్చే సరికి వెనుకనుంచి ఎవరిదో పిలుపువినిపించింది.

"ఒలెంకో! ఒలెంకో! ఉండు, ఉండు, వస్తున్నా!"

"ఒలెంకో ఆగివెనుదిరిగి చూచాడు. ఆ వస్తున్నది వాన్యా గల్చెంకో. ఒలెంకోను సమీపించాడు వాన్యా.

"ఎందుకు వాన్యా వచ్చావు?" అని అడిగాడు ఒలెంకో.

"నీ అడ్రస్ నాకు కావాలి ఇవ్వవూ? నీ అసలు అడ్రెస్! నా ఒక్కడికోసమే కాదు. అందరికీ కావాలి. ఇగోర్ కూడా అడగ మన్నాడు." అన్నాడు వాన్యా.

"ఎందుకూ నా అడ్రెస్?"

"అలా అంటావేమిటి ఒలెంకో? ఇవ్వు నీ అడ్రస్ ఇవ్వు."

ఒలెంకో తన అడ్రెస్ వ్రాసి ఇచ్చాడు. మళ్ళీ ముందుకు నడక సాగించాడు. వాన్యా వెనక్కు మళ్ళాడు.

వాన్యా రాకకోసం నాలుగోదళ సభ్యులంతా పార్కులో కనిపెట్టుకుని ఉన్నారు. అతను రాగానే ఆదుర్దాగా "అడ్రెస్ ఇచ్చాడా?" అని అడిగారు అందరూ.

"ఆ, ఇచ్చాడు. కాని అతను ఇదివరకు అనుకున్నట్లు సమారాకు వెళ్ళడంలేదు. పోల్టోవాకు వెడుతున్నాడు!" అన్నాడు వాన్యా.

# 32
# జంతుపక్షులు

కాలనీలో ప్రధాన భవనం చాలా సుందరంగా ఉంటుంది. భవనం ముందున్న వరండా ఎంతోచక్కగా ఉంటుంది అది కేవలం వరండాలా అగుపించదు. చుట్టూ చక్కని పూలచెట్లు, అల్లుకునిఉన్న తీవెలు, పొదరిండ్లు వుండడంవల్ల వరండా మరింత శోభాయమానంగా కనుపిస్తుంది. స్నేహితులను కలుసుకునేందుకు

ఎవరైనా వస్తే ఆ వరండాలో హాయిగా కూచోవడానికి వీలుగా బెంచీలు వేశారు. అతిథులు, అభ్యాగతులు ఇలా కూచోవడానికి ఇంతకన్న అనువైనచోటు లేదు. అదీకాక మరోవిశేషం కూడా ఉంది. కాలనీలో ఎవరు ఎక్కడికి వెళ్ళాలన్నా భవనం దాటి మరీ వెళ్ళాలి. జకరోవ్ ఆఫీసు, కమాండర్ల కౌన్సిలు హాలు, కొమ్సొమోల్ బ్యూరో, భోజనశాల, క్లబ్ గదులు, ప్రదర్శనశాల; ఇవన్నీ భవనానికి చేరువగా ఉన్నాయి. అంచాత పనిమీద వెళు తున్న ప్రతిఒక్కరూ భవనంముందు ఆగి వరండాలో ఉన్న స్నేహి తులను పలకరించి మరీ వెడుతుంటారు: వరండా ఎప్పుడూ సందడిగా ఉంటుంది, ఎవరో ఒకరు వస్తుంటారు, పోతుంటారు, కూచుని మాట్లాడుకుంటూ ఉంటారు. ఎల్ల వేళలా అక్కడొక కాపలావాడు కాపలా కాస్తుంటాడు.

ఒకనాటి ఉదయం అనుకోకుండా టార్‌స్కీ, జిరియాన్‌స్కీ, బ్లమ్‌లు వరండాలో కలుసుకున్నారు. కొద్ది నిముషాలకు లారీ డ్రైవరు ఒరోబ్యోవ్ కూడా అక్కడికి వచ్చాడు. వస్తూనే అందర్నీ చూచి "గుడ్‌మార్నింగ్" అన్నాడు.

ఇందుకు సమాధానంగా జిరియాన్‌స్కీ తల ఊపాడు. తరువాత ఇలా అన్నాడు.

"ఏంవయ్యా ఒరోబ్యోవ్! ఆ విషయం గురించి ఇంతకుముం దొకమాటు నిన్ను హెచ్చరించాను. కాని నీవు నామాట ఖాతరు చెయ్యలేదు !"

అదే సమయానికి తొమ్మిదవ దళం కమాండర్ పొఖ్రుఖ్ అక్కడికి వచ్చాడు. జిరియాన్‌స్కీ అన్నమాట వినీవినడం తోనే అతను తమాషాగా ఇలా అన్నాడు :

"ఎవరయ్యా జకరోవ్ నీమాట పెడచెవిని పెట్టిందీ! ఒరోబ్యోవ్ కదూ ? వినడానికి తమాషాగానే ఉంది !"

"నేనేదో అతనితో హాస్యానికి అన్నాననుకుంటున్నాడు... ఏం, అంతేనా ఒరోబ్యోవ్ ? ఆపిల్ల చుట్టూ కాలుగాలిన పిల్లిలా

ఎందుకలా తిరుగుతావు? ఆ పిల్లదగ్గర ఉరిపోసుకుని చస్తావా ఏమిటి?'' అని అడిగాడు జిరియాన్‌స్కీ.

"ఉరిపోసుకు చస్తావా? అంటే ఏమిటి మీమాట కర్థం?" అన్నాడు ఒరోబ్యోవ్ ధీమాగా.

"అబ్బాయ్! మళ్ళీ చెపుతాను విను. నీవిక్కడ లారీ డ్రైవర్‌వు. లారీ నడపడం నీపని. కావలిస్తే నీ లారీని ఎటుబడితే అటు నీ ఇష్టంవచ్చినట్టు తిప్పుకో, బావుంటుంది! అంతేకాని ఆడ పిల్లల మనస్సులు తిప్పుతావటయ్యా?'' అన్నాడు జిరియాన్‌స్కీ.

ఇదివిని బ్లుమ్ జోక్యం కలిగించుకున్నాడు. జిరియాన్‌స్కీతోటి తర్కానికి దిగాడు:

"కామ్రేడ్ జిరియాన్‌స్కీ! నే చెప్పేది వింటావా? ఒరో బ్యోవ్, వాండాలు ఒకరి నొకరు ప్రేమించుకున్నారు!'' అన్నాడు బ్లుమ్.

"ఎవరూ ప్రేమించుకున్నది? మళ్ళీచెప్పు?'' అన్నాడు జిరియ్యాన్‌స్కీ.

"అదేనయ్యా, ఒరోబ్యోవ్-వాండా! ఇరువురూ ప్రేమించు కున్నారు! ఇరువురి హృదయాలు ఏకమైనాయి! ఇందులో తప్పే మిటి? ఎందుకు ప్రేమించుకో కూడదూ?''

"ఏమిటయ్యా నీవంటున్నది? ప్రేమట! హృదయమట! అంతా విడ్డూరంగాఉందే! అయితే నేను మాత్రం ఒక అమ్మా యిని ప్రేమంచకూడదూ? ... వాండా చదువుకునే పిల్ల. ఇది ఆఖరు సంవత్సరం. ఆపిల్ల చదువు పూర్తికావాలి. ఈలోగానే ఈడ్రైవర్ మహాశయుడు ఆపిల్ల మనస్సును మళ్ళిస్తున్నాడు!''

ఇలా కొంతసేపు చర్చ జరిగింది. ఇంతసేపూ టూర్‌స్కీ ఏమీ మాట్లాడలేదు. కాని చివరకు జిరియాన్‌స్కీ అభిప్రాయంతో ఏకీభవిస్తూ ఇలా అన్నాడు:

"అవును. ఇదేం ఆషామాషీ వ్యవహారం కాదు. ఒరో బ్యోవ్! నీకేచెప్పేది! నీవు సర్వసభ్య సమావేశం ముందు సమా ధానం చెప్పుకోవలసి ఉంటుంది.''

ఇది వినేసరికి ఒరోబ్యోవ్ కళవళ పడ్డాడు. ముఖం వివర్ణమైంది. కాని మళ్ళీ ధైర్యం తెచ్చుకుని ఇలా అన్నాడు :

"కామ్రేడ్స్! మీరు పెట్టిన రూల్సన్నీ చాలా విడ్డూరంగా ఉన్నాయి! వాండా పసిపిల్ల కాదు. జ్ఞానం తెలిసినపిల్ల. కొమ్సొమోల్ సభ్యురాలు. అటువంటి అమ్మాయికి ఎలాంటి హక్కులూ ఉండవా ?"

ఇదివిని జిరియాన్స్కీ తోక తొక్కిన తాచులా కస్సుమని లేచాడు :

"ఇహ ఆపు ! ఏమిటీ! జ్ఞానం తెలిసిన పిల్లా ? ఆమె కాలనీ సభ్యురాలు. ఇక్కడ హక్కులతో సంబంధంలేదు." అన్నాడు.

ఈ ప్రేమ కలాపాలవల్ల వచ్చే కష్టనష్టాలు టార్స్కీ మెల్లగా డ్రైవర్‌కు నచ్చచెప్పి ఇలా అన్నాడు ;

"నీవు కాలనీ సభ్యుడివి కాదు. కాలనీ అవతలికిపోయి నీవు కావలసినంతమంది పిల్లలను కట్టుకుంటావు! నీదేం పోయిందయ్యా! కాని ఆవ్యవహారాలు కాలనీ ఆవరణలో సాగవు. అలా సాగనిస్తే మాపరువు ప్రతిష్టలు మంట కలిసినట్టే !"

"నీవేదో ఇందాక హక్కులను గురించి మహా మాట్లాడబోయావు, హక్కులను గురించి మనం చర్చించడం మొదలుపెడితే తెల్లవారుతుంది!" అన్నాడు జిరియాన్స్కీ డ్రైవర్‌తో కోపంగా.

"అదేమిటయ్యా ? ఆపిల్ల ఒక పురుషుణ్ణి ప్రేమిస్తే మనదేం పోయిందయ్యా మధ్య? అసలువిషయం మాకు తలకెక్కినట్టేలేదే!" అన్నాడు బ్లమ్ పానకంలో పుడకలాగా.

"అవును పాపం! ప్రేమ భిక్షకోసం పడుగాపులు కాస్తున్నారు ఈ తుంటరివాళ్ళు!" అన్నాడు జిరియాన్స్కీ.

"ఎవరా తుంటరివాళ్ళు?"

"ఇంకెవరు?—వీళ్ళే—ఈ ప్రేమికులు. ఒకొరినొకరు అర్థం చేసుకునేందుకు ఇంతకాలం వేచిఉన్నారు. ప్రేమ తప్ప వాళ్ళకు

మరోపనిలేదు. ఇక్కడ—ఈ కాలనీలో మనం ఫ్యాక్టరీ నిర్మించుకుంటున్నాం. కష్టసాధ్యమైన ప్రణాళికను జయప్రదం చెయ్యబోతున్నాం. వీటన్నిటితో మనం నానా తిప్పలు పడుతున్నాం. కాని ప్రేమికులకు వీటితో సంబంధంలేదు. వాళ్ళ లోకంలో వాళ్ళున్నారు! వాళ్ళ ప్రేమకలాపాలేమిటో, వాళ్ళ ముద్దులేమిటో—వాళ్ళు...ఏం ఒరోబ్యోవ్? నిజంచెప్పు? నీవు ఆ పిల్లను ఒక్కమాటయినా ముద్దు పెట్టుకున్నావా?"

"ప్రమాణపూర్తిగా... ..."

"అవును—ప్రమాణాల కేంలే! వాళ్ళు ముద్దులు పెట్టుకుంటారయ్యా—బుగ్గలు కందిపోయేవరకూ ముద్దాడుతారయ్యా! వాళ్ళను మనం అర్థం చేసుకోవాలట! వాళ్ళను మనం సానుభూతితో చూడాలట! అదేమీ అంటే—వాళ్ళు ప్రేమించుకున్నారుగదటయ్యా. ఆ ప్రేమ సముద్రంలో ప్రొద్దస్తమానం మునిగి తేలుతున్నారు కదయ్యా!" అన్నాడు జిరియాన్‌స్కీ.

"వాళ్ళన్నమాట నిజమేనయ్యా. మనం వాళ్ళను అర్థం చేసుకోవాలి. సానుభూతి చూపాలి. నీకూ ఆ విషయం తెలుసులే! —ప్రేమలో పడితే ఒడ్డుకు అంతత్వరలో చేరతామా?" అని పరాచకాలాడాడు బ్లమ్.

ఈ సూటిపోటి మాటలన్నీ వింటూ ఒరోబ్యోవ్ తల వొంచుకున్నాడు.

"ఎందుకయ్యా ఆ తలవంపులు? ముఖం పైకెత్తు." అంటూ జిరియాన్‌స్కీ భవనం పై అంతస్తులోకి వెళ్ళాడు.

పాఖోర్ఖుయ్, ఒరోబ్యోవ్ బుజాలమీద జాలిగా చేతులు వేసి ఇలా అన్నాడు.

"ఏం భయంలేదులే. నీవేంచెయ్యాలో నె చెపుతాను విను మెల్లగా, చడీ చప్పుడు కాకుండా ఆ పిల్లను లేవతీసుకుపో!"

"అంటే?"

"అంటే ఏమీలేదు—లేవదీసుక పోవడమంటే లేవదీసుక పోవడమే! ఇహ అంటే లేదు గింటే లేదు! ఒక మంచిగుర్రం సంపాయించు. ఇద్దరు దానిమీద ఎక్కి ఏ అర్ధరాత్రో ఉడాయించండి! పూర్వకాలంలో ప్రేయసీ ప్రియులు ఇలాగే చేసేవాళ్లు!" అన్నాడు పొఖోర్షుయ్.

ఈ మాటలకు బ్లమ్ పక పక నవ్వాడు.

"పిల్లను లేవదీసుకపోవడానికి అతనికి గుర్రం ఎందుకయ్యా? నిక్షేపంలా లారీ ఉంటేను. తిన్నగా లారీమీద రిజిస్ట్రార్ ఆఫీసుకు పోయి పెళ్ళి చేసుకుంటారు. కాలనీకి వచ్చి సర్వసభ్య సమావేశం ముందు, పెళ్ళి చేసుకున్నట్లు పత్రం చూపిస్తారు. దాంతో మనమంతా దంపతులను దీవిస్తాం?" అన్నాడు.

ఇంతలో అక్కడికి కొందరు కుర్రవాళ్ళు వచ్చారు. బ్లమ్ చర్చ ఆపుచేసి ఇలా అన్నాడు.

"ఎందుకొచ్చిన కబుర్లయ్యా ఇవి? పనిచెరుపు! పదవయ్యా ఒరోబ్యోవ్. చేయవలసిన పని చాలా ఉంది."

తరువాత ఎవరి పనిమీద వారు వెళ్ళిపోయారు.

ఒక వారం గడిచింది. ఆవేళ అందరికీ సెలవు. సభ్యులందరూ నగరంలో సినిమా చూచి ఆలస్యంగా కాలనీకి వచ్చారు. సినిమా ఎంతో బాగున్నది. సినిమానుంచి వస్తూ పిల్లలంతా హుషారుగా ఉన్నారు. కదం తొక్కుతూ వచ్చారు. నగరంలో నుంచి కదంతొక్కుతూ వెళ్ళడం రావడం, వాళ్ళకెంతో సరదా కలిగించింది. జకరోవ్ కూడా ఆరోజు సంతోషంగా ఉన్నాడు. కాలనీకి చేరుకున్న తరువాత పిల్లలందరూ కాళ్లు చేతులు కడుక్కొని భోజనాలకు కూచున్నారు. ఆవేళ కాపలా డ్యూటీలో నోవక్ ఉన్నాడు. అందుచేత అతనికి సినిమా చూచే అవకాశం లేకపోయింది. అందరితోపాటు తనూ సంతోషంగా కాలం గడపలేక పోయినందుకు నోవక్ విచారిస్తూ వరండాలో నిలుచున్నాడు. ఒరోబ్యోవ్ అతని ముఖం చూచి గాభరా పడ్డాడు. ఒకటి రెండు

నిముషాల తరువాత వాన్యా కూడా అక్కడికి వచ్చాడు. అతన్ని చూచి ఒరోబ్యోవ్ ఇలారమ్మ''ని పిలిచాడు.

"ఎందుకూ? వాండాను పిలుచుకురావాలా? అంతేనా?" అని అడిగాడు వాన్యా.

"భలే - బాగా పసికట్టావే! అదేపని - ఒకమాటు వెళ్ళి వాండాను పిలుద్దూ, నీకు పుణ్యముంటుందీ!" అన్నాడు ఒరోబ్యోవ్.

"అలాగే పిలుస్తాను కాని, మరి నన్ను ఒకమాటు లారీ ఎక్కనిస్తావా?"

"ఆ, అలాగే ఎక్కుదువుకాని."

"అయితే సరే - వాండాను పిలుచుకొస్తాను!" అని పెద్దగా కేకవేశాడు వాన్యా.

"ఎందుకలా కేకలు పెడతావోయ్, నీపాడుగాను! రహస్యంగా మాట్లాడు!" అన్నాడు ఒరోబ్యోవ్.

"ఇందులో రహస్య మేముంది కామ్రేడ్—అందరికీ తెలిసిన విషయమేగా!... ఉండుండు. గాభరా పడకు. వాండాను పిలుచుకొస్తాను." అంటూ వాన్యా మేడమీదికి పరుగెత్తాడు.

కొంతసేపటికి వాండా బయటికి వచ్చింది. తెల్లటి గౌను వేసుకుంది. అప్పుడే పూసిన గులాబీ పువ్వులా ఎంతో అందంగా మెరుస్తోంది.

"వాండా! ఇప్పుడు నిన్నెందుకు పిలిచానో తెలుసునా?" అని అడిగాడు ఒరోబ్యోవ్.

"ఎందుకో, నాకేం తెలుసు?...నాతల గిర్రున తిరిగిపోతోంది. పిల్లలంతా మన ఇరువురిని గురించే చెప్పుకుంటున్నారు! నలుగురిలో తల ఎత్తుక తిరగలేకుండా ఉన్నాను!" అన్నది ఆపిల్ల.

"ఏం భయంలేదు రా, నాతో రా. ఇరువురం లారీ ఎక్కి వెళ్ళిపోదాం." అన్నా డతను.

"ఎలా వెడతాం? ఎక్కడికి వెడతాం?"

"లారీమీద తిన్నగా మా ఇంటికి వెళ్ళిపోదాం."

"బావుంది—చాలా బావుంది జకరోవ్ !"

"ఎందుకా సందేహం వాండా? రేపు ఉదయాన్నే రిజిస్ట్రాఫీసుకు వెళదాం. అన్నీ అక్కడ చక్కబడతాయి."

"మరి కాలనీ ఏమవుతుంది; ఫ్యాక్టరీ ఏమవుతుంది?"

"జకరోవ్ నిన్ను సామాన్యంగా విడిచిపెట్టడు... అందుకే నాతో రా. వెళ్ళిపోదాం."

"అమ్మయ్యో! విన్నవాళ్ళంతా ఏమనుకుంటారు?"

"ఏమనుకుంటే మనకేం? వాళ్ళ మాటలతో మనకేం లెక్క?... ఇంతకూ ఈ సలహా నాకు చెప్పింది ఎవరో తెలుసా? మన కాలనీలో పిల్లలే!" అన్నాడు జకరోవ్.

"కాని ఇటు నాకేసి చూడు. ఇలాంటి దుస్తులు వేసుకుని ఎలా రాగలను?" అన్నది వాండా.

"ఆ దుస్తులే నీకు అందంగా ఉన్నాయి. వాండా తెల్లటి దుస్తుల్లో నీవు నిజంగా దేవకన్యలా ఉన్నావు! ఈ దుస్తుల్లో పెళ్ళి చేసుకుంటే ఎంత బావుంటుందనుకున్నావ్? మా అమ్మతో నీ విషయమంతా చెప్పాను. ఆమె ఎంతో సంతోషించింది."

వాండా కంపించిపోసాగింది. చెక్కిళ్ళు ఎరుపెక్కాయి. ఏదో ఉద్వేగంలో ఊగిపోయింది.

"మీఅమ్మతో చెప్పావా? మంచిపని చేశావు పెద్దవాళ్ళకు చెప్పకుండా ఏపనీ చెయ్యకూడదు. ఏమో అనుకున్నాను. అమ్మో నీవు తెలివైనవాడివిలే!" అన్నది.

"లేకపోతే ఏమనుకున్నావు మరి? లారీ డ్రైవర్ను ఊరికనే కాగలిగానా?"

"మరి మనం వెళ్ళిపోతుంటే ఎవరైనా చూస్తే?"

"లారీమీద వెడుతున్నాం ఎవ్వరూ చూడరు"

"ఎక్కడా ఆగకుండా ఏకాఏకీ వెళ్ళిపోతామా?"

"ఆ, ఎక్కడా ఆగేదిలేదు. తిన్నగా వెళ్ళిపోవడమే."

"అయితే సరేలే,"

"సరేలే అంటేకాదు. వెంటనే లారీఎక్కు——ఊ, త్వరగా"

"ఉండుండు! ఒక్కనిముషం ఆగు! నా సామాను తెచ్చుకోనీ."

"సరే. పద్రా త్వరగా రా ఇక్కడే నిలుచుంటాను. నీవు వెళ్ళిపోతున్నట్టు రెండుముక్కలు చీటీ వ్రాసి అక్కడ పెట్టి మరీ రా."

చీటీ వ్రాయనా?"

"వ్రాయి. ఇలా వ్రాయి: 'కామ్రేడ్స్! గుడ్ బై నన్ను జ్ఞాపకం పెట్టుకోండి!"

"అలాగే—అలాగే వ్రాస్తాను" అన్నది వాండా.

ఇలా అని వాండా లోపలికి పరుగెత్తింది. ఒరోబ్యోవ్ పూలమొక్కలమధ్య నిలుచుని ఉన్నాడు. అతని కళ్ళముందు ఇప్పుడు మూడు విషయాలు కనుపిస్తున్నాయి. ఒకటి—తను వాండాకోసం నిరీక్షిస్తున్నాడు; రెండు—తనకోసం లారీ నిరీక్షిస్తున్నది—ఇహ మూడోది—ఈ మధ్యలో మాత్రం జిరియాన్‌స్కీ ఇక్కడికి రాడుకదా? వాడికోసం ఎవరూ నిరీక్షించకపోయినా, వాడుమాత్రం సరిగ్గా సమయానికి శకునిపక్షిలా ప్రత్యక్ష మవుతుంటాడు!

ఇదే తరుణంలో వరండాకు మరోకప్రక్క ఇంజనీరు కొమొరోవ్, ఎవరికోసమో నిరీక్షిస్తున్నాడు. జిరియాన్‌స్కీ అతన్ని 'ఎందు కిక్కడున్నావు?" అని అడిగాడు.

"ఊరికనే." అంటూ కొమొరోవ్ మెల్లగా అక్కడనుంచి తప్పుకున్నాడు.

ఒరోబ్యోవ్ అతనికి ంఅగుపిచాడు కాని అత నావిషయం పట్టించుకోలేదు. ఇంతలో వాండా బయటి కొచ్చింది ఒరోబ్యోవ్ చెంతకు వెళ్ళింది. ఇరువురూ ఉడాయించడానికి సిద్ధపడ్డారు. సరిగ్గా

అ దేసమయానికి జిరియాన్‌స్కీ అక్కడికి రావడం వాళ్ళనుచూడడం జరిగింది.

కొమొరోవ్ రెండడుగులు ముందుకు వేశాడు. జిరియాన్‌స్కీ అతన్ని అనుసరించాడు.

"ఓహో! ప్రేయసీ ప్రియులు ప్రయాణమైనట్టున్నారే!" అన్నాడు జిరియాన్‌స్కీ.

"మీరనేదేమిటో అర్థం కావడంలేదు." అన్నాడు కొమొరోవ్.

"ప్రేమికులయ్యా, ప్రేమికులు! అర్థం కాకపోవడానికేముందీ!" అన్నాడు జిరియాన్‌స్కీ.

తనగుట్టు బయట పడిందేమోనని కొమొరోవ్‌కు గుండె దడదడ కొట్టుకుంది.

"ఇహ ప్రేమికులను విడిచిపెట్టకూడదు. పట్టుకోవాలి." అన్నాడు జిరియాన్‌స్కీ మళ్ళీ.

జిరియాన్‌స్కీ కొమొరోవ్‌ల సంభాషణ ఏవిధంగా ముగుస్తుందో చెప్పలేంకాని, ఇంతలో వగండాలోకి వాసిల్యేవ్నా వచ్చింది. ఆమెకూడా వాండాలాగే తెల్లటి గౌను వేసుకుంది. చక్కని రిబ్బన్ తలకు చుట్టుకుంది. చూడ ముచ్చట గొలుపుతున్నది.

"జిరియాన్‌స్కీ ప్రేమికు లందరినీ నిర్బంధించేలా ఉన్నాడు కొమొరోవ్! నీవు ఎవరినైనా పిల్లను ప్రేమిస్తే అతనికిమాత్రం తెలియనీయకు——కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు!" అన్నది వాసిల్యేవ్నా, జిరియాన్‌స్కీకి వినిపించేటట్టు.

"ఏం భయం లేదులే——ప్రేమించుకోండి!" అంటూ జిరియాన్‌స్కీ నవ్వి భోజనశాలలోకి వెళ్ళిపోయాడు.

"నేవచ్చి చాలాసేపయింది. నీకోసం కనిపెట్టుకుని ఉన్నాను" అన్నాడు కొమొరోవ్.

వాసిల్యేవ్నా బెంచీమీద కూచుంది. అతనివైపు తదేకంగా చూచింది.

"నాకోసం కనిపెట్టుకుని ఉన్నావా? ఎందుకూ? ఏంపని? ఇనుము, పనిముట్లు ఎలా ఉన్నాయని అడగడానికా!" అన్నది.

"ఆవేవీకాదు... నన్ను క్షమించు..." అని ఏదో చెప్ప బోయాడు కొమొరోవ్.

"మిషను బాగా అమర్చానా లేదా అని అడగడానికా?"

"నీవెప్పుడూ ఇలాగే పరాచకాలాడుతుంటావు!"

"అవును. నీవంటి యువకులతో పరాచకాలాడడానికి నాకు అనుమతి లభించింది."

"ఎవరిచ్చారు అనుమతి?"

"వీ — ఇచ్చాడు!"

"వీ — యా? ఎవరతను?"

"గొగోల్ ఒక కథలో పారిశ్రామిక జీవితాన్ని గురించి చెప్పాడులే — వీ — ని తీసుకరండన్నాడు. 'వీ' — అంటే గొప్ప సాంకేతిక నిపుణుడన్నమాట! అలాంటి వీ — ఇక్కడ మనకు కూడా ఒకడు ఉన్నాడు!"

"ఓహో! ఒర్లునోవ్ అన్నమాట!"

"ఆ, అతనే. యువక ఇంజనీర్లతో రకరకాలుగా హాస్యా లాడవచ్చునని నాకు అనుమతిచ్చాడు!"

"అనుమతించాడా? వట్టిది"

"ఎందుకా సంశయం? ఇంజనీర్లు అతి తేలికయిన వస్తువుల వంటి వాళ్ళు — గాజు వస్తువుల్లా" ఇట్టే పగిలిపోతారు! పాలు, వెన్నలా చెడిపోతారు! అన్నది వాసిల్యెవ్నా.

వారిరువురూ ఇలా ముచ్చటిస్తుండగా అక్కడ కాపలా డ్యూటీలో ఉన్న నోవక్ అంతా వింటున్నాడు. ఆ పిల్ల ఒర్లు నోవ్‌ని 'వీ' — తో పోల్చడం అతనికెంతో సరదాపుట్టించింది. గొగోల్ కథ అతనికి జ్ఞాపకంవచ్చింది. అవును. ఆ కథలో 'వీ' లాంటివాడే ఒర్లునోవ్ కూడా.

వరండాలో మరోవైపు మనిషి అలికిడి అయింది. చేత్తో సామాను పట్టుకుని వచ్చింది వాండా. వాసిల్యావ్నా కనుపించగానే ఇలా అన్నది.

"వాసిల్యావ్నా ! నాకో చిన్న ఉపకారం చేసిపెట్టు. ఈ చీటీముక్క కాస్త టార్స్కీకి అందచేద్దూ."

"ఎక్కడికీ ఆ సామాను ?" అని అడిగింది వాసిల్యావ్నా.

"నేను వెళ్ళిపోతున్నాను." అని చెప్పింది వాండా.

"ఎక్కడికి ?"

"ఎక్కడికో చెప్పడానికి సిగ్గేస్తోంది !......

"ఒరోబ్యోవ్‌తో వెళ్ళిపోతున్నాను." ఇలా అని వాండా, వాసిల్యావ్నాను ముద్దాడింది. వెంటనే వరండాలోనుంచి దూసుకపోయింది.

వాండా ఒరోబ్యోవ్ ఇరువురూ కాలనీ వదలి వెళ్ళిపోతున్నట్లు కాపలా భటుడు నోవక్‌కు ఇప్పటికిగాని తెలిసింది కాదు. వెంటనే భోజనశాలలోకి పరుగెత్తాడు.

"జిరియాన్‌స్కీ ! జిరియాన్‌స్కీ ! వాండా వెళ్ళిపోతున్నది!" అని కేకలు పెట్టాడు.

అదివిని జిరియాన్‌స్కీ లోపలనుంచి పరుగెత్తుక వచ్చాడు. అతనువచ్చి చూచేసరికే ఒరోబ్యోవ్ లారీ కాలనీదాటి వెళ్ళిపోయింది.

"ఓహో ! అదా విషయం ! పిట్ట ఎగిరిపోయిందా ? సామాను కూడా పట్టుకపోయిందా ?" అని అడిగాడు జిరియాన్‌స్కీ.

"ఆ, సామానుతోటే వెళ్ళింది...ఇదిగో ! టార్స్కీకి ఇమ్మని ఒక చీటీకూడా ఇచ్చింది." అంటూ నోవక్ చీటీ అందించాడు.

"చీటీయా ! ఇదంతా ఒక నవలలో కథలా ఉందే ! అంతా పెటీబూర్జువాల మనస్తత్వం ! చూడు! ఈ చీటీలో ఏం వ్రాసిందో

చదువుతాను." అంటూ జిరిదూన్‌స్కీ ఆ చీటీ చదివాడు. అందులో ఇలాఉంది :

"టార్‌స్కీ! నేను ఒరోబ్యోవ్‌ను ప్రేమించాను. అతనితో నేను వెళ్ళిపోతున్నాను. మేమిరువురం పెళ్ళాడుతాం. కాలనీ సభ్యులందరికీ నా కృతజ్ఞత మళ్ళీ మనం కలుసుకుంటామని నమ్ముతున్నాను.

ఇట్లు,
వాండా"

# 33
# కమాండర్‌గా రైజికోవ్

ఆగస్టునెల వచ్చింది. ఈ ఆగస్టుకూడా గడిచిన ఆగస్టులాగే ఉంది. రాత్రిళ్ళు విపరీతంగా చలివేస్తోంది. అయినా కాలనీలో అందరూ బయట పడుకుంటున్నారు. నిరుటిలాగా ఈఏడుకూడా ఈ నెల హాయిగా, ఆనందంగా గడిచిపోతున్నది. కాని ఒకటవ దళంమాత్రం నిరుత్సాహంగా ఉంది.

ఒకటవదళం కమాండర్ ఒలెంకో వెళ్ళిపోవడంతో ఆ స్థానానికి ఖాళీ ఏర్పడింది. రైజికోవ్‌ను కొత్త కమాండర్‌గా ఎన్నుకోవాలని ఆదళ సభ్యులంతా నిర్ణయించుకున్నారు.

సర్వసభ్య సాధారణ సమావేశం జరిగింది. రైజికోవ్ అభ్యర్థిత్వానికి నా అభ్యంతరమేమీ లేదన్నాడు జకరోవ్. ఒక కమాండర్‌గా రైజికోవ్ ఇప్పటికంటె ఎక్కువ పేరు ప్రఖ్యాతుల్లోకి వస్తాడని చెప్పాడు.

"ఒకటవ దళం క్లిష్ట పరిస్థితుల్లో చిక్కుకున్నదని మాఅందరికీ తెలుసును. దళంలో అయిదుగురు కొమ్సొమోల్ సభ్యులు

నేడో, రేపో వాళ్ళు పై చదువు చదువుకునేందుకు కాలేజీకి వెళ్ళి పోతారు. అందుచేత ఆ అయిదుగురి స్థానాల్లోనూ కొత్త కుర్రవాళ్ళు వస్తారు. కొత్తవాళ్ళకు తర్ఫీదు ఇవ్వడమంటే మాటలతో పనికాదు. ఇందుకు 'కమాండర్‌గా ఉండడానికి రైజికోవ్ మాత్రమే సమర్థుడు. అతని శిక్షణలో స్థాయి పెరుగుతుంది. అతను బుద్ధిమంతుడు శక్తిమంతుడు. మంచి పనివాడు. పొడ్వోస్కో‌ను, లెవిటిన్‌ను దొంగతనం చేస్తుంటే ఎలా పట్టుకున్నాడో తలుచుకుంటే మనందరికీ ఆశ్చర్యం వేస్తుంది!'' అన్నాడు మార్కు గ్రీన్‌హాస్.

"నేనేం దొంగతనం చెయ్యలేదు — నేను దొంగను కాను.'' అని అరిచాడు లెవిటిన్.

గ్రిన్‌హాస్ తన ప్రసంగాన్ని మళ్ళీ ఇలా ప్రారంభించాడు: "కాలనీలో రైజికోవ్‌కు చాలామంది వ్యతిరేకులున్నారు. అతను పూర్వం గడిపిన జీవితం మంచిదికాదు. అతని శత్రువులు అతని గత జీవితాన్ని ఇంకా జ్ఞాపకంపెట్టుకునే ఉన్నారు. మనలో చాలామందిమి రైజికోవ్ లాంటి వాళ్ళమే! గత జీవితంలో ఏదో ఒక చెడుపని చేయడంవల్ల — దాన్ని సరిదిద్దుకునేందుకు ఇక్కడికి వచ్చాం. అలాంటి మనవాళ్ళలో చాలామంది కొమ్సొమోల్ సభ్యులయ్యారు. విద్యార్థులుగా అభివృద్ధిలోకి వస్తున్నారు. పై చదువులకు వెళ్ళనున్నారు. అయితే ఇప్పుడు రైజికోవ్‌ను కమాండర్‌గా ఎన్నుకోవచ్చునా లేదా అన్నది ఒక ప్రశ్న. ఇది అతని కొక్కడికే సంబంధించినదికాదు. అందరికీ సంబంధించిన ప్రశ్న! కొముసొమోల్ సభ్యులు స్వేచ్ఛగా ఓటు చెయ్యాలి. అధిక సంఖ్యాకుల నిర్ణయమే అంతిమనిర్ణయం.''

కారణం ఏమిటో తెలీదు కాని, నాలుగోదళ సభ్యులకు రైజికోవ్ అంటే ఇష్టంలేదు. అతను కమాండర్‌గా ఉండడానికి అనర్హుడని వాళ్ళ భావం. వాళ్ళ కమాండర్ జిరియాన్‌స్కీ లేచి నిలుచుని ఇలా అన్నాడు.

"ఈ విషయం మీద మా దళం తరఫున బిగోనక్ మాట్లాడతాడు.''

కమాండర్ జిరియాన్‌స్కీ కాక దళం తరఫున బిగోనక్ ఎందుకు మాట్లాడుతున్నాడో కాలనీ సభ్యులకు అర్థమైంది. ఇదివరకు ఈ విషయాన్ని గురించి బిగోనక్ ఏదో మాట్లాడబోయాడని అందరికీ తెలుసు. కాని ఆవేళ అతన్ని మాట్లాడనివ్వలేదు. క్రమశిక్షణను పాటించడంకోసం ఆవేళ బిగోనక్ మాట్లాడకుండా సమావేశంలో కూచుండిపోయాడు. అతనికి ఆ అసంతృప్తి మనస్సులో ఉండిపోయింది. దాన్ని తొలగించడమే ఇప్పుడు జిరియాన్‌స్కీ ఉద్దేశం. అందుకే ఇప్పుడు అతనికి మాట్లాడే అవకాశం కల్పించాడు. అదీకాక బిగోనక్ అభిప్రాయంతో తానుకూడా ఏకీభవిస్తున్నట్లు సూచింపచేశాడు.

బిగోనక్ లేచి నిలుచున్నాడు. నాలుగోదళ సభ్యులు మొండి ఘటాలు. ఆ విషయం కాలనీ కుర్రవాళ్ళందరికీ తెలుసును. ఆ పూట బిగోనక్ చాలా జాగ్రత్తగా మాట్లాడాడు.

"కాలనీ సభ్యుడైన రైజికోవ్‌పట్ల నాలుగోదళ సభ్యులకు ఎలాంటి వ్యతిరేక భావమూలేదు. కాని కమాండర్‌గా ఉండడానికి రైజికోవ్‌కంటె సమర్థుడైన వ్యక్తి మరొకడున్నాడని మా ఉద్దేశం. అందుకని రైజికోవ్‌కు వ్యతిరేకంగా మేం ఓటు వేస్తున్నాం" అన్నాడు బిగోనక్.

అతను ఇంత మెలకువగా మాట్లాడడం టార్‌స్కీకి ఆశ్చర్యం కలిగించింది.

"అంటే నీ ఉద్దేశం ఏమిటి? రైజికోవ్ కమాండర్ పదవికి అనర్హుడనే కదా?" అని ప్రశ్నించాడు సభాధ్యక్షుడు టార్‌స్కీ.

"అదికాదు మా అభిప్రాయం అదికాదు. రైజికోవ్ అందుకు అర్హుడే. కాని అంతకంటె అర్హుడైన వ్యక్తిని ఆ పదవికి నియమించాలి. అదీ మా ఉద్దేశం" అన్నాడు బిగోనక్.

"ఆవ్యక్తి ఎవరో మీరే సూచించకూడదూ?" అన్నాడు మళ్ళీ టార్‌స్కీ.

"అలాంటి వ్యక్తులు కాలనీలో చాలామంది ఉన్నారు. వారిలో ఎవరినో ఒకరిని కమాండర్‌గా నియమించ వచ్చును." అన్నాడు బిగోనక్.

"ఎవరినో ఒకరిని ఎన్నుకోవచ్చునే తప్ప, రైజికోవ్‌ను మాత్రం కాదన్నమాట ?"

"అవును కాలనీలో మరెవరికైనా మేం ఓటుచేస్తాం. రైజికోవ్‌కుమాత్రం ఒటివ్వం."

"ఓహో ! అదా విషయం! రైజికోవ్ పనికిరాడన్నమాట!" అన్నాడు టార్‌స్కీ.

ఇందుకు బిగోనక్ మాట్లాడలేదు. ఔనన్నట్లు తల ఊపాడు.

"పోనీ ఆ పదవికి నీవు పనికివస్తావా ? వాన్యా గల్చెంకో పనికివస్తాడా ?" అని మళ్లీ అడిగాడు టార్‌స్కీ.

"నేను మా విషయం చెప్పడంలేదు. కాని మేము రైజికోవ్ కంటే నయమే." అన్నాడు బిగోనక్, ధీమాగా.

"సరే. రైజికోవ్ ఒకటవ దళానికి కమాండర్‌గా నిలుచుం టున్నాడు, అందుకు వ్యతిరేకు లెవరో చేతులెత్తండి.'' అన్నాడు టార్‌స్కీ.

స్టాలిన్ విగ్రహంచుట్టూ కూచున్న పద్నాలుగుమంది కుర్ర వాళ్ళు చేతులెత్తారు. వాళ్ళుకాక మరో పదముగ్గురు కూడా వ్యతి రేకంగా చేతులెత్తారు. వాళ్ళలో ఇగోర్ చెర్నియావిన్, ఒక్సానా, షూరామిట్నికోవా, రస్లాన్ గొరొఖోవ్, లెవిటిన్, ఇల్యారొడ్నేవ్; మొదలయినవారంతా ఉన్నారు.

ఎత్తిన చేతులన్నీ లెక్కించి టార్‌స్కీ ఇలా అన్నాడు:

"మొత్తం వ్యతిరేకులు ఇరవైఏడుమంది! ఇగోర్, రొడ్నేవ్‌లుకూడా వ్యతిరేకంగానే ఓటు చేశారే! వాళ్ళ దళసభ్యులు మాత్రం అనుకూలంగా ఓటుచేశారు... ఏమయ్యా, అంతేకదూ?"

ఇందుకు ఇగోర్ సమాధానం చెప్పలేదు. రొడ్నేవ్ లేచి "అవును బిగోనక్ ఉపన్యాసంతో నేను ఈ నిర్ణయానికి వచ్చాను" అన్నాడు.

సమావేశంలో రైజికోవ్‌కు అనుకూలంగా అత్యధిక సంఖ్యా కులు ఓటు చేశారు. అనుకూలంగా ఓటు చేసినవాళ్ళు ఇరవై ఏడుగురే. అయితేనేం? కాలనీలో ఇదివరకు కమాండర్లందరూ ఏకగ్రీవంగా ఎన్నుకోబడుతూ వచ్చారు. ఇప్పుడు రైజికోవ్‌కు మాత్రం ఆ అదృష్టం పట్టలేదు.

రైజికోవ్ ఒకటవదళానికి కమాండర్‌గా ఎన్నుకోబడగానే లాంఛనప్రాయంగా పదవీస్వీకారం కావించాడు. ఒకటవ దళం తాత్కాలిక కమాండర్ సెడొవొనిచ్ పతాకం పట్టుకుని జకరోవ్ దగ్గరికి వచ్చాడు. అతను అధికారాన్ని రైజికోవ్‌కు అప్పగిస్తూ ఉంటే, రైజికోవ్‌కు శాల్యూట్ చెయ్యటానికి కుర్రవాళ్ళు కొంచెం జంకారు.

"రైజికోవ్‌కు శాల్యూట్ చేయడమంటే తమాషాగానే ఉంటుంది!" అంటూ జిరియాన్‌స్కీ చెవిలో గొణిగాడు, ఫిల్కాషెకీ.

"మనం అభివాదం చేస్తున్నది అతనికి కాదోయ్, సాధారణ సభ్యుల సమావేశానికి, మన అరుణపతాకానికీ." అని మెల్లగా సమాధానం చెప్పాడు జిరియాన్‌స్కీ.

రైజికోవ్ కమాండర్ అయ్యాడు. ఒక వారం గడిచింది. ఆవేళ కాలనీ అంతా అతనే కమాండర్. వాన్యా గల్చెంకో కాపలా డ్యూటీలో ఉన్నాడు. కాలనీ కమాండర్ హోదాలో రైజికోవ్ తన ప్రక్కనుంచే వెళ్ళిపోతుంటే, కాపలా డ్యూటీలో ఉన్న వాన్యా బందోబస్తులో నిలుచుని అభివాదం చెయ్యక తప్పిందికాదు!

# 34

# జీవించడం నేర్చుకున్నాను

వాండా ప్రేమవ్యవహారం అనుకున్నదానికంటె హాయిగా ముగిసింది. అయితే చడీచప్పుడు లేకుండా ఆమె కాలనీలోనుంచి పరారీ అయిపోవడం అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేసింది. కాని ఆపిల్ల టార్‌స్కీకి వ్రాసిన చీటీ కొందరిని సంతృప్తి పరిచింది. వాళ్ళు ఇలా చెప్పుకోసాగారు :

"ఇందులో విచిత్ర మేముంది ? దీనికింత రాద్ధాంత మెందుకూ? వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు, పెళ్ళిచేసుకున్నారు."

కాలనీలో ఎక్కువమంది పిల్లలు ఇలాగే అనుకోసాగారు. కాని వాళ్ళధోరణి జిరియాన్‌స్కీకి నచ్చలేదు, నచ్చకపోవడమే కాదు, కోపంకూడా వచ్చింది.

"ఆహా ! ఇందులో ఏముందా ! ఇహనేం ? – మనమంతా ప్రేమలోపడి కొట్టుకపోదాం – పెళ్ళిళ్ళు చేసుకుని పిల్లలను కందాం !" అన్నాడు.

"పెళ్లి చేసుకుందామంటే సరికాదు. మనల్ని ఏపిల్లఅయినా ప్రేమించాలి."

"అందులో కష్టమేముందయ్యా ! ఇహ మూడు మాసాల కల్లా మన కాలనీలో ఆడపిల్లలు, మగపిల్లలు పూర్తిగా ప్రేమలో పడిపోతారు !"

"ఈపాటిదానికి ఎందుకయ్యా ఇంత అల్లరి ? ప్రేమించుకో గానే సరా ? పెళ్లి చేసుకునేందుకు ఎంతధైర్యం కావాలి ! నీవు ప్రేమించినా లాభంలేదు. ఎక్కడికీ ఉడాయించడానికి వల్లకాదు. ఎందుకంటే నీకు లారీ లేదుగా !" అన్నాడు పొఖోర్షుయ్.

బ్లమ్‌కూడా జిరియాన్‌స్కీ అభిప్రాయాలతో ఏకీభవించలేదు.

"జీవితమంటే ఏమిటో నీకు తెలీదు కామ్రేడ్ జిరియాన్‌స్కీ. రేషన్‌కార్డు చూపించగానే రొట్టె, అదీ దొరికినట్లు ప్రేమ దొరుకుతుందనుకున్నావా ఏమిటి? ప్రేమించడమంటే అంత తేలిక కాదయ్యా! ఒక్క పిల్లను ప్రేమించిన తరువాత ఎన్ని కష్టసుఖాలు ఆలోచించుకోవాలి, ఏంకథ! ఉండడానికి ఇల్లు చూచుకోవాలి. ఆ ప్రియురాలిని పోషించడానికీ తిండీ బట్టా చూచుకోవాలి.అందుచేత నెలనెల పనిచేసి డబ్బు సంపాయించుకురావాలి." అన్నాడు బ్లమ్.

"నీ వాలకం చూస్తే నీవుకూడా కాలనీలోనుంచి ఓ అమ్మాయిని లేవనెత్తుక పొయ్యేటట్టున్నావే!" కామ్రేడ్ అన్నాడు.

"నా కెందుకయ్యా మళ్ళీ పెళ్ళి జిరియాన్‌స్కీ. ఇప్పుడున్న పెళ్ళాం పిల్లలు చాలకనా? ఇప్పుడు నాకు నలుగురు కూతుళ్లు, వాళ్ళకు పెళ్లిళ్ళు చేసేసరికి నాతాడు తెగుతుంది!" అన్నాడు బ్లమ్!

కొన్నాళ్ళు గడిచింది. ఒకరోజున అకస్మాత్తుగా వాండా కాలనీకి వచ్చింది. ఆవేళ కాలనీకి సెలవు. దురదృష్టవశాత్తూ జిరియాన్‌స్కీ ఆవేళ కమాండర్ డ్యూటీలో ఉన్నాడు. కాలనీ పిల్లలంతా భోజనాలు చేశారు. కొందరు గదుల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు. కొందరు పార్కులో కూచుని కబుర్లాడుకుంటున్నారు. ఇంకా కొందరు భవనం పై అంతస్థులో కూచున్నారు.

వాండా నెమ్మదిగా వరండా దగ్గరికి వచ్చింది. అక్కడ వాస్యాక్లుష్నేవ్ కాపలా డ్యూటీలో ఉన్నాడు. అతన్ని చూడగానే "ఏం వాస్యా? కులాసాగా ఉన్నావా?" అనీ వాండా పలుకరించింది. ఓహో నీవా వాండా! ఎప్పుడొచ్చావు?" అని ఆదుర్దాగా అడిగాడు వాస్యా.

"ఇప్పుడే – పిల్లలను చూచిపోదామని వచ్చాను. నేనువచ్చానని ఒకమాటు వాళ్ళకు కబురు అందిద్దూ."

"వేరేకబురెందుకూ? వచ్చావుగా నీవే, వెళ్ళు వెళ్ళిపిల్లలను చూచిరా. ఆడపిల్లలంతా పడకగదుల్లో ఉన్నారు." అన్నాడు వాస్యా.

ఇవాళ కమాండర్ ఎవరు?''

"జిరియాన్‌స్కీ."

వాండాముఖంలో నెత్తురుచుక్క లేదు.

"చచ్చాంరా దేవుడా!" అనుకుంటూ బెంచీమీద కూలబడిపోయింది. "ఇవాళ ఎంత దురదృష్టం!" అన్నది.

"ఏం భయంలేదు. తిన్నగా లోనికి వెళ్ళు అతను నిన్నేం చేస్తాడు!" అన్నాడు వాస్యా.

సరిగ్గా అదేవేళకు జిరియాన్‌స్కీ భోజనశాలలోనుంచి ఇవతలికొచ్చాడు. అతనివెంట బిగోనక్ కూడా ఉన్నాడు:

"ఓహో! నీవా! ఇలా దయచేశారేం? ఏమిటిపని?"అన్నాడు జిరియాన్‌స్కీ. వాండాను చూసీచూడడంతోనే.

"ఇక్కడికి రాక తప్పిందికాదు" అన్నది వాండా.

"తప్పలేదూ? మంచిపనయింది! కాలనీనుంచి అలా చెప్పకుండా పారిపోతావా?"

ఇంతలో భోజనశాలలోనుంచి ఇరువురు అమ్మాయిలు ఇవతలికొచ్చారు. వాండాను చూడగానే కిలకిల నవ్వారు. సంతోషంతో కేకలు పెట్టారు. ఈ సందడి విని పడకగదుల్లో ఉన్న ఆడపిల్లలు కూడా కొందరు ఇవతలికి పరుగెత్తుకుని వచ్చారు. వారిలో ఒక్సానా ఒకతె.

వాండాను చూడగానే ఒక్సానఎగిరివచ్చి ఆమెను కౌగిలించుకుంది. "వాండా! నా ప్రియమైన వాండా!" అంటూ ఆమెను ముద్దాడింది.

ఇదంతచూచి జిరియాన్‌స్కీ అక్కడనుంచి అవతలికి పోయాడు:

"మిమ్ములనందర్నీ నిర్బంధంలో ఉంచుతాను! ఆ పిల్ల కాలనీనుంచి పారిపోయింది. పారిపోయిన పిల్లతో మీకేంపని? ఏమిటా కిలకిలలు, పకపకలు! ఇహ ఆపండి" అంటూ అరిచాడు.

"లేదు. వాండా పారిపోలేదు" అన్నది ఒక్సానా జిరియాన్‌స్కీ వంక ఆశ్చర్యంగా చూస్తూ.

"ఏమిటన్నావు?" అంటూ ఉరిమి చూచాడు జిరియాన్‌స్కీ.

"ఆపిల్ల పారిపోలేదన్నాను. ఆమె పెళ్ళి చేసుకునేందుకు వెళ్ళింది" అన్నది మళ్ళీ ఒక్సానా.

ఇంతసేపు అలాగే నిశ్చేష్టుడై నిలుచుండిపోయాడు బిగోనక్. చివరకు వాండా రెండుచేతులూ పట్టుకున్నాడు:

"వాండా ప్రియమైన వాండా! ఎంతమంచిపని చేశావు! పెళ్ళి చేసుకున్నావా?" అన్నాడు.

"వదిలిపెట్టు ఆ పిల్లచేతులు వదిలిపెట్టు!" అని అరిచారు ఆడపిల్లలు.

జిరియాన్‌స్కీ ఇహ ఊరుకోలేకపోయాడు. తాను ఆ పూట కమాండర్‌ను అనేమాట జ్ఞాపకం తెచ్చుకున్నాడు:

"ఏయ్ పిల్లలూ! ఇది కాలనీ - అంతా నిశ్శబ్దంగా ఉండండి" అని ఆజ్ఞాపించాడు.

వెంటనే ఆడపిల్లలంతా నిశబ్దం వహించారు.

"అ పిల్ల ఇక్కడ ఒక్కక్షణం ఉండడానికి వీల్లేదు. లోపల అడుగుపెట్టడానికి వీల్లేదు. అమె కాలనీనుంచి పారిపోయింది. ఆనాటితో ఆమెకీ కాలనీకి రుణంతీరింది! ఎందుకలా అమె ఉడాయించాలి? ప్రేమలోపడి కదూ?" అన్నాడు జిరియాన్‌స్కీ.

"నేను కాలనీనుంచి పారిపోయానా? నేనేం గుడిసేటిదాననుకున్నావా? కాలనీకి నాకూ రుణంతీరిందా? ఎందుకని కాలనీలో నేనే ఏడాదిపాటున్నాను." అన్నది వాండా.

"ఒక ఏడాది ఉండబట్టేనే అలా చెప్పకుండా ఉడాయించావు? ఇహ ఇప్పుడు నీకు కాలనీతో పనేమిటి? నీదారి నీది, మాదారిమాది. నీకొక ప్రియుడు-డాన్‌క్విగ్జోట్ దొరికాడు కదూ?"

"ఎవరా క్విగ్జోట్?"

"ఇంకెవరు? లారీ డ్రైవర్!"

"మర్యాదగా మాట్లాడు. మే మిరువురం పెళ్ళాడాం. ఆయన నా భర్త. ఇరువురం రిజస్ట్రాఫీసుకు వెళ్ళి చక్కగా పెళ్ళి చేసుకున్నాం."

"అక్కడికి వెళ్ళడానికి నీకు ముఖంచెల్లిందికాని కమాండర్ల కౌన్సిలు దగ్గరికి రావడానికి నీకు ముఖం చెల్లలేదూ? పారిపోయావు, పారిపోయిన నెల్లాల్లకు తుళ్ళీ వచ్చావు?... కామ్రేడ్ క్లష్ణేవ్! ఈ పిల్లను పైకి రానీయకు"

"అలాగే కామ్రేడ్ కమాండర్, అలాగే!" అన్నాడు కాపలా కాస్తున్న క్లష్ణేవ్.

కోపంతో గిరుక్కున తిరిగి జిరియాన్‌స్కీ భోజనశాలలోకి వెళ్ళాడు. బిగోనక్ ఆదుర్దాగా జకరోవ్ ఆఫీసుకు పరుగెత్తాడు.

"జిరియాన్‌స్కీ మహా క్రూరుడు! ఇప్పుడు మనం ఏంచేద్దాం? ఏం వాస్యా వాండాను మేడమీదికి వెళ్ళనివ్వవా?" అని అడిగింది ఒక్సానా.

"నీ ప్రశ్నకు నేనేం సమాధానం చెప్పను? కమాండర్ అంటే కమాండరే! అతని ఆజ్ఞ నీవూ పాటించాలి, నేనూ పాటించాలి. అవునా" అన్నాడు క్లష్ణేవ్.

ఓ అయిదు నిముషాలపాటు గడిచింది. ఆఫీసులోనుంచి జకరోవ్ ఇవతలికొచ్చాడు. అతన్ని చూడగానే ఆడపిల్లలు ఎదురు వెళ్ళారు:

"అలెక్సీ స్టెపానొవిచ్! వాండా వచ్చింది. పిల్లలందరినీ కలుసుకోవాలంటున్నది. కాని జిరియాన్‌స్కీ ఆమెను లోపలికి రావద్దన్నాడు." అని ఆడపిల్లలు జకరోవ్‌తో చెప్పారు.

వాండాను చూడగానే జకరోవ్ ఆమె చెయ్యి అందుకుని ముద్దాడాడు. తల నిమిరాడు. ఇంతలో జిరియాన్‌స్కీ అక్కడికి వచ్చాడు.

"ఏమిటి దంతా? ఎందుకీ అల్లరి? మనలను చూడడానికి కాలనీకి ఒక అతిథి వచ్చింది. అతిథికి స్వాగతమిచ్చే పద్ధతి ఇదేనా నీ ప్రవర్తన ఏమీ బాగాలేదు. నీకు సిగ్గు వెయ్యడంలేదూ?" అన్నాడు జకరోవ్.

"కాలనీనుంచి పారిపోయినవాళ్ళు, మళ్ళీ కాలనీకి వస్తే వాళ్ళను లోనికి రానివ్వవలసిన పనిలేదు. ఇది మన సంప్రదాయం" అని జవాబిచ్చాడు జిరియాన్‌స్కీ.

"ఆమె పారిపోయిందా? నీవు మాట్లాడే మాటలకేమైనా అర్థముందా? ఆమెను వెళ్ళనీ, లోపలికి వెళ్ళనీ."

"మంచిది. అలాగేచేస్తాను కామ్రేడ్ డైరెక్టర్!" అంటూ వెర్రిముఖం పెట్టాడు జిరియాన్‌స్కీ.

తరువాత కాపలా కాస్తున్న క్లుష్ణేవ్‌ను పిలిచి డైరెక్టర్ ఆదేశానుసారం ఆమెను లోపలికి పోనీ." అని చెప్పాడు.

అతని మాటల ధోరణికి జకరోవ్ నవ్వుకున్నాడు. తల పంకించాడు. వాండా భుజాలమీద చేతులువేసి తన ఆఫీసుకు రమ్మని ఆహ్వానించాడు. ఇరువురూ ఆఫీసుకు వెళ్ళారు. అక్కడ చాలాసేపు కూచుని కులాసాగా మాట్లాడుకున్నారు.

తరువాత ఏం జరిగిందో, ఆ కబుర్లన్నీ బిగోనక్ నాలుగో దళ సభ్యులకు ఇలా చెప్పసాగాడు:

"జకరోవ్ ఆఫీసులో వాండా కూచున్నది. ఆమె చుట్టూ చాలామంది ఆడపిల్లలున్నారు. అందరూ కులాసాగా, మామూలు ధోరణిలో కబుర్లు చెప్పుకుంటున్నారు. జకరోవ్ వాళ్ళను పల్లెత్తు మాటఅనలేదు. వాండా చేసినపనికి ఆమెను మందలించలేదుకూడా. ఏవేవో అడిగి తెలుసుకున్నాడు: 'ఇప్పుడు మీరు ఉంటున్నఇల్లు బాగున్నదా? ఒరోబ్యోవ్ నిన్ను బాగా చూస్తున్నాడా? మీ అత్త నిన్ను ఆదరంగా చూస్తున్నదా?' ఇవన్నీ అడిగాడు. అతను అడిగిన వాటన్నిటికీ వాండా జవాబు చెప్పింది. తన భర్త ఒరోబ్యోవ్ చాలా మంచివాడట! తనను ప్రాణప్రదంగా చూచుకుంటాట్ట. ఇహ వాళ్ళ అత్తగారు మరీ మంచిదట. తన జీవితం మూడు పూవులు, ఆరు కాయలుగా ఉన్నదట! ఇలా చెపుతూనే వాండా ఉన్నట్టుండి ఒక్కమాటు భోరున ఏడ్చింది. తనకు అన్నివిధాలా బాగానే ఉన్నదట! మరి అలా ఎందుకేడ్చిందో! ఆశ్చర్యం! ఆమె ఏడుపు చూచి తక్కిన ఆడపిల్లలు కూడా గొల్లుమన్నారు......"

"తరువాత ఏం జరిగింది?"

"తరువాత జకరోవ్ నన్ను అవతలికి వెళ్ళిపొమ్మన్నాడు. నేను ఇవతలికి వచ్చేశాను."

"అతను నిన్ను ఎందుకు వెళ్ళిపొమ్మన్నాడు?"

"నన్నా?...ఏంచెప్పను? నేను ఊరికె అలా చూస్తూ నిలుచున్నాను..."

"ఇంతకూ ఆపిల్ల ఎందుకు ఏడ్చిందంటావ్?"

"ఏమోమరి, నేను మీ అందరికి రుణపడి ఉన్నానని వాండా జకరోవ్‌తో అన్నది. ఇలా అంటూనే గదిమధ్యకు వచ్చి 'జీవించడం ఎలాగో నేను నేర్చుకున్నాను.' జీవితమంటే ఏమిటో మీరు నాకు నేర్పారు! అందుకు మీ అందరికీ నేనెంతో కృతజ్ఞురాలిని" అన్నది.

"అవును బాగానేఉంది. ఆమె చెప్పింది నిజమే." అంటూ ఫిల్కా—షేరీ బిగోనక్ వంక చూచాడు: "ఇంతకూ నీవు చెప్పిన దాన్నిబట్టి ఆపిల్ల ఏడ్వడానికి కారణ మేమిటో నాకర్థం కావడం లేదు. జకరోవ్ ఆపిల్లను ఏదో అని ఉంటాడు. లేకపోతే ఊరికె ఎందుకు ఏడుస్తుందీ?" అన్నాడు మళ్ళీ.

"అబ్బెబ్బె! జకరోవ్ ఆమెను ఏమీ అనలేదు. నేను వింటున్నానుగా" అన్నాడు బిగోనక్.

ఆ సాయంకాలం కమాండర్ల కౌన్సిలు సమావేశం జరిగింది. ఒరోబ్యోవ్ కూడా సమావేశానికి హాజరయినాడు. నాలుగోదళ సభ్యులు సయితం వచ్చారు. ఒర్లనోవ్‌కూడా పాల్గొన్నాడు. టార్‌స్కీ, వాండాను మాట్లాడమని కోరాడు. ఆమెలేచి నిలుచున్నది. ఒకమాటు సభ్యులందరివంక చూచింది. ఆమెకంఠం గాద్గదికమయింది. మాటలు తడబడ్డాయి. కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి:

"ప్రియమైన కాలనీ సభ్యులారా! మీతో నేనొక ఏడాది గడిపాను. ఆఒక్క ఏడాదీ నేనెంతో ఆనందమయంగా, ప్రతిగంటా జీవించాను. ఆ రోజులు నాకెన్నటికీ మరుపురావు. నా జీవితంలో

ఈ కాలనీని, ఈ కాలనీ సభ్యులను మర్చిపోలేను. మీకూ సోవియట్ ప్రభుత్వానికీ నా కృతజ్ఞతాభివందనాలు. నేను ఒరోబ్యోవ్‌ను ప్రేమించాను. ఆ విషయం నేను మీతో చెప్పలేదు. చెప్పాలనుకున్నాను. కాని భయంవేసింది, సిగ్గు ముంచుకొచ్చింది. ఇలా చెప్పలేకపోయినందుకు నన్ను మన్నించండి. ఒరోబ్యోవ్‌కూడా మీలాంటివాడే. అతన్నికూడా మీరు క్షమించాలి. కాలనీనుంచి నేను వెళ్ళిపోతున్నాను. సక్రమమైన పద్ధతిలో జీవితాన్ని సరిదిద్దుకుంటాను. ఆదర్శప్రాయంగా జీవిస్తాను. మన కొత్త ఫ్యాక్టరీలో నాకు పని చెయ్యాలని ఉంది. మీరు అంగీకరిస్తారనుకుంటాను.'' అని చెప్పింది వాండా.

తరువాత ఒరోబ్యోవ్ ప్రసంగించాడు. మాట్లాడుతున్నంత సేపూ అతని దృష్టి జిరియాన్‌స్కీ మీదనే ఉంది.

''నేను ఉపన్యాసకుణ్ణికాను. బాగా మాట్లాడడం నాకు చేతకాదు. మాటల్లో ఏమీలేదు. మాట్లాడే మనిషిలోనే అంతా ఉంది. ఇక్కడ, కాలనీలో మీరు కొన్ని సూత్రాలను నియమించుకున్నారు. వాటిని తూ.చ తప్పకుండా పాటిస్తున్నారు. అందుచేతనే వాండా చెప్పకుండా నాతో వెళ్ళిపోవలసివచ్చింది'' అని చెప్పాడు ఒరోబ్యోవ్

''ఆ అమ్మాయంటే నీకు ఇష్టమేకదూ?'' అని అడిగాడు జిరియాన్‌స్కీ.

''అవును, ఇష్టమే ఆమెను నేను ప్రేమించాను. నాజీవితాంతం ఆమెను ప్రేమిస్తూనే ఉంటాను''

''ఎంతబాగా చెప్పాడు!'' అన్నది ఒకాస్సానా, లిడాటాలికోవ్నాతో రహస్యంగా.

లిడాటాలికోవ్నా చాలా బాగున్నదన్నట్లు తలఊపింది.

సమావేశంలో తను మాట్లాడతానని జిరియాన్‌స్కీ పట్టుబట్టాడు, సరే మాట్లాడమన్నారు అతన్ని. అతను ఇలా చెప్ప సాగాడు.

"వాండా ఒరోబ్యోవ్‌లు సక్రమంగా ప్రవర్తించలేదు. జీవితాంతంవరకూ వారిరువురూ ఒకరినొకరు మోసం చేసుకోపోవచ్చును. కాని అలా ఉంటారని మనకేమిటి నమ్మకం? అనేక మంది ప్రేమించుకున్నట్టే ప్రేమించుకుని మధ్యలో తెగిపోతారు. ప్రేమించుకున్న స్త్రీ పురుషులు పెళ్లి చేసుకుంటే అది నిజమైన ప్రేమ అవునో కాదో ముందే మనం తెలుసుకోవాలి. ఎవరిష్ట మొచ్చినట్లు వాళ్ళు ప్రవర్తిస్తే ఇహ ఇక్కడ మనం మన కాలనీ ఎందుకూ? కాలనీలో ఇన్ని నియమాలెందుకూ? వాండా తను ఒరోబ్యోవ్‌ను ప్రేమిస్తున్నట్లు ఎవరికీ చెప్పలేదు. కమాండర్ల కౌన్సిలుకు ఎరుకపరచకుండానే ఆమె తన ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించింది."

"కమాండర్ల కౌన్సిలుంటే తల్లిదండ్రులనుకున్నావయ్యా ఆమె చెప్పడానికి? ఒక్కొక్కప్పుడు యువతీయువకులు తమ తల్లదండ్రులకు కూడా తెలియకుండా పెళ్ళిళ్ళు చేసుకుంటూ ఉంటారు. ఇహ కౌన్సిలుమాట లెక్కఏమిటీ?" అన్నాడు ఒర్లనోవ్.

"ఏమైనసరే, కాలనీ క్రమశిక్షణకు భంగకరంగా వాళ్ళు ప్రవర్తించారు కనుక, వారిద్దర్నీ పదిగంటలపాటు నిర్బంధంలో ఉంచాలి. ఇదీ నా ప్రతిపాదన." అన్నాడు జెరియాన్‌స్కీ నిక్కచ్చిగా.

అతని ప్రతిపాదన విని అందరూ పక్కున నవ్వారు. అయినా అతను తన ప్రతిపాదన ఉపసంహరించుకోలేదు. కాని తీరా దాన్ని ఓటుకు పెట్టేసరికి అది వీగిపోయింది. ఇద్దరుమాత్రం అనుకూలంగా ఓటుచేశారు. వాండాకు కొత్త ఫ్యాక్టరీలో ఉద్యోగం ఇవ్వాలనీ, లాంఛనప్రాయంగా ముందు కొంత ధనం బహూకరించాలనీ కమాండర్ల కౌన్సిలు నిర్ణయించింది. ఆ నూతన దంపతుల జీవితం ఎలా ఉంటున్నదో అప్పుడప్పుడు కౌన్సిలు సభ్యులు వాళ్ళ ఇంటికివెళ్లి తెలుసుకుంటూ ఉండాలనీ అవసరమైనప్పుడు వాళ్ళకు సహాయపడాలనీ సమావేశంలో తీర్మానించారు. అంతటితో సమావేశం ముగిసింది.

ఆ సాయంకాలం వాండా నాలుగోదళ సభ్యులను చూడ్డానికి వెళ్ళింది. అప్పుడు జిరియాన్‌స్కీ అక్కడే ఉన్నాడు. ఆమె గదిలోకి రాగానే కుర్చీ చూపించి కూచోమన్నాడు.

"నామీద కోపం వచ్చిందా జిరియాన్‌స్కీ?" అని అడిగింది వాండా.

"నాకెందుకు కోపం! నీకే నామీద కోపం వచ్చిందేమో!"

"లేదు. ఎంతమాత్రం లేదు. ఇహనే వెళ్ళొస్తాను. మిమ్మల్ని వదిలి వెడుతున్నందుకు నాకెంతో విచారంగా ఉంది. నన్ను ఎప్పుడూ మరచిపోకండి. నన్ను ఇంతగా ఆదరించినందుకు మీ అందరికీ మరోమాటు నా కృతజ్ఞత తెల్పుకుంటున్నాను." ఇలా అంటూంటే వాండా కనులవెంట నీరు ధారకట్టింది.

తరువాత ఆమె అందరితోనూ కరస్పర్శ కావించింది.

"అప్పుడప్పుడు కాలనీకి వస్తూఉండు. నీ యోగక్షేమాలు తెల్పుతూ ఉండు" అన్నారు దళసభ్యులు.

అలాగేనన్నది వాండా. అందరూ ఆమెకు వీడ్కోలిచ్చారు.

# 35

# విజయధ్వజం

ఫ్యాక్టరీ భవన నిర్మాణం పూర్తిఅయింది. కాని చేయవలసిన పనులు ఇంకా చాలా ఉండిపోయాయి. పనులకు అంతూపంతూ లేనట్లు కనుపిస్తోంది. ఫ్యాక్టరీలో దిమ్మలదగ్గర యంత్రాలు అమరుస్తున్నారు. ఒకవైపు ఇలా అమర్చే యంత్రాలు అమరుస్తుంటే, మరొకవైపు కొత్తయంత్రాలు పైనుంచి వచ్చి పడుతున్నాయి. ఫ్యాక్టరీకి సంబంధించిన కొన్ని భవనాలు ఇంకా పూర్తికాలేదు. కాలనీలో అక్కడక్కడ తాత్కాలికంగా వేసిన కుటీరాలు, షెడ్లు

ఉండనేఉన్నాయి. పేర్చిన ఇటుకలు ఇంకా తరగలేదు. చుట్టూ రంపపుపొట్టు ఇంకా అలాగే పడిఉంది. ఆగస్టునెల అయిపోయే సరికి కాలనీ సభ్యులు నవంబరు నెలవరకూ సాధించవలసిన అభివృద్ధిని సాధించారు. కుడిభాగంలో ఆడపిల్లల కృషి మరీ బావుంది. వాళ్లు డిసెంబరు నెలవరకూ పురోగమించారు. ఏమైనప్పటికీ బ్లమ్ ఫ్యాక్టరీమాత్రం అలాగే ఉండిపోయింది. అభివృద్ధి ఏమీ అగుపించలేదు. యంత్రశాఖలోను, వడ్రంగం కార్ఖానాలలోను పని మందగించింది. స్టేడియమ్‌చుట్టూ నానా అసహ్యంగా ఉంది. రంపపుపొట్టు, ఇటుక ముక్కలు, చెత్త, చెదారం చిందరవందరగా పడిఉన్నాయి. చూచినవారికి రోత కలిగిస్తున్నాయి.

స్టేడియమ్ కొత్తదికాదు, పాతదే. అది చాలా పురాతనమైపోయి ఇప్పుడో, ఇంకాసేపటికో పడిపోయేటట్టు ఊగిస లాడుతున్నది. ఒకనాడు జకరోవ్ స్టేడియమ్‌ను చూచి పిల్లవాళ్ళను అక్కడికి వెళ్ళమన్నాడు. వాళ్ళకేదో ఆజ్ఞాపించాడు. స్టేడియమ్‌లో ఒకటి రెండుసార్లు మంటలు లేచాయి. ఎందుకలా మంటలు లేచాయో ఎవరికీ బోధపడలేదు. కాని తరువాత ఆ మంటలు ఆర్పివేశారు. మంటలవల్ల పొగచూరి, నల్లగా కరుళ్లుకట్టి మరీ అసహ్యంగా తయారయింది స్టేడియమ్.

"దేన్నిఅయినా నేను భరిస్తాను. ఉత్పత్తి కుంటుపడితే తట్టుకోగలను. కాని స్టేడియమ్ వ్యవహారమే సహించలేకుండా ఉన్నాను. స్టేడియమ్‌లో ఆమంట లేమిటీ ?" అని అడిగాడు బ్లమ్.

"స్టేడియమ్‌ను కాల్చివేస్తాం! దాన్ని దగ్ధం చెయ్యమని ఆజ్ఞలయ్యాయి, నీకు తెలీదా సాలొమన్ డవాడొవిచ్ ?"అన్నారు కుర్రవాళ్ళు.

"ఎవరు మీాకా ఆజ్ఞలిచ్చింది ? ఎలా తెలిసింది ?" అని అడిగాడు బ్లమ్.

"కాలనీలో అందరికీ ఈ విషయం తెలుసు."

"ఇంకా ఏంచేస్తారట ?"

"ఇంకేంచెయ్యాలి! స్టేడియమ్ బాగాలేదు. అది పాతకు చిహ్నం. దాన్ని దగ్ధం చెయ్యడమే పని! నీవు ఏమనుకున్నా సరే."

ఇదివిని బ్లుమ్ భయోచ్చకితుడయ్యాడు, కోపంకూడవచ్చింది. రోజూ సాయంకాలం జకరోవ్ ఆఫీసుకు వెళ్ళి అక్కడ ఒక కునుకు తీయడం బ్లుమ్‌కు అలవాటు. అలాగే ఒకనాడు జకరోవ్ ఆఫీసులో కుర్చీలో కూచుని కునుకు తీస్తున్నాడు బ్లుమ్.

"ఇక్కడ ఆ కుర్చీలో అవస్థ పడకపోతే హాయిగా వెళ్ళి గదిలో పడుకోరాదటయ్యా!" అన్నాడు జకరోవ్.

"గొప్ప చిక్కే వచ్చిపడింది."

"ఏమిటా చిక్కు?"

"మీదంతా తమాషాగా ఉంది! ఏక్షణంలో నిప్పు అంటుకుంటుందో ఎవరెరుగుదురు!"

"దేనికి నిప్పంటుకునేది? స్టేడియంకా?"అన్నాడు జకరోవ్.

"ఇంకా దేనికనుకుంటున్నావు మరి? కాని నీవు మెలకువతో ఉండగా నిప్పంటుకోలేదులే. నీవు నిద్రపోయి లేచేసరికల్లా అంతా అయిపోతుంది!" అన్నాడు బ్లుమ్.

"అది వేరే విషయం. నావల్లనే స్టేడియమ్ తగలబడిందంటారు! నేను అర్ధరాత్రిదాకా ఇక్కడే ఉంటాను."

"అలాగే ఉండు, ఎవరొద్దన్నారు."

ఆగస్టునెల ముగియవస్తున్నది. క్లుట్జర్ కాలనీకి వచ్చాడు. అతను రాగానే బ్లుమ్ తాలూకు వర్కుషాపు తనిఖీచేశాడు. తరువాత జకరోవ్ ఆఫీసుకు వెళ్ళాడు.

"కమాండర్ల కౌన్సిలు సమావేశం జరుపమని ఒరోబ్యోతో చెప్పు." అన్నాడు క్లుట్జర్?

"ఎప్పుడు జరపాలి సమావేశం?" అని అడిగాడు జకరోవ్.

"ఎప్పుడేమిటీ? ఇప్పుడే—వెంటనే జరపాలి" అన్నాడు క్లుట్జర్.

"వెంటనే ఎలా సాధ్యం? అందరూ పనులలో ఉన్నారు."

"ఉన్నా ఫర్వాలేదు. పనులు ఆపి ముందు సమావేశం జరపమనండి. యంత్రశాల, స్టేడియమ్ ఎవరైనా పనిచేసే స్థితిలో ఉన్నాయా? అవి చాలా అధ్వాన్నంగా తగలడ్డాయే!"

"అవును. అధ్వాన్నంగానే ఉన్నాయి"

"అందుకే ముందు కౌన్సిలు సమావేశం ఏర్పాటు చెయ్యమంటున్నాను"

"సరే అయితే, అలాగే ఏర్పాటు చేద్దాం"

కమాండర్ల కౌన్సిలు సమావేశం జరగబోతున్నదని బిగిల్ కూత వినిపించింది. అదివిని కమాండర్లందరూ ఆశ్చర్యచకితులయ్యారు. కాలనీలో పనులన్నీ క్షణంలో ఎక్కడివక్కడ ఆగిపోయాయి. ఈ సమావేశంతో బ్లమ్ ఫ్యాక్టరీకి స్వస్తి జరుగుతుందని ఎవరూ అనుకోలేదు.

సమావేశం ఎంతోసేపు జరగలేదు. ఇట్టే ముగిసింది. కాలనీ సభ్యులంతా ఇంకా ఎక్కువ శక్తితో, దీక్షతో పునర్నిర్మాణం ప్రారంభించాలనీ, అలా అయితే కొత్త ప్యాక్టరీ అనుకున్నదానికంటె ముందుగా తయారయిపోతుందనీ క్లుట్జర్ చెప్పాడు. అతని ప్రతిపాదనకు సభ్యులు తమ హర్షాన్ని వెల్లడించారు. ఒర్గనోవ్ ఇదంతా కళ్ళారా చూస్తూ, చెవులారా వింటూ ఉన్నాడు.

"అయితే పరవంజా కూడా తీసిపారవేస్తారా?" అని అడిగాడు ఒర్గనోవ్.

"ఆ, అన్నీ తీసి పారేస్తారు! ఊరుకుంటే సరి ఇల్లు పీకి పందిరి వేస్తారు!" అన్నాడు బ్లమ్.

జకరోవ్ తమాషాగా ఇలా అన్నాడు:

"బ్లమ్, పైటర్ పెట్రోవిచ్‌లు పూర్వకాలపువాళ్ళు అదే మిటయ్యా అలా కోపపడతావు బ్లమ్? కొత్త పరికరాలతో కొత్త ఫ్యాక్టరీ కడుతుంటే నీకెందుకంత కోపం?"

ఆమరుసటిరోజు వరండాలో గోడకు వ్రేలాడగట్టిన రేఖాపటం చూస్తూ పిల్లలు గుమిగూడారు:

"ఆగస్టు 29 తేదీన యుద్ధరంగ పరిస్థితి ఇలా ఉన్నది:-నిన్న మన ఎర్రసైనికులు శత్రువుపై ఆఖరు దెబ్బ కొట్టారు! దుస్తుల కార్ఖానాలో పనిచేస్తున్న ఆడపిల్లలు సంవత్సరానికి తయారు కావలసిన ఉత్పత్తిని సాధించారు. నగరానికి కుడిప్రక్కన ఉన్న శిఖరాన్ని పట్టుకున్నారు. నగరపు బురుజులమీద సోవియట్ పతాకం ప్రతిష్ఠించారు! ఇహ లాభం లేదని శత్రువు నగరం ఖాళీ చేసి పలాయనం చిత్తగించడం మొదలుపెట్టాడు.

రేపు సెలవు దినం. అయినాసరే, ఎడమభాగంలో పురోగమిస్తున్న మన సైనికులు రేపే నగరంలో ప్రవేశించబోతున్నారు".

రేఖాపటంలో కుడివైపున చక్కగా నగరం చిత్రితమై ఉన్నది. నగరపు బురుజులమీద అరుణపతాకాలు ఆకాశవీధుల్లో రెపరెప ఎగురుతున్నాయి. ఈ మహాసంఘటనకోసం కాలనీఅంతా ఎంతకాలం బట్టియో నిరీక్షిస్తున్నది. ఇప్పుడు వాళ్ళ కలలు నిజమైనాయి. ఇంతవేగంగా తమకీ మహోజ్వలమైన విజయం లభిస్తుందనీ తాము విజయధ్వజం ప్రతిష్ఠిస్తామనీ వాళ్ళు ఊహించలేదు. ఇలా జరిగినందుకు తమ కళ్ళను తామే నమ్మలేకపోయారు.

ఆ రోజల్లా నాల్గవదళం అక్కడే ఉంది. నగరపు బురుజుల మీద ఎగురుతున్న ఎర్రజెండాలను చూస్తున్నది. ఎర్రసైనికులు పురోగమిస్తున్నారు. శత్రుసైనికులు తిరోగమిస్తున్నారు. శత్రువులు చాలా పొట్టివాళ్ళు! బలహీనులు; నల్లగా, వికారంగా ఉన్నారు. మలెంకో వాళ్ళను నల్లసిరాతో రేఖాపటమందు చిత్రించాడు. శత్రువులు ఒకరు, ఇద్దరూ కాదు. ఎంతోమంది ఉన్నారు.

కాలనీలో ఆ రోజే ఉత్సవం జరిపారు. కాలనీ పిల్లలందరూ ఆ విజయోత్సవంలో ఉత్సాహంగా పాల్గొన్నారు. కాలనీ అంతా చక్కటి తోరణాలతో అలంకరించారు. మంగళ వాయిద్యాలు మిన్ను ముట్టాయి. అరుణపతాకాలు రెపరెపలాడాయి. ఆడపిల్లలు కవాతు దుస్తులు ధరించారు. కాలనీ సభ్యులు వారిని ప్రత్యేకంగా అభినందించినందుకు ఒక్సానా సభ్యులందరికీ ఇలా కృతజ్ఞతలు తెలిపింది:

"ప్రియమైన కామ్రేడ్స్! మమ్మల్ని మీరింతగా అభినందించినందుకు సంతోషం. ఇంత అందమైన కాలనీలో, ఇంత సుందరమైన భవనాలలో మేము మీతోపాటు జీవిస్తూ మా శక్తివంచన లేకుండా పాటుపడుతున్నాం. మన అందరి ధ్యేయం ఒక్కటే. మనమంతా ఒకే పతాకచ్ఛాయలో పయనిస్తున్నాం. మన గమ్యం ఒక్కటే లెనిన్ మహాశయుడు మనకు ఏమి ఆదేశించి పోయాడో. స్టాలిన్ మహాశయుడు ఇప్పుడు మనకు ఏమి బోధిస్తున్నాడో - మన బోల్షివిక్ పార్టీ మనకు ఏమి ఉపదేశిస్తున్నదో - అదే మనందరికీ అవశ్య అనుసరణీయం, ఆచరణీయముకూడా. మనం ఆ మహామహుల బోధనలు విన్నాం. అవగతం చేసుకున్నాం. ఆచరిస్తున్నాం వీరులవలె దీక్షతో కృషి సలుపుతున్నాం. మన కృషి ఫలిస్తున్నది. కాలనీ ఇప్పటికి మనం ఎన్నో వేలు, లక్షలు, కుర్చీలు, బెంచీలు, నూనెపాత్రలు, వ్రాతబల్లలు, దుస్తులు తయారుచేసి మన ప్రజలకు అందిస్తున్నాం. నిజంగా ఇది గొప్ప విజయం. మన దేశంకోసం, మన ప్రజలకోసం మనం ఇక్కడ క్రొత్త కర్మాగారం నిర్మించుకున్నాం. అదే స్టాలిన్ కర్మాగారం. అక్కడ మనం మన సైనికులకు అవసరమైన పరికరాలను ఉత్పత్తి చేయబోతున్నాం. తుపాకి గుండ్లేకాదు, దుస్తులేకాదు; విమానాలకు పనికి వచ్చే విద్యుత్పరికరాలనుకూడా తయారుచేయబోతున్నాం. మనం తయారు చేసిన వస్తువులు ఒక్క ఎర్రసైనికులకేకాదు. మన ప్రజలందరికీ ఉపయోగపడతాయి. వంతెనల నిర్మాణానికి గృహనిర్మాణానికి మన పరికరాలు ఎంతో ఉపకరిస్తాయి. కాని ఇంతమాత్రంతో మన కృషి ఫలించినదనీ, మనం చేయవలసినది ఇహ లేదనీ సంతృప్తిపడి ఊరుకోకూడదు. మనం చేయవలసింది ఇంకా ఎంతో ఉన్నది. మన లోపాలను, మన బలహీనతలను మనం గుర్తించి వాటిని సరిదిద్దుకోవాలి. నిన్ననే మన ఫ్యాక్టరీలో కొన్ని వస్తువులు పోయాయి. ఇది నిజంగా విచారకరమైన విషయం. మనలో ఇంకా దొంగలున్నారంటే నిజంగా మనం సిగ్గుపడాల్సిఉంటుంది. మన ఇంటి దొంగలను మనమే పట్టుకోవాలి. అలా ఆ దొంగలు పట్టుబడిననాడు

మనం మరోఘన విజయాన్ని సాధించిన వారమవుతాం. అప్పుడు మనం మళ్ళీ మరోవిజయోత్సవం చేసుకుందాం!"

ఇలా ఒక్సానా ప్రసంగించేసరికి కాలనీ పిల్లలంతా హర్షధ్వానాలు కావించారు. ఆమె ఉపన్యాసం ఎంత ఉత్తేజకరంగా ఉంది! ఎంత అద్భుతంగా ఉంది! ఆమె ప్రసంగం వింటున్నంత సేపూ సభ్యులు మైమరిచారు. అవును, ఒక్సానా చెప్పినట్టు ఇహ ముందు కాలనీలో దొంగతనం జరగకూడదు. ఇదివరకే చాలా జరిగాయి నాటకాల తెరగుడ్డ పోయింది. జకరోవ్ జేబుగడియారం వెండిది మాయమైంది. కొన్ని ఓవరు కోట్లు, కొన్ని బూట్లు, ఇంకా ఇతర పరికరాలు పత్తా లేకుండా పోయినాయి. ఒక్సానా చెప్పినట్లు ఆ దొంగలు దొరకగానే మళ్లీ పండుగ చేసుకుంటాం. ఇంతకంటె పెద్దపండుగ! అదే నిజయమైన విజయోత్సవం!

ఒక్సానా తన ఉపన్యాసం ముగించి క్రింద కూచున్నది. తరువాత ఎవరూ మాట్లాడవలసిన అవసరం లేదనుకున్నారు. కాని కొంతసేపటికి ఒర్లునోవ్ లేచి వేదికదగ్గిరికి వచ్చాడు. ఇలా చెప్ప సాగాడు :

"ఒక్సానా వీరవనిత! ఆమె అయిదో దళానికి కమాండర్ నేను వయస్సు మళ్ళినవాణ్ని, ఒక ఇంజనీరును, ఆమెకు నా అభివందనాలు తెలుపుతున్నాను. ఒక్సానా విటోవ్ చెంకో! చక్కగా మాట్లాడావమ్మా నీవు. నిజం మాట్లాడావమ్మా! నీ ఉపన్యాసం అద్భుతంగా ఉన్నది. ఎంతో ముఖ్యమైన విషయాన్ని విపులంగా చెప్పావు, నీవు గాదెక్రింది పందికొక్కును పట్టితీరాలి! అదిఉంటే ఇహ మనం ఎత్తిరిల్లం: నేను ఇక్కడికి వచ్చిన కొత్తలో మీ మాటలు నమ్మలేదు. మీరొక ఫ్యాక్టరీ కట్టుకుంటారంటే నాకు నిజంగా ఆశ్చర్యం కలిగింది. ఇది జరిగేపని కాదనుకున్నాను. కాని ఇప్పుడూ ? ఇప్పుడు నాకే ఆశ్చర్యమూ లేదు. మీరు ఎంతటి కార్యాన్ని అయినా ఇట్టే సాధించగలరు. మీకు అసాధ్యమైంది ఏదీలేదు ! ఇహ మనం కొత్తఫ్యాక్టరీలో పని ప్రారంభిద్దాం. అధి

ణోత్పత్తి కావిద్దాం. ఇన్ని విజయాలు సాధించిన మనకు కాలనీలో దొంగను పట్టడమనగా ఎంత !"

ఒర్గునోవ్ ఇలా మాట్లాడేసరికి సభ్యులంతా హర్ష ధ్వానాలు చేశారు. అతను మళ్లీ ఇలా అన్నాడు :

"కాని ఒక్క విషయం గుర్తుంచుకోండి. నేను ముక్కుకు సూటిగా పొయ్యేమనిషిని. పని చేస్తున్నపుడు మాత్రం నాతో మీరంతా జాగ్రత్తగా మసలుకోవాలి. మీ జకరోవ్ ఎంత కట్టుదిట్టంగా ఉంటాడో – నేను అంతకంటె నాలుగు ఆకులు ఎక్కువ చదివాను!"

"అయితే మరీమంచిది!" అని అరిచారు సభ్యులు.

"నేను చెప్పినట్టు చేస్తారుకదూ?" అన్నాడు ఒర్గునోవ్.

"చేస్తాం, చేస్తాం. మరిమీరూ?"

"నేనుకూడా మీరుచెప్పినట్లు వినాలా? ఆ-ఒక్కొక్కప్పుడు వింటానులెండి!" అంటూ ఒర్గునోవ్ పకపక నవ్వాడు.

కాలనీ సభ్యులు కరతాళధ్వనులు చేశారు. పెద్దగా నవ్వుకున్నారు. వాయిద్యదళాలు సయితం నవ్వాయి. అంతటా నవ్వులు! నవ్వులతో కాలనీ కళకళలాడింది!

ఆ మరుసటిరోజు వరండాలో వ్రేలాడగట్టిన రేఖాపటంలో ఈ క్రింది వివరాలున్నాయి.

"శత్రువు నగర పొలిమేరలు దాటి పారిపోయాడు? అన్ని వైపులనుంచీ మన దళాలు నగరంలోకి చొచ్చుకునిపోయాయి. నగరపు బురుజులన్నింటిమీదా మన సైనికుల ఎర్ర జెండాలను ప్రతిష్ఠించారు, శత్రువుల అవశేషాలు నగరంలో అక్కడక్కడ దాగి ఉన్నాయి. కొన్ని అవశేషాలు 'స్టేడియమ్'లో తలదాచుకున్నాయి. సెప్టెంబరు నెలలో ఆ స్టేడియమ్‌ను పూర్తిగా ధ్వంసం చెయ్యమని కమాండర్ల కౌన్సిలు మనసైనికులకు ఆజ్ఞాపించింది. దానితో మన శత్రువులు నిశ్శేషమైనట్టే, పూర్తిగాశత్రు నిర్మూలన జరిగాక విప్లవవార్షికోత్సవం విజయ వంతంగా జరుపుకుందాం."

# 36

# అదీ ఉత్సాహమంటే!

పాతభవనం ఖాళీ చేసి కొత్తభవనంలో ప్రవేశించడానికి ఒక నెల పడుతుందని ఒర్లనోవ్ అంచనా వేశాడు. కాలనీలో ఉన్న పదకొండు దళాల సభ్యులూ ఒక్క నెలరోజులపాటు పని చేయవలసి ఉంటుందని అన్నాడు. ఆగస్టు 31 వ తేదీన సర్వసభ్య సమావేశం తన నిర్ణయాన్ని ఇలా ప్రకటించింది.

"ప్రస్తుత పరిస్థితులలో పాఠశాలను నిర్వహించడం సాధ్యం కాదు. అందుకని సెప్టెంబరు 15 వ తేదీవరకూ పాఠాలు మొదలు పెట్టరు. ఇప్పుడు ఒక నెలరోజులు పాఠశాల ఉండదు. కనుక ఈ ఏడాదికి శీతాకాలపు సెలవులు ఉండవు. తనకు సంబంధించిన పనికి ఏదళానికి ఆదళమే బాధ్యత వహించాలి. సెప్టెంబరు 15 వ తేదీకి పని అంతా పూర్తికావాలి."

సెప్టెంబరు మొదటి తేదీన అన్ని దళాలూ తమతమ పనులు ప్రారంభించాయి. కాలనీలో మొత్తం రెండు వందల పిల్లలూ పని ప్రారంభించారు. రోజుకు ఎనిమిది గంటలు పని చేస్తున్నారు. భవన పరిసరాలు పరిశుభ్రంచేశారు. ఫ్యాక్టరీ భవనంలో అక్కడక్కడ ఉన్న గోతులను పూడుస్తున్నారు. ఆ పని ఆడపిల్లలది. తట్టలతో మన్ను తెచ్చి గుంటలు, గోతులు నింపుతున్నారు.

"ఆడపిల్లలు మట్టితట్టలు మోయడం కష్టం ఇలా రెండు మూడు రోజులు పనిచేస్తే వాళ్ళ ఎముకలు గుల్ల అవుతాయి!" అనుకున్నారు మగపిల్లలు.

కాని వాళ్ళు అనుకున్నది శుద్ధతప్పని వెంటనే తేలి పోయింది. ఆడపిల్లలు అవలీలగా మట్టితట్టలు మోస్తూ చకచకా పనిచేస్తున్నారు అందరికీ ఆశ్చర్యంగా ఉన్నది వాళ్ళలా పని చేయడం. వాళ్ళు ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ, పేలుతూ కులా సాగా పని చేస్తున్నారు. ఒర్గునోవ్ అక్కడికి వెళ్ళి చూచి వస్తు న్నాడు.

"మాతో మగపిల్లలు, పోటీపడలేరు!" అన్నారు ఆడపిల్లలు.

ఉపాధ్యాయులు, శిక్షకులు; అందరూ కాలనీ సభ్యులతో కలిసి పనిచేస్తున్నారు. ఒకదళం కంకరరాళ్ళు, సిమెంటు కలుపు తున్నది. మరొకదళం నేలంతా దిమ్మిసకొట్టి చదును చేస్తున్నది. బ్రాట్సన్ తాలూకు దళం త్రోవలన్నీ చిమ్మి శుభ్రంచేస్తున్నది. రోజుకు మూడుసార్లు నగరంనుంచి ఒకలారీ వస్తున్నది. తారుపీపా లను కాలనీకి చేరుస్తున్నది. నాలుగైదు రోజుల్లో కాలనీలో విశాల మైన త్రోవలు ఏర్పడ్డాయి. తారురోడ్లు తయారు చేశారు. ఫ్యాక్టరీ ప్రధాన భవనపు పరంజాను పొఖోర్ఘుయ్ దళం పడగొడుతున్నది. ఆపని మొదట ఏ దళానికి అప్పచెప్పాలా అనే సమస్య వచ్చింది. దాన్నిగురించి కమాండర్ల కౌన్సిలు కొంతసేపు దీర్ఘంగా చర్చిం చింది. చర్చ ఎటూ తేలలేదు. చివరకు చీట్లు కలిపివేశారు. చీటీ ప్రకారం ఆపని తొమ్మిదవ దళానికి వచ్చింది. ఆదళం కమాండర్ పొఖోర్ఘుయ్ తన దళసభ్యులతో భవనంలో ప్రవేశించాడు. పరం జాను ఊడబెరకడం ప్రారంభించారు దళసభ్యులు. ఈదళం చేస్తున్న పనిచూచి ఒర్గునోవ్ చిరాకు పడసాగాడు. దళసభ్యులు భవనం మీాదికి ఎక్కి పెంకులు ఊడదీస్తున్నారు. దూలాలు పడగొడుతు న్నారు. కిటికీలు పెల్లగిస్తున్నారు. ఒర్గునోవ్ క్రింద నిలుచుని గాభ రాగా, అరవడం మొదలు పెట్టాడు. ఒకదూలం ఎంతకూ ఊడిరా వడంలేదు. ఊడదీస్తున్నప్పుడు ఆదూలం పాడయిపోతుందేమోనని ఒర్గునోవ్ అదేపనిగా గోల పెడుతున్నాడు. జీన్ గ్రిఫీ రంపంతో రిఫర్ బద్దలను పరపర కోస్తున్నాడు. అలాకోస్తే దూలాలన్నీ

ఎందుకూ పనిరాకుండా పోతాయని ఒర్గనోవ్ చిందులు తొక్కుతు న్నాడు. కాని పిల్లలెవరూ అతని మాటలు లెక్కచెయ్యడం లేదు.

"ఏమిటర్రా ఆ కోతిచేష్టలూ మీరూ! దూలాలన్నీ అలా పాడుచేస్తారేం? వాటిని జాగర్తగా క్రిందికి దింపండి." అని అరిచాడు ఒర్గనోవ్

"పని ఎలాచెయ్యాలో నీకేం తెలుస్తుందయ్యా?" అని పైనుంచి సమాధానం చెప్పాడు గ్రిఫీ.

ఇప్పుడు ఒర్గనోవ్ సినిట్‌సిన్ మీదికి మళ్ళింది. అతను ఒక దూలానికి వ్రేలాడగట్టిన మోకు నోట కరుచుకుని పైకి ఎగబ్రాకు తున్నాను.

"అదేమిటోయ్ ఆపని! అలా మోకు పళ్ళ కరుచుకుని ఉడతలా పైకెగబ్రాకుతావేం? దిగు, క్రిందికి దిగు!" అని అరి చాడు ఒర్గనోవ్.

"నీకెందుకయ్యా అంతగాబరా! ఆమోకు ఎక్కడ కట్టాలో నీకు తెలుసునా వాడికి తెలుసునా?" అని సమాధానం చెప్పాడు పొఖోర్ఘుయ్.

అదికాదురా బుజ్జినాయనా! ఆ స్తంభం ఊడి క్రిందపడితే ఏమవుతుంది? వీడి తల పచ్చడి పచ్చడి అవుతుంది!" అన్నాడు మళ్ళీ ఒర్గనోవ్.

"అదేం ఊడిపడదు. మేం పన్నెండు మందిమి దాన్ని గట్టిగా పూడిచాం!"

ఇలా వీరిపురూ వాదించుకుంటూ ఉండగానే సినిట్‌సిన్ స్తంభంచివరకు ప్రాకిపోయాడు. మోకును దూలానికి చుట్టాడు.

అక్కడే ఉన్న డెమ్‌ను చూచి ఒర్గనోవ్ ఇలా అన్నాడు:

"రా, రా. ఇలా రా. నీవైనావచ్చి ఈ కుర్రకుంకలకు చెప్పు. వీళ్ళు చేస్తున్న పని చూస్తే నాకే గాభరాగా ఉంది."

డెమ్ మరోవైపుకు చూస్తూ నిలుచున్నాడు. పదిహేను మంది కుర్రవాళ్ళు సరంబీమీద నిలుచుని త్రాళ్ళతో దేన్నో

గట్టిగా లాగుతున్నారు. మొద్దు ఊగుతున్నది. అయినాకూడా పిల్లలింకా ఉత్సాహంగా దాన్ని పడగొట్టాలని ప్రయత్నిస్తున్నారు. కొంతసేపటికి అది గభీలుమని ఊడిపడింది. "ఒక్కసారిగా ఫెళఫెళ మనేధ్వని మిన్నుముట్టింది. మొద్దుకప్పు ఊడిపడింది! పదిహేనుమంది కుర్రవాళ్ళు క్షణంలో ప్రక్కకు తప్పుకుని, పెద్ద విజయం సాధించి నట్లు చప్పట్లు చరిచారు. పకపక నవ్వారు. ఇదంతా చూచి ఒర్గు నోవ్‌కు ముచ్చెమటలు పోశాయి. పిల్లలు మరొక మొద్దు దగ్గరికి వెళ్ళారు. దాన్నికూడా పడగొట్టడం ఎలాగా అని ఆలోచిస్తూ అక్కడే కొంతసేపు నిలుచున్నారు. కొరోటక్ ఏదో ఒకమాట అని ముందుకు పరుగెత్తాడు. ఒక్కక్షణంలో మెరుపులా మొద్దు పైకప్పు మీద ప్రత్యక్షమయ్యాడు! ఒర్గునోవ్ ఇలాకపోయి చూడసాగాడు.

"ఏయ్, ఎవరునీవు? నీది ఎన్నోదళం?" అని అడిగాడు.

"నాది పదోదళం" అన్నాడు కొరోటక్.

"మరి మీ కమాండర్ ఏడీ?"

"ఇదిగో ఇక్కడే ఉన్నానయ్యా." అంటూ రొడ్నేవ్, ఒర్గునోవ్‌కు ఎదురుగా వచ్చి నిలుచున్నాడు.

"ఏమిటోయ్ మీరిక్కడ చేస్తున్నది? పనిచేసేతీరు ఇదేనా?" అని అడిగాడు ఒర్గునోవ్.

"ఇంకెలా చెయ్యాలి?" అన్నాడు రొడ్నేవ్.

"నీవేనా కమాండర్‌వు? నీపేరు?"

"రొడ్నేవ్."

"నేను డిప్యూటీ డైరెక్టర్, నాపేరు ఒర్గునోవ్. నిన్ను డిటెన్‌షన్‌లో పెట్టడానికి నాకు హక్కున్నదని తెలుసునా?" అన్నాడు ఒర్గునోవ్.

"నన్ను డిటెన్‌షన్‌లో పెడతారా? దేనికి? ఏంచేశాననీ?" అని అడిగాడు రొడ్నేవ్, ఆశ్చర్యంగా.

ఒక కట్టడంపడగొట్టే పద్ధతి ఇదేనా? ఎక్కడ నేర్చుకున్నా వయ్యా ఈ పని?"

"ఏం? ఈ పద్ధతిలో తప్పేముంది? ఇదేవిధంగా ఇప్పటికి రెండు పెడ్లు పడగొట్టాం, ఇది మూడోది. మరో రెండుమాత్రం పడగొట్టాల్సి ఉంది" అన్నాడు రొడ్నేవ్.

"ఇలా పనిచేయడం పనికిరాదు, తెలిసిందా?"

"కామ్రేడ్ ఒర్గునోవ్ తక్కిన రెంటినికూడా పడగొట్ట నివ్వండి."

"అరె! వద్దని చెపుతున్నానుకదయ్యా."

"వద్దంటారేమిటండీ? క్షణంలో ఆ రెండూ పడగొట్టేస్తాం." అన్నాడు రొడ్నేవ్.

"అదే వద్దంటున్నాను. ఇహ నన్ను విసిగించకు. నిన్ను ఒకగంట డిటెన్షన్‌లో పెడుతున్నాను! వెళ్ళు!" అన్నాడు ఒర్గునోవ్ కోపంగా.

రొడ్నేవ్ శాల్యూట్ చేసి తన దళానికి ఇలా ఉత్తర్వు చేశాడు:

"ఎయ్ పెర్లోవ్! ఒక గంటసేపు నీవు నా డ్యూటీ నిర్వర్తించు. ఇప్పుడు నేను డ్యూటీలో లేను."

"అలాగే, అలాగే" అంటూ పెర్లోవ్ మళ్ళీ దళసభ్యులకు ఇలా అజ్ఞాపించాడు: "ఎందుకర్రా అలా గ్రుడ్లు మిటకరించుకుని చూస్తారు? ఒక్క ఫువ్వూలో పెడ్డు పడగొట్టండి!"

వెంటనే పదోదళం సభ్యులు పెడ్డుమీదికి ఎక్కారు. ఒర్గునోవ్ ఇహ చేసేది లేక రొడ్నేవ్ బుజాలమీద చేతులువేసి ఇలా అన్నాడు.

"పనిచేసే పద్ధతి ఇదికాదయ్యా, చెపితే వినిపించుకోవేం? వాళ్ళను క్రిందికి దిగమను"

"కామ్రేడ్ ఒర్గునోవ్! మీరు నామాట విని ఒక్కక్షణం సేపు అటు చూడకండి, పని అయిపోతుంది" అన్నాడు రొడ్నేవ్.

కాని ఒర్లునోవ్ ఊరుకోలేదు. పెద్దు పడగొట్టేపద్ధతి అది కాదని గొంతు చించుకుని అరిచాడు. కేకలు పెట్టాడు సభ్యులు ఇహ చేసేదిలేక పెద్దు దిగి వచ్చారు.

తరువాత కమాండర్ల కౌన్సిలు ఎదుట ఆత్మవిమర్శ చేసు కుంటూ రోడ్నోవ్ ఇలా అంగీకరించాడు:

"మా దళసభ్యులు పడిన శ్రమ వ్యర్థం. అది నిజమే. వాస్త వానికి ఆరెండు పెద్లనీ ఒక పావుగంట సేపట్లో పడగొట్టవచ్చు. కాని మేం బండపని చేశాం. అందుకని రెండురోజులు పట్టింది."

భవనానికి మరొక కొసన దారిలోఉన్న చెట్లును పడగొడు తున్నారు ఎనిమదోదళం సభ్యులు. ఇగోర్, బోరిన్‌లు రంపాలు పట్టుకుని చెట్లమానులు కోస్తున్నారు. పడిపోయిన ఒకచెట్టుమీద గొరొవోయ్ కూచుని ఉన్నాడు. జకరోవ్ అక్కడికి వచ్చాడు.

"చూడండి అలెగ్జీ! మాకొత్త కమాండర్ పనులన్నీ తనే చేసుకపోతున్నాడు. ఒక్కపనీ మాకు అప్పచెప్పడు." అన్నాడు గొరొవోయ్.

"ఈపని నేనే చెయ్యాలి అలెగ్జీ! ఇది అతనికి కొత్త. అదీ కాక మరోగమ్మత్తు కూడాఉంది చెప్పమంటారా? గొరోవోయ్ మా అందరికన్నా లావు; మనిషి పిప్పళ్ళబస్తాలా ఉంటాడు. అందు కని మానుకు ఒక కొసన అతన్ని కూచోబెట్టాం. మానులేకుండా ఉండేందుకు, రెండోచివరన మేం రంపాలతో కోస్తున్నాం బాగుందికదూ!" అని చెప్పాడు ఇగోర్.

జకరోవ్ నవ్వుతూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఇలాగే కాలనీలో ఉన్న పదకొండు దళాలూ తమతమ పనులు శ్రద్ధగా సాగిస్తున్నాయి. పిల్లలంతా ఉత్సాహంగా, ఉల్లా సంగా పనులు సాగిస్తున్నారు. ప్రతిదళం చేసేపనీ, ఎప్పటికప్పుడు శ్రద్ధాశక్తులతో తనిఖీ చేస్తున్నాడు డిప్యూటీ డైరెక్టర్ ఒర్లునోవ్.

"అబ్బో! ఏమో అనుకున్నాను, ఈ కుర్రకుంకలంతా దేవాంతకులయ్యోయ్! వీళ్ళతో నీవు ఎలా వేగుతున్నావయ్యా?"

అన్నాడు డైరెక్టర్ జకరోవ్‌తోటి. అస్తమానం అదేపనిగా, కాల స్సిలో అటూఇటూ తిరగడం ఒర్గునోవ్‌కు చిరాకనిపించింది. కాసేపు హాయిగా ప్రొద్దుపుచ్చాలనుకున్నాడు. ఒకనాడు పిల్లవాళ్ళ పడక గదుల్లోకి వెళ్ళాడు. అతను లోపలికి రాగానే, అతన్ని మర్యాద చేసి కుర్చీలో కూచోబెట్టాడు పొఖోర్ఘుయ్.

"కామ్రేడ్ పొఖోర్ఘుయ్! ఆ దూలం జాగర్తగా బయటికి వచ్చిందా?" అని అడిగాడు ఒర్గునోవ్.

"ఏదూలం?"

"అదేనయ్యా మొన్న మీరు ఊడదీయడానికి ప్రయత్నించారే—ఎత్తుగా ఉన్న దూలం?"

"ఓ అదా! అదేకాదు. అలాంటివి మరో మూడు దూలాలు కూడా జాగర్తగా బయటికి లాగాం" అని చెప్పాడు పొఖోర్ఘుమ్.

"ఓ, అలాగా!"

"ఇదేం గొప్పయ్యా! మేమంతా మహోత్సాహంతో పని చేస్తున్నాం, ఎప్పుడు కొత్తభవనంలోకి అడుగు పెడతామా అని ఉవ్విళ్ళూరుతున్నాం."

"ఉత్సాహంగా ఉన్నారా? అంటే?"

"ఉత్సాహమంటే ఉత్సాహమేనయ్యా! కొమ్సొమోల్ పద్ధతిలో మహోత్సాహంగా ఉన్నామన్నమాట!"

"అలాగా!"

"ఏం? ఉత్సాహంగా ఉండారంటే మీరు నమ్మరా?"

"ఎందుకునమ్మనూ?"

"ఉత్సాహమంటే ఏమిటో అసలు మీకు తెలుసునా?"

"తెలుసును కాని నాకో విషయం చెప్పు? నీకు జామెట్రీ అంటే ఏమిటో తెలుసునా!"

"ఆ, తెలుసును."

"ఒకవర్తులంయొక్క వైశాల్యం కనుక్కోవడానికి సూత్ర మేమిటీ?"

"పై—ఆర్—స్క్వేర్" అని చెప్పాడు పాఖోర్కుయ్.

"ఆసూత్రాన్ని నీవు ఉత్సాహానికి ముడిపెట్టి పాడుచేయ గలవా?" అని అడిగాడు ఒర్గునోవ్.

"ముడిపెట్టలేను, పాడుచెయ్యలేను. జామెట్రీసూత్రాలు వేరు, ఉత్సాహం వేరు."

"అయితే నీవు చాలా సూత్రాలను ఉత్సాహంతో పాడు చేశావు!"

"ఎప్పుడు పాడుచేశాను, ఎలా పాడుచేశాను? చెప్పండి?"

"మెట్లు పడగొడుతున్నప్పుడు నీవు అంతే చేశావు."

"మెట్లు పడగొట్టే సూత్రా లేమిటంటారు?"

"అన్నిటికీ అడుగడుగునా సూత్రాలంటూ ఉన్నాయి. ఒక స్తంభం ఉన్నదీ అంటే దానిమీాద ఏదో ఒక బరువు ఆధార పడి ఉంటుందన్నమాట, ఇలాగే ప్రతీదీను. నీవు మెట్లును పడగొట్టే పద్ధతి సరైనదికాదు. మోకు నోట కరుచుకుని అలా స్తంభానికి ఎవరూ ఎగ్రబాకరు."

ఒర్గునోవ్ అన్నమాట విని దళసభ్యులు పకపక నవ్వారు. తరువాత ఇలా అడిగారు:

"యుద్ధరంగంలోకూడా ఇలాగే సూత్రా లుంటాయా?"

"ఆ, ఉంటాయి. తప్పకుండా ఉంటాయి."

"ఉంటే ఏమిటవి? కాస్త వివరించి చెప్పండి?"

"అయితే వినండి చెపుతాను: యుద్ధానికి వెళ్ళేటప్పుడు ప్రాణాలకు తెగించి వెళ్ళాలి. ఇది మొదటి సూత్రం. మూర్ఖంగా చచ్చిపోవడానికి మీాకు హక్కులేదు."

"మూర్ఖంగా అంటే?"

"అంటే—శత్రువుకు కనిపించకుండా దాక్కోవలసివచ్చి నప్పుడు, దాక్కోకుండా రహస్యస్థావరంనుంచి బయటికి వచ్చి శత్రువుకు కనిపిస్తావా? అలా కనిపిస్తే అన్యాయంగా చచ్చిపోతావు

దీన్నే తెలివితక్కువగా చనిపోవడమంటారు. ఇలా చెయ్యడానికి మీకు హక్కు లేదు. కనుక ఇలాగే అన్నిటికీ సూత్రాలున్నాయి. ఇహ రేపటినుంచీ మీరు అన్ని సూత్రాలనూ తూ. చ తప్పకుండా పాటించండి.'' అని చెప్పి ఒర్గనోవ్ అక్కడనుంచి లేచి వెళ్ళి పోయాడు.

అతను వెళ్ళిపోగానే పాఖోర్ఘుయ్ తన దళసభ్యులతో ఇలా అన్నాడు :

“ఇతనొక విచిత్రమైన వ్యక్తి! ఉత్సాహంగా ఉండడమంటే ఇతనికి సరిపడదు !”

“కాదు కాదు. ఉత్సాహానికి అతను వ్యతిరేకి కాదు.” అన్నాడు ఒకడు.

“కాదులే, నీకు తెలీదులే.”

ఇలా ఒక్క ఆ దళసభ్యులేకాక, అన్ని దళాల సభ్యులూ ఒర్గనోవ్‌కు ఉత్సాహంగా ఉండడమంటే సరిపడదన్న విషయంపై చర్చలు సాగించారు.

నిర్మాణ రంగంలో కృషి చురుగ్గా సాగుతున్నది. భవనంలో పనిఅంతా అయిపోతున్నట్టే. యంత్రశాలల్లో యంత్రాలు అమర్చారు. చుట్టూ త్రోవలు ఏర్పరిచారు. త్రోవల కిరుప్రక్కలా చక్కని పూలమొక్కలు నాటారు.

యంత్రశాలల్లో పరిశుభ్రంగా ఉండడంకోసం అనేక ఫ్యాక్టరీ ద్వారాలచెంత కాపలావాళ్ళను పెట్టారు. ఎవరు లోపలికి వచ్చినా కాపలావాళ్ళు ఇలా హెచ్చరిక చేస్తున్నారు :

“కామ్రేడ్? వాకిట్లో కాళ్ళుతుడుచుకుని మరీ లోపలికిరా.”

“ఏమిటీ?”

“కాళ్ళు తుడుచుకోవయ్యా? నీకే చెప్పేది.”

“నన్నేనా?”

"నిన్నే, నిన్నే - ముమ్మాటికీ నీకే చెప్పేది - చెవుడొచ్చిందా? "

కాపలావాళ్లు చేస్తున్న గడబిడచూసి కొందరు జకరోవ్ ఒర్గునోవ్‌ల దగ్గరికివెళ్ళి ఫిర్యాదు చేశారు:

"ఏమిటయ్యా ఆ కాపలావాళ్ళ దబాయింపూ? వాళ్ళపని పట్టపగ్గాల్లేకుండా ఉందే! "

"అందులో ఏమున్నదయ్యా? వాళ్ళడ్యూటీ వాళ్ళు చేస్తు న్నారు- నేనువెళ్ళినా నన్నూ అలాగే అంటారు!" అన్నాడు జక రోవ్.

సెప్టెంబరు 15 వ తేదీన సర్వసభ్య సమావేశం జరిగింది. అనుకున్న పనులన్నీ పూర్తి అయ్యాయని డిప్యూటీ డైరెక్టర్ ఒర్గునోవ్ సమావేశంలో ప్రకటించాడు. దళాలన్నీ అమోఘమైన కృషి కావించాయని అభినందించాడు. సమావేశం ముగిసిన తరువాత పొఖోర్ఘుయ్, ఒర్గునోవ్‌ను ఇలా అడిగాడు:

"అయితే ఇంతకూ ఏమంటారండీ? దీనికంతకూ కారణం కాలనీ కుర్రవాళ్ళ ఉత్సాహమే నంటారా? "

"ఉత్సాహం అనేదానికి అనేక రకాల పేర్లున్నాయిరా అబ్బాయి! ఆత్మవిశ్వాసం, చిత్తశుద్ధి, ప్రేమ, హృదయం, ఇవన్నీ ఉత్సాహానికి మారుపేర్లు- తెలిసిందా? సరే ఇదిచెప్పు? నీకు హృదయం ఉన్నదా? లేదా?"

"ఉన్నదనే అనుకుంటానండీ! " అన్నాడు పొఖోర్ఘుయ్.

"ఉంటే ఇంకేం? నీకు ఉత్సాహం ఉన్నదన్నమాటే! " అన్నాడు ఒర్గునోవ్.

# 37

# కొత్తఫ్యాక్టరీలో

కొందరు విద్యార్థులు, మరికొంతమంది పిల్లలు కాలనీవిడిచి వెళ్ళారు. లాంఛనప్రాయంగా కాలనీసభ్యులు వారికి వీడ్కోలి చ్చారు: సభ జరిగింది. ఉపన్యాసాలు, విందుభోజనాలు జరిగాయి.

విద్యార్థులు వెళ్ళిపోతుంటే తక్కిన కాలనీసభ్యులు కంట తడి పెట్టారు. క్లావా కసిరినా వెళ్ళిపోతుంటే ఆడపిల్లలందరికీ ఎంతో విచారం కలిగింది' నెస్ట్రెంకో, కొరోస్, సెడోవ్‌నిచ్, గ్రాస్ మాన్‌లు వెళ్లిపోతుంటే ఎనిమిదవ దళసభ్యులు ఎంతగానో దుఃఖ పడసాగారు.

కాని వెళ్ళిపోతున్న పిల్లల స్థానంలో మళ్ళీ కొత్తపిల్లలు వచ్చి చేరుతున్నారు. కొందరు సరాసరి ఇండ్లదగ్గరనుంచి వచ్చి కాలనీలో చేరుతున్నారు. వాళ్ళను ఇగోర్ కాలనీసభ్యులుగా చేర్చు కుంటున్నారు.

కొత్తగా వచ్చిన పిల్లలకు మరీ అదృష్టం పట్టింది. బ్లమ్ పాతఫ్యాక్టరీ పూర్తిగా మూతపడింది. శిథిలావస్థలోనున్న 'స్టేడి యమ్' రూపు మాసిపోయింది. కాలనీలో కొత్తఫ్యాక్టరీ వెలిసింది!

ఇప్పుడు బ్లమ్ కొత్తఉద్యోగంలోకి మారాడు. కాలనీలో వస్తు సరఫరా శాఖకు ప్రధానోద్యోగిగా బ్లమ్ నియమితుడైనాడు. తాను ఉద్యోగం స్వీకరిస్తున్న రోజున తనకాపదవి ఇచ్చినందుకు అతను కాలనీ సభ్యులకు కృతజ్ఞత తెలిపాడు. పాతఫ్యాక్టరీలో పరిస్థి తులు అనుకూలంగా లేకపోయినా సభ్యులు గొప్పగా కృషి సలి

పారనీ, వారి అమోఘమైన కృషిఫలితంగానే కొత్తఫ్యాక్టరీ తయారైందనీ బ్లమ్ ప్రత్యేకంగా తనసంతసాన్ని వెలిబుచ్చాడు. ఈ సంవత్సరం తన జీవితంలో అద్వితీయమైనదని అన్నాడు. ఇలా అంటున్నప్పుడు అతని కళ్ళు చెమ్మగిలాయి.

ఆనాటి సాయంకాలం జకరోవ్ ఆఫీసులో బ్లమ్ కూచున్నాడు. తాను నిర్వర్తించవలసిన విధులను గురించి అడిగి తెలుసుకుంటున్నాడు.

"మీరంతా ఇప్పుడు నాకో సమరభూమి అప్పచెప్పారు! నేను చచ్చినాసరే, బ్రతికినాసరే– ఈ సమరంలో నేను గెలిచితీరుతాను!" అన్నాడు బ్లమ్.

"సమరభూమి ఏమిటీ?" అని అడిగాడు జకరోవ్.

"నాకు మీరు అప్పచెప్పిన సరఫరాశాఖయ్యా– ఇటు సూర్యుడు అటు పొడిచినాసరే మీకు కావలసిన వస్తువులు సప్లయి చేస్తాను: మీకు ఏ ఇబ్బందీ కలిగించను." అన్నాడు బ్లమ్.

"నీవు సామాన్యుడివటయ్యా! నీపేరులోనేఉన్నది పెన్నిధి!"

కాలనీకి కొత్తపిల్లలు వచ్చినవెంటనే వాళ్ళకు పనులు అప్పచెప్పారు. కొత్త ఫ్యాక్టరీలో పనిచేయమన్నారు. వాళ్ళకెంతో ఉల్లాసమనిపించింది. కొత్త ఫ్యాక్టరీలో పనిచేస్తుంటే వాళ్ళకేదో దేవలోకంలో ఉన్నట్టనిపించింది.

యంత్రశాల చాలా అందంగా నిర్మించారు. పూర్వంలాగా అది ఇప్పుడు క్రిందలేదు. మేడమీద ఉంది. యంత్రశాలలో మొత్తం యాభైమిషన్లుఉన్నాయి. అన్నీ సరికొత్తవి. కొన్ని రష్యాలోను, మరికొన్ని విదేశాలలోను తయారైనవి. ఒకటి తెల్లగా, ఒకటి పచ్చగా, ఒకటి ఎర్రగా, ఇలా రంగురంగులతో మెరుస్తున్నాయి ఆ మిషన్లు. ఒకమిషను కొమ్సొమోల్ సభ్యుల అజమాయిషీ క్రింద ఉన్నది. ఆ మిషను మీద మూడవదళం, పదవదళం పనిచేస్తున్నాయి. మరొకమిషను జిరియాన్స్కీ, పోర్షినేవ్, ఎనోవిస్కీల అజమాయిషీక్రింద

ఉన్నది. ఇలాగే ఎవరి బాధ్యతలు వారు స్వీకరించారు. యంత్ర భాగాలను అమర్చే శాలలో ఆడపిల్లలు, చిన్నపిల్లలు పని చేస్తు న్నారు. కొత్త యంత్రాలను ఎలా నడపాలో, పని సులువుగా ఎలా చెయ్యాలో కాలనీ సభ్యులకు కాలనీలో బోధిస్తున్నారు. అందుకు ప్రత్యేకంగా శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నారు. కొత్తగా చేరిన పిల్లలంతా ఎంతో శ్రద్ధాభక్తులతో తరగతులకు హాజరవుతున్నారు. రకరకాల యంత్రాలను ఎలా నడపవలసిందీ నేర్చుకుంటున్నారు. బోధకులు వాళ్ళ చురుకుదనము, చాక చక్యము చూచి మెచ్చుకుంటున్నారు.

ఇంజనీరు కొమొరోవ్‌కు, విమానాలకు పనికివచ్చే విద్యు త్పరికరాలను ఉత్పత్తిచేసే శాఖను అప్పగించారు. అతని అజమా యిషీక్రింద దళ సభ్యులు చురుకుగా పని ప్రారంభించారు. ఒకనెల గడిచింది. ఎన్నెన్నో విద్యుత్పరికరాలు తయారవు తున్నాయి. కాని పని తొందరతొందరగా చేయడంవల్ల పనిముట్లు అనుకున్నంతబాగా లేవు. అందుకు కొమొరోవ్‌ను సంజాయిషీ అడిగారు కొమోసామోల్ సభ్యులు. ఏంచెప్పాలో తోచక కొమొ రోవ్ తెల్లబోయాడు. కొత్తగా ప్రధాన ఇంజనీరు బాధ్యత స్వీక రించిన ఒర్లునోవ్ వంక దీనంగా చూచాడు.

"నావంక ఎందుకయ్యా అలా చూస్తావు? వాళ్ళు అడుగు తున్నారుగా? అడిగినదానికి ఏం చెబుతావో చెప్పు!" అన్నాడు ఒర్లునోవ్.

ఇంతసేపూ ఊరిక కూచున్న ఫిల్కా-షేరీ ఉండబట్టలేక ఇలా అన్నాడు:

"కొమొరోవ్ పొరపాటు చెయ్యడానికి వేరేకారణమున్నది లెండి, వాసిల్యావ్నా ప్రేమలోపడి పాపం తన్ను తానే మర్చి పోతున్నాడు! ఇహ పనిమాట ఎలా జ్ఞాపకం ఉంటుంది!"

"ఫిల్కా! సరిగ్గా మాట్లాడు! పిట్టకొంచెం, కూతఘనం! ఓహో, ఊరుకున్నకొద్దీ వ్యవహారం ముదురుతున్నదే! సమావేశం నుంచి బయటికి పంపించాలా?" అని గద్దించాడు టార్‌స్కీ.

ఫిల్కా చేసేదిలేక వెర్రిముఖం వేశాడు. కుక్కినపేనులా కూచుండిపోయాడు. కాని అతనలా మాట్లాడడం వల్ల కొమొరోవ్ కళవళపడ సాగాడు:

"నేనిక్కడ పనిచేయడానికి వచ్చాను. అడ్డమైన ప్రశ్నలకూ సమాధానాలు చెప్పడానికి నేను రాలేదు" అన్నాడు.

ఆ సాయంకాలమే కొమొరోవ్ తన రాజీనామాపత్రం వ్రాసి జకరోవ్ దగ్గరికివెళ్ళి దాఖలు చేసుకున్నాడు.

"నీవు రాజీనామా చెయ్యవలసినఅవసరం ఏంవొచ్చింది?" అని అడిగాడు జకరోవ్.

"ఆ, నేను ఉద్యోగానికి రాజీనామా పెట్టకతప్పదు. నన్నలా అడగడానికి వాళ్ళకున్న హక్కేమిటి? నా వ్యక్తిగత జీవితంతో వాళ్ళకేమిటి సంబంధం?" అన్నాడు కొమొరోవ్.

"ఎందుకయ్యా అంతగాభరా? నీ వ్యక్తిగత జీవితంలో నీవు సిగ్గుపడవలసిందేమీలేదు. వాసిల్యవ్నాను నీవు ప్రేమించావని మా అందరికీ తెలుసును. నీమీద మాకు సానుభూతి ఉన్నది. అందుకు మేం నిజంగా సంతోషిస్తున్నాం. ఫిల్కా కుర్రకుంక! వాడికేం తెలుసు? ఏదో అన్నాడు. వాడి మాటలు లెక్కపెడతావటయ్యా!" అన్నాడు జకరోవ్.

ఇది జరిగిన పదిరోజులవరకూ కొమొరోవ్ వాసిల్యవ్నాతో మాట్లాడలేదు. మరో పదిరోజులు గడిచింది. కమాండర్ల కౌన్సిలుతో కొమొరోవ్‌కు మళ్ళీ పేచీ వచ్చింది. ఈసారి కారణంవేరు. తనదగ్గర పనిచేస్తున్న రెట్కాను యంత్రశాలకు మార్చాలని కౌన్సిలు సభ్యులు నిర్ణయించారు. ఈనిర్ణయాన్ని కొమొరోవ్ తీవ్రంగా వ్యతిరేకించాడు:

"అలా మీరు రెట్కాను నాదగ్గరనుంచి మరోచోటికి బదిలీ సేసినట్లయితే ఇహ నేనీ ఫ్యాక్టరీలో పనిచెయ్యను. తక్షణం బయటికి వెళ్ళిపోతాను" అన్నాడు కొమొరోవ్ కోపంగా.

అతనిలా తీవ్రంగా ఎదిరించేసరికి చివరకు కౌన్సిలు అతని కోరికను మన్నించింది. అంచేత కొమొరోవ్ ఆ సాయంకాలం చాలా ఉత్సాహంగా ఉన్నాడు. వాసిల్యవ్నాతో కులాసాగా గడిపాడు.

బ్లమ్ పని చేస్తున్న కార్యరంగం అతనికి సుకరంగా లేదు. నానాటికీ ఏవేవో అడ్డంకులు వస్తున్నాయి. కొత్త భవనాలు నిర్మించడంలో ఉన్న ధనమంతా వ్యయమైపోయింది.

"మనకు కంట్రాక్టులు వచ్చిపడుతున్నాయి. 'బరమాలు' మనం సప్లయిచేస్తే మన చేతిలో డబ్బు పడుతుంది" అన్నాడు బ్లమ్.

" ఇంకా వాటిని మన ఫ్యాక్టరీలో తయారుచెయ్యలేదే " అన్నాడు జకరోవ్.

"ఇంతవరకూ చెయ్యకపోతే ఇహ ముందు చేస్తారుకదా! "

"చేస్తాం కాని, మొదట చేసినవి అంతబావుండవు."

"బాగులేకపోతే మనకేమయ్యా! వాటిని మనం అమ్మకో లేకపోతే కదా" అన్నాడు బ్లమ్.

"అలా ఇష్టంవచ్చినట్లు అమ్మకూడదు మనం. మంచివస్తువులు లేనప్పుడు వాటిని మనం అమ్మకపోవడమే మంచిది"అన్నాడు జకరోవ్.

"అలా అనకు నీకుపుణ్యాం ఉంటుంది. మంచో, చెడ్డో- ముందు వాటిని అమ్మకపోతే లాభంలేదు. ఇహఇక్కడ నేనుండి ప్రయోజనమేమిటి? వాటిని అమ్మడం నీకిష్టంలేకపోతే నాకు బదులుగా మరొకణ్ణి నాస్థానంలో నియమించండి" అన్నాడు బ్లమ్.

ఇందుకు జకరోవ్ ఏమీ మాట్లాడలేదు

కొత్త ఫ్యాక్టరీని సక్రమంగా నడపడమంటే చాలాశ్రమతో కూడిన పని. కాలనీసభ్యులంతా సతమతమయిపోతున్నారు. ఎప్పటికప్పుడు ఏవేవో కొత్తసమస్యలు వచ్చి మీదపడుతున్నాయి. బ్లమ్

లాగానే, నాలుగోదళ సభ్యులుసయితం అన్నివిధాలా శ్రమపడు తున్నారు. కొత్తఫాక్టరీ నిర్మాణంతో తమ జీవితంలో నూతన అధ్యాయం ఆరంభమైనదని కాలనీ సభ్యులు భావించారు. అక్టోబరు విప్లవంతో సోవియట్ ప్రజలకు నూతనజీవితం ప్రారంభ మైనట్లే, నూతన కర్మాగారం నిర్మించడంతో కాలనీసభ్యులకు సరికొత్త జీవితం ఆరంభమైంది. ఇదేభావం అందరిహృదయా ల్లోనూ నిండి ఆనందంలో ముంచివేస్తున్నది. తాము ఫ్యాక్టరీలో ఎప్పుడు 'బరమాలు' తయారు చేస్తామా, ఎప్పుడవి ఎర్రసైనికు లకు అందుతాయా అని కాలనీ సభ్యులు ఉవ్విళ్ళూరుతున్నారు. తాము ఎర్రసైనికులకు అవసర మొచ్చినన్ని వస్తువులను ఉత్పత్తి చేయగలిగినపుడు ఆ వస్తువులకోసం తమ సోవియట్ ప్రభుత్వం ఇతర దేశాలమీద ఆధారపడవలసిన అగత్యం లేదు ఆ తరుణం కోసం కాలనీ సభ్యులు కళ్ళు కాయలు కాచేలా కనిపెట్టుక కూచు న్నారు.

ఇగోర్ చెర్నియావిన్‌కు ఫ్యాక్టరీలో చక్కని మిషను ఒకటి అప్పచెప్పారు. అది శాంప్సన్ కంపెనీవారు తయారుచేసిన మిషను. దాంతో వస్తువులకు బాగా నగిషీ పెట్టవచ్చు. అది యంత్రశాలలో ఒకమూల ఉన్నది.

"ఈ మిషను ప్రపంచంలోకల్లా చాలా ఉత్తమమైనది!" అన్నాడు ఇగోర్.

ఇగోర్ ఉదయాన్నేవచ్చి మిషనుదగ్గర పనిచేస్తూ ఉంటాడు.

ఈ మిషను బాగా పనిచేయడానికి ప్రత్యేకంగా దీనికొక నూనె అవసరం. బ్లమ్ చాలా కష్టంమీద ఒక నూనెసీసా సంపా యించి ఇగోర్‌కు ఇచ్చాడు. ఇగోర్ దాన్ని భద్రంగా తన మిషన్ డ్రాయరులో దాచుకున్నాడు.

ఒకనాడు ప్రొద్దున్నే యంత్రందగ్గిరకొచ్చి నూనెసీసాకోసం డ్రాయరు తెరిచి చూచాడు. కాని నూనెసీసా కనుపించలేదు. మరెక్కడైనా పెట్టి మరిచిపోయానేమోనని మొదట అనుకున్నాడు. అన్నిచోట్లా వెదికి చూసాడు. కాని ఎక్కడా అగుపించలేదు.

"నిన్ననే మిషన్‌కు నూనె పట్టించి నూనెసీసా ఇక్కడ పెట్టాను! ఎలా మాయమైంది?"

ఇగోర్ మిషనుప్రక్కనే ఉన్న మరో మిషనుదగ్గిర ఫిల్కా షేరీ పనిచేస్తున్నాడు. ఇగోర్ తన నూనెసీసా అతను తీశాడేమో నని అనుమానించాడు.

కాలనీలో మళ్ళీ దొంగతనాలు ప్రారంభమైనాయి. కొత్త ఫ్యాక్టరీలోపనిముట్లు పోవడం మొదలుపెట్టాయి. ప్రతిరోజూ ఏదో ఒకవస్తువు మాయమవుతూనే ఉంది! సామానుగదికి తాళంవేయించి ఉంచాడు జకరోవ్. అయినా లాభం లేకపోయింది. అక్కడ కాక పోయినా, కాలనీలో ఎక్కడో ఒకచోట దొంగతనాలు జరుగు తూనే ఉన్నాయి!

రోజూ ఏమేమి వస్తువులు కనబడకుండా పోతున్నాయో, అన్నీ ఒకజాబితా వ్రాసిపెడుతున్నాడు బ్యాంకొవిస్కీ. ఆజాబితా మీాద ఒర్గునోవ్ సంతకం చెయ్యవలసివుంటుంది. సంతకంచేయించే నిమిత్తం ఒకనాడు ఆ జాబితా తీసుకుని ఒర్గునోవ్ దగ్గరికివెళ్ళాడు బ్యాంకొవిస్కీ.

"ఇదేమిటయ్యా ఈగోల? కాలనీలో సగంమంది దొంగ వెధవల్లాగా ఉన్నారు!" అంటూ కోపంగా జాబితామీాద సంతకం పెట్టాడు ఒర్గునోవ్. తరువాత జకరోవ్ ఆఫీసుకు వెళ్ళాడు:

"ఇలాగ అయితే మనం ఎలా చస్తామయ్యా జకరోవ్! ఒకటా, రెండా! చాలా వస్తువులు పోయాయి! మైక్రోమీాటర్లు కూడా మాయం చేశారయ్యా! అవి చాలా ఖరీదు." అన్నాడు ఒర్గునోవ్.

ఇదివిని జకరోవ్ ఏమీా మాట్లాడలేదు. కూర్చీ వెనక్కు జరుపుకొని కూచున్నాడు. బల్లమీాద మోచేతులానించి కొంతసేపు ఆలోచించాడు.

"మన కాలనీలో ఎంతమంది దొంగవెధవ లున్నా రంటావు?" అని అడిగాడు మళ్ళీ ఒర్గునోవ్.

"ఎక్కువమంది ఉండరు. కాని వాళ్ళుకూడా మానాభి మానాలు ఉన్నవాళ్ళే! ఫ్యాక్టరీలో వస్తువులు వాళ్ళు దొంగిలించి ఉండరు." అన్నాడు జకరోవ్.

"వాళ్ళు కాకపోతే మరెవరు తీస్తారంటావు? రాత్రిళ్ళు నాకు నిద్రపడితే ఒట్టు! ఇలా మనం ఊరుకుంటే మరికొన్నాళ్ళకు ఫ్యాక్టరీ మొత్తం ఊడగొట్టి పట్టుకపోతారు!" అన్నాడు ఒర్లునోవ్ అసహనంగా.

అంతటిలో వారి సంభాషణ ముగిసింది. ఇగోర్ పోయిన తన నూనెసీసాకోసం ఇంకా వెతుకుతూనే ఉన్నాడు. కాని ఎక్కడా అది దొరకలేదు. కాలనీలో పిల్లలు పోయిన మైక్రో మీటర్లకోసం గాలించివేస్తున్నారు, అవి ఎలా మాయమైనాయో వాళ్ళకే ఆశ్చర్యంగా ఉంది!

ఒకనాడు రైజికోవ్ కమాండర్ డ్యూటీలో ఉన్నాడు. భోజనాలయ్యాక అతను జకరోవ్ ఆఫీసుకు వెళ్ళి ఇలా ఫిర్యాదు చేశాడు:

"ఇవాళ మరోదొంగతనం జరిగింది అలెగ్జీ! సానపట్టే పరి కరాలు పోయాయి!"

"ఏమిటీ?"

"ఉన్న పరికరాలన్నీ ఊడ్చుకపోయారు! మొత్తం పద్దెనిమిది!"

"బాగానే ఉంది."

"ఇవాళ మనం కాలనీ అంతా సోదాచేద్దాం అలెగ్జీ." అన్నాడు మళ్ళీ రైజికోవ్.

"వద్దు, సోదావద్దు ఏమీవద్దు" అన్నాడు జకరోవ్, సాలోచనగా.

రైజికోవ్ దీర్ఘంగా నిశ్వసించి, జకరోవ్‌కు శాల్యూట్ చేసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

# 21

# దొంగలు!!

సాయంత్రం అయిదుగంటలయింది. ఫిల్కా-షేరీ, వాన్యా గల్చెంకోలు జకరోవ్ కార్యాలయంలోనుంచి బయటికి వచ్చారు. కమాండర్ల సమావేశం జరగనున్నదని బిగోనక్ బిగిల్ ఊదాడు. బిగిల్ కూతవిని రైజికోవ్ ఆశ్చర్యపోయాడు. ఆవేళ అతను కమాండర్ డ్యూటీలో ఉన్నాడు. తనకు తెలీకుండా, బిగోనక్ ఎందుకు బిగిల్ ఊదాడు? అదేదో కనుక్కుందామని అతను తిన్నగా జకరోవ్ ఆఫీసుకు వెళ్ళాడు.

"క్షమించాలి రైజికోవ్! ఇది చాలా అత్యవసర సమావేశం! ఇవాళ భోజనాలకు కొంచెం ఆలస్యం అయితే అవుతుందిలే, సమావేశం ముగిశాక భోజనాలు చేద్దాం" అన్నాడు జకరోవ్. అక్కడికి కమాండర్లంతా వచ్చేలోపునే ఇగోర్ చెర్నియావిన్, జకరోవ్ దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు:

"నా మూనెసీసాను ఫిల్కా వాన్యాలు దొంగిలించారు! వాళ్ళను ఒకసారి పిలిపించి అడగండి."

"వాళ్ళు దొంగిలించినట్లు నీకు రుజువు ఉన్నదా?" అని అడిగాడు జకరోవ్.

"రుజువు ఉన్నట్టయితే వాళ్ళను పిలిపించమని మీతో ఎందుకు చెబుతాను? కమాండర్ల కౌన్సిలులోనే ఈ విషయం చర్చకు పెడుదును. కనుక ముందు వాళ్ళను పిలిపించి అన్నీ అడగండి. వాళ్ళ మిషన్లు, నామిషన్లు ఒకచోటనే ఉన్నాయి. ఇది వాళ్ళపనే, మరెవరిపనీ కాదు."

ఇగోర్ ఇలా చెపుతున్నప్పుడు ఒర్లునోవ్, బ్లిమ్, వాసిల్యేవ్లు ఆఫీసులో కూచుని ఉన్నారు. వాళ్లు అక్కడ ఉన్నారని ఇగోర్ ఏమీభయపడలేదు. తనుచెప్పదలుచుకున్నది జకరోవ్‌తో చెప్పాడు. అంతా విని జకరోవ్ నవ్వుతూ ఇలా అన్నాడు:

"నే నేంచేసేది ఇగోర్?"

"వాళ్ళను పిలిపించి గట్టిగా చీవాట్లు పెట్టండి ... వెళ్ళి పిలవమంటారా?"

"సరే, పిలుచుకరా."

ఇగోర్ అక్కడనుంచి వెళ్ళిపోయి క్షణంలో ఫిల్కా, వాన్యాలను పిలుచుక వచ్చాడు.

"పదండి, లోపలికి పదండి!" అన్నాడు ఇగోర్ వాళ్ళను జకరోవ్ ఆఫీసులోకి పంపిస్తూ.

వాళ్ళిరువురూ లోపలికి వచ్చి జకరోవ్‌కు శాల్యూట్ చేశారు. వాన్యా బల్లమీద కూచున్నాడు. ఫిల్కా బల్లకు ఆను కుని నిలుచున్నాడు. తరువాత జకరోవ్ వాళ్ళను ఇలా ప్రశ్నిం చాడు:

"ఇదిగో అబ్బాయిలూ! ఇటు చూడండి! మీరిద్దరూ తన నూనెసీసాను దొంగిలించారని ఇగోర్ ఫిర్యాదు చేస్తున్నాడు. ఇందుకు మీరేం సమాధానం చెపుతారు?"

ఫిల్కా, ఇగోర్ వంక తేరిపారచూచి ఇలా అన్నాడు:

"నీ సీసా మేం దొంగిలించామా ఇగోర్! తమాషాగాఉందే! మేందొంగిలి ·చలేదు. మాకేం తెలియదు"

"కాదు మీరే దొంగిలించారు" అన్నాడు ఇగోర్.

"జాగ్రత్తగా ఆలోచించు. ఆలోచించి మరీ మాట్లాడు. మా ఇద్దరికీ నీ సీసాతో పనిలేదు. నీమాత్రం నూనెసీసాలు మాకూ ఉన్నాయి." అన్నాడు ఫిల్కా.

"మాకూ ఉన్నాయి కాని నా సీసావంటివి లేవు నా నూనె సీసా మంచిరకంది. మీవాటికంటే ఖరీదు హెచ్చుకూడా."

"ఓహో. నీది మేలిరకమా? అదెక్కడపోయింది? ఎక్కడ దాచుకున్నావు దాన్ని?"

"నేను ఎక్కడ దాచుకున్నదీ మీా ఇద్దరికీ తెలుసును. మిషన్ దగ్గర డ్రాయర్లో దాచుకున్నాను."

"అసలు నీదగ్గర ఆ సీసా వున్నట్లే మాకు తెలీదు! ఏమం టావు వాన్యా?" అంటూ ఫిల్కా వాన్యావంక చూచాడు.

కాని వాన్యాకు, ఫిల్కా మాట్లాడే ధోరణి నచ్చలేదు, అతను ఎవరివంక చూడక గది నాలుగువైపులా పరికించ సాగాడు. ఫిల్కా అడిగినదానికి అవునన్నట్లు తలమాత్రం ఊపాడు వాన్యా.

"వెధవ అబద్ధాలు ఆడకురా ఫిల్కా! నాదగ్గర నూనెసీసా ఉన్నట్లు నీకు తెలీదూ? నీ మిషనుకు నూనె కావాల్సివచ్చి ఎన్ని సార్లు నన్నడిగావు? అడిగితే నేనివ్వలేదూ? దొంగా! అబద్ధాలు చెపుతున్నావా?" అన్నాడు ఇగోర్.

"అవును, అడిగాను అన్నాడు ఫిల్కా.

"నాదగ్గరఉన్న నూనెసీసా లాంటిది ఒకటి కొనిపెట్టమని నీవు బ్లమ్‌ను మాటిమాటికీ అడుగుతూనేఉన్నావు. అవునా?" అన్నాడు ఇగోర్.

"అవును, అడిగాను. అందులో తప్పేమిటి? అన్నాడు ఫిల్కా.

"తప్పేం లేదోయ్. కాని నాలుగురోజుల నుంచీ బ్లమ్‌ను అలా అడగడం మానేశావు! అంటే ఏమిటి దానిఅర్థం?"

"అవును. ఎంతకాలం ఆయన ప్రాణాలు కొరుక్కుతింటాం. అడిగీ అడిగీ నోరు నొప్పెట్టి ఊరుకున్నాం. నీకంటే కొనిపెట్టాడు, మాకెందుకు కొనిపెడతాడు? నీవంటే ఆయనకిష్టం!" అన్నాడు. ఫిల్కా

"ఆరి కుర్రకుంకా! కొంటెవాడివే!" అంటూ బ్లమ్ ఫిల్కా వంక చూచాడు. ఫిల్కా చిరునవ్వు నవ్వాడు. వాన్యా ఏమీా మాట్లాడలేదు.

"అయితే ఫిల్కా! నీవు స్టిమిషన్‌కు నూనె ఎలా పట్టిస్తున్నావు చెప్పు?" అని అడిగాడు ఇగోర్.

"మామూలుగానే- మామూలుగానేనయ్యా." అన్నాడు ఫిల్కా.

"నాకు తెలుసునురా తమ్ముడూ! నాదగ్గర దొంగవేషాలు వెయ్యకు. కాలనీలో ఎవరూ లేవకముందే నీవు లేచి రోజూ యంత్రశాలకు వెడుతున్నావు. నా నూనెసీసా తీసుకుని నీ మిషనుకు నూనె పట్టించుకుంటూ ఉంటావు. లోపల నీవీపని చేస్తుంటే ఎవరూ రాకుండా బయట వాన్యా కాపలా ఉంటాడు! ఇదే జరుగుతున్న తంతు! మీ రిద్దరూ తోడుదొంగలురా అబ్బాయి!" అన్నాడు ఇగోర్.

జుకరోవ్ ఫిల్కావంక చూచాడు. ఫిల్కా ముఖం వెలవెల బోతున్నది.

"మాకుతోచినట్టు మా మిషనుకు నూనె పట్టించుకుంటున్నాం" అన్నాడు ఫిల్కా.

"కావాలంటే మాలాగే నీవూ అందరికంటే ముందుగాలే, నీ మిషనుకు నూనె పట్టించుకో. ఎవరొద్దన్నారు?" అన్నాడు వాన్యా, ఫిల్కాకు పక్కతాళంవేస్తూ.

ఇతంతా విని జకరోవ్ నవ్వాడు. తరువాత ఇలాఅన్నాడు:

"ఇహ మీరిద్దరూ వెళ్ళిపొండిరా కుర్రాళ్ళూ!"

ఫిల్కా, వాన్యాలు జకరోవ్‌కు శాల్యూట్ చేసి అక్కడ నుంచి వెళ్లిపోయారు. కమాండర్లందరూ సరదాగా నవ్వులో సాగారు. ఇగోర్ మాత్రం భీష్మించుకుని కూచున్నాడు.

"ఇప్పటికైనా నిజం తెలుసుకున్నారా? వాళ్ళిద్దరికీ ఏం శిక్ష విధిస్తారు? అని అడిగాడు ఇగోర్.

"తొందర పడకోయ్ చెర్నియావిన్! నీకు మరో సీసా కొని పెడతాంలే. వాళ్ళను ఆసీసా వాడుకోనీ. పాపం ఆ కుర్రకుంకలకు మిషన్లంటే ఎంతో ప్రేమ!" అన్నాడు బ్లమ్

"చేసిన దొంగతనానికి శిక్షఏమీ లేదన్నమాట!" అని మళ్ళీ అడిగాడు ఇగోర్.

"నేనూ వాళ్ళూ ఇష్టంగాఉంటున్నాం. వాళ్ళకు అలాంటి నూనెతో అవసరమొచ్చి అది పట్టుకపోయారు. పోనిలే... కాని ఆ సీసా ఎక్కడ దాచారంటావు? వాళ్ళపడక గదులన్నీ నేను వెదికి చూచానే?" అన్నాడు బ్లమ్.

"మీరు వెదకడానికి వెళ్ళినప్పుడు వాళ్లు గదుల్లోఉన్నారా అని అడిగాడు ఇగోర్. "ఆఁ అక్కడే ఉన్నారు." అని చెప్పాడు బ్లమ్.

అదే సమయానికి బంకోవిస్కీ అక్కడికి వచ్చాడు. వాకిట్లో నుంచి లోపలికి తొంగిచూచి ఇలా అన్నాడు:

కౌన్సిలుసభ్యులు నన్ను రమ్మని పిలిచారట, అవునాఅలెగ్జీ?"

"అవును. చాలా ముఖ్యమైన విషయం చర్చించాలి. అత్యవసర సమావేశం ఏర్పాటు చేశాం." అన్నాడు జకరోవ్.

"చిత్రికపట్టే పరికరాలను గురించేనా?"

"ఒక్కవాటినిగురించేకాదు, ఇంకా చాలావాటిని గురించి"

బంకోవిస్కీ అవతలికి వెళ్ళిపోయాడు.

"చిత్రికపట్టే పరికరాలను గురించి సమావేశంలో చర్చిస్తారని నాకు తెలీదే!" అన్నాడు ఒర్లనోవ్.

బిగోనక్ గది తలుపు తెరిచి "కౌన్సిలు సభ్యులంతా సమావేశమైనట్టే" అన్నాడు.

తరువాత టార్స్కీ లోనికి వచ్చాడు. వెంటనే సమావేశం ప్రారంభించాడు.

"మొదట జకరోవ్ మాట్లాడతాడు." అన్నాడు టార్స్కీ జకరోవ్ ఒకమాటు చుట్టూ కలయచూచి అన్నాడు:

"నేచెప్పే విషయాలు అంతగా ఏమీలేవు. ఫిల్కా షేకీని మాట్లాడమనండి. వాడు మీకో నివేదిక అందచేస్తాడు!" అన్నాడు జకరోవ్.

"నివేదికా? ఫిల్కా సమర్పిస్తాడా?"

"అవును, చాలా ముఖ్యమైన విషయంమీద నివేదిక అది. అతను చెప్పేది జాగ్రత్తగా వినండి."

తరువాత ఫిల్కా మేకి లేచి నిలుచున్నాడు. టార్‌స్కీ బల్ల దగ్గరికి మెల్లగా నడిచివెళ్ళాడు. విడా టాలికోవ్నా వంక చూస్తూ కొద్దిసేపు ఊరుకున్నాడు. ఆమె చిరునవ్వు నవ్వింది. పిమ్మట ఇలా చెప్పసాగాడు ఫిల్కా.

"ఇవాళ ప్రొద్దున్నే ఎవరూ లేవకముందే నేనూ, వాన్యా కలిసి యంత్రశాలకు వెళ్ళాం."

"ఎందుకూ? మీ మిషన్లకు నూనె పట్టించే టందుకా?" అని అడిగాడు మెల్లగా ఒర్లనోవ్.

కమాంశర్లందరూ గొల్లున నవ్వారు.

"మా మిషన్లకు నూనె పట్టించుకోవడానికి మాకు హక్కున్నది."

"దేనితో?—దొంగిలించిన నూనెతోనా?"

"చూశారా టార్‌స్కీ...మామీద దొంగతనం మోపుతున్నాటు! ఇది చాలా అవమానకరం."

"దానికేంలే! అతని మాటలు పట్టించుకోకు. నీవు చెప్పేది చెప్పు."

మళ్ళీ ఫిల్కా చెప్పసాగాడు:

"వాన్యా, నేనూ యంత్రశాలకు వెళ్ళాం. మా మిషనుకు నూనె పట్టించుకోవాలనుకున్నాం. ఇంతలో రైజికోవ్, బంకో విస్కీలు ఫౌండ్రీలోనుంచి మెల్లగా అక్కడికి వచ్చారు. వాళ్ళు ఏంచేస్తారో చూద్దామని మేము అక్కడున్న ఇగోర్ మిషను వెనకాల దాక్కున్నాం..."

ఇంతలో బయట పెద్దకోలాహలం వినిపించింది. పిల్లలు కేకలువేస్తున్నారు. ఎవరో కొట్టినట్లు చప్పుడయింది. తరువాత జిరియాన్‌స్కీ బిగ్గరగా అరవడం వినిపించింది.

"కాదు, నేను నిన్నొకకంట కనిపెడుతూనే ఉన్నాను. నీవు దొంగవు!" అంటున్నాడు జిరియాన్‌స్కీ.

అంతలో గదితలుపు దభేలున తెరుచుకున్నది. జిరియాన్‌స్కీ, రైజికోవ్‌ను ఒక్కతాపు తన్నాడు. రైజికోవ్ వచ్చి గది మధ్యలో బోర్లాపడ్డాడు. అతని పెదవుల వెంట నెత్తురుకారటం మొదలుపెట్టింది. కమాండర్లంతా పోయి అతనివంక చూడ సాగారు. అలజడిగా ఉండడంచూచి "నిశ్శబ్దం, నిశ్శబ్దం... ఏమిటి జిరియాన్‌స్కీ? ఏమిటిదంతా?... ముందా రైజికోవ్‌ను లేవతియ్యి బ్రాట్‌సన్" అని గద్దించాడు జకరోవ్.

రైజికోవ్ తనంతటతానే లేచి నిలుచున్నాడు. చొక్కాతో మూతి తుడుచుకున్నాడు. అతని భుజంమీదఉన్న కమాండర్ బాడ్జీని జిరియాన్‌స్కీ వచ్చి తీసేశాడు.

"ఇవాళ ప్రొద్దుటినుంచీ నేను వీడివాలకం కనిపెడు తున్నాను. ఇన్నాళ్ళకుదొరికాడుదొంగ!" అన్నాడుజిరియాన్‌స్కీ కోపంగా,

రైజికోవ్ గదిమధ్యలో అలాగే నిలుచున్నాడు. ఎవరూ అతన్ని కూచోమనలేదు. అతని వాలకంచూచి అతనే కాలనీకి శత్రువనీ, దొంగనీ అంతా అనుకోసాగారు. జిరియాన్‌స్కీ చెప్పిన విషయాన్ని రైజికోవ్ ఏమీ కాదనలేదు.

"సరే- దానిమాటకేం? తరువాత నీవు చూసిందేమిటో చెప్పు ఫిల్కా?" అని అడిగాడొక కమాండర్.

"ఆ తరువాత - మేమిద్దరం ఇగోర్ మిషను ప్రక్క దాక్కున్నాం. బంకొవిస్కీ రైజికోవ్‌తో ఇలా అన్నాడు. 'నిన్న రాత్రి బెగ్లోవ్ సానపట్టే పరికరాలతో గడబిడచేశాడు. ఆ పరిక రాలు ఎక్కడఉన్నాయో నాకు తెలుసును.' రైజికోవ్, బంకొ విస్కీ లిరువురూ ఇలా మాట్లాడుకుంటూ ఒక డ్రాయరు దగ్గరికి వెళ్ళారు. ఆ డ్రాయరులోనుంచి పరికరాలు తీసుకున్నారు. రైజి కోవ్ ఇలా అడిగాడు: 'మొన్న మనం పట్టుకెళ్ళిన రెంచీలను

అమ్మేసేవా? 'లేదు, అవి అట్టే ఖరీదుండవు' అని చెప్పాడు బంకో విస్కీ. అప్పుడు రైజికోవ్ నవ్వుతూ 'యీసాన పట్టే యాత్రాలు కనుపించకపోతే మరీ తమాషాగా ఉంటుంది! ఇహ ఇప్పుడు వాళ్లు ఏంచేస్తారో చూద్దాం' అన్నాడు. అందుకు బంకోవిస్కీ 'ఇలాంటి బేవార్సు వెధవలేనట్రా కొత్త ఫ్యాక్టరీ కట్టేది?' అంటూ కోపంగా చూచాడు. అప్పుడు రైజికోవ్ మామూలుగానే ఉన్నాడు. ఇంత సేపూ నవ్వుతూ నిలుచున్నాడు. తరువాత వాళ్ళిద్దరూ ఆ పరిక రాలు తీసుకుని వెళ్ళిపోయారు. తరువాత మేం ఇవతలికొచ్చాం. ఈ గొడవలోపడి మిషనుకు నూనెపూసేమాటే మరిచిపోయాం. వెంటనే వెళ్ళి ఈ విషయమంతా జిరియాన్‌స్కీకి తెలియచేశాం. తరువాత జకరోవ్ దగ్గరికివచ్చాం." అంటూ ఫిల్కా-షేరీ జకరోవ్ వంక చూచాడు.

తరువాత బంకోవిస్కీని వచ్చి హాజరుకమ్మని కబురు పంపారు. వెంటనే అతను వచ్చాడు. విషయమంతా అతనికి అర్థమై పోయింది.

"దీనికి నీవేమంటావు బంకోవిస్కీ?" అని ప్రశ్నించాడు టూర్‌స్కీ.

బంకోవిస్కీ ముఖం వెలవెలపోయింది. కాని నిర్భయంగా "చెప్పడానికేమీ లేదు. ఆ కుర్రకుంకలు చెప్పినమాటలు మీరెలా నమ్ముతున్నారు?" అని అడిగాడు.

"అతను చెప్పేదేమీ లేదు, మనం వినేది అంతకన్నా లేదు —వెంటనే వెళ్ళి అతనిగది సోదా చేద్దాం" అన్నాడు జిరియాన్‌స్కీ.

"అలా మనం సోదా చెయ్యవచ్చునా? మనకు హక్కున్నదా?" అని అడిగాడు వారిలో ఒకరు.

"హక్కుమాటకేం? సోదా చేయడానికి బంకోవిస్కీయే సమ్మతిస్తాడు...ఏం బంకోవిస్కీ?" అన్నాడు జిరియాన్‌స్కీ.

"ప్రత్యేకంగా నాకు ఏమీ అభ్యంతరం లేదు. కాని ఒక్క మాట. నాగది సోదా చెయ్యడానికి మీకు హక్కులేదు. ఇలా

ప్రతివాళ్లూ ప్రతి ఒక్కరి గదీ సోదా చెయ్యడం మొదలుపెడితే ఏమవుతుందో మీరే ఆలోచించండి.'' అన్నాడు బంకొవిస్కీ.

"అలా అయితే నీ అనుమతితో పే మాకు అవసరంలేదు. వెళ్ళి సోదా చేస్తాం.'' అన్నాడు జకరోవ్ నిక్కచ్చిగా.

"చేతికి చిక్కిన అవకాశం జారిపోనీయకూడదు. ఒకరి అనుమతితో మనకేమీ ప్రమేయంలేదు. నీవు దొంగతనం చేస్తుండగానే పట్టుబడ్డావు.''

"ఎవరు నన్ను పట్టుకున్నది?'' అని అరిచాడు బంకొవిస్కీ

"ఎవరేమిటి? మేమే—మేమేనిన్ను పట్టుకున్నాం...... టార్‌స్కీ! వీడి గది సోదా చెయ్యడానికి ముగ్గురు మనుష్యులను పంపండి.''

సోదా చెయ్యడానికి ఒక కమీషన్ నియమింపబడింది. ఆ కమిషన్‌లో జిరియాన్‌స్కీ, ఇగోర్, పొఖోర్చుయ్‌లు ముగ్గురూ సభ్యులు.

"మీరు ముగ్గురూ వెళ్ళండి. దీనికి నాయకుడు జిరియాన్‌స్కీ. ఇహ వెళ్ళండి.'' అన్నాడు టార్‌స్కీ.

"బంకొవిస్కీని మా వెంట తీసుకెళ్ళమంటారా?'' అని అడిగారు కమిషన్ సభ్యులు.

"నేను మీ వెంట రాను—ఎక్కడికీ రాను. నా గది తాళాలు కూడా మీ చేతి కివ్వను. ఈ మీ చర్యను నేను తీవ్రంగా నిరశిస్తున్నాను.'' అన్నాడు బంకొవిస్కీ.

"ఎందుకంత గాభరా పడతావు బంకొవిస్కీ? తిన్నగా వాళ్ళవెంట వెళ్ళు'' అన్నాడు టార్‌స్కీ.

బంకొవిస్కీ, కమిషన్ సభ్యులవెంట వెళ్ళాడు.

అంతవరకూ గదిలో తమ ఎదుట రైజికోవ్ నిలబడి ఉన్నాడన్న విషయం అక్కడివారెవరికీ జ్ఞాపకం వచ్చిందికాదు.

"ఉండండి, ఉండండి! రైజికోవ్ ఏదో చెప్పబోతున్నట్లుంది'' అన్నాడు జకరోవ్.

రైజికోవ్ దీనంగా ముఖం పెట్టాడు. తనను అర్థంచేసికోవలసిందనీ, సానుభూతితో చూడవలసిందనీ అర్థిస్తున్నట్లున్నాయి అతని చూపులు. ముఖమంతా కుంచించుకపోయింది. ఉన్నదున్నట్లు ఏమాత్రం దాపరికంలేకుండా అంతా విపులంగా చెప్పాడు రైజికోవ్.

అలా చెప్పడంవల్ల కాలనీ సభ్యుల సానుభూతిని పొందవచ్చు ననుకున్నాడు. కాలనీలో మొదటినుంచీ జరిగిన దొంగతనాలన్నీ ఇప్పుడు బయట పడ్డాయి. ఓవర్ కోటు, తెరగుడ్డ, వెండి జేబుగడియారం, అన్నిరకాల పరికరాలు; ఇవన్నీ ఎలా పోయాయో సభ్యులందరికీ తెలిసిపోయింది. లెవిటిన్ పెట్టెలో తానే రెంచీలు పెట్టానని రైజికోవ్ ఒప్పుకున్నాడు. స్టేడియమ్‌కు రెండుసార్లు నిప్పు అంటించిందికూడా తానేనని అంగీకరించాడు. ఈ విషయాలన్నీ చెపుతున్నప్పుడు అతని నేత్రాలు అశ్రుపూరితాలైనాయి.

"బంకొవిస్కీ ఒకతడవ నాతో 'కమాండర్లను అందరూ అనుమానించేటట్టు మనం చేయగలిగితే అదీ గొప్ప! ఈ దొంగతనాలలో వాళ్ళను ఎలాగో ఒకలాగు ఇరికించాలి!' అన్నాడు. అందుకు నేను అంగీకరించాను. ఒలెంకో దగ్గరనుంచి వెండి గడియారం దొంగిలించాను. జిరియాన్‌స్కీనికూడా అనుమానించేటట్టు చేసి చిక్కుల్లో పెడదామనుకున్నాను. కాని అతను దొంగతనం చేశాడంటే ఎవరూ నమ్మరు. అందుచేత నా ప్రయత్నం మానుకున్నాను" అని చెప్పాడు రైజికోవ్.

అతను చెప్పినదంతా విని జకరోవ్ ఇలా అడిగాడు.

ఈ దొంగతనాలన్నీ ఎందుకొరకు చేశావు? డబ్బుకోసమా?

"ఇంకెందుకూ నాకుడబ్బు. బంకొవిస్కీ మాటలు విని భ్రష్టుడనైపోయాను. అతను మా నాయనను గురించి 'మీనాన్న చాలా హాయిగా, దర్జాగా బ్రతికేవాడు. ఇప్పుడు నీకున్న ఆస్థి అంతా అడుగంటిపోయింది. దీనికి కారణం ఎవరు? సోవియట్ ప్రభుత్వం' అంటూ వుండేవాడు. రోజూ ఇలాగే నాకు బోధించే

వాడు. అందుచేత అతను నాకు గురువు. నేనతనికి శిష్యుణ్ణి అయి పోయాం. అతను ఆడించినట్లల్లా ఆడాను. నేను మూర్ఖుణ్ణి. ఇంతకూ మా నాయనను గురించి అతనలా అభిమానంగా చెప్పడానికి అతను మాకేమన్నా బంధువా? నాకే మానాయనమీద అభి మానం లేదుగదా?"

"నిజమే, నిన్ను చూస్తే నాకు జాలివేస్తున్నది, పాపం!" అన్నాడు జిరియాన్స్కీ వ్యగ్యంగా.

రైజిగోవ్ జిరియాన్స్కీవంక చూచాడు. జిరియాన్స్కీ ముఖంలో ఎలాంటి జాలీ అగుపించడంలేదు. పైగా కోపంతో ఎర్రగా పొంగిఉన్నది అతని ముఖం.

ఒకగంట పోయిన తరువాత క్రుట్జర్ అక్కడికి వచ్చాడు. అతన్ని రమ్మని జకరోవ్ ఫోన్ చేశాడు. క్రుట్జర్ మామూలుగానే నవ్వుతూ లోనికి వచ్చాడు. కాని అందరూ నిశ్శబ్దంగా, గంభీరంగా కూచుని ఉండడంచూచి. "మొత్తంమీద దొంగలు దొరికిపోయా రన్నమాట? వాళ్ళగదులు సోదా చేశారా?...బావుంది. సానపట్టే పరికరాలు దొరికాయా?... రెంచీలో?...ఆతోడుదొంగలు ఇరువు రితోటీ నేను వేరుగా మాట్లాడాలి. బంకోవిస్కీ ఒక్కడితోటే రెండు ముక్కలు రహస్యంగా చెప్పాలి." అన్నాడు క్రుట్జర్.

బంకోవిస్కీతో మాట్లాడి మళ్ళీ అయిదు నిముషాల సేపట్లో జకరోవ్ ఆఫీసుకు తిరిగి వచ్చాడు క్రుట్జర్. ఈ వ్యవహార మంతా చాలా చిక్కుగా ఉన్నది! ఈ ముడి విప్పాలంటే ఆంత రంగిక ప్రజా సమితే విప్పాలి. వీళ్ళిద్దర్నీ మనం నగరానికి పంపించి వేద్దాం. సమితి వాళ్ళు అక్కడ వీళ్ళ వ్యవహారం తేల్చివేస్తారు ...జకరోవ్! మంచి వస్తాదుల్లాంటి కుర్రాళ్ళను ఆరుగురిని ఏరండి —వీళ్ళిద్దరికీ కాపలాగా నగరానికి పంపడానికి" అన్నాడు క్రుట్జర్.

"వాళ్లను మనం పారిపోనిస్తామటయ్యా! అన్ని కట్టుదిట్టాలు చేసి మరీ పంపుతాం." అన్నాడు జకరోవ్.

"పోనీ జిరియాన్‌స్కీని పంపుదాం."

"అమ్మో- అతనితోనే వెళ్ళను. మధ్యలో అతను నన్ను చంపేస్తాడు!" అన్నాడు గ్రైజికోవ్.

"ఏమయ్యా? నీవు వాణ్ణి చంపేస్తేవా?" అని అడిగాడు జకరోవ్.

"ఏమో? ఎవరుమాట ఇస్తారు చంపనని-" అన్నాడు జిరియాన్‌స్కీ.

"ఇంకా ఎవర్ని పంపుదాం?" అని అడిగాడు క్రుట్జర్.

"ఇగోర్‌ను పంపుదాం."

"అలాగే వెడతాను...కాని జకరోవ్! ఒకమాట, త్రోవ పొడుగునా వీడిని తంతూ తీసుకెడతాను. ఒలెంకోపేరు చెప్పి నాలుగుతన్నులు తంతాను!" అన్నాడు ఇగోర్.

"ఏమిటిదంతా? జిరియాన్‌స్కీ, ఇగోర్, పాఖోర్ఘుయ్, బ్రాట్‌సన్: పోర్షినీవ్, మీ అయిదుగురూ వాళ్ళిద్దరివెంట వెళ్ళండి" అని ఆజ్ఞాపించాడు క్రుట్జర్.

"మరి ఆరోవా డెవరు?"

"నేను వెడతాను- నేను!" అంటూ లేచి నిలుచున్నాడు ఫిల్కా షేరీ.

"కూచోవోయ్ కుర్రకుంక! వేలెడంతలేవు - నీవేం వెడతావు? మరి కొంచెం పెద్దవాడ వయితే అప్పుడు."

"అందరూ నన్ను ఎప్పుడూ 'కుర్రవాడు, కుర్రవాడు' అంటారు" అన్నాడు ఫిల్కా, బిక్కముఖంవేసి.

"అయితే ఇంకా కాస్త ఎదగరాదూ?... క్లుష్ణేవ్! నీవు కూడ బయలుదేరవయ్యా- ఆరుగురు అవుతారు. నీకో ఉత్తరం వ్రాసి ఇస్తాను. అది తీసుకెళ్ళి వాళ్ళకివ్వు. వీళ్ళిద్దర్నీ దారిలో ఏమీ చెయ్యకండి- తెలిసిందా?"

ఆరుగురు కుర్రవాళ్ళు లేచి నిలుచుని శాల్యూట్ చేశారు.

"అలాగే వెడతాం కామ్రేడ్ క్రుట్జర్! నీవు చెప్పినట్లే చేస్తాం" అంటూ ఆ ఆరుగురూ బయటికి వెళ్ళారు.

"ఆ దొంగలను పట్టుకున్న దెవరు? ... ఫిల్కా-షేరీ, వాన్యా గల్చెంకోలా కుర్రాళ్లా? మీరు నిజంగా మహావీరులు! ఇలారండి- కూచోండి కాలనీకి మీరు చేసిన సేవ అమోఘ మైనది" అంటూ క్లుట్జర్ వాళ్ళను దగ్గరికి పిలిచి, వాళ్ళతో కర స్పర్శ కావించాడు. ఇరువురినీ అభినందించాడు.

సమావేశం ముగిసింది. బంకొవిస్కీ, రైజికోవ్‌లను బయటికి తీసుకెళ్ళిపోయారు. కొంతసేపయ్యాక ఫిల్కా-షేర్, వాన్యా గల్చెంకోలు తమ దగ్గర ఉన్న ఇగోర్ నూనె సీసాను జకరోవ్ వద్దకు పట్టుకొచ్చారు.

"ఇదిగోండి అలెగ్జీ! ఇగోర్ నూనెసీసా! దీన్ని మేం రెండు సార్లు మాత్రమే వాడుకున్నాం. ఒకసారి ఇగోర్ తాలూకు శాంసన్ యంత్రానికి నూనె పట్టించాం మేమే" అన్నారు

జకరోవ్ వాళ్ళ ముఖాలను పరకాయించి చూచాడు.

"మీ రిద్దరూ మొనికల్లాంటి కుర్రాళ్లురా! కాలనీకి మీ లాంటి కుర్రాళ్ళే కావాలి!" అని అభినందించాడు మళ్ళీ.

# 22

# ఎప్పటికీ జ్ఞాపకం ఉంటుంది!

కాలనీ ప్రధాన భవనంమీద రెండు ఎర్రజెండాలు ఎగురుతున్నాయి. ఇప్పుడు కాలనీలో, ఫ్యాక్టరీలో, దళాలలో ఎక్కడ చూద్దామన్నా దొంగలు లేరు. శత్రువులు అంతకన్నా లేరు. కాలనీలో పిల్లలు ఆనందంతో, హాయిగా కాలం గడుపుతున్నారు. ఒకరినొకరు పలకరించుకుంటున్నారు. ఒకరి కష్టసుఖాలు ఒకరికి చెప్పుకుంటున్నారు.

అక్టోబరు నెలాఖరున విట్యాటార్స్కీ తన కార్యదర్శి పద వివి వదులుకున్నాడు. ఉన్నతవిద్య నభ్యసించడానికి లెనిన్‌గ్రాడ్ నగరం వెళ్ళాడు. అక్కడ నావికాశిక్షణ కేంద్రంలో విద్యార్థిగా చేరాడు.

టార్స్కీ స్థానంలో ఎవర్ని కార్యదర్శిగా ఎన్నుకోవాలా అన్న ప్రశ్న వచ్చింది. ఇందుకు ఇగోర్ చెర్నియావిన్ అర్హుడని రోడ్నేవ్ అన్నాడు:

"ఇగోర్ దూరదృష్టి కలవాడు. మనకు రైజికోవ్ ఒక్కడే శత్రువు అని అతను ఏనాడో హెచ్చరించాడు. అప్పుడు మనం అతని మాటలు నమ్మలేదు అంత దూరదృష్టిగల ఇగోర్, కార్యదర్శిగా ఉండడం చాలా మంచిది." అన్నాడు రోడ్నేవ్.

అందరూ అదే అభిప్రాయంతో ఉండడంవల్ల ఇగోర్ ఏక గ్రీవంగా కాలనీ కార్యదర్శి పదవికి ఎన్నిక అయ్యాడు. అతని కమాండర్ పదవిని, శాంకోజోరిన్‌కు అప్పగించారు. ఇప్పుడు ఇగోర్ జకరోవ్ ప్రక్కనే కుర్చీ వేసుకుని కూచుంటున్నాడు. ఆఫీసు వ్యవ హారాలు అతి జాగ్రత్తగా చూచుకుంటున్నాడు. అతనా పదవిలోకి రాగానే ఒక ఆలోచన తట్టింది. వెంటనే ఒలెంకోను మళ్ళీ కాల నీకి రప్పించాలనుకున్నాడు. ఒలెంకో అడ్రెసు ఆఫీసు ఫైళ్ళలో భద్రంగా ఉన్నది.

ఒలెంకోను కలుసుకుని కాలనీకి రమ్మని చెప్పి, స్వయంగా వెంట ఉండి అతన్ని తీసుకరావటానికి సభ్యులు ఒక ప్రతినిధి వర్గాన్ని ఎన్నుకున్నారు. ఒలెంకోకు రైలుఖర్చులూ, యూని ఫారము, సంసిద్ధపరిచారు. స్వయంగా జకరోవ్, ఇగోర్లు అతన్ని రమ్మని ఆహ్వానిస్తూ ఒక ఉత్తరంకూడా వ్రాసి ప్రతినిధి వర్గానికి ఇచ్చారు.

ఇదివరకు ఒలెంకోను అతని అడ్రెస్ ఇమ్మని అడిగి పుచ్చు కున్నాడు వాన్యా. అది ఇప్పుడు వాన్యాకు ఎంతో ఉపకరించింది. ప్రతినిధి వర్గంలో అతనూ ఒక సభ్యుడుగా ఎన్నిక అయ్యాడు. ప్రతినిధివర్గం వెంటనే ప్రయాణమై ఒలెంకోఉన్న ఊరికి వెళ్ళింది.

అతన్ని కలుసుకున్నది. కాలనీ విశేషాలన్నీ అతనికి తెలియ చెప్పింది. విప్లవ దినోత్సవంనాటికి ఒలెంకో కాలనీ చేరుకున్నాడు.

అతను కాలనీకి వస్తాడనగానే కాలనీ సభ్యులు రెండువందల మంది యూనిఫారాలు ధరించి, బారులు తీర్చి అతనికి స్వాగతం ఇవ్వడంకోసం రైలుస్టేషన్‌కు బయలుదేరారు.

స్టేషన్‌ముందు విశాలమైన ఒక చౌకు ఉన్నది. ఆ చౌకులో రెండువందల మంది పిల్లలు బారులు తీర్చి నిలుచున్నారు. మగ పిల్లలు, ఆడపిల్లలు వేరువేరుగా బారులు తీర్చి నిలుచున్నారు. జకరోవ్ ముందు నడుస్తూ ఉంటే, కమాండర్లు కౌన్సిలు సభ్యులు అతని వెనకాలే ప్లాట్‌ఫారంమీదికి నడిచివెళ్ళారు.

రైలువచ్చింది. ఒలెంకో రైలు దిగాడు. బ్యాండు వాయిద్యాలు మ్రోగాయి. ఒలెంకో చౌకులోకివచ్చి తనకోసం ఎదురు చూస్తున్న కాలనీ సభ్యులను కలుసుకున్నాడు. కాలనీ పిల్లల కనుల నుండి ఆనందాశ్రువులు రాలాయి.

పిల్లలంతా బందోబస్తులో నిలుచుని గౌరవ సూచకంగా ఒలెంకోకుశాల్యూట్ చేశారు.తరువాత జకరోవ్ పిల్లలకు బారులు చెదిరి ఎవరిష్టమొచ్చినట్లు వారు వెళ్ళవచ్చునని అనుజ్ఞ ఇచ్చాడు. అటూ ఇటూ స్వేచ్ఛగా గంతులువేస్తూ, ఒలెంకోచుట్టూ పిల్లలు ఆనందంతోమూగారు.

కొంతసేపు గడిచింది. మళ్ళీ బారులుతీర్చి నగర వీధుల్లో కదంత్రొక్కుతూ అంతా కాలనీకి చేరుకున్నారు.

కాలనీ అందంగా అలంకరించారు. పిల్లలంతా 'రెడ్ స్క్వేర్'ముందు నిలుచున్నారు. ఇగోర్ చెర్నియావిన్ మధ్యకు వచ్చి ఇలా అన్నాడు.

"అన్ని విషయాలూ తరువాత మనం ముచ్చటించుకో వచ్చును. ముందు కామ్రేడ్ ఒలెంకోకు- అతని కమాండర్ డ్యూటీని మళ్ళీ అతనికి అప్పగిస్తున్నాను. ఇవాళ మనకు పర్వ దినం- విప్లవదినోత్సవం! ఈ విప్లవ దినోత్సవంనాడు కామ్రేడ్ ఒలెంకో, మళ్ళీ మనమధ్యకు రావడం నిజంగా మన అదృష్టం!

ఇవాళే అతను ఒకటవదళానికి కమాండర్‌గా పదవీస్వీకారం చేయడం మరీ ఆనందదాయకం."

వెంటనే పదవీ స్వీకరణోత్సవం ప్రారంభమైంది. రొడ్జీవ్, ఒలెంకోలు డైరెక్టర్ జకరోవ్ ముందు బందోబస్తులో నిలుచున్నారు.

"కామ్రేడ్ డైరెక్టర్! నా కమాండర్ బాధ్యతలను ఒలెంకోకు ఇప్పుడే అప్పగిస్తున్నాను." అన్నాడు రొడ్జేవ్.

"కామ్రేడ్ డైరెక్టర్! నా కమాండర్ బాధ్యతలను రొడ్జేవ్‌నుండి ఇప్పుడే నేను స్వీకరిస్తున్నాను" అన్నాడు ఒలెంకో.

ఆ సాయంకాలమే సభ జరిగింది. విప్లవదినోత్సవ అభివందనాలను సభ్యులందరికీ అందచేసి కామ్రేడ్ క్రుట్జర్ ఇలా అన్నాడు.

"స్నేహితులారా! మళ్ళీ మన ఒలెంకో మన మధ్యకు వచ్చాడు. అతడు కాలనీనుంచి వెళ్ళిపోవడానికి కారణం ఎవరో మీకు తెలుసును. అదంతా మన శత్రువులు చేసినపని. శత్రువులను ఎలా ఎదిరించి పోరాడాలో మీకు వేరుగా చెప్ప పనిలేదు. రైజికోవ్ ఒకటవ దళానికి కమాండర్‌గా ఉండేవాడు. అతను కనుపించగానే మీరు గౌరవంతో బందోబస్తులో నిలుచునేవారు. 'కామ్రేడ్ కమాండర్!' అని పిలిచేవారు. నిజానికి అతను మీకు కామ్రేడ్ కాడు. కమాండర్ విధులు నిర్వహించడానికి బదులుగా అతను శత్రువులుచేసే ఘాతుకచర్యలకు ఒడిగట్టాడు! శత్రువు అంటే ఎలా ఉంటాడో, వాడు ఎంత హాని చేస్తాడో మీ రిప్పుడు కళ్ళారా చూచారు. పూర్తిగా తెలుసుకున్నారు. మీ శత్రువు ఎప్పుడూ పైకి మీకు శత్రువులా కనిపించడు. ఎప్పుడూ తీయటికబుర్లు చెపుతాడు, మిమ్మల్ని ఆకర్షిస్తాడు. మీ అందరితోనూ ఎంతో ఇష్టంగా ఉంటాడు. మీరు చెప్పిన పనల్లా చేస్తాడు. కాని మీరు జాగ్రత్తగా ఉండాలి... అది మీకూ, సోవియట్ దేశానికీ కూడా అవసరం ఒక్క రైజికోవ్ యే కాదు—అలాంటి దొంగలు—శత్రువులు అనేకమంది ఉంటారు. వాళ్ళను మీరు జాగ్రత్తగా ఒక కంట కనిపెడుతూ ఉండాలి."

క్రుట్జర్ ప్రసంగంలో ఉన్న సత్యాన్ని, గాంభీర్యాన్ని అవగతం చేసుకున్నారు కాలనీ సభ్యులు. శత్రువు శత్రువే... వాణ్ణి ఎప్పుడూ నమ్మకూడదు. వాడు ఎప్పుడూ ద్రోహం చేస్తాడు. ఏపనికైనా తెగిస్తాడు.

ఒక నెల గడిచింది దేశంలో విప్లవ ప్రతీఘాతకులు ఇంకా చెలరేగుతూనే ఉన్నారు. సోవియట్ ప్రభుత్వాన్ని కూలదోయాలని కుట్రలు పన్నుతూనే ఉన్నారు. కాని ఎర్రసైనికులు, కార్మికులు, కర్షకులు, విద్యార్థులు; తాము స్థాపించుకున్న సోవియట్ ప్రభుత్వ రక్షణకోసం అచంచలమైన దీక్ష వహించారు.

ఒకనాడు తన బసనుంచి ఆలశ్యంగా బయటికి వచ్చాడు జకరోవ్. రాత్రి తెల్లవార్లూ ఆఫీసు పనిచేసుకోవడం వల్ల ఆనాడు ఆలస్యంగా నిద్రలేచాడు. బయటికి వస్తూనే మామూలుగా సింహద్వారంవద్ద ఆగిపోయాడు. చుట్టూ ఒకమాటు కలయచూచాడు. అప్పుడే సూర్యోదయం అవుతూఉంది. కాలనీలో ప్రధాన భవనపు పై అంతస్థులమీద ఎర్రజెండాలు ఎగురుతున్నాయి. కాని... ఉన్నట్లుండి హఠాత్తుగా అందులో ఒకజెండా క్రిందికి దిగిపోతున్నది! జకరోవ్ భయచకితుడై అటుచూచాడు. జెండా సగం వరకూ దిగిపోయి అక్కడ ఆగింది... ఆ రోజు డిసెంబరు 2... జెండా సగంవరకూ ఎందుకు క్రిందికి దిగిపోయింది? బహుశా ఏదో ఒక దురదృష్టకరమైన సంఘటన జరిగి ఉండాలి...జకరోవ్ గబగబా నాలుగడుగులు ముందుకు వేశాడు. పూలతోట దగ్గరికివచ్చేసరికి అతనికి ఇగోర్ చెర్నియావిన్ ఎదురుపడ్డాడు.

"ఏమిటి జరిగింది ఇగోర్? ఎందుకు జెండాలు సగం దింపేశారు?" అని గాభరాగా అడిగాడు జకరోవ్.

" * కిరోవ్... అలెగ్జీ స్టెపానొవిచ్!... కిరోవ్‌ను... ఎవరో హత్యచేశారు!" అన్నాడు ఇగోర్, తడబడుతూ.

---

* 1934 డిసెంబరు 1 వ తేదీన లెనిన్‌గ్రాడ్‌లో సెర్జీ మిరొనొవిచ్ కిరోవ్‌ను విప్లవ ప్రతీఘాతక రహస్యదళ సభ్యుడొకడు హత్య కావించాడు.

"ఎవరు? నీ కీ విషయం ఎవరు చెప్పారు?"

"ఇప్పుడే రేడియోలో వార్త వచ్చింది!" అని చెప్పాడు ఇగోర్.

జకరోవ్ గబగబా లోనికి వెళ్ళాడు. కాలనీలో సభ్యులంతా బయట ఒకచోట గుమికూడారు. ఎవరిమటుకు వాళ్ళు ఏం జరుగుతుందో అని గాభరా పడుతున్నారు. ఏమీ తోచక, అటూఇటూ తిరుగుతున్నారు, అంతా నిశ్శబ్దంగా ఉంది.

పార్కులో ఒక బెంచీమీద కూచుని ఒక్సానా వెక్కి వెక్కి ఏడుస్తున్నది. ఆవేళ కమాండర్ డ్యూటీ ఆపిల్లదే. జకరోవ్ మళ్ళీ అక్కడికి రాగానే ఒక్సానా అతని దగ్గరికి వెళ్ళి ఏడుస్తూనిలుచున్నది.

"ఇవాళ నేను డ్యూటీ చెయ్యలేను అలెగ్జీ! చెయ్యలేను." అన్నది.

"అదేమిటీ? ఎందుకలా భయపడతావు? ఎందుకావిచారం?" అని అడిగాడు జకరోవ్.

"లేదు లేదు– ఏపని చెయ్యాలన్నా నాకు కాలు, చెయ్యి ఆడడంలేదు– నేను ఇవాళ డ్యూటీ చెయ్యలేను అలెగ్జీ!" ఇలా అంటూ ఒక్సానా అక్కడే చతికిలపడి పోయింది.

జకరోవ్ ఆమె బుజంమీద ఉన్న కమాండర్ బాడ్జీనితీసి చేత్తో పట్టుకున్నాడు. పిల్లలు భయంతో, మౌనంగా ఒక్సానా వంక చూస్తూ నిలుచున్నారు. జకరోవ్ ఆ బాడ్జీని ఇగోర్కు అందిచ్చాడు.

"ఇవాళ ఒక్సానా డ్యూటీ ఎవరు చేస్తారు?"అని అడిగాడు ఇగోర్.

"ఎవరేమిటి? నీవే చెయ్యి ...ఇప్పుడు వెంటనే సర్వసభ్య సమావేశం ఏర్పాటుచెయ్యాలి. బ్యాండు దళాన్నికూడా పిలిపించు. నల్లకేపు నా గదిలోఉంది. వెళ్ళి పట్టుకరా." అని ఆజ్ఞాపించాడు జకరోవ్. తరువాత తన ఆఫీసులోకి వెళ్ళాడు. అక్కడ కొన్నిలు

సభ్యులు నిశ్శబ్దంగా కూచునిఉన్నారు. గదినిండా విచారం, విషాదం అలుముకుని ఉన్నది. జకరోవ్ కుర్చీలో చతికిలబడి ఇలా అన్నాడు:

"రేడియోలో మీరు ఏమిటి విన్నారో అదినాకు స్పష్టంగా చెప్పండి."

పిల్లలు తాము విన్నవార్త అతనికి విపులంగా చెప్పారు. ఈ లోగా ఇగోర్ సర్వసభ్యసమావేశానికి సర్వసన్నాహాలు కావించాడు.

సమావేశం ప్రారంభమైంది. ఇవాళ సమావేశం ఎప్పటిలా లేదు. జెండాచుట్టూ నల్లటి అంచు కుట్టారు. సభ్యులు జెండాకు అభివాదం చేశారు. జకరోవ్ లేచి నిలుచున్నాడు. కంపిస్తున్న కంఠస్వరంతో ఇలా చెప్పసాగాడు:

"కామ్రేడ్స్! ఇది మనం మరువలేని దుస్సంఘటన. అతి నీచమైన ఘోరకృత్యానికి శత్రువు ఒడిగట్టాడు. మనచుట్టూ ఎలాంటి నీచులు, శత్రువులు ఉన్నారో, వాళ్ళు ఎలాంటి అఘాయిత్యాలు చేస్తున్నారో, మనం జాగ్రత్తగా గమనించాలి. శత్రువు మనమీద ద్వేషాన్ని పురికొలుపుతున్నాడు. విద్వేషంతో కుట్రలు, కుతంత్రాలు పన్నుతున్నాడు. మనమీద, మననాయకుల మీద, మన ప్రభుత్వంమీద దెబ్బతీయాలని ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. శత్రువుపట్ల మనం ఎలా వ్యవహరించాలో మీకు నేను ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు."

"అవును, అర్థమైంది, అంతా అర్థమైంది!" అని అన్ని గొంతులూ కలిపి ఒక్క గొంతులా వినిపించాయి.

బ్యాండు వాయిద్యాలు మ్రోగాయి. విచార, విషాద గానం ఆలాపించాయి. కమాండర్ల కౌన్సిలు కార్యదర్శి ఇగోర్ చెర్నియావిన్ ముందుకు వచ్చి ఇలా ఉపన్యసించాడు:

"మన జీవితానందం మన చేతుల్లోనే ఉంది. మన సౌఖ్యాన్ని, శాంతినీ అపహరించాలని శత్రువులు పొంచి చూస్తు

న్నారు. శత్రువుల ఆలోచన ఏమిటి? వాళ్ళ పథకాలు ఏమిటి? వాళ్ళు ఎంత నైచ్యానికి పాల్పడ్డారో చూడండి! కామ్రేడ్ కిరోవ్‌ను కాల్చి చంపారు! బహుశా శత్రువు ఇలా అనుకుంటూ ఉండవచ్చు. 'కొంతమంది విప్లవవీరులను మనం చంపుదాం. మరి కొందరిని భయపెడదాం. మిగిలినవారిని మోసగిద్దాం.' ఇవీ ఆ ద్రోహుల ఆలోచనలు. వాళ్ళు ఎందుకీ ద్రోహం తలపెట్టారో మీకు తెలుసునా? ఏ దుర్భరజీవితాన్ని అయితే మనం పారద్రోలామో, ఏ బానిస వ్యవస్థనయితే మనం బ్రద్దలు కొట్టామో, ఆ దుర్భర జీవితాన్ని తిరిగి నెలకొల్పాలనీ, ఆ బానిస వ్యవస్థను పునఃప్రతిష్ఠించాలనీ విప్లవ విద్రోహులు పగటికలలు కంటున్నారు! స్వాతంత్ర్యమును సంపాదించుకున్న మనలను, మన ప్రజానీకాన్ని మళ్ళీ బానిసలుగా మార్చి తాము పెత్తనం సాగించాలని కుట్రలు పన్నుతున్నారు! కాని వాళ్ళ కుట్రలు మనం భగ్నపరుస్తాం, వాళ్ళను ఓడిస్తాం; మన విజయాన్ని ఇంకా శాశ్వతంగా భద్రపరుచుకుంటాం. మనం ఎన్నటికీ ఒకరికి బానిసలం కాము. తిరిగి ఆ బానిసవ్యవస్థ ఈ దేశంలో తల ఎత్తడం కల్ల. ఇదే మనం మన శత్రువులకు చెప్పేజవాబు. కామ్రేడ్ కిరోవ్ అమరజీవి! ఆయన ఎప్పుడూ మన ప్రజల స్మృతిపథంలో ఉండిపోతాడు. ఆయన కావించిన సేవను మన ప్రజానీకం ఎన్నటికీ విస్మరించదు. ఆ విప్లవమూర్తిని, ఆ విప్లవవీరుని ఎవరుహత్య చేశారో, ఎందుకు హత్యచేశారో మనకు తెలుసును. ఈ ఘాతుక కృత్యాన్ని మనం ఎన్నటికీ మరిచిపోం. దీనికి తగిన ప్రతీకారం చేసి తీరుతాం. మన విప్లవపథం అప్రతిహతంగా విస్తరిస్తుంది. మన మార్గంలో ఎవరు అడ్డువచ్చినా వాళ్ళను క్షమించం. ఎన్ని అడ్డంకులు ఎదురయినా వాటిని మనం అధిగమిస్తాం. విప్లవం జయించడమేకాదు, విప్లవానంతర పునర్నిర్మాణకృషి విజయవంతంగా కొనసాగుతుంది. అలా కొనసాగించాలని మనం శపథం తీసుకుందాం. ప్రతిరోజూ, ప్రతిగంటా, ప్రతినిముషం ఇదే మన నినాదం! మన ఫస్ట్ ఆఫ్ మే కాలనీలో మనం నూతనకర్మాగారం ఎందుకు నిర్మించు

కున్నామో, దాని పరమావధి ఏమిటో మనందరికీ తెలుసును. కామ్రేడ్స్! మన కర్మాగారమే మన ఖడ్గం! మన కవచం! ఈ పోరాటంలో అదే మన గాండీవం! లెనిన్, స్టాలిన్‌ల ఉపదేశాలే మన మంత్రం!

"అవును – ఈ రోజు సదా మనకు జ్ఞాపకం ఉంటుంది. ఎల్లప్పుడూ అప్రమత్తులమై మెలగాలనీ ఈరోజు మనలను హెచ్చరిస్తూ ఉంటుంది. అమరజీవి కిరోవ్ ఏ ఆశయసిద్ధికోసం తన అసువులు వీడాడో, ఆ ఆశయసిద్ధికోసం మనం నిరంతరం పోరాడదాం. కామ్రేడ్ కిరోవ్ అంత్యక్రియలు పూర్తి అయ్యేవరకూ ఆయన జ్ఞాపకార్థం ఈ జెండాను స్టాలిన్ విగ్రహం చెంత ఉంచుదాం. అక్కడే ఆయన గౌరవార్థం మనం నిలుచుందాం."

రెండురోజులు గడిచాయి. ఆ రెండురోజులు ఫస్ట్ ఆఫ్ మే కాలనీ విషాదంలో మునిగిపోయింది. స్టాలిన్ విగ్రహంచెంత సభ్యులు కిరోవ్ గౌరవార్థం మౌనంగా నిలుచున్నారు.

ఒకనాడు కాలనీలో ప్రధానభవనం పై అంతస్థులమీద మళ్ళీ ఎప్పటిలాగా ఎర్రజెండాలు ఎగురసాగాయి. అవి క్రొత్త జెండాలు! జీవితంలో ఒక నూతన ఆదర్శాన్ని, నూతనశోభనూ, వినూత్న కాంతులనూ వెదజల్లుతున్న విజయధ్వజాలు అవి!

కాలనీ పిల్లలు వెనుకటికంటే ఎక్కువఉత్సాహంతో, పట్టుదలతో తమ కార్యక్రమాలు కొనసాగిస్తున్నారు. కర్మాగారంనిర్విఘ్నంగాఉత్పత్తిని కొనసాగిస్తున్నది. అనేక క్రొత్తక్రొత్త వస్తువులను, పరికరాలను తయారుచేసి దేశానికి అందిస్తున్నది. కాలనీ పిల్లలంతా క్రమశిక్షణతో మెలగుతున్నారు.

జీవితం తన సంఘర్షణతో పురోగమిస్తున్నది. ఆ జీవిత సంఘర్షణలో ఆనందం, అనురాగం, విజయోత్సాహం వెల్లివిరుస్తున్నాయి. ఇగోర్, ఒక్సానాలు చిలకా గోరువంకల్లా ఒకరి నొకరు పలకరించుకుంటూ, నవ్వుకుంటూ, పరాచకా లాడుకుంటూ ఒకరితో ఒకరు సహకరించుకుంటూ, ఆనందమయంగా కాలనీలో

కాలం గడుపుతున్నారు. కర్మాగారంలో తమ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

ఇప్పుడు ఇగోర్ వెనకటి ఇగోర్ కాదు. అతనిలో అద్భుతమైన మార్పు వచ్చింది. కొత్తశక్తులు అనేకం అతనిలో మూర్తీభవించాయి.

ఇప్పుడు వాండా స్ట్రాడ్జిట్స్కాయా ఒక ఉత్తమ ఇల్లాలు. ఆమెకొక చక్కని బిడ్డ కలిగింది. తన గత జీవితాన్ని తలుచుకుంటూ, అద్భుతమైన మార్పుకు ఆనందిస్తూ ఆమె ఫ్యాక్టరీలో తనపని చేసుకుపోతున్నది. ఆదర్శప్రాయంగా జీవితం గడుపుతున్నది.

వాన్యా గల్చెంకో గడుసువాడయ్యాడు! అన్నింట్లోనూ అతనే మొదటివాడుగా ఉంటున్నాడు. అతనొక్కడే కాదు. అతను ఉంటున్న మొదటిదళం సభ్యులందరూ అన్నిట్లోనూ ఆరితేరిన యువకులయ్యారు. మొదటిదళమే కాదు. కాలనీలో ఉన్న అన్నిదళాలూ ఎంతో పురోభివృద్ధి గాంచాయి.

ఫస్టు అఫ్ మే కాలనీలో ఇప్పుడు ఉన్న ఈ కుర్రవాళ్లు ఒకప్పుడు జారిస్టురష్యాలో ఎందుకూ పనికిరానివాళ్ళుగా పరిగణింపబడ్డారు. కాని ఇప్పుడో! ఆ అసమసంఘ వ్యవస్థ అంతమైంది. సామ్యవాదవ్యవస్థ నెలకొన్నది. వీధుల్లో పక్షులవలె దిక్కూమొక్కూ లేకుండా తిరుగుతున్న వీళ్ళవంటి నిర్భాగ్యులను సామ్యవాద వ్యవస్థ ఉత్తమమానవులుగా తయారుచేసింది! ఉన్నత ఆదర్శాలతో జీవించడం నేర్పింది! అవును మానవులను దేవతలుగా మార్చే ఈ సామ్యవాదవ్యవస్థ రక్షణకోసం వాళ్ళు సర్వదా కృషి కావిస్తూనే ఉంటారు.

ఈ శతాబ్దిలో అశేషకార్మిక కర్షక ప్రజలు, స్త్రీలు, పురుషులు, రష్యాలో ఒక నూతనచరిత్రను నిర్మించుకున్నారు! వారు నిర్మించిన నూతనచరిత్ర ప్రపంచ కార్మిక కర్షక జనాళికి విజయధ్వజమై వెలసింది; నిలచింది!!

(సమాప్తం)